# విషయానుక్రమణిక



---

ప్రథమ ద్వితీయ సంపుటములు, అమ్మకమునకు సిద్ధముగా నున్నవి.

# ఆంధ్ర విజ్ఞాన సర్వస్వము

ప్రథమసంపుటమునందు డిమ్మీ ౪-వ ఆకృతియందు ౬౦౦ పుటలు గలవు. ఇందు 'అ' నుండి "అధ్వర్యు" వరకును గల విషయము గలదు. త్రివర్ణ పటములు ౮, ఇతర పటములు ౧౨౫, వివిధ విషయములు ౪౦౦ కలవు.

రెండవ సంపుటమునందు డిమ్మీ ౪-వ ఆకృతియందు ౬౦౦లకు మించిన పుటలు కలవు. "అన్" మొదలుకొని "అశ్విని" వరకు గల విషయము గలదు. త్రివర్ణపటములు ౧౦. వానిలో ౨ అమరావతీస్తూపమునకును ౨ అనాహతమునకును చెందినవియు ౬ దేశచిత్ర పటములును గలవు. ఇవిగాక మరి ౫ సాదా దేశపటములు కలవు. ప్రాచీనాంధ్రుల కళాసంపదను వ్యక్తముచేయు అమరావతీస్తూపమునుగురించినగొప్ప వ్యాసమునందు అమరావతీశిల్పమునకు సంబంధించిన హాఫ్‌టోన్ బొమ్మలు రమారమి ౧౦౦ ను, వేషభూషాదుల వెల్లడించు బొమ్మలు ౫౦ వఱకును గలవు. మరియు అభినయమను వ్యాసమున భరతశాస్త్రమునందలి వేఱువేఱుహస్తములను సూచించు బొమ్మలు ౫౭ ను, 'అనాహతము'నందు షట్చక్రాదులచిత్రములును గలవు. ఇట్లు ఆయావ్యాసములకు చెందిన చిత్రములు మొత్తముమీద ౨౫౦ కి పైగా నున్నవి. వివిధవిషయముల సంఖ్య ౪౦౦ వరకు నుండును.

సంపుటము చక్కని స్వదేశీచర్మముతోడను బంగారు రేఖలతోడను సంపుటీకృతము. ప్రతిసంపుటమున ౬౦౦ పుట లుండును. ప్రతి సంపుటము వెల రూ. ౧౦-౦-౦. ప్రవేశరుసుము రూ. ౧-౦-౦. మొత్తము రూ. ౧౧-౦-౦.
పోస్టుద్వారా: రూ. ౧-౮-౦ రైలుద్వారా: దగ్గరచోట్లకు ఖర్చులు అ. ౧౨.
☞ పోస్టు-రైలుఖర్చులుప్రత్యేకము. చందాదారులు అడ్వాన్సు రూ. ౫ లు పంప ప్రార్థితులు.

మూడవ సంపుటము ముద్రణమున నున్నది. అందు ఆంధ్రదేశ చరిత్రము, వాఙ్మయము, భాష మొదలయిన విషయములకు సంబంధించిన లనేకవ్యాసములు కలవు.

పండితసాహాయ్యమునను, అపార సాధనసంపదల మూలమునను, సాధ్యము గాదగిన ఈ కార్యమును తలపెట్టుట సాహసమును, అనాలోచితమును అయినను ఆంధ్రమహాజనుల సాహాయ్యమున నీప్రయత్నము సఫలముగాగల దని నమ్మిచు యథాశక్తిని సహాయము చేయుటకు వేడుచున్నాము.

మేనేజరు, ఆంధ్రవిజ్ఞానసర్వస్వ కార్యాలయము,
నెం 7, తంబుశెట్టివీథి, మదరాసు.



సత్కాలక్షేపము



సంపు. ౧౨ యువసంవత్సరము, శ్రావణమాసము (ఆగస్టు ౧౯౩౫) సంఖ్య ౧

# ప్రాఁతబండి

మండపాక పార్వతీశ్వరశాస్త్రి

౨

ప్రాఁతబండిని జూచి రోఁతవ ద్దెపుడు.

* * *

బడబడలాడుచుఁ బ్రాకుచునున్న
ప్రాఁతబండిని జూడ రోఁత మీకేల?

* * *

క్రొత్తచక్రాలతోఁ క్రొవ్వాడియెడ్ల
క్రొత్తవేగమ్ముతో, క్రొత్తత్రోవలను
క్రొత్తక్రొత్తగఁ బోయి, క్రొత్తవింతనుచు,
ప్రాఁతబండికి రోఁతపడుట యొప్పిదమె?

క్రొత్త వింతనుమాట క్రొత్తదికాదు,
ప్రాఁత వంతనుమాట ప్రాఁతదే—కాని,
క్రొత్తవింతలఁ జూచి రోఁత మాకేల?
ప్రాఁతవంతలఁ జూచి రోఁత మీకేల?
మాకేల మీకేల యీ కానిరోఁత,
కానిరోఁతలు చేతకాని చేతులకె!

* * *

క్రొత్తలో భావముల్ కోటి యున్నపుడు,
ప్రాఁతలోపల నొక్క భావంబు లేదె?
బండి క్రొత్తదియైన బాట ప్రాఁతదియె;

బాట క్రొత్తదియైన బండి ప్రాతదియె;
బాట క్రొత్తదియైన, బండి క్రొత్తైన,
బండితోలెడువాఁడు ప్రాఁతవాఁడేను.
బండియు, బాటయు, బండినాయుఁడును,
సంతయుఁ గ్రొత్తయే యైనప్పుడింక
బండియెక్కెడువాని బ్రతు కేమియగునో?

* * *

క్రొత్తచోటులు చూచు కోర్కె సంతసమె,
క్రొత్తబండ్లను బోవు కోర్కె సంతసమె;
బండితోలెడువాఁడు ప్రాఁతవాఁడైన,
బండియెక్కెడువాని పని మేలుకాదె?
బండి ప్రాతదియైన ప్రక్క కీడ్చెదము,
బాట ప్రాఁతదియైన వదలివేసెదము,
బండితోలెడుశక్తి ప్రాఁతదికాదు.

* * *

క్రొత్తదాబాటను, క్రొత్తదా బండి,
క్రొత్తదా శక్తిఁ దోల్కొనిపోవువేళ,
క్రొత్తయుత్సాహముల్ కొమరొందుఁగాని,
క్రొత్తలక్ష్యంబులు కొమరొందుఁగాని,
క్రొత్తపోకడ లెట్లు కొనసాగనేర్చు?
క్రొత్తరాకడ లెట్లు కొనసాగనేర్చు?
క్రొత్తలోపల ప్రాఁత రూపింపవలయు,
ప్రాఁతలోపల క్రొత్త పరికింపవలయు,
ప్రాఁతక్రొత్తల పసల్ రాణింపవలయు,
క్రొత్తకు ప్రాఁతకుఁ గొల తెప్పనగునె?

* * *

క్రొత్తని మీరేల కూర్మిచెందెదరు?
ప్రాఁతని మమ్మేల పరిహసించెదరు?
ప్రాఁతచంద్రుఁడు క్రొత్తరహి చూపలేదె,
క్రొత్తసూర్యుఁడు ప్రాతరుచి చూపలేదె?

క్రొత్తచైత్రుఁడు ప్రేమ కూర్చువాఁడైన,
ప్రాఁతమాఘుఁడు ప్రేమపాత్రుండు కాఁడె?

* * *

ఈప్రాఁతబండితో హిమవన్మహాద్రి
కందరంబులలోనఁ గ్రాలఁజాలితిమి.
ఈప్రాఁతబండితో నేరుఁగొండయును
నాల్మొగలో వింత లరయఁజాలితిమి.
ఈప్రాఁతబండితో నీసులంగొల్పు
పారిజాతపుఁజెట్టు పడయఁజాలితిమి.
ఈప్రాతబండితో నెక్కటిపేడి
సొగసికన్నెలఁ గొంట చూడఁజాలితిమి.

* * *

ఎండకాలములోన నేమూలఁజూడ,
నేదియో యొకత్రోవ యేర్పడుచుండు;
ఎండకాలములోన నేర్పడ్డత్రోవ
వానకాలములో ప్రయాణాలకౌనె?
మూఁడుకాలములలో ముచ్చటల్ దీరఁ
దగు ప్రయాణాల కందముగొల్పు త్రోవ
ప్రాఁతదో,—క్రొత్తదో—యేతీరుదైన,
నదియె మంచిదికాని, యన్య ముత్తమమె?

* * *

ప్రాఁతబండి యటంచు వలదు నవ్వంగ,
ప్రాఁతబండి యటంచు వలదు పల్కంగ,
ప్రాఁతేమి, క్రొత్తేమి, ప్రాఁతక్రొత్తేమి?
ఆనందమొనఁగూర్చునదియె యాఁ త్రోవ;
ఆనందమొనఁగూర్చునదియె యా బండి;

* * *

ప్రాఁతబాటలఁ జూచి రోఁతవద్దెపుడు,
ప్రాఁతబండ్లను జూచి రోఁతవద్దెపుడు,
ప్రాఁతవారలఁ జూచి రోఁతవద్దెపుడు.

# "హిస్ మాస్టర్స్ వాయ్స్"



మాడల్ నెం. **130**

ధర రూ. **160/-**

రికార్డులందలి సహజనాదమును ప్రతిధ్వనింపగల మెషీనులు "హిస్ మాస్టర్స్ వాయ్స్" మెషీనులే. వాడుకయందును, అందచందములకును సాటిలేనిది. నేడే మా వ్యాపారులయొద్ద వలయు మెషీనును పొందుడు.

మెషీను క్యాటలాగు ఎల్లరకు నుచితముగా నివ్వబడును.

## ది గ్రామఫోను కంపెని

లిమిటెడ్.,

45, సౌతుపెరేడు, బెంగుళూరు.





అభాగిని

కం. "నీకతమున నాదాస్యము, ప్రాకటముగఁ బాయుననిన బలు కెదలోనం
జేకొని యూఱడి నిర్గత, శోకస్థితి నున్నదానఁ.................."

(మహాభారతము, ఆది.)

—మంత్రవాది వెంకటరత్నం.



ఆందోళన

—శ్రీపాద దుర్గారావు

# వేదాంగములు

బుర్రా వెంకటసుబ్బారాయుడు

"అతిగంభీరస్య వేదస్య అర్థ మవబోధయితుం శిక్షాదీని షడంగాని ప్రవృత్తాని" అని సాయణాచార్య[1]లన్నట్లు గంభీరమగు వేదముయొక్క అర్థము తెలియవలెనన్న వేదాంగములను చదువవలసియున్నది. "వేదాంగములు" (=వేదముయొక్క అవయవములు) అనుపదమే వీనికిని వేదములకును గల యన్యోన్య సంబంధమును (అవయవావయవిభావమును) తెలియజేయుచున్నది. మనగ్రంథములలోని "సాంగ మగు వేదమును పఠించెను" అనువాక్యములలోగూడ నీయర్థమే యిమిడియున్నది.

## వేదాంగము లన నేమి?

ఈవిషయమునుగూర్చి (వైదికవాఙ్మయమునందలి యితరము లనేకవిషయములను గూర్చి యున్నట్లు) భిన్నాభిప్రాయము లున్నవి. సంప్రదాయానుయాయులు వేదాంగములన ప్రస్తుతము శిక్ష, వ్యాకరణము (=పాణినీయము), జ్యోతిషము, పింగళుని ఛందస్సు, యాస్కుని నిరుక్తము, కల్పసూత్రములు అని వ్యవహరింపబడుచున్న ఆరు "గ్రంథము" లని చెప్పుచున్నారు. పాశ్చాత్యవిమర్శకులు[2] "వేదాంగము లనగా కొన్నిగ్రంథములు కావు: ఇవి శిక్షావ్యాకరణాది విద్యావిషయములు. కాబట్టి వేదాంగములన్న నీ "యావిషయములనుగూర్చి మంత్రబ్రాహ్మణాత్మకము లగు వేదములయం దచ్చటచ్చట చెప్పబడియున్న వాక్యముల సముదాయమే కాని గ్రంథములు కావు. మన కిప్పుడు లోకమునందున కనబడు శిక్ష, పింగళుని ఛందస్సు, జ్యోతిషాంగము - వీనిని బ్రాహ్మణోపనిషత్తులయందు కూడ పేర్కొనబడియున్న, అతి ప్రాచీనము లని యెంచబడుచున్న వేదాంగములకు సమాధానముగా గ్రహించుట హాస్యాస్పదము. పైనుదాహరించిన శ్లోకరూపమున నున్న గ్రంథములు, పూర్వర్షులచే వ్రాయబడి ఆ పేరట నున్న గ్రంథములు సామాన్యప్రజల కవగాహ మగునట్లుగా ఇటీవల పండితులచే వ్రాయబడిన గ్రంథము లని చెప్పుట సమంజస" మని చెప్పుచున్నారు. ఉపనిషత్తులందును, కల్పాదిసూత్రములందునుగూడ మనకు వైదిక గ్రంథముల పట్టికలలో "వేదాంగము"లను పదము పురాణేతిహాసములతో బాటు కనబడుచున్నది.

ఇచ్చట పురాణేతిహాసము లనగా సంహితలలో గాని, బ్రాహ్మణములలో గాని చెప్పబడిన పౌరాణిక గాథలు, కథలు, ఇతిహాసము లని సాయణుడు మొదలైన సుప్రసిద్ధవ్యాఖ్యాతలు చెప్పుచున్నారు. ఈ విధముగనే వేదాంగములన నాయాచోట్ల తత్తద్విషయమునుగూర్చి చెప్పబడిన వాక్యముల సముదాయమేయని పై జెప్పిన విమర్శకు లూహించుచున్నారు. వీరివాదమునకు ఈపదముపై బృహదారణ్యకోపనిషత్తునందలి వ్యాఖ్యాన మనుకూలముగా నున్నది.—

కాని పై జెప్పిన రెండు వాదములునుగూడ పూర్తిగా సమంజసముగా కనుపించవు. పై విమర్శక వాదముప్రకారము వేదాంగములన శిక్షాదివిషయములే కావచ్చును. కాని వీనిని ( ఈ వేదాంగములను ) గూర్చి నవి అనిర్దిష్టములగు కేవలము కొన్నిమంత్రబ్రాహ్మణ

1. ఋగ్వేదభాష్యోపక్రమణిక.

2. ముఖ్యముగా Winternitz, Max Muller పండితులు: "Originally these meant neither 'special' nor 'Schools' but only subjects of instruction"—Winternitz: History of Indian Literature (Eng. Translation) P. 269. ఇట్లే History of Ancient Sanskrit Literature.
—P. 109. Max Muller.

ములలోని వాక్యసముదాయములే కాక ప్రత్యేకించి కొన్ని గ్రంథములుకూడ నుండెనని ఒప్పుకొనకతప్పదు. పఠనీయమగు నొకవిషయ మున్నప్పుడు తత్సంబంధి యగు నొకగ్రంథముకూడ ( = అట్టి ప్రాచీనకాలమున ) సామాన్యముగ నుండునుగదా! ("గ్రంథములేని చదు వాకాశపురాణమువంటి" దని వినుచుందుము.) అట్టిచో నిచ్చటగూడ నేల వేదాంగము లను విషయముల నుద్దేశించి కొన్ని గ్రంథము లుండియుండరాదు? 3 ఇట్టి యూహ కనేకకారణము లున్నవి. అట్టి ప్రాచీనగ్రంథములలో కొన్ని నశించి నిలిచియుండవచ్చును. అట్లు నిలిచినవి యాస్కుని నిరుక్తము, కల్పసూత్రములు, పాణినీయము నని చెప్పవచ్చును.4 నశించినవాని స్థానమున నావిషయమున సుబోధమగునట్లు క్రొత్తగ్రంథములను తరువాతివారు వ్రాసియుందురు. (విమర్శకు లనునట్లు వీరు ఇటీవలి పండితులు కారు. వీరు కొంత ప్రాచీనులే.) ఈగ్రంథములే మన కిప్పుడు శ్లోకరూపమున నున్న వేదాంగములు.

సూక్తద్రష్టలైన మునులయనంతరము క్రమేపి వైదికమంత్రము లర్థమగుట మానుటతోడనే, భాషాభివృద్ధితోబాటు (అప్పటి యార్యులనాడుకభాష ఆర్ష భాష) భాషయందు దోషోచ్చారణ బయలుదేఱుటతోడనే, ప్రజలకు వాని యర్థము తెలియునట్లుగను, దోషోచ్చారణ (వేదముపట్ల) మాన్పించుటకును ప్రజల యుపయోగమునకై యింక నెన్నోవిధముల తోడ్పడిన మునులు వేదాంగములనుగూర్చి కొన్నిగ్రంథములు వ్రాసియుండుట యసంభవము కాదు. కర్మప్రధానులగు ఆనాటి ఆర్యులకు ప్రతికర్మయందు మంత్రముల యావశ్యకత యుండెను. అందుచే మంత్రముల యర్థోచ్చారణలు ముఖ్యములై యుండెను. అందుచే నీమునులు వేదములకు చివఱ ఇట్లు తాము రచించిన, వేదమునకుపయోగించు చిన్నిగ్రంథములను వేదాధ్యయనానంతరము శిష్యుల పఠనార్థమై చేర్చియుందురు. కాని ప్రజలకెప్పుడు, వీనికంటె విషయములను విపులముగా చర్చించునట్టియు, కాలక్రమమున శాఖాభేదము లెక్కువయగుటచే ప్రతిశాఖకు జెందిన విశేషములను చెప్పుటకు బయలుదేరినట్టియు ప్రాతిశాఖ్యలు బయలుదేరెనో, అప్పుడు వేదాంగములనుగూర్చిన గ్రంథములలో కొన్ని ( = ముఖ్యముగా ప్రాతిశాఖ్యలలో చర్చింపబడిన విషయములకు సంబంధించినవి ) పఠనపాఠనములులేక నశించిపోయినవి. నిలబడియున్న గ్రంథములు వేదములకు చివఱ తమకు చేకూరిన స్థానమును కోల్పోయి, స్వతంత్రగ్రంథములై యొప్పారుచున్నవి. ఈ ఊహ కనుకూలముగా కృష్ణయజుర్వేదమునకు జెందిన తైత్తిరీయారణ్యకమున తొమ్మిదవ ప్రపాఠకమున శిక్షావల్లి కలదు. ఇది అంతర్హితముకాకుండ మిగిలిన వేదాంగము అని తోచును. ఇట్టివే మొదట ఋగాది వేదములకు గూడ నుండియుండును; ప్రాతిశాఖ్యల యనంతరము మటుమాయమై యుండును. రానురాను షడంగము లనుపేరుమాత్రము వినవచ్చుచుండెను. అంగము లనుపేరుతో కొన్నిమాత్రము యాస్కనిరుక్తము, కల్పసూత్రములు, పాణినీయము మొదలైనవి వేఱువేఱు గ్రంథములు కనుపడుచుండెను. ఇదిచూచి "షడంగములు" కానరాకుండుటచే ఆలోటును దీర్చుటకై యంతర్హితములైన యంగములస్థానమున ప్రజల కర్థమగునట్లు ప్రాతిశాఖ్యలలోని విషయముల సేకరించి కొందఱు శ్లోకరూపమున కొన్నిగ్రంథముల వ్రాసియుందురు. అట్లు వ్రాయునప్పుడు వారికాలమునకు జెందిన విషయములు కొన్ని అనుద్దిష్టములై యాగ్రంథ

3. పురాణేతిహాసముల విషయములో నిట్లు గ్రంథము లుండియుండవలెనని వాదించలేము. వాని విషయములో నిట్లు గ్రంథము లుండ నవసరములేదు. ఎందుచేనన అట్టికథలు, పౌరాణికగాథలు సామాన్యప్రజలందఱకును వాడుకలో నున్నవి. అందుచే సుప్రసిద్ధమే.

4. ప్రాతిశాఖ్యలనుగూడ కొందఱు వేదాంగములుగ బరిగణించుచు అవశిష్టములైయున్న వేదాంగములలో (శిక్షాంగముగా) చేర్కొనుచున్నారు. దీన్నికి ప్రమాణము కనుపించదు. ప్రాతిశాఖ్యలలో రెండు మూడంగములనుగూర్చి యున్నది. వాని యుద్దేశమే వేఱు. వేదాంగములు సామాన్యగ్రంథములు.

ముల పొచ్చుట సహజము. పైన జెప్పిన శ్లోకరూపమున నున్న శిక్షాజ్యోతిషాంగములును, పింగళుని ఛందస్సును నిట్టివియై యుండును. వీని యర్వాచీనత వీనిశైలియే చెప్పుచున్నది. ఇందు తుదిజెప్పిన గ్రంథమున ప్రాకృత ఛందస్సును గూర్చికూడ నున్నది. ఈ గ్రంథములను నిరుక్తవ్యాకరణములతో బోల్చిచూచిన వీని అర్వాచీనత సుగోచరమగును.

ఈపైకారణములచే మొదట వేదాంగము లన కొన్ని శిక్షణావిషయములే యైయున్నను శిక్షావల్లి కంటె కొన్ని గ్రంథములు వేదములు చదివిన వెనుక విద్యార్థులు చదువుటకై వానివిషయ ముండె ననియు, కాలాంతరములచే కొన్ని నశించి, మిగిలినవి స్థానభ్రష్టత నొందినవనియు, నశించినవాని స్థానమున శ్లోకరూపమున అర్వాచీనర్షులచే క్రొత్తగ్రంథములు వ్రాయబడెననియు, ప్రస్తుతము సాయణునికాలమునుండి (అంతకు పూర్వమునుండి కూడ) వేదాంగము లనగా ప్రజలు ఈశ్లోకరూపమున నున్న శిక్షాంగము మొదలైనవియు,[5] నిరుక్తాది ప్రాచీనగ్రంథములును కలసిన సమూహమని వ్యవహరించుచుండిరనియు తెలిసికొనవలెను.

## వేదాంగములసంఖ్య

ప్రస్తుతము వేదాంగము లనగా నీక్రింది యాఱింటిని జెప్పుదురు. వీని ప్రయోజనముకూడ ఈక్రింద చెప్పబడి యున్నది:

| | |
|---|---|
| ౧. శిక్షాంగము<br>౨. ఛందస్సు | సరియగు వేదోచ్చారణ కుపయోగపడు అంగములు |
| 3. నిరుక్తము<br>౪. వ్యాకరణము | వేదార్థముయొక్క అవబోధకు తోడ్పడు అంగములు |
| ౫. కల్పము<br>౬. జ్యోతిషము | మంత్ర వినియోగమున కుపయోగించు అంగములు |

కాని ఆదినుండియు నిట్టివిభేద ముండెననిగాని, ఆఱు అను సంఖ్య యుండెననిగాని చెప్పవీలులేదు. ఈ ఆఱు అనుసంఖ్యగాని, విభజన గాని యెప్పటినుండి యేర్పడెనో చూతము. చరణవ్యూహమున నీ యాఱు పేళ్లును గలవు. అంతకంటె ప్రాచీనమగు మనుస్మృతి యందు[6], దీనికంటె ప్రాచీనమగు ముండకోపనిషత్తునందు ఆఱు అను సంఖ్యయు, వీని పేర్లునుగూడ పేర్కొనబడియున్నవి. కాని యీవాక్యమును[7] విమర్శకులు ప్రక్షిప్తముగా దలచుచున్నారు. అదియును గాక యీయుపనిషత్తర్వాచీనమైనదని చెప్పుచున్నారు.

యాస్కనిరుక్తమున సంఖ్య కానరాకున్నను "వేదాంగాని"[8] అని బహువచనప్రయోగ ముండుటచే రెండింటికంటె నెక్కువయంగములు ఆకాలమున ప్రసిద్ధములై యున్నట్లు కనబడును. "చ" కారమువలన నిరుక్తముగాక మూడుగాని, అంతకంటె ఎక్కువగాని అంగము లుండియుండునని యూహింపవచ్చును.

ఛాందోగ్యోపనిషత్తునందు పేర్లు కలవు గాని సంఖ్యలేదు. కాని ఒకచోట ఈక్రింది పేళ్లు పేర్కొన

5. యాస్కనిరుక్తము, పాణినీయము గూడ నిరుక్త వ్యాకరణాంగములలో ప్రథమ గ్రంథము లని మనము చెప్పలేము. యాస్కపాణినులకు పూర్వముకూడ యీఅంగముల గూర్చి కొందఱు కొన్ని గ్రంథములు వ్రాసియుండిరని యీ గ్రంథములబట్టియే తెలియుచున్నది. ఈగ్రంథములు పేర్కొనుచున్న పూర్వర్షుల నామములలో గార్గ్యశాకటాయనుల పేళ్లు ముఖ్యముగా కనుపించుచున్నవి. (నిరుక్తమును చూడుడు). ఇందు గార్గ్యుడు వ్యాకరణాంగమును గూర్చియు, శాకటాయనుడు నిరుక్తాంగమును గూర్చియు చెరియొకగ్రంథమును వ్రాసియుండియుందు రని ఊహింపదగియున్నది. ప్రస్తుతము మనకు కనుపించు యాస్కపాణినుల గ్రంథములు వీని నశింపజేసి యుండును.

6. మనుస్మృతి: III. 185 చూడుడు.

7. తత్రాపరా ఋగ్వేదో యజుర్వేదః సామవేదోఽథర్వవేదః శిక్షా కల్పో వ్యాకరణం నిరుక్తం ఛందో జ్యోతిష మితి.

8. "ఉపదేశాయ గ్లాయంతోఽవరే బిల్మగ్రహణా యేమం గ్రంథం సమామ్నాసిషుః వేదంచ వేదాంగాని చ"— యాస్కనిరుక్తము I 20.

బడినవి. వానిలో కొన్నిమాత్రమే (క్రిందగీతయున్నవి) పైన జెప్పిన వేదాంగములుగా కనబడును.

వేదములకు వేదము (= వ్యాకరణము), పైత్ర్యం రాశి, దైవం, నిధి (= మహాకాలాదినిధిశాస్త్రము) వాకోవాక్యం, ఏకాయనం, దేవవిద్య (= నిరుక్తం), బ్రహ్మవిద్య (= ? శిక్షా, ఛందస్సు), భూతవిద్య(= భూతతంత్రము, క్షత్రవిద్య (=ధనుర్విద్య) నక్షత్రవిద్య (= జ్యోతిషము), సర్పవిద్య (= గారుడము) అను నవి పేర్కొనబడి యున్నవి.

షడ్వింశ బ్రాహ్మణమున 9. "స్వాహా"ను గూర్చి చెప్పుచు.

"చత్వారో అస్యై వేదాః శీర్షాః, షడంగాని అంగాని, ఓషధివనస్పతయో లోమాని."

అని అంగముల్ని ఆరు అనిమాత్రమున్నది. షడ్వింశ బ్రాహ్మణము సామవేదమునకు జెందినది. దీని నర్వాచీన బ్రాహ్మణములలో నొకటిగా విమర్శకులు తలచుచున్నారు. అనగా మనకు చివరకు తేలిన పర్యవసాన మేమనగా షడంగములు (వాని పేళ్లు, స్వరూపము ఎట్టి వైనను) బ్రాహ్మణయుగాంత్యభాగమునుండియు నుండి యుండవలెను.

## I. శిక్షాంగము

ఈ వేదాంగములలో మొదటిది శిక్షాంగము. ఇందు వర్ణము, స్వరము, బలము, సామ(=అతిద్రుతాతి విలంబిత గీత్యాదిదోషములు లేక మాధుర్యాది గుణయుక్తముగా ఉచ్చరించుట), సంతానము (=సంహిత) మొదలగువానిగూర్చి యున్నది. సంప్రదాయవాదుల ప్రకారము దీని ఆవశ్యకత

"మన్త్రో హీనః స్వరతో వర్ణతో వా
మిథ్యాప్రయుక్తో నతమర్థమాహ,
స వాగ్వజ్రో యజమానం హినస్తి
యథేంద్రశత్రుః స్వరతోఽపరాధాత్."
—పా. మ. భా.

అను స్వరాద్యపరాధమువలన యజమానునికి రాబోవు కీడును చెప్పువాక్యములవలన తెలియుచున్నది. అందుచే స్వరాద్యపరాధరాహిత్యమునకై శిక్షాశాస్త్రము తెలిసికొనవలసినదని వారి యభిప్రాయము. శిక్షాశాస్త్రము తెలియుటచే నను పైముప్పునుండి యెట్లున్నను, దీనివలన నిర్వర్ణ్యమును, మఱియొక, అర్వాచీన "భాషా విజ్ఞాన శాస్త్రజ్ఞుల"కు ముఖ్యమైన యుపయోగము గలదు. ఈ శాస్త్రసహాయముననే మనకు అతిప్రాచీనములగు "వేదములు" నేటివఱకును చెక్కుచెదరక యున్నవి. ముందు చెప్పినట్లు దోషోచ్చారణవలన వేదములు నశించు నను భయముతో లోకోపకారులగు మును లీశాస్త్రమును గూర్చి యెంతయో కృషి సల్పి దీనిని వ్రాసియుంచిరి.

ఇట్లు వ్రాయుట కావశ్యకత యాగాదిసందర్భముననే వచ్చినది. దీనివలన మనకు సామాన్యముగా నర్థముకాని మంత్రముల యర్థము తెలియ వీలగుచున్నది. భాషావిజ్ఞానశాస్త్రజ్ఞులు దీనివలన భాషావ్యుత్పత్తిని, చరిత్రను చెప్పగలుగుచున్నారు.

తైత్తిరీయారణ్యకమున శిక్షాంగమునకు జెందినది "శిక్షావల్లి" యనునది కనబడుచున్నది. ఈశిక్షావల్లివలన గ్రహింపబడదగిన యంశమును గూర్చి యిదివఱకు విశదీకరించియున్నాము. ఇది కల్పసూత్రములతో సమకాలీనమైయుండెను. ఇదిగాక సంప్రదాయవాదులచే వేదాంగముగ నెంచబడుచున్న యొక శిక్షాగ్రంథము గలదు. ఇందు శంకరసూత్రములలోని విషయములు శ్లోకరూపమున నున్నవి. ఇందు ప్రాకృతమునుగూర్చి కూడ ఉండుటచేత పాణినికి తరువాతికాలమున రచింపబడియుండునని Max Muller తలచుచున్నాడు. సాయణుడు దీనినే శిక్షాంగమని యెంచుచున్నాడు. ఈతనికంటె ప్రాచీనుడగు సోమేశ్వరుడుగూడ స్వీయ తంత్రవార్తికమునందు కాత్యాయనాదుల గ్రంథములకంటెగూడ దీని కెక్కువ ప్రాముఖ్యము నిచ్చుచున్నాడు. కాని దీనిని నిరుక్తముతోగాని, పాణినీయముతోగాని పోల్చిచూచిన, వానితో సమకాలీనము

గాని, వానికంటె ప్రాచీనముగాని కానేరదని స్పష్టముగా తెలియనగును. ఇది సూత్రయుగమునను జెంది యుండును.

ఇదిగాక "మాండుకీ శిక్ష"10 యని యీవేదాంగమునకు జెందిన మఱియొక గ్రంథ మున్నది. ఇది మాండుకాయనుని శాఖకు జెందియుండును. ఇదికూడ సూత్రయుగానంతరము వ్రాయబడియుండును.

ఇవిగాక శిక్షాశాస్త్రమునుగూర్చి ప్రాతిశాఖ్యలు విశేషించి వ్రాయుచున్నవి. ఈకారణముచే కొందఱు శిక్షాంగములలో ప్రాతిశాఖ్యలుకూడ వచ్చునని వ్రాయుచున్నారు. ఇది గొప్ప పొరబాటు. ప్రాతిశాఖ్య లనేక విషయములనుగూర్చి చెప్పుచు శిక్షాశాస్త్రమును (తచ్ఛాఖకు జెందిన స్వరాదివిశేషముల జెప్పుదానిని) గూర్చి కూడ చెప్పుచున్నవి. అదియునుగాక వేదాంగములు అన్ని వేదములకుగూడ నుపయోగపడు సామాన్య గ్రంథములు. ప్రాతిశాఖ్యలన్ననో ఒకవేదములోని ఒకశాఖకు జెందిన విశేషములను జెప్పు విశిష్టగ్రంథములు; వేదాంగములకంటె నర్వాచీనములు.

## II. ఛందస్సు

దీనినిగూడ నెఱుగనిదే వైదికకర్మను యథావిధిగ నెఱవేర్పలేము. ఎవడు అవిదితార్షేయ ఛందోదైవత బ్రాహ్మణంబగు మంత్రమును చెప్పునో అట్టివాడు కాత్యాయనానుక్రమణిప్రకారము విపత్తు నొందును. "(స్థాణుం వార్చ్ఛతి గర్తేవా పాత్యతే, ప్రమీయాన్ భవతి)." అందుచే ప్రతిమంత్రమునందును ఛందస్సును తెలిసికొనవలసియున్నది. అదియునుగాక బ్రాహ్మణములలోని విధులు "అర్ధగాయత్రితో గాని, అర్ధజగతితో గాని ఒకానొక దేవతను పూజింపవలెను" మొదలగువాని జెప్పుచున్నవి. అందుచే వైదిక ఛందస్సుతో పరిచయమున్ననే గాని యిట్టి విధులను నెఱవేర్పవీలు లేదు. వృత్తములపేళ్లనేకము మనకు వేదములందును, బ్రాహ్మణోపనిషత్తులందును కూడ కనబడును. ఆరణ్యకోపనిషత్తులలో వీనినిగూర్చి నిగూఢములగు పెద్దఉపన్యాసము లున్నవి. సూత్రరూపమున ప్రథమమున ఛందస్సును వ్రాసియుండుము. ఇట్టియూహకనుగుణముగ (ఇట్టిరచన యుండెననుటకు) ఋక్ప్రాతిశాఖ్యయందలి కడపటి మూడధ్యాయములు (౧౬, ౧౭, ౧౮) కనుపించుచున్నవి. వీనిని బోలి యొక వేదాంగ గ్రంథ ముండియుండును. (మిగ గ్రంథమునకంటె నీ మూడధ్యాయములును నర్వాచీనములైన ట్లనేక విమర్శకు లనుచున్నారు. దానిమాట యెట్లున్నను ఇవికూడ చాల ప్రాచీనము లనుమాటమాత్రము నిజము.) ఈ ప్రాతిశాఖ్య శ్లోకరూపమునను, సూత్రరూపమునను కూడ ఉన్నది. (సూత్రములే శ్లోకములలో నిమడ్చబడినవి.) ఇట్టిశైలి శౌనకునకు సామాన్యముగ నలవాటే.

ఛందస్సును గూర్చి (కాత్యాయనుని యనంతరము వ్రాయబడినట్లు కనబడు) నిదానసూత్రమున (సామవేదము) ౧౦ వ ప్రపాఠకమున చివఱ ఛందోనుక్రమణి గలదు. ఇదియుగాక పింగళనాగునిచే వ్రాయబడిన "పింగళసూత్రము"లను ఒక గ్రంథము కలదు. సంప్రదాయవాదులు నేడు దీనినే ఛందోంగముగా దలంచుచున్నారు. దీనికి కొందఱు విమర్శకు లంగీకరింపకున్నారు. దీనికి తగుకారణము నిదివఱకు గమనించియుంటిమి. ఇది అంతప్రాచీనమైనది కాదు. పింగళనాగు డన పతంజలియే యని సంప్రదాయ వాదము. అట్లయినచో నివి పాణినీయముకంటె నర్వాచీనములే కదా. అదియునుగాక ముందు చెప్పినట్లు, ఇందు సంస్కృత ప్రాకృతముల రెండింటి ఛందస్సును చెప్పబడియున్నది. ఈరెండు విషయములును పాణినీయాదులకంటె వీని అర్వాచీనతను చెప్పుచున్నవి. కాని యీ గ్రంథము "పరిశిష్టము"లలో ప్రమాణముగ పరిగణింపబడియుండుటచే నిది సూత్రయుగాంతమున రచింపబడియుండునని యూహింపదగియున్నది.

ఉవ్వటుడు, ఋక్ప్రాతిశాఖ్య వ్యాఖ్యాత (=? ౧౧ వ శతాబ్దము) ఇదిగాక మఱిరెండు గ్రంథము లుండియున్నట్లు చెప్పుచున్నాడు.11

10. ఋక్ప్రాతిశాఖ్యయందు "మాండుకేయు"ని పేరు చెప్పబడియున్నది.

11. "తథా సర్వైశ్ఛందశ్చిత్యాదిభిః పింగళయాస్కసైతవ ప్రభృతిభిః యత్సామాన్యే నోక్తంలక్షణమ్."

పాశ్చాత్యసంస్కృత పండితులు ఛందస్సును గూడ విడువక, దీనిపై చాలకృషి సల్పియుండిరి. Arnold[12] అను పండితుడు "వైదికఛందస్సు" (Vedic Metre) అను గ్రంథము నొకదానిని వ్రాసెను. అత డద్దానిలో ఛందస్సునుబట్టి తత్తన్మంత్రముల పౌర్వాపర్యమును, కాలనిర్ణయమును చేయువిధానమును చూపియున్నాడు.

## III. నిరుక్తము

నిరుక్తవ్యాకరణములు వేదార్థమును తెలియజేయు అంగములని ఇదివఱకు చెప్పియుంటిమి. నిరుక్తమనగా శబ్దముల వ్యుత్పత్తిని గూర్చి చెప్పు శాస్త్రము అందురు. కాని నిరుక్తమనగా నిర్వచనమనియే యర్థము. సాయణుడు నిరుక్తనిఘంటువుల యర్థభేదము గమనించిన ట్లగపడదు. ఆతడు "నిరుక్తమనగా అర్థావబోధ యనుచున్నను, అన్యోన్యాకాంక్ష లేకయుండు పదముల సమూహములను జెప్పునది" అని చెప్పియున్నాడు. "గౌః మొదలు దేవపత్న్యవఱకు శబ్దములు గల గ్రంథము" అని సూచించియున్నాడు.[13] ఇట్లు సాయణు డుదాహరించిన గ్రంథము నిఘంటువుగాని నిరుక్తము కాదనియు, నిఘంటువు నాధారముగా జేసికొని యాస్కమహర్షి యిందు కొన్నిపదముల వ్యుత్పత్తిని జెప్పును అట్టి వ్యుత్పత్తికి ప్రమాణముగ వైదికమంత్రములను వ్యాఖ్యానముతోసహా ఉదాహరించుచు నిరుక్తమనుగ్రంథమును వ్రాసెననియు, నిరుక్తమందుచే నిఘంటువుపై వ్యాఖ్యానము (భాష్యము) వంటిదనియు, నిఘంటువుయొక్క గ్రంథకర్త యెవరైనను "పరంపరయా వచ్చిన"దని యాస్కుడే అనియుండుటచేత యాస్కుడుమాత్రము కానేరడనియు నేటివఱకు నీవిషయముపై గల విమర్శనుబట్టి తెలియుచున్నది.[14] ఈసంగతులకు కొన్నిటికి నిరుక్తమునందే ప్రబలప్రమాణము లున్నవి.

"నిఘంటువుల" యందు పదముల సమామ్నాయము గలదు. ఇది మూడుకాండములుగ విభజింపబడినది. దీనిని యాస్కుడు తన పండ్రెండధ్యాయముల నిరుక్తగ్రంథములో నీక్రిందివిధమున రచించెను.

| నిఘంటువు | యాస్కుని నిరుక్తము |
| --- | --- |
| ౧. నైఘంటుకకాండ | ౧, ౨, ౩ అధ్యాయములు |
| ౨. నైగమకాండ | ౪, ౫, ౬ ,, |
| ౩. దైవతకాండ | ౭ మొదలు ౧౨ వఱకు అధ్యాయములు |

పైన చూపినట్లు ఈగ్రంథమునందు యాస్కుడు కొన్నికొన్ని నిఘంటువులలోని మాటలను దీసికొని వ్యుత్పత్తిని జెప్పును, అట్టి వ్యుత్పత్తికి సంహితాబ్రాహ్మణములనుండి ప్రమాణమునకై మంత్రములను, వాక్యములను చెప్పుచున్నాడు. ఈనిరుక్తములో మొదటి యధ్యాయమునను, రెండవయధ్యాయములో కొంతభాగమునను, ౭ వ అధ్యాయమునను శాస్త్రమును గూర్చి చర్చింపబడి యున్నది. (మొదటి రెండధ్యాయములలో నిరుక్త శాస్త్రమును గూర్చియు, సప్తమాధ్యాయమున పౌరాణికశాస్త్రము (Science of Mythology) ను గూర్చియు విచారింపబడి యున్నది.)[15]

---

12. ఛందోవిశేషములనుబట్టి యీతడు ఋగ్వేదమును ౩ విభాగములుగా విభజించి, ఆయామంత్రము యొక్క ఛందస్సునుబట్టి ఆమంత్ర మేవిభాగమునకు జెందినది, దానినిబట్టి యేకాలమునకు జెందినది చెప్పుచున్నాడు.

13. ఋగ్వేదభాష్యోపక్రమణికా నిరుక్తము యాదృచ్ఛికముగా శబ్దముల వ్యుత్పత్తిని జెప్పుచున్నను, నిర్వచనము అనగా నిఘంటుస్థశబ్దముల, లేక మంత్రముల యర్థము చెప్పుటయే ప్రాధాన్యమగుటచే నిది యొక భాష్యమని చెప్పవలెను.

14. Cf. Lakshman Swarup's Nirukta-Introduction; and Hannes Skold's Nirukta who differs from him. (p 110. Seq.)

15. యాస్కనిరుక్తమునుగూర్చి చెప్పవలసిన విశేషము లనేక మున్నను ఇచ్చట వానిని చెప్పుట కవకాశము లేదు.

యాస్కుని నిరుక్తమునకు పూర్వము నిరుక్తాంగమును నేదేని గ్రంథ ముండెడిదా యను విషయము ఊహ్యమేగాని కేవలము నిర్ధారణచేసి చెప్ప వీలులేకున్నది. కాని ముందు నిర్దేశించినట్లు శాకటాయను డనునాతడు నిరుక్తమును నేదేని గ్రంథము నొండు వ్రాసియుండును. ఈతడు పతంజలిచేతను, పాణినిచేతను, శౌనకునిచేతను, యాస్కునిచేతను కూడ తమగ్రంథములయందు ప్రమాణ పురుషుడుగా తలపబడుచున్నాడు. ఈతడు నైరుక్తుడని తెలియుచున్నది. ఉణాది సూత్రముల నీతడే రచించియుండుననియు, పాణిని ఈసూత్రముల నెఱిగియుండెననియు, కాని పాణినికాలమునాటికి వీనిస్వరూపము ఇప్పటివలె నుండియుండ దనియు, పాణినికాలమునాటి కీసూత్రములలో బహుశః వైదిక శబ్దములే యెక్కువగా నుండియుండుననియు, కాలక్రమమున వీనికి లౌకికశబ్దములు చాల చేర్పబడియుండుటచే ప్రస్తుతము లౌకికశబ్దములే యెక్కువగాకానవచ్చుచున్న వనియు, అందుచే నీగ్రంథము నిరుక్తపాణినీయముల కంటెకూడ ప్రాచీనమైనదనియు, చాలకాలముక్రిందట16 Max Muller పండితుడును, ఇటీవల Belvelkar17 పండితుడును చెప్పుచున్నారు. శాకటాయనుడే ఉణాది సూత్రములనుగాని, లేక నిరుక్తమును వేఱొక గ్రంథమును గాని వ్రాసియుండెననుట నిజమని తోచుచున్నది.

నిరుక్తవ్యాకరణముల యుపయోగమును గూర్చి యంతగా జెప్ప నవసరములేదు. నిరుక్తసాహాయ్యమున భాషావిజ్ఞానశాస్త్రజ్ఞులకు, భాషనుగూర్చి తద్వ్యుత్పత్తినిగూర్చి, భాషాసమూహములనుగూర్చి, ఆసమూహములలోని భాషల యన్యోన్యసాదృశ్యములనుగూర్చి నూతనవిషయములను తెలిసికొనుట కవకాశము గల్గినది. అదియునుగాక ఏతత్సహాయముననే యనేకగూఢమంత్రముల కర్థము తెలిసికొనగల్గుచున్నాము. సాయణభాష్యమునగూడ నివారణకాని సందేహముల గొన్నిటి నిది పోగొట్టుచున్నది. నిరుక్తముయొక్క ప్రాచీనత్వమే దీనికి సాయణభాష్యముకంటె నెక్కువప్రామాణ్యమును కల్పించుచున్నది. అందుచేతనే నవీనవైదిక విమర్శకులు సాయణభాష్యము నిరుక్తములోని మంత్రవ్యాఖ్యానమునకు విరుద్ధముగ నున్నయెడల, యాస్కుని వ్యాఖ్యానమునే స్వీకరించుచున్నారు. దీనికి కారణము యాస్కుడు ( = ? క్రీ. పూ. ౬౦౦ సంవత్సరములపైన) సాయణునికంటె ( = క్రీ. శ. ౧౪ వ శతాబ్దము) వైదికయుగమునకు మిక్కిలి సమీపస్థుడైయుండుటయే. నిరుక్తమువలన పౌరాణికునకుగూడ చాల నుపయోగము గలదు. ఇందలి ఏడవ అధ్యాయమునుగూర్చి చెప్పియుంటిమి. దైవతకాండకు జెందిన ౭ మొదలు ౧౨ అధ్యాయములను చదివినయెడల మనకు వైదికదేవతల స్వరూపమునుగూర్చియు, చరిత్రనుగూర్చియు ననేక నూతన విషయములు తెలియుటయే గాక, దేవతలనుగూర్చి ప్రజల నమ్మకములలో నెట్టిమార్పులు జరుగుచుండునో, పౌరాణికైతిహాసిక దేవతలకు, వైదికదేవతలకును నెట్టి సంబంధము గలదో యిట్టివిషయములన్నియు తెలియగలవు. నిరుక్తమువలని ఉపయోగములను యాస్కుడే స్వీయ గ్రంథమున బేర్కొని యున్నాడు:

(౧) "అథాపీద మంతరేణ మంత్రే ష్వర్థప్రత్యయో నవిద్యతే, అర్థ మప్రతియతః నాత్యంతం స్వరసంస్కారోద్దేశః, తదిదం విద్యాస్థానం, వ్యాకరణస్య కార్త్స్న్యం, స్వార్థసాధకంచ."

నిరుక్తమునుగూర్చి దుర్గాచార్యు డిట్లు వ్రాయుచున్నాడు:

"ప్రధాన శ్చేద మితరేభ్యోఽంగేభ్యః సర్వశాస్త్రేభ్యశ్చ అర్థ పరిజ్ఞానాభినివేశాత్. అర్థోహి ప్రధానమ్, తద్గుణః శబ్దః"

(ఈ అంగ మన్ని యంగములకంటెను, అన్నిశాస్త్రములకంటెను అర్థజ్ఞానమును కలుగజేయు ననుకారణముచే ప్రధానమైనది. అర్థముకదా ప్రధానము. అది గుణముగా కలదే శబ్దము.)

16. History of Ancient Sanskrit Literature.

17. Systems of Paninean Grammar.

(ఈనిరుక్తము లేకుండ వైదికమంత్రముల అర్థ నిశ్చయము కలుగనేరదు. అర్థనిశ్చయము కలుగనివానికి స్వరసంస్కారముల నిశ్చితమగు జ్ఞానము కలుగదు. అందుచేత నిది (నిరుక్తము) బ్రహ్మవిద్యకు (=వేదార్థ జ్ఞానమునకు) స్థానము. స్వరసంస్కారము లర్థమునకు లోబడియున్నవగుట వ్యాకరణమునకు పూర్ణత్వమును (=కృత్స్నభావమును) ఇచ్చుచున్నది. ఆనుషంగికముగా వ్యాకరణమునకు పూర్ణత్వము నిచ్చుచున్నను, స్వార్థమును కూడ నెఱవేర్చుచున్నది).

(౨) మఱియు నీనిరుక్తము సహాయము లేకుండ సరిగా పదవిభాగము చేయలేకున్నాము. ఇందు కుదాహరణగా నీక్రిందివానిని తీసికొందము:

(అ) "అవసాయ పద్వతే రుద్రమృళ" ఋ. వే. సం. X. 169. 1. (ఓరుద్రా, నడచునట్టి పాదములుగల (గోవును) సుఖింపజేయుము) అని ప్రార్థన.

ఇచ్చట 'అవసాయ' అనుపదము గత్యర్థకమగు "అవ్" ధాతువుకంటె "అస్" అను ప్రత్యయము జేర్చగా వచ్చిన "అవస" శబ్దమునకు చతుర్థ్యేకవచనము. అందుచే నిది ఏకపదము. కనుక పదపాఠమున నీ పదమున అవగ్రహ (ఽ) యుండదు.

"అవసాయ పద్వతే రుద్ర మృళ"

(ఆ) "అవసాయాశ్వాన్" ఋ. వే. సం I. 104.1.

( = (రథములనుండి) అశ్వములను విడిపించి (=విప్పి) )

"షో అన్తకర్మణి" అనుధాతువును "అవ" అను ఉపసర్గతో జేర్చి విమోచనార్థమందు "అవసాయ" అని అసమాపక క్రియ ఉపయోగింపబడియున్నది. ఇందుపసర్గ యుండుటచేత పదపాఠమున అవగ్రహ యుండును.

"అవఽసాయ అశ్వాన్"

అందుచే నిట్టి పదపాఠభేదములు నిరుక్తము నెఱిగియుండినగాని గుర్తింపలేము. పదపాఠమునకర్థమావశ్యకము. అర్థము నిరుక్తము నెఱిగిన గాని తెలియదు. అందుచే నిరుక్తము పదపాఠముకొఱకైన చదువవలెను.

(౩) ఇట్లే నిరుక్తము చదువనికారణమున అర్థము తెలియమి మంత్రమున నుద్దిష్టమైన దేవత యెద్దియో చెప్పలేకున్నాము. కేవలము ఒకానొక దేవత నామోచ్చారణనుబట్టి ఆమంత్రమున కాదేవత నధిష్ఠానదేవతగా తలచుట తటస్థించుచున్నది. రెండుమూడు దేవతలపేళ్లు కనబడినప్పుడీకార్యమును చేయలేకున్నాము. అట్టి సందర్భములలో ఒకదేవత మంత్రాధిష్ఠాన దేవతయు, మిగిలినవి ఆనుషంగికములు, లేక యాదృచ్ఛికములును నగుచున్నవి. ఇట్టివిషయములు నిరుక్తము తెలిసికొనిన సులభముగ గ్రహింపగలము.

(౪) కేవలము జ్ఞానము సంపాదించుటకైనను నిరుక్తము చదువవలసినదని యాస్కుడనుచున్నాడు. అజ్ఞాననిందయు, జ్ఞానప్రశంసయు లోకప్రసిద్ధములే.[18]

## IV. వ్యాకరణము

పాణినీయవ్యాకరణమును[19] నేడందఱును వ్యాకరణాంగ గ్రంథముగా దీసికొనుచున్నారు. ఈగ్రంథమున వైదికసంస్కృత వాఙ్మయములగూర్చి వ్యాకరణము వేఱువేఱుగా చెప్పబడియుండలేదు. సామాన్యముగ వ్యాకరణమును జెప్పును గ్రంథకర్త భాషావిశేష

18. ఋగ్వేదములోని యీక్రింది మంత్రముల జూడుడు:

(అ) "చత్వారి వాక్పరిమితా పదాని
తాని విదుర్బ్రాహ్మణా యే మనీషిణః
గుహా త్రీణి నిహితా నేఙ్గయన్తి
తురీయం వాచో మనుష్యా వదన్తి" I 164, 45.

(ఆ) "సక్తుమివ తితఉనా పునన్తో
యత్ర ధీరా మనసా వాచమక్రత
అత్రా సఖాయః సఖ్యాని జానతే
భద్రైషాం లక్ష్మీర్నిహితాధివాచి" X 71, 2.

(ఇ) "ఉతత్వః పశ్యన్న దదర్శ వాచ
ముతత్వః శృణ్వన్న శృణోత్యేనామ్
ఉతో త్వస్మై తన్వం విసస్రే
జాయేవ పత్య ఉశతీ సువాసాః" X 71, 4.

19. ఇది (పాణినీయవ్యాకరణము) అందఱకు పరిచితమైన గ్రంథమేకాబట్టి దీనినిగూర్చి విస్తరించివ్రాయలేదు.

మూడును రచించినట్లే వైదికవ్యాకరణ విశేషములను రచించియున్నాడు. అందుచే నిందు ఎక్కువగ సంస్కృత, వైదికవ్యాకరణములకు గల భేదములు చెప్పబడియున్నవేకాని కేవలము వైదికవ్యాకరణమునుగూర్చి లేదు. ఇట్టివిశేషముల నన్నిటి నొకచో జేర్చి సిద్ధాంతకౌముదీకారుడు వైదికప్రక్రియయని, స్వరప్రక్రియ యని పేర్లు పెట్టినాడు.

పాణినికంటె ముం దనేక ప్రాచీనవైయాకరణులున్నట్లు మనకు పాణినీయమువలననే కాక ప్రాతిశాఖ్యలవలనను, నిరుక్తమువలనను కూడ తెలియుచున్నది. అందుచే వీరిలో నెవరైనను కొన్ని వ్యాకరణగ్రంథములు వ్రాసియుందురు. డాక్టరు లక్ష్మణస్వరూప్‌గారు తమ "నిరుక్తము" నందు గార్గ్యుడనునాతడు వ్యాకరణగ్రంథము వ్రాసియుండు ననియు, బహుశః పాణిని ఆతని ననుసరించియుండు ననియు, కాలక్రమమున గార్గ్యుని గ్రంథము రూపుమాసిపోయి, తత్‌స్థానమున పాణిని గ్రంథము ప్రమాణమై యుండుననియు చెప్పుచున్నారు. ఇది సమంజసముగ కనుపించును. పాణినిగ్రంథము మిగత ప్రాచీన గ్రంథము లన్నిటిని తుడిచివేసి వేసినది. ఈ కారణమునుబట్టియే ఒక విమర్శకుడు "పాణిన్యాదయః" కంటె "పాణిన్యంతాః" అనిన బాగుండు ననుచున్నాడు. పాణినీయముధాటికి కాక గ్రంథములు వ్యాకరణమునకు సంబంధించినవి మనకు మైనజెప్పిన ఉణాదిసూత్రములును, శాంతనాచార్యుని ఫిట్‌సూత్రములును నిలిచియున్నవి. ఫిట్‌సూత్రములందు స్వరము నుద్దేశించియుండుటచేతను, వైదికవాఙ్మయముననే స్వరము గోచరించుచుండుటచేతను లౌకికభాష ప్రాధాన్యముగా వ్యాకరణమును వ్రాసిన పాణినికంటె శాంతనాచార్యుడే ప్రాచీనుడని చెప్పవచ్చును. వ్యాకరణాంగమునకు జెందినవి యీమూడుదప్ప ప్రాచీనగ్రంథము లితరము లేవియు లేవు. ప్రాతిశాఖ్యలయందు ఆయాశాఖలయందు గల వ్యాకరణవిశేషములుమాత్రమే వివరింపబడినవి.

వ్యాకరణముయొక్క ఉపయోగములనుగురించి విస్తరించి వ్రాయనవసరము లేదు.20 అంగములన్నిట శిక్షావ్యాకరణములు వేదాధ్యయనమున కత్యంతోపయోగకరములు. వ్యాకరణప్రయోజనమునుగూర్చి సాధారణముగా వరరుచివార్తికమును "రక్షోహాగమలఘ్వసందేహాః ప్రయోజనమ్" అనుదానిని చెప్పుచుందురు. దీనిని పతంజలి స్వీయ మహాభాష్యమున విశదీకరించియున్నాడు.

(౧) రక్షా—వేదములు నశించకుండ రక్షించుటకై వ్యాకరణమును చదువవలెను. లోపాగమవర్ణవికారములను దెలిసికొనినవాడే వేదములను పరిపాలించుటకుగాని, వేదార్థమును తెలిసికొనుటకుగాని సమర్థుడగుచున్నాడు.

(౨) ఊహ—వేదములలోని మంత్రములను యజ్ఞములలో సందర్భానుసారముగా నుపయోగించుటకై వానిలో లింగవిభక్తివచనాదిభేదముల నూహించి చేయవలసివచ్చును. వ్యాకరణ మెఱుగనివా డట్టికూర్పులను జేయ నసమర్థుడు.

(3) ఆగమ-ఇది యొకశాస్త్రము కాబట్టియు, బ్రాహ్మణులకు ఏప్రయోజనము లేనప్పటికిని సాంగముగ వేదము చదువుట ధర్మమని చెప్పబడియున్నది కాబట్టియు అట్టి అంగములలో వ్యాకరణము ప్రధానమైనదగుటచే దీనిని చదువవలెను.

(౪) లఘు—లఘ్వర్థమై వ్యాకరణమును చదువవలెను. శాస్త్రపద్ధతుల సాహాయ్యమున భాష నేర్చుకొనవలెనేకాని ఒక్కొక్కశబ్దమే నేర్చుకొనుట మొద

---

20. "శిక్షా ఘ్రాణం తు వేదస్య
ముఖం వ్యాకరణం స్మృతమ్,
తస్మాత్సాంగ మధీత్యైవ
బ్రహ్మలోకే మహీయతే."

శిక్షాంగము. 41.

(వేదమునకు శిక్ష ఘ్రాణేంద్రియము. వ్యాకరణము ముఖము. అందుచే సాంగముగ వేదము నధ్యయనముచేసియే బ్రహ్మలోకమున జనుడు గొప్పవాడగుచున్నాడు).

లిడిన భాషలో సర్వంకషమగు పాండిత్యమును సంపాదించుట కెన్నిసంవత్సరములైనను పట్టును. అందుచే మనము శాస్త్రసూత్రమైన వ్యాకరణమువలన కొలది కాలములోనే భాష నేర్చుకొనగలము. (Cf. Economy of effort)

(౫) అసందేహః—స్వరాదులయందు సందేహము కల్గినప్పుడు వ్యాకరణసాహాయ్యమున తన్నివృత్తి కలుగుచున్నది. ఇందుకుదాహరణ:— కర్మధారయ బహువ్రీహిసమాసముల భేదము స్వరముపై నాధారపడియుండును21. ఈభేదమును వ్యాకరణము తెలిసినగాని గమనింపలేము.

ఈ పై జెప్పినవానిలో నాల్గవ విషయమునకు భాషావిజ్ఞానశాస్త్రజ్ఞు లెక్కువవిలువ నిచ్చుచున్నారు. వైదికవ్యాకరణమునకును,సంస్కృత వ్యాకరణమునకును నత్యంతభేద మున్నది. కాని పైనచెప్పినట్లు పాణిని రెండింటిని కలిపి వ్రాసియున్నాడు. సంస్కృతవిద్యార్థులకు సిద్ధాంతకౌముదియందలి వైదికస్వరప్రక్రియలు విడిచిపెట్టుట పరిపాటియైనది. ఈకారణమున వీరు మంత్రముల యర్థము అనాయాసముగ చెప్పలేకున్నారు. ఇది శోచనీయము. వైదికవ్యాకరణమంతయు తెలిసికొనవలెనన్న పాణినీయము చాలదు. దీనికి ప్రాతిశాఖ్యల జత చేసి చదువవలెను.

వైదికవ్యాకరణమునుగూర్చి భాషావిజ్ఞానశాస్త్రజ్ఞులలోముఖ్యులగు Whitney, Macdonnel మొదలగు పాశ్చాత్యులు కొన్ని గ్రంథములు వ్రాసియుండిరి. ఈయిద్దరిగ్రంథములును భాషావిజ్ఞానశాస్త్రమున కత్యంతోపకారకములై యున్నవి.

## V. కల్పాంగము

కల్పము22 కూడ నిరుక్తమువలె ప్రాచీనమైన వేదాంగము. ఇది మంత్రవినియోగమును జెప్పు అంగములలో నొకటియని యిదివఱలో చెప్పియుంటిని. ఈ వేదాంగమునుగూర్చి కల్పసూత్రములని కొన్ని గ్రంథములున్నవి. ఇవి ఒక్కొక్కవేదమునకు ఒక్కొక్కశాఖకు ఒక్కొక్కటిగా రచింపబడియుండెను. ఇందు కొన్ని నశించుటతోడనే ఆశాఖకు జెందినవారు అదియే వేదమున మఱియొకశాఖకు జెందిన కల్పసూత్రమునుగాని, లేక వేఱొకవేదమునకు జెందిన సూత్రమునుగాని యుపయోగించుచున్నారు.

ఈకల్పసూత్రములు ఒక్కొక్కటి నాలుగుభాగములుగా నున్నవి:

౧. శ్రౌతసూత్రము.
౨. గృహ్యసూత్రము.
౩. ధర్మసూత్రము.
౪. శుల్బసూత్రము.

ఋగ్వేదమునకు ఆశ్వలాయనసూత్రము, శాంఖాయనసూత్రము నని రెండుసూత్రములు కనుపించుచున్నవి. శౌనకసూత్రమని పేరుమాత్రము వినవచ్చుచున్నది.

యజుర్వేదము—కృష్ణయజుర్వేదమునకు జెందిన సూత్రములు చాలగా నున్నవి. ఇందు ఆపస్తంబ,బౌధాయన, సత్యాషాఢ, హిరణ్యకేశులసూత్రములుమాత్రము దృగ్గోచరమగుచున్నవి.మానవసూత్రమున కొంతభాగమె నిలచియున్నది. కఠమైత్రలౌగాక్షివారాహ భారద్వాజ వైఖానససూత్రములు నామావశిష్టములు.

శుక్లయజుస్సునకు జెందినవి కాత్యాయనశ్రౌతసూత్రము, పారస్కరగృహ్యసూత్రముమాత్రమె కనుపించుచున్నవి.

సామవేదమునకు జెందిన కల్పసూత్రములుగూడ పెక్కులున్నవి. అవి లాట్యాయనద్రాహ్యాయనసూత్రములు, మశకుని ఆర్షేయకల్పము, గౌతమధర్మసూత్రము, ఖదిర, గోభిలజైమినీయసూత్రములు మొదలైనవి.

అథర్వవేదమునకు కౌశికవైతాన సూత్రములని రెండుసూత్రములు గలవు.

21. "యథేంద్రశత్రుః స్వరతోపరాధాత్" అనుదానిపై జెప్పిన సాయణుని కథను చూడుడు.

ఋ. వే. భాష్యోపక్రమణిక.

22 కల్పసూత్రములనుగూర్చి చెప్పవలసిన విషయము లనేకమున్నను, సామంజస్యము ననుసరించి యిచ్చట కొద్దివిషయములే చెప్పబడియున్నవి.

ఈ పైవానిలో బౌధాయన ఆపస్తంబ కల్ప సూత్రములకు దప్ప మిగతవేనికినిగూడ పైనజెప్పిన శ్రౌతాది చతుర్విధసూత్రములు కనుపించుటలేదు. అందుచే ముందు చెప్పినట్లు ఏసూత్రము లేకున్న ఆశాఖ వారు ఆశాఖకు దగ్గఱగా నున్న మఱియొకశాఖకు జెందిన ఆసూత్రము నుపయోగించుకొనుచున్నారు. కాని కొందఱు విమర్శకులు పైనుదాహరించిన నామములతో (స్థవిరాశ్వలాయనాదినామములతో) చతుర్విధసూత్రములను నొకప్పు డుండెనని, కొన్ని నశించిపోగా కొన్నియే మిగిలినవని యనుట సరికాదనుచున్నారు. వీరిమతమున "ఈ సూత్రములకు పేర్లు ఆయాఋషి, తత్ప్రవచయితలయొక్క నామము ననుసరించి వచ్చినవి. అట్టి ఋషి మిగతసూత్రములకూడ నాగ్రంథముతో బాటు రచించెననుట కెట్టి యాధారమును లేదు. ఆఋషి ఆ సూత్రమువిషయమున సరియగు ప్రమాణగ్రంథము లేక పోవుటచేతకాని, తన కాసూత్రమును స్పష్టముగా వ్రాయుట యభిమతము గుటచేత గాని ఆసూత్రమును మాత్రమే వ్రాసియుండవచ్చును. అట్లుకాదేని అనేక గ్రంథములు నష్టమై పోయెనని యూహింపవలసి వచ్చును."

వీనియందు మంత్ర బ్రాహ్మణములయం దుదాహరింపబడిన సర్వక్రతువులయందును చేయబడదగిన కార్యక్రమము, విధులు చెప్పబడియున్నవి. యజ్ఞము చేయగోరువారికి వీని యావశ్యకత యెట్టిదో చెప్పనక్కఱలేదు. కర్మతో నిమిత్తములేక కేవలము వేదము నర్థముచేసికొనగోరు సామాన్యులకుగూడ వీని ఉపయోగమమితము. ముఖ్యముగా యజురథర్వవేదముల విషయమున వీని దెలియకున్న ఆవేదము లేమాత్రమును నర్థముకావు. ఎందుచేతననగా ఈవేదములలో యజ్ఞకర్మకు సంబంధించిన పదము లనేకము లున్నవి.

మఱియు సంహితా బ్రాహ్మణములలో క్షిప్తముగా చెప్పబడియున్న యాగాదికర్మవిధానము ఇందు విపులముగా చెప్పబడియున్నది.

ఆధునికవిమర్శకులు దీనినిబట్టి ఆనాటియార్యుల సాంఘికస్థితిని, నాగరికతను గూర్చి చెప్పగలుగుచున్నారు. అదియుగాక ఇది హిందువుల పౌరాణికైతిహాసికచరిత్రకు చాల సహాయపడుచున్నది. మఱియు పల్లెలలో నుండు సామాన్యప్రజల విశ్వాసములును, ఆచారములునుగూడ దీనివలన మనకు తెలియుచున్నవి.

ఈ అంగమునుగూర్చి Max Muller, Weber, Hillebrandt, Hang, Buhler, Oldenberg, Eggling, Kieth, Sylvan Levi మొదలగు ననేకులు అనేకగ్రంథములు వ్రాసియుండిరి. వీనిలో Hillebrandt అను జర్మను పండితుడు శ్రౌతకర్మను గూర్చి చాలపరిశోధన చేసి యుత్కృష్టమగు గ్రంథములను రచించెను. ఈవిభాగమునుగూర్చి శ్రౌతసూత్రములు, గృహ్యసూత్రములు మొదలగువానిపై ప్రత్యేకించి వ్రాయవలసిన విషయము లనేకమున్నను వాని నన్నిటి నిచ్చట చెప్పుట కవకాశములేదు.

## VI. జ్యోతిషము

కాత్యాయనుడుజ్యోతిషాంగమును "యజ్ఞకాలార్థసిద్ధికై" చదువవలసినదిగా జెప్పియున్నాడు. ఇట్టి కాలవిశేషములనుగూర్చి మనకు మంత్రబ్రాహ్మణములయం దచ్చటచ్చట "సంవత్సర మేతద్వ్రతం చరేత్" మొదలగునవి కనబడుచున్నవి. ఇట్లె ఋతువులగూర్చియు, మాసములగూర్చియు, పక్షములగూర్చియు, నక్షత్రములగూర్చియు విధులు కనబడుచున్నవి. వీని నర్థముచేసికొని ఏసమయమునం దేకర్మ చేయవలెనో తెలిసికొనవలసియున్నది. వీని యర్థము తెలిసినగాని వేదార్థ మవగతము కాదు.

జ్యోతిషాంగమను పేరట నొకగ్రంథ మున్నది. ఇది శ్లోకరూపమున నున్నది. ఇది మనకు కనబడు శిక్షాగ్రంథముతో సమకాలీమనని యొకవిమర్శకుడు[24] తలచుచున్నాడు. కాని అది అంత సబబుగా కనిపిం

23. ఈ సందర్భమున "ఋగ్వేదము కేవలము కవిత్వమందలి, వాఙ్మయమందలి అభిలాష చేతనే- వ్రాయబడియుండెను. కాని మిగిలిన వేదములు, యజ్ఞమున నుపయోగపడుటకై రచింపబడియున్నవి. కాలక్రమమున ఋగ్వేదము నీ కార్యముననే యుపయోగింపబడుచున్నది" అనువాదమును గమనింపవలెను.

24. Max Muller.

చదు. ఇది మిక్కిలి ప్రాచీనముకానప్పటికి "శిక్షా" గ్రంథమంత యర్వాచీనము కాదని తోచెడిని.

చరణవ్యూహమున జ్యోతిషమనియు, ఉపజ్యోతిష మనియు పేర్కొనబడియున్నవి. దీనినిబట్టి అప్పటి కీశాస్త్రము చాలఅభివృద్ధిపొందియుండె నని చెప్పగలము. చరణవ్యూహకారునికంటె ప్రాచీనుడైన పాణిని "గణపాఠమున" వైదికగ్రంథములలో జ్యోతిషమును గూడ పేర్కొనెను. వీనికిముందు "ఛాందోగ్యోపనిషత్తు" నందు "నక్షత్రవిద్య" యనుపేరట జ్యోతిషము పేర్కొనబడియున్నట్లు కనబడును. బ్రాహ్మణములలో "చంద్రుడు కాలప్రమాణమును సూచించు"నని యనేకసారులు చెప్పబడియున్నది. తైత్తిరీయమున 'నక్షత్రదర్శ' అనియు, 'గణక' అనియు పదములు కనుపించుచున్నవి. వీనినన్నిటిని బట్టిచూడ చాలప్రాచీనకాలము నుండియు జ్యోతిషమునందు కూడ హిందువులు కృషి సల్పుచున్నట్లు కనబడును. నాగార్జునవాగ్భటాదులకు ముందుగూడ ననేకగ్రంథము లుండియుండునుకాని పాణినీయాదులవలెనే వీరిగ్రంథములు వానిని రూపుమాపియుండును. అందుచే వైదికయుగమున జ్యోతిషాంగముగా పరిగణింపబడెడు గ్రంథ మేదియో చెప్పలేము. మనకు కనుపించు "జ్యోతిషాంగ" గ్రంథమున సిద్ధాంతభాగమునుగూర్చి యంతగాలేదు. ఇది చాల ప్రాథమికగ్రంథమనియు, శాస్త్రసంబద్ధమై లేదనియు Max Muller విమర్శించుచున్నాడు. వైదికయాగాదుల సమయములను నిర్ణయించుట కుపయోగించునట్లుగా దినములను, ఘడియలను తెలిసికొనుటకై యిది వ్రాయబడియుండును.

పైనుదాహరించిన చరణవ్యూహమున పేర్కొనబడిన "ఉపజ్యోతిషము"నకు జెందిన గ్రంథములు బహుశః "పరిశిష్టము"లై యుండును. ఇట్టిపరిశిష్టములలో జ్యోతిషమును గూర్చి సామవేదమునకు జెందినది "గోభిలీయనవగ్రహశాంతిపరిశిష్ట" మనియు, అథర్వమునకు జెందినది "నక్షత్రకల్ప" మనియు కలవు.

జ్యోతిషాంగ గ్రంథము రెండు విధములుగానున్నది. యజుర్వేదమునకు జెందిన పుస్తకములో 43 శ్లోకములు గలవు. ఋగ్వేదమునకు జెందిన గ్రంథములో 36 శ్లోకములుమాత్రమె కలవు. వీనిలోని విషయములు సామాన్యముగా గ్రహచారములగూర్చియు, నక్షత్రములగూర్చియు, దర్శపౌర్ణమాసలగూర్చియు నున్నవి.

జ్యోతిషము నాధారముగాజేసికొని తిలక్, యాకోబీ (Jacobi) పండితులు వేదముల కాలనిర్ణయము చేయుచున్నారు. ఇందు తిలకుమహాశయుని ప్రకారము క్రీ. పూ. ౬౫౦౦ మొదలు 3000 సం. లందును, యాకోబీప్రకారము 3000 సం. లందును బహు ప్రాచీనములైన వైదికసూక్తములు రచింపబడియుండవలెను.

ఇట్లు షడంగములును వేదార్థమును తెలిసికొనుటలో అత్యంతోపయోగకరమైన వగుటచేతనే వీనికి "వేదాంగత్వ" మబ్బియున్నది. కర్మప్రధానులైన వైదికపురుషులకు దీనివలని ఉపయోగమునాట యటుంచి కేవలము విమర్శ దృష్టితో వేదములను సమీపించు మనకు వీని యుపయోగమునుగూర్చి విచారించిన, ఉపయోగ మపారమని తోచును. వ్యాసమునం దచ్చటచ్చట పృథక్కుగా వీని యుపయోగములగూర్చి చెప్పియుంటిని. పౌరాణికచరిత్రయందును (History of Mythology), భాషా విజ్ఞాన శాస్త్రమునందును (Philology), ఛందశ్శాస్త్రమునందును (Prosody), హిందూదేశపు నాగరికతాచరిత్రమునందును (History of the Civilisation of India) వీని యావశ్యకతయు, ఉపయోగమును గోచరమగును.

వైదికపురుషుడు షడంగముల జదివిననేగాని పరిపూర్ణనాగరకు డనిపించుకొనుటలేదు. అతడు చదివిన చదువంతకు వేదాంగముల చదువు మెరుసునెట్టు చున్నది. సింహావలోక న్యాయమున మనము దీనిపై విమర్శదృష్టి బరపి చూచిన, నివి కేవలము సద్యః ప్రయోజనమును వేదార్థావబోధమాట యటుండ, వైదికపురుషునకు సామాన్యజ్ఞానమును, నాగరికతను నిచ్చుచున్నవి. ఆనాటి విద్యావంతుడను ప్రతిపురుషుడును వీనిని జదివినగాని పూర్ణవిద్యావంతుడగుటలేదు. అనగా పఠనీయమగు విద్యలో నీవేదాంగములకు కొంతసాటున్నది. అందులకనే పరాపరావిద్యలనుగూర్చి చెప్పుచు ముండకోపనిషత్తు వేదాంగములను వేదములతో సహా అపరావిద్యగా దలచుచున్నది. సాంగముగు వేదమును జదివినగాని పురుషుడు విద్యావంతు డగుటలేదు.

# సంస్కృత ప్రాకృతములు

శ్రీ పరవస్తు వెంకటరామానుజస్వామి

మన హిందూదేశమునందలి సంస్కృతప్రాకృతాది భాషలకును, యైరోపాఖండమునందలి గ్రీకు, లాటిను, ఇంగ్లీషు, గాథికు మొదలగు భాషలకును బదములలోను, ప్రత్యయములలోను, వ్యాకరణ విషయములోను విశేషసామ్య మగపడుచున్నది. వీనినిబట్టి యీ భాషల నేమాత్ర మెఱిగినవారైనను వీనికి విశేషసంబంధము కలదని చెప్పగలరు. స్థానములనుబట్టి యత్యంత వ్యవహితములగు నీభాషలలో సాదృశ్యము యాదృచ్ఛికమని కాని, సాంక్రామికమని కాని చెప్పుటకు వలను పడదు. ఏభాషనుండి వీనియన్నిటికిని నీసాదృశ్యము సంక్రమించినదో చెప్పజాలము. నవీనరూపములకంటె ప్రాచీనరూపములకు సాదృశ్యాధిక్య మగపడుచుండుటచే నీభాషల పూర్వపూర్వావస్థలలో సాదృశ్య మధిక మగుచుండినదనియు, నాద్యావస్థలో నివియన్నియు నభిన్నముగా నుండి యేకభాషగా నుండినవనియు నూహింపవలసియున్నది. అట్టిభాషను 'ఇండో - యూరపియన్' మాతృభాషయని వ్యవహరింతురు. అది ప్రస్తుత మెచ్చటను వ్యవహారములో లేదు.

౨. మన కుపలబ్ధములగు భాషలలో దేనినైనను మాతృభాషయని తలంచుటకు వలనుపడదు. అట్లు తలంచుట కట్టిభాష భాషాంతరములకంటె ప్రాచీనమైనది కావలయునుకదా. లేనియెడల మాతృభాషకంటె దజ్జన్యభాష ప్రాచీనమను నసంగతి వాటిల్లును. సంస్కృత భాష నెఱుగనికాలమున పాశ్చాత్యులు తాఱెఱింగిన భాషలలోనెల్ల గ్రీకుభాష ప్రాచీనమైనదగుటచే లాటిను మొదలగు భాషాంతరము లన్నియు దజ్జన్యములని తలంచుచుండిరి. గ్రీకుభాషకంటె ప్రాచీనతరమగు సంస్కృత భాష యొకటి కలదని వారికి దెలిసినపిమ్మట వా రాయభిప్రాయమును విడనాడిరి. ఇప్పుడు మనమెఱిగిన 'ఇండో యూరపియన్' భాషలలోనెల్ల సంస్కృతభాషయే ప్రాచీనతమమైనది. దీనినిగూడ మాతృభాషయనియు, దీనినుండియే భాషాంతరము లుద్భవించినవనియు జెప్పజాలము. సంస్కృతమున మిగిలిన భాషలకంటె ననేకప్రాచీనరూపము లగపడుచున్నను నందలి కొన్ని విషయములు ప్రాచీనములు కావని తలంచుటకు నిదర్శనములు కలవు. వానిలో నొకటిరెం డిచ్చట నుదాహరించెదను.

సంస్కృతమున హ్రస్వములగు నెకారోకారములు (ఎ, ఒ) లేవు. గ్రీకు లాటిన్ భాషలలోని యేతద్వర్ణఘటితపదములకు సమానములగు సంస్కృతపదములలో వానిస్థానమున నకార (అ) మగపడును. ఉ. సం. పతిః, గ్రీ. posis; సం. అవిః, గ్రీ. ois, లా. ovis; సం. కతరః, గ్రీ. poteros; సం. దదర్శ, గ్రీ. dedorke; సం. అస్తి, గ్రీ. esti, లా. est, లిథు. esti; సం. అశ్వః, లా. equus. సంస్కృతమే మాతృభాషయై గ్రీకు, లాటిను మొదలగు భాషలు తజ్జన్యములైనచో నా శబ్దములలో నకారఘటితరూపములే ప్రాచీనములు కావలయును. గ్రీకులాటిన్ భాషలలో ప్రాచీనాకారమే (అ) ఎకారోకారములుగా (ఎ, ఒ) బరిణమించియుండవలయును. కాని గ్రీకులాటిన్ భాషలలోని వర్ణములే ప్రాచీనములనియు, సంస్కృతమున నెకారోకారములు (ఎ, ఒ) కొన్నిదినములు వ్యవహారములోనుండి తరువాత నవి అకారముక్రింద మారినవనియు తలంచుట కుపపత్తులు కలవు.

గ్రీకు, లాటిను మొదలగు పాశ్చాత్యభాషలలోని కంఠ్యోష్ఠ్యఘటితపదములకు సమానములగు సంస్కృత పదములు కొన్ని కంఠ్యోష్ఠ్యఘటితములుగాను, మిగిలినవి తాలవ్యోష్ఠ్యఘటితములుగాను నున్నవి. ఇట్టి భేదమునకు కారణ మేమైయుండునని విమర్శింపబడెను. తాలవ్య వర్ణఘటితపదములలో దద్వర్ణమునకు బరముగా నకారేకారయకారములలో (అ-ఇ-య) నేదో యొకవర్ణమును, గంఠ్యవర్ణఘటితపదములలో దద్వర్ణమునకు బరముగా నికార-యకారభిన్నమగు వర్ణములలో నేదోయొకటి

యును నగపడుచుండెను. కాగా అకారమునకు బూర్వమున గొన్నియెడల గంఠ్యమును, మరికొన్నియెడల దాలవ్యమును సంస్కృతమున నగపడుచుండెను. సమానవర్ణము పరమగునప్పుడు పూర్వవర్ణమున భేద మగపడుటకు గారణము విమర్శింపబడెను. ఈపదములకు సమానములగు గ్రీకులాటినురూపములను బరీక్షింపగా వానిలో సంస్కృతకంఠ్యఘటితపదములకు సమానములగువానిలో కంఠ్యవర్ణమునకు బరముగా అకారౌకారములును (అ-ఒ), సంస్కృతమున తాలవ్యఘటితపదములకుసమానములగు వానిలో గంఠ్యవర్ణమునకు బరముగా నెకారము (ఎ)ను నగుపడెను. చూ.సం. కకుద్, లా. cacumen; సం. కక్షః, లా.coxa; కాని సం. పఞ్చ, లా. Quinque; సం. చత్వారః, లిథు. Keturi; సం. చ, లా. Que. పైసందర్భముల ననుసరించి సంస్కృతమున గంఠ్యము తాలవ్యముగా మాఱుటకు గారణ మూహింపబడెను. సంస్కృతమున దాలవ్యవర్ణమునకు బరమగునట్టియు, భాషాంతరములలో నెకార (ఎ) స్థానీయ మగునట్టియు అకారము ప్రాచీనము కాక ఎకారమే ప్రాచీనమైనచో గంఠ్యము తాలవ్య మగుట క్రిందివిధమగు నుపపత్తి కుదురును. ప్రాచీనకంఠ్యవర్ణమునకు ఎ, ఇ, య, అనుతాలవ్యవర్ణములు పరమగుచో నాకంఠ్యము సంస్కృతమున దాలవ్యవర్ణములోనికి మాఱును. అట్లుకాక సంస్కృతములోని అకారమే ప్రాచీనమై యది గ్రీకు, లాటిను మొదలగు భాషలలో ఎకారముగా మాఱినదని తలంచినయెడల సంస్కృతమున గొన్నియెడల దాలవ్యములగు ఇకార యకారములు పరమగునప్పుడు కంఠ్యము తాలవ్యముక్రింద మాఱుచుండె మఱికొన్నియెడల గంఠ్యమగుఅకారము పరమగునప్పుడు తాలవ్యములోనికి మాఱుట సమంజసముగా తోపదు. కాన సంస్కృతమునందలి అకారముకంటె భాషాంతరములలోని ఎకారమే ప్రాచీనమైనదనియు, నది కొంతకాలము ప్రాచీనసంస్కృతమున వ్యవహారములో నుండి ఇకారయకారములవలె పూర్వమందుండు కంఠ్యము తాలవ్యముగా మాఱుటకు గారణమై తరువాత నకారములోనికి మాఱియుండవలయును. ఇట్లు సంస్కృతమున నగపడనట్టియు, గ్రీకు, లాటిను మొదలగు భాషలలో నగపడునట్టియు ఎకారౌకారముల(ఎ-ఒ) రెంటిలోను నొకటియగు ఎకారము ప్రాచీనమనియు,నది సంస్కృతమున నికేవల అకారముగా మాఱినదనియు నంగీకరింపవలసిరాగా భాషాశాస్త్రజ్ఞులు రెండవది కూడ నట్లే మాఱియుండుననియు, గ్రీకు,లాటిను మొదలగు భాషలయందువలె మాతృభాషలోగూడ అ-ఎ-ఒ, అను రూపములగు హ్రస్వాచ్చులును నుండినవనియు, సంస్కృతమున నెకారౌకారము (ఎ-ఒ)లకారముక్రింద నికేవల మాఱినవనియు జెప్పుట యుక్తమని తలంప నారంభించిరి. 'ఇండో-యూరపియన్' భాషలన్నిటిలోను గ్రీకుభాషలో నచ్చు లధికముగా నున్నవి. మాతృభాషలోగూడ నిట్లే యచ్చుబాహుళ్య ముండినదనియు, గ్రీకుభాషలో మాతృభాషలోని యచ్చులు చాలవఱకు నిలిచియున్న వనియు నిప్పటి భాషాశాస్త్రజ్ఞుల సిద్ధాంతము.

అచ్చులలోనేకాక హల్లులలోగూడ సంస్కృతమున మార్పుసంభవించినదని సోపపత్తికముగ నిరూపింపవచ్చును. ప్రాచీనకంఠ్యములు కొన్నియెడల తాలవ్యములుగా మాఱినవని పైసందర్భమున మనకు తెలిసినది. ప్రాచీనతాలవ్యము లూష్మలుగా మాఱినవి. ఉ: సం. శ్వా, గ్రీ. kuon, గాథి, hunds; సం. శతమ్, గ్రీ. he-katon, లా. centum, గాథి. hund; సం. హంసః, గ్రీ. chen, ప్రా. హై. జ. gans; సం. బాహుః, గ్రీ. pechus, ప్రా. హై. జ. buog. మహాప్రాణవర్ణములు కొన్ని యల్పప్రాణములలోనికిని, మఱికొన్ని హకారములోనికిని మాఱినవి. ఉ: సం. గృభ్ణామి, గాథి. gredus; సం. బధ్నామి, గాథి. bindan; సం. మహో. గ్రీ. methai; సం. హి, గ్రీ. thi. మఱియు ప్రాచీనరేఫలకారములకు సంస్కృతమున వినిమయము సంభవించినది. ఉ: సం. రిరేచ, గ్రీ. eloipa, గాథి. laihw; సం. లుంపామి, లా. rumpo, ప్రా. ఇం. reofan.

పైరీతిని నచ్చులలోను, హల్లులలోను విపరిణామము లనేకము లగపడుటచే సంస్కృతము భాషాంతర

ములకు మూలమని తలంచుట కవకాశములేదు. ఇట్టి కారణాంతరములచేతను, సంస్కృతమునకంటె నవీన మగుటచేతను భాషాంతరములలో నేదియును మాతృభాషయని యంగీకరింప వలనుపడదు. ఇవియన్నియును నేదో యొక మూలభాషనుండి వివిధరీతుల విపరిణామములను బొంది కాలక్రమమున విభిన్నభాషలుగా మాఱి యొక పెద్దభాషాకుటుంబముగా నేర్పడినవి. వీనిలో హిందూదేశములోని యార్యభాషయొక్క పోకడలు మన కిప్పుడు ప్రసక్తమైయున్నవి.

3. 'ఇండోయూరపియన్' కుటుంబములోని ఆర్యన్‌శాఖలో పారసీకదేశపు భాషలును, హిందూదేశములోని భాషలును జేరియున్నవి. వీనికి సన్నిహిత సంబంధ ముండుటచే నివిరెండును నొకశాఖలో జేర్పబడినవి. హిందూదేశభాషలలో ఋగ్వేదాదివేదసంహితలలోని భాష యతిప్రాచీనమైనది. బ్రాహ్మణారణ్యకోపనిషత్తులలోని భాష యంతకన్నను నవీనమైనది. ఇది పాణినీయవ్యాకరణభాషకు చాల సమీపముగా నుండును. పాణినికాత్యాయనపతంజలులచే దమ వ్యాకరణమున ననుశాసింపబడిన భాష సంస్కృతభాషయని తెఱచుగా వ్యవహరింపబడును. పై రెండువిధములగు భాషలకును గూడ సంస్కృతమని సామాన్యవ్యవహారముగలదు. అశోకుని శాసనములలోని భాషను, బౌద్ధమతగ్రంథములలోని భాషను బాళీభాషయని వ్యవహరింతురు. ఇదియును, సంస్కృతనాటకములలో నగపడునవియు, వరరుచి హేమచంద్రాదులచే వ్యాకరణములందు వర్ణింపబడినవియునగు బ్రాకృతభాషలును సంస్కృతమునకంటె నవీనములు. ఉత్తర హిందూదేశమున వ్యవహరింపబడుచున్న హిందీ, బెంగాలీ, పంజాబీ, మరాఠీ మొదలగు భాషలు పైయన్నిటికంటె నవీనములైనవి.

వేదసంహితలలోని భాష వైదికభాషయని వ్యవహరింపబడుచున్నది. సంహితలలో ఋగ్వేదసంహిత ప్రాచీనతమమైనది. కాన నిందలిభాష ప్రాచీనతమమైన హిందూదేశభాషయని చెప్పవచ్చును. ఋగ్వేదసంహితలోని ఋక్కులన్నియు నేకకర్తృకములు కావు. అనేకఋషులు రచియించినట్లు మనగ్రంథములే చెప్పుచున్నవి. మూడవమండలమునందలి ఋక్కులు విశ్వామిత్రునిచేతను, నతని వంశమువారిచేతను, నేడవమండలములోని ఋక్కులు వసిష్ఠునిచేతను, నతని వంశస్థులచేతను దృష్టములైనవి. కాన నీమంత్రములు భిన్నకాలికములని యంగీకరింపకతీరదు. భిన్నభిన్నకాలములలో రచియింపబడినవగుటచే వీనిలో భాషాభేద ముండకతప్పదు. ఆకారణముచే గావలయును, కొన్నిసూక్తములు మనకు సులభముగా నర్థమగుచుండగా మఱికొన్ని దురవగాహములుగా నున్నవి. వేదమున నేకత్ర 'కృత' యను యనురూపమున నున్న శబ్దమన్యత్ర 'కట'యనురూపమున నుండుటయు, 'గర్త'యనురూపమున నున్న శబ్దము 'కాట' యనురూపముతో నుండుటయు, 'ద్యోతీ'రూపమున నుండు శబ్దము 'జ్యోతీ'రూపమున నుండుటయు, 'బృశశృధిర'రూపముల నుండు శబ్దములు 'బుసశిథిర'రూపముల నుండుటయు గాలభేదకృతమని మన మంగీకరింపవచ్చును. వేదమంత్రములు రచియింపబడినకాలమును మనము వైదికయుగమని వ్యవహరింపవచ్చును.

వైదికయుగమున నార్యులు హిందూదేశమున సింధునది మొదలుకొని సరస్వతీనదివఱకు వ్యాపించియుండిరి. విశాలమగు దేశమును వ్యాపించియున్నవారి భాష యేకరీతిగా నుండునని భాషాతత్త్వము నెఱిగినవా రెవరును నంగీకరింపజాలరు. ప్రదేశభేదములను బట్టి భాషలో భేదము లుద్భవించును. ఇట్టిభేదములు హిందూదేశార్యభాషలలో బ్రాచీనతమమైన వైదికభాషలోగూడ నుండినవి. ధకారభకారయుక్త పదములు హకారయుక్తములుగా గూడ నుండుటయు, డకారఢకారయుక్తపదములు కొన్ని ళకారళ్హకారయుక్తములుగాగూడ నుండుటయు, రేఫయుక్త పదములు లకారయుక్తములుగాగూడ నుండుటయు, అకారాంత శబ్దముల తృతీయాబహువచనరూపములు కొన్ని ఐసంతములుగాను, మఱికొన్ని భిస్సంతములుగాను నుండుటయు నిట్టిభేదములని మన మూహింపవచ్చును. ఇట్టి భేదములతోగూడిన తమతమ భాషలలో ఋషులు మంత్రములను రచియించిరి. మంత్రముల భాషకును, దద్ద్రష్టల వ్యావహారికభాషకును భేదమేమియును లేదని

చెప్పజాలము. ఏకాలమునందైనను గ్రాంథికవ్యావహారిక భాషల కెట్టిభేద ముండునో వీనికిగూడ నట్టిభేదమే యుండినదని మన మంగీకరింపవచ్చును. వ్యావహారిక భాషలో రూపబాహుళ్యము విశేషముగా నుండును. వానిలో గ్రామ్యము లని తోచెడు కొన్ని రూపములు గ్రాంథికభాషలో విడువబడును. మఱియు కొన్ని వ్యవహారములోనున్న పదములు వాని ప్రయోగమున కవసరము కలుగకపోవుటచే గ్రాంథికభాషలో జేరకపోవచ్చును. కాబట్టి వైదిక భాషకంటె వైదిక యుగమునందు వ్యవహారములోనుండిన భాషలో రూపబాహుళ్యము తక్క మఱేమియు విశేషము లేదని మనము చెప్పవచ్చును. భాషాంతర జన్మమునకు గ్రాంథిక వ్యావహారిక భాషలలో వ్యావహారిక భాష కారణమగును గాని గ్రాంథికభాష యెన్నడును గానేరదు. కాన నొకకాలపు వ్యావహారిక భాషకును, దత్పూర్వకాలపు గ్రాంథికభాషకును బ్రత్యయములందును, బదజాలము నందును విశేషభేద మగపడుచుండును.

౮. వైదిక భాష క్రమముగా బ్రాహ్మణారణ్యకోపనిషత్తులలోని భాషగా బరిణమించినది. వైదిక భాషలోని యనేకపదములు వ్యవహారములోనుండి జారినవి. రూప బాహుళ్యము కాలక్రమమున నశించినది. అకారాంతపుంలింగ శబ్దములలో బ్రథమా బహువచనమున అస్ ప్రత్యయము మాత్రము నిలిచి అసస్ ప్రత్యయము లోపించినది. ప్రథమాద్వితీయాద్వివచనమున ఔ ప్రత్యయము నిలిచి ఆ ప్రత్యయము లోపించినది. నపుంసకలింగశబ్దములలో బ్రథమాద్వితీయా బహువచనమున ఆని యను ప్రత్యయము నిలిచి ఆ ప్రత్యయములోపించినది. అకారాంతశబ్దములలోనే తృతీయైకవచనబహువచనములలో ఏన, ఐస్ అను ప్రత్యయములు నిలిచి, ఆ, భిస్ అను ప్రత్యయములు లోపించినవి. షష్ఠీబహువచనమున నామ్ ప్రత్యయము నిలిచి ఆమ్ ప్రత్యయము లోపించినది. అన్నంతశబ్దముల సప్తమ్యేకవచనమున ఇ ప్రత్యయముతో గూడిన రూపములే నిలిచి ప్రత్యయరహిత కేవలప్రాతిపదికసమానాకారములగు రూపములు వ్యవహారమునుండి తొలగినవి. సర్వనామస్థానమునకును నసర్వనామస్థానమునకును గలభేదము స్థిరపడినది. సర్వనామశబ్దములలో ద్వివచనమున నామవాచకభిన్నరూపములు లోపించి యదినామవాచకద్వివచనముతో సమానముగా జేయబడినది. తిఙ్లలో మస్ స్థానమున నగు మసి ప్రత్యయమును, తేస్థానమున నగు ఏ ప్రత్యయమును, త్వమ్ స్థానమున నగు త్వ ప్రత్యయమును, త్వాత్, ధి ప్రత్యయములును లోపించినవి. ధాతువులకు వికరణప్రత్యయములు నియతములైనవి. లేట్ వ్యవహారమునుండి తొలగినది. కృదంతములలో ననేకరూపములు నశించినవి. తుమర్థమున త్వార్థమున, బ్రత్యయాంతరములు లోపించి యారెండునుమాత్రము మిగిలినవి. ఇన్నివిధము లగు రూపములు లోపించి స్వల్పముగా గ్రొత్త రూపములు వ్యవహారములోనికి వచ్చినవి. లుట్టు, లిట్టులో "అస్, కృ, భూ అను ధాతువుల యనుప్రయోగము, లుఙ్లో నొక రూపము (ఉ: అదాయిషి), తవతు ప్రత్యయము అనునవి యీ కాలమున నూతనముగా వ్యవహారములోనికి వచ్చిన రూపములలో ముఖ్యములైనవి.

భాషలోని పైవిపరిణామములు సార్వజనీనముగా జరిగియుండలేదు. కొందఱిభాషలో పైవిపరిణామములు కొన్ని జరుగక మఱికొన్ని యితరవిపరిణామములు సంభవించినవి. సుబంతతిఙంతరూపములలో ద్వివచనము నశించినది. తృతీయైకవచనమున ఆ ప్రత్యయమును, బహువచనమున భిస్ ప్రత్యయమును, ప్రథమా బహువచనమున అసస్ ప్రత్యయమును, సర్వనామ శబ్దములలో కొన్నివైకల్పికరూపములును లోపింపలేదు. తుమర్థమున తల్ ప్రత్యయముగూడ వ్యవహారములో నుండెను. స్వరములో గూడ జనులలో భేదము సంభవించెను.

మఱియు నీభాష వివిధజాతిజనులచే వివిధములుగా వ్యవహరింపబడినది. శిష్టులగు బ్రాహ్మణు లొకతీరునను, పామరజను లొకతీరునను భేదముగా వ్యవహరించుచుండిరి. బ్రాహ్మణులు వ్యవహరించు నగ్రామ్యభాషకే పాణిని వ్యాకరణమును వ్రాసెను. బ్రాహ్మణులు వేదము నభ్యసించినవారగుటచే వారికి వైదికభాషయంతయు స్వాధీనముగానుండెను. వ్యవహారమున మాత్రము పైవిధమున మాఱిన భాష నుపయోగించుచుండిరి. కావు



గొర్లకాపరి

—పెండ్యాల వెంకటరామరావు

# 'కాటాస్' నగర దేవాలయములు (G. S. A.)

౫. జంట దేవాలయము



(ఇట్టివి తూర్పునను గలవు. వీనికి నడుమ ప్రధానాలయ మొక్కటి యున్నది. భార్యాసోదర సమేతుడయి రాముడు దీనిని దర్శించెనట. కాబట్టి దీనికి రఘునాథదేవాలయ మనుపేరు కలిగినది.)

౬. పాండవ దేవాలయము.



(పాండవులకు వీనికి సంబంధము కల్పింపబడినది. కాని వీని నిర్మాణము కాశ్మీర శిల్పము ననుసరించి యున్నది. ఇది కాశ్మీరము గెలుచుకొనిన సింగపురముయొక్క ప్రాచీన రాజధాని యని గుర్తింపబడినది.)

వనే పాణిని వైదికలౌకికభాషలకు రెంటికిని వ్యాకరణ మును రచియించెను. జనసామాన్యము వైదికభాష నెఱిగి యుండలేదు. వారు గ్రామ్యభాష నుపయోగించుచుండిరి. వారిభాష నుద్దేశించి పాణిని వ్యాకరణమును రచియించియుండలేదు. పైరీతిని సంస్కృతము రెండు రీతుల వ్యవహరింపబడుచుండినదను విషయ మీక్రింది రామాయణశ్లోకములవలన స్పష్టపడుచున్నది.

"అహం హ్యతితనుశ్చైవ వానరశ్చ విశేషతః,
వాచం చోదాహరిష్యామి మానుషీమిహ సంస్కృతామ్.
యది వాచం ప్రదాస్యామి ద్విజాతిరివ సంస్కృతామ్,
రావణం మన్యమానా మాం సీతా భీతా భవిష్యతి.
అవశ్యమేవ వక్తవ్యం మానుషం వాక్య మర్థవత్,
మయా సాన్త్వయితుం శక్యా నాన్యథేయ మనిన్దితా."
సున్దరకా - ౩౦ సర్గ. ౧౭-౧౯ శ్లో.

ద్విజులును, ద్విజేతరులునుగూడ సంస్కృతమును వ్యవహరించుచుండినట్లును, వారిభాషలకు పరస్పరము భేదముండినట్లును పైశ్లోకములవలన దెలియుచున్నది. ద్విజులు వేదవేదాంగములను రచియించినవారును, నభ్యసించినవారును నగుటచే వారిభాష నిర్దుష్టముగానుండెను. ద్విజేతరులభాషలో లోపము లుండినవి. వికరణవినిమయము, పరస్మైపదాత్మనేపద వినిమయము, ధాతుప్రత్యయ, లకారప్రత్యయముల వినిమయము వీరి భాషలో తఱచుగా గలుగుచుండెను. ద్విజేతరులకు ముఖ్యముగా నుద్దిష్టములైన రామాయణ మహాభారతాది గ్రంథము లీభాషలోనే రచియింపబడినవి. ఇవి ద్విజేతరులచే రచియింపబడియుండ నుండవచ్చును. అందువల్లనే వీరిభాష పాణినీయవ్యాకరణానుసారిగా లేదు.

బ్రాహ్మణారణ్యకోపనిషత్తులు శిష్టులచే దమ భాషలో వ్రాయబడిన గ్రంథములు. వీనిలోని భాషకును, శిష్టవ్యవహారభాషకును గొంచెము భేద ముండును. ఒకటి గ్రాంథికభాషయు, రెండవది వ్యావహారికభాషయు నైయున్నవి. పాణినీయము శిష్టవ్యవహారభాష కనుశాసనము. కాన బ్రాహ్మణారణ్యకోపనిషత్తులలోని భాష స్వల్పభేదములతో పాణినీయమునకు సరిపడుచున్నది. ఈభేదము గ్రాంథికభాషయగుటచే సంభవించినది. పాణినీయ మాకాలపు వ్యావహారికభాష కనుశాసనమని 'పృషోదరాదీని యథోపదిష్టమ్' (౬-౩-౧౦౯) అను పాణినిసూత్రము సూచించుచున్నది.

౫. పై రీతిని వేదకాలపుభాష మాఱుచువచ్చి పాణినినాటికి రెండువిధములుగా బరిణమించినది. ఈపరిణామములకును మూలభాషకును పదజాలమునందును, ప్రత్యయములందును విశేష భేదము సంభవించినది. వర్ణములలోమాత్ర మతిస్వల్పమైన మార్పు కలిగినది. పాణిని తరువాతికాలమున వర్ణములలో విశేష విపరిణామము కలుగ నారంభించినది. పతంజలినాటికి వర్ణవిపరిణామములు విశేషముగా సంభవించిన ట్లాతనిమహాభాష్యము వలననే తెలియుచున్నది.

"గా రిత్యస్య గావీ గోణీ గోతా గోపోతలికే త్యేవమాదయో౽పభ్రంశాః. (౧. ౧. ౧.) లోకే హి కృత్స్నార్థే కసింప్రయుఞ్జతే, దృశ్యర్థేచ దిశిమ్. (౧.౩.౧.)

కాత్యాయనుని కాలమున స్వల్పముగా వర్ణవిపరిణామములు సంభవించినవని యీ క్రిందివార్తికము సూచించుచున్నది:

"భూవాదిపాఠః ప్రాతిపదికాణపయత్యాదినివృత్త్యర్థః. (కే పున రాణపయత్యాదయః. ఆణపయతి వట్టతి వడ్ఢతీతి.") మహాభాష్యము. ౧. ౩. ౧.

ఈ వర్ణవిపరిణామములు ద్విజుల భాషలోను, ద్విజేతరుల భాషలోనుగూడ సంభవించినవి. ద్విజులు వేదవేదాంగముల నభ్యసించినవారగుటచే వారి భాషయందు విపరిణామము నెమ్మదిగాగలుగును. వారు వ్యాకరణమును జదివినవా రగుటచే గలుగకుండుటకు ప్రయత్నముగూడ జేయుదురు. ద్విజేతరులు విద్యావంతులు గాకపోవుటచే వారిభాషలో విపరిణామములు శీఘ్రముగా సంభవించును. ద్విజులభాషలోగూడ విపరిణామములు పతంజలికాలమునకు పూర్వమే సంభవించినట్లు మహాభాష్యములోని యీక్రిందివాక్యములు సూచించుచున్నవి:

"ఏవం హి శ్రూయతే. యర్వాణ స్తర్వాణో నామర్షయో బభూవుః. ప్రత్యక్షధర్మాణః పరావరజ్ఞా విదితవేదితవ్యాః అధిగతయాథాతథ్యాః. తే తత్రభవన్తో యద్వాన స్తద్వాన ఇతి ప్రయోక్తవ్యే యర్వాణ స్తర్వాణ ఇతి ప్రయుఞ్జతే. యజ్ఞే పునః కర్మణి నాపభాషన్తే" (౧. ౧. ౧).

ఇట్లు ప్రాచీనవేదకాలమునాటి భాష ప్రథమమున రూపబాహుళ్యమును విడనాడి పాణినికాలమునాటికి సంస్కృతభాషగా నేర్పడి తరువాతను వర్ణవిపరిణామములను బొంది పతంజలికాలమునాటికి పాళీభాషగా నేర్పడినది. ఈకాలమున కొందఱుమాత్రము ప్రాచీనగ్రంథములను వేదవేదాంగముల నభ్యసించి వానిలోనిభాష నుపయోగింపగలిగి యుండిరి. యజ్ఞాదికర్మల జేయుకాలమున దానినే తప్పక వాడుచుండిరి. మిగిలిన కాలములలో గొన్ని యపభ్రంశపదములను వాడుచుండిరి. పాణినికాలమునమాత్ర (అనగా బ్రాహ్మణారణ్యకోపనిషత్తుల రచనాకాలమున) మందఱును సంస్కృతమునే వాడుచుండిరి. ద్విజులు శుద్ధమైనభాషను, ద్విజేతరులు గ్రామ్యభాషను వ్యవహరించుచుండిరి.

౬. సంస్కృతభాష యెన్నడును వ్యవహారములో నుండిన భాష కాదనియు, నది వైయాకరణులచే వైదికభాషనుండి కల్పింపబడిన కృతక భాష యనియు, నందుచే నది భాషాంతర జనకము కానేరదనియు వాదించుట సమంజసము కాదు. కృతకభాషకు ముఖ్యలక్షణమగు వ్యవస్థను గలిగియుండక సంస్కృతభాష దురవగాహమగు నవ్యవస్థనే కలిగియున్నది. సంస్కృత వ్యాకరణమున నపవాద శాస్త్రములు విశేషముగా నున్నవి. వైదికభాషనుండియైన యనవసరమగు వైకల్పిక రూపములను విడిచి సహజముగా నుద్భవించిన భాషవలె సంస్కృతము స్పష్టముగా నగపడుచున్నది. వైయాకరణులు వైదికభాషనుండి సంస్కృత భాషను కల్పింపలేదు. వారు క్రొత్తభాషను నిర్మించుటకు నిమిత్తమేమియును గానరాదు. అట్లు వారు పూనుకొనినను నట్టిపని సాధ్యమైనది కాదని భాషాతత్త్వ మెఱింగిన వారందఱును దృఢముగా జెప్పగలరు. వారు సహజసిద్ధమగు భాషను నిరూపించుటకు ప్రయత్నించిరి. మఱియు వైదికభాష వ్యావహారిక భాషయైనచో సంస్కృతము కాకపోవుటకు గారణమేమో తెలియకున్నది. వైదికభాషకంటె సంస్కృత భాష రూపబాహుళ్యమును గలిగిన భాష కాదు, కఠినమైనభాషయు గాదు. సంస్కృత భాషవలె రూపాధిక్యము కల గ్రీకుభాష వ్యావహారికభాష యైనచో సంస్కృతము కాకపోవుటకు గారణము లేదు.

సంస్కృతము వ్యావహారికభాషయనుటకు నిదర్శనములుకూడ గలవు. యాస్కుడు తన నిరుక్తగ్రంథమున బదవ్యుత్పత్తిని గుఱించి ప్రసంగించుచు "నిగమము", "భాష" అని ప్రత్యేకముగా వ్యవహరించి యున్నాడు.

"అథాపి భాషికేభ్యో ధాతుభ్యో నైగమాః కృతో భాష్యన్తే దమూనాః క్షేత్రసాధా ఇతి. అథాపి నైగమేభ్యో భాషికా ఉష్ణం ఘృతమితి". (౨. ౧. ౩)

ఇచ్చట వేదమునకు బ్రతిద్వంద్విగా జేర్కొనబడిన 'భాష' వ్యావహారికభాషయే కావలయును. నిపాతల యర్థమునగూడ వేదమునకును 'భాష'కును భేదము కలదని చెప్పియున్నాడు.

"ఏతే చత్వార (అనగా ఇవ,న,చిత్, నూ యనునవి) ఉపమార్థే భవన్తి. ఇవేతి భాషాయాం చాన్వధ్యాయఞ్చ. ......నేతి ప్రతిషేధార్థీయో భాషాయా ముభయ మన్వధ్యాయమ్" (అన్వధ్యాయమ్=ఛన్దసి). (౧. ౨. ౧)

పాణిని తనవ్యాకరణమున వైదికభాషలోని విశేషములను 'ఛన్దస్' 'నిగమ' 'మన్త్ర' 'బ్రాహ్మణ' అను మొదలుగాగల వేదనామములతో నిర్దేశించుచు మఱికొన్ని విశేషములను "భాషా" అను నామమున నిర్దేశించి యున్నాడు.

"సఖ్యశిశ్వీతి భాషాయామ్. ౪-౧-౬౨. (సఖీ అశిశ్వీ ఇత్యేతౌ శబ్దౌ జీషన్తౌ భాషాయాం నిపాత్యేతే)
ప్రథమాయాశ్చ ద్వివచనే భాషాయామ్ ౭-౨-౮౮.
(ప్రథమాయాశ్చ ద్వివచనే పరతో భాషాయాం విషయే యుష్మదస్మదో రాకారాదేశో భవతి. యువామ్, ఆవామ్")

ఇట్టిసూత్రము లింకననేకములు కలవు. పాణినీయవ్యాకరణములోని సూత్రములు చాలవఱకు వేదమునకును 'భాష'కును సమానముగా నుండును. కొన్ని వేదమునకుమాత్రము, మఱికొన్ని పైవిధమున భాషకుమాత్రమును సంబంధించియున్నవి. ఇచ్చట వేదమునకు ప్రతికక్షిగా బేర్కొనబడిన 'భాష' వ్యావహారికభాషయే కావలయును.

యాస్కపాణినులు (కాత్యాయనుడు కూడ) సంస్కృతభాష వివిధదేశములలో వివిధముగా నున్నట్లు వ్రాయుచున్నారు.

"అథాపి ప్రకృతయ ఏవైకేషు భాష్యన్తే వికృతయ ఏకేషు. శవతి ర్గతికర్మా కమ్బోజేష్వేవ భాష్యతే. .........వికారమస్యార్యేషు భాషన్తే శవ ఇతి. దాతి ర్లవనార్థే ప్రాచ్యేషు. దాత్ర ముదీచ్యేషు. (౨.౧.౩-౪)

ప్రాచాం క్రీడాయామ్ ౬-౨-౭౪. (ప్రాగ్దేశవర్తినాం యా క్రీడా తద్వాచిని సమాసేఽకప్రత్యయాన్త ఉత్తరపదే పూర్వపదమాద్యుదాత్తం భవతి. ఉద్దాలకపుష్పభఞ్జికా.......ప్రాచామితి కిమ్? జీవపుత్త్రప్రచాయికా. ఇయ ముదీచాం క్రీడా.)"

ఈసూత్రము క్రీడలను సంబంధించిన దగుటచే సంస్కృతము సర్వజనవ్యవహారములో నుండిన భాష యని యిది సూచించుచున్నది.

"మాతరపితరా వుదీచామ్. ౬-౩-౩౨. (మాతరపితరా విత్యుదీచా మాచార్యాణాంమతే నారజాదేశో మాతృశబ్దస్య నిపాత్యతే. మాతరపితరా. ఉదీచామితి కిమ్? మాతాపితరౌ.)

వృద్ధాట్ఠక్ సౌవీరేషు బహులమ్. ౪-౧-౧౪౮. (వృద్ధా త్సౌవీర గోత్రా దపత్యే బహులం ఠక్ ప్రత్యయో భవతి కుత్సనే గమ్యమానే. భాగవిత్తికః. తార్ణబిన్దవికః. .........సౌవీరేష్వితి కిమ్? ఔపగవి ర్జాల్మః. కుత్సన ఇత్యేవ. భాగవిత్తాయనో మాణవకః)

భర్గాత్ త్రైగర్తే ౪-౧-౧౧౧. (భర్గశబ్దా దపత్యే విశేషే త్రైగర్తే గోత్రే ఫఞ్ ప్రత్యయో భవతి. భార్గాయణో భవతి త్రైగర్తశ్చేత్. భార్గి రన్యః.)

పరిస్కన్దః ప్రాచ్యభరతేషు ౮-౩-౭౫. (పరిస్కన్ద ఇతి మూర్ధన్యాభావో నిపాత్యతే ప్రాచ్యభరతేషు ప్రయోగవిషయేషు......అన్యత్ర పరిష్కన్దః)"

ఇట్టి సూత్రము లింకననేకములు కలవు. విశాలమగు దేశమున నేకభాష వ్యవహరింపబడుచుండిన యెడల నందు ప్రదేశభేదమున భేదము లేర్పడును. వీనికి మాండలికభేదములని వ్యవహారముకలదు. ఇట్టిభేదములు వ్యావహారికభాషలలోనే యగపడును గాని కృతకభాషలలో నేర్పడవు.

మఱియు బాణినీయములోని యీక్రిందినియమములు సజీవమగు వ్యావహారికభాషకు వర్తించును గాని నిర్జీవమగు కృతకభాషకు వర్తింపనేరవు.

" క్రియాసమభిహారే లోట్ లోటో హిస్వౌ వా చ తధ్వమోః ౩-౪-౨. (సమభిహారవిశిష్ట క్రియావచనాద్ధాతో ర్లోట్ ప్రత్యయో భవతి సర్వేషు కాలేషు. సర్వలకారాణా మపవాదః. తస్యచ లోటో హి స్వ ఇత్యేతా వాదేశౌ భవతః తధ్వంభావినస్తు వా భవతః. లునీహి లునీహీ త్యేవాయం లునాతి. అధీష్వాధీష్వే త్యేవాయ మధీతే.

సముచ్చయేఽన్యతరస్యామ్ ౩-౪-౩. (సముచ్చీయమాన క్రియావచనా ద్ధాతో రన్యతరస్యామ్ లోట్ ప్రత్యయో భవతి. తస్యలోటో హిస్వావాదేశౌ భవతః. తధ్వంభావినస్తు వా భవతః. భ్రాష్ట్రమట మఠమట ఖదూరమట స్థాల్యపిధానమటే త్యేవాయ మటతి ఛన్దోఽధీష్వ వ్యాకరణ మధీష్వ నిరుక్త మధీష్వే త్యేవాయ మధీతే.)

సముచ్చయే సామాన్యవచనస్య ౩-౪-౫. (ద్వితీయే లోడ్విధానే సముచ్చయే సామాన్య వచనస్య ధాతో రనుప్రయోగః కర్తవ్యః. ఓదనం భుంక్ష్వ సక్తూన్ పిబ ధానాః ఖాదే త్యేవాయ మభ్యవహరతి.)

తత్ర తేనేదమితి సరూపే ౨-౨-౨౭. (సప్తమ్యన్తే గ్రహణవిషయే సరూపే పదే తృతీయాన్తే చ

ప్రహరణవిషయే ఇదం యుద్ధం ప్రవృత్త మిత్యర్థే సమస్యతే కర్మవ్యతిహారేద్యోత్యే. కేశేషు కేశేషు గృహీత్వేదం యుద్ధం ప్రవృత్తం కేశాకేశి. దణ్డైర్దణ్డైశ్చ ప్రహృత్యేదం యుద్ధం ప్రవృత్తం దణ్డాదణ్డి. ముష్టీముష్టి. బాహూబాహవి.)

మయూరవ్యంసకాదయశ్చ. ౨-౧-౭౨. (ఏహీడాదయోఽన్యపదార్థే. ఏహీడ ఇతి యస్మిన్ కర్మణి తదేహీడమ్. ఉద్ధర కోష్ఠా దుత్సృజ దేహీతి యస్యాం క్రియాయాం సాఉద్ధరోత్సృజా. జహికర్మణా బహులమాభీక్ష్ణ్యే కర్తారం చాభిదధాతి జహీతే తత్కర్మణా బహులం సమస్యతే ఆభీక్ష్ణ్యే గమ్యే సమాసేన చేత్కర్త్రాభిధీయతే. జహి జోడః. జహి స్తమ్బః. ఆఖ్యాతమాఖ్యాతేన క్రియాసాతత్యే. అశ్నీతపిబతేత్యేవం సతతం యత్రాభిధీయతే సా అశ్నీతపిబతా. పచతభృజ్జతా. ఖాదతమోదతా.)"

సంబోధనమునందును, ప్రత్యభివాదనమునందును బ్లుతవిధికూడ వ్యావహారికభాషకు సంబంధించిననే యర్థవంతమగును గాని కృతకభాషకు గానేరదు కదా.

"ప్రత్యభివాదేఽశూద్రే. దూరాద్ధూతే చ. హైహేప్రయోగే హైహయోః. గురోరనృతోఽనన్త్యస్యాప్యేకైకస్య ప్రాచామ్." (౮-౨.౮౩-౮౬.)

ఇచ్చట దేశభేదమునుబట్టి యుచ్చారణభేదము కూడ నిర్దేశింపబడినది. ఆక్రోశసూచనావిషయకమగు నీక్రిందినియమముకూడ వ్యావహారికభాషకే చెందగలదు.

"నాదిన్యాక్రోశే పుత్రస్య ౮-౪-౪౮. (పుత్రాదినీ త్వమసి పాపే.)"

ణముల్ ప్రత్యయాంతముల ప్రయోగములు కొన్ని వ్యావహారికభాషకు సహజములైనవిగా నున్నవి.

"స్వాదుమి ణముల్ ౩-౪-౨౬. (స్వాద్వర్థేషూపపదేషు కృఞో ణముల్ ప్రత్యయో భవతి. స్వాదుంకారం భుంక్తే. సంపన్నంకారం భుంక్తే. లవణంకారం భుంక్తే)

అన్యథైవంకథమిత్థంసు సిద్ధాప్రయోగశ్చేత్ ౩-౪-౨౭. (అన్యథాది షూపపదేషు కృఞో ణముల్ ప్రత్యయో భవతి సిద్ధాప్రయోగశ్చే త్కరోతే ర్భవతి ......అన్యథాకారం భుంక్తే. ఏవంకారం భుంక్తే. కథంకారం భుంక్తే. ఇత్థంకారం భుంక్తే.)

యథాతథయో రసూయాప్రతివచనే ౩-౪-౨౮. (యథాతథాశబ్దయో రుపపదయోః కృఞో ణముల్ ప్రత్యయో భవతి అసూయాప్రతివచనే గమ్యమానే... యథాకార మహం భోక్ష్యే తథాకార మహం కింతవానేన.

చర్మోదరయోః పూరేః ౩-౪-౩౧. (చర్మోదరయోః కర్మణో రుపపదయోః పూరతే ర్ణముల్ ప్రత్యయో భవతి చర్మపూరం స్తృణాతి. ఉదరపూరం భుంక్తే.)

వర్ష ప్రమాణ ఊలోపశ్చా స్యాన్యతరస్యామ్ ౩-౪-౩౨. (పూరయతే ర్ధాతోః ణముల్ ప్రత్యయో భవతి ఊలోపశ్చాస్య పూరయతే రన్యతరస్యాం భవతి సముదాయేన చేద్వర్షస్య ప్రమాణ మియత్తా గమ్యతే. గోష్పదపూరం వృష్టోదేవః. గోష్పదప్రంవృష్టో దేవః. సీతాపూరంవృష్టోదేవః సీతాప్రం వృష్టో దేవః.)

చేలే క్నోపేః ౩-౪-౩౩. (క్నూయో శబ్దే ఉన్దనే చ. అస్మాణ్ణ్యన్తాద్ధాతో శ్చేలార్థేషు కర్మసు ఉపపదేషు ణముల్ ప్రత్యయో భవతి వర్షప్రమాణే గమ్యమానే. చేలక్నోపం వృష్టో దేవః. వస్త్రక్నోపం వసనక్నోపమ్.)

సమూలాకృత జీవేషు హన్కృఞ్గ్రహః ౩-౪-౩౬ సమూల-అకృత-జీవ ఇత్యేతేషుశబ్దేషు కర్మసూపపదేషు యథాసంఖ్యం హన్ కృఞ్ గ్రహ ఇత్యేతేభ్యో ణముల్ ప్రత్యయో భవతి సమూలఘాతం హన్తి. అకృతకారం కరోతి. జీవగ్రాహం గృహ్ణాతి.)

హస్తే వర్తిగ్రహోః ౩-౪-౩౯. (హస్తవాచిని కరణ ఉపపదే వర్తయతే ర్గృహ్ణాతేశ్చ ణముల్ ప్రత్యయోభవతి. హస్తవర్తం వర్తయతి. హస్తగ్రాహం గృహ్ణాతి.)

కర్త్రోర్జీవపురుషయో ర్నశివహోః ౩-౪-౪౩. (జీవపురుషయోః కర్తృవాచినో రుపపదయో ర్యథా

సంఖ్యం నశివహో ర్థాతోర్వై ర్ణముల్ ప్రత్యయో భవతి. జీవనాశం నశ్యతి. పురుషవాహం వహతి.)"

ఇట్టిప్రయోగములను సూచించు సూత్రము లింక ననేకములు కలవు. తెలుగు మొదలగు వ్యావహారిక భాషలలో నిట్టిప్రయోగములను మనము చూచుచున్నాము. ఉ॥ కమ్మగా భోజనముచేసితిని. నేను యలా భోజనముచేస్తే అలాచేస్తాను నీకేమి. కడుపునిండా తిన్నాను. దుక్కివాన కురిసింది. బట్టతడుపువినుకులు పడినవి. ప్రాణంతో పట్టుకున్నాడు మొ. ఇట్టివి వ్యావహారిక భాషలలోనే యగపడును; గ్రాంథికభాషలలో నుండవు. కావుననే వేదమున మంత్రభాగమున నిట్టిప్రయోగము లతివిరళముగా నున్నవి. మఱియు జూదరుల భాషకును, గొల్లలభాషకును సంబంధించిన యీక్రిందినియమములుకూడ సంస్కృతము వ్యవహారములో నుండిన భాష యని సూచించుచున్నవి.

"అక్షశలాకాసంఖ్యాః పరిణా ౨-౧-౧౦. (అక్షశబ్దః శలాకాశబ్దః సంఖ్యాశబ్దశ్చ పరిణాసహ సమస్యన్తే ......కితవవ్యవహారే సమాసోఽయ మిష్యతే. పంచికానామ ద్యూతం పంచభి రక్షైః శలాకాభిర్వా భవతి. తత్ర యదా సర్వే ఉత్తానాః పత న్త్యవాఞ్చోవా తదా పాతయితా జయతి. తస్యైవాస్య విఘాతోఽన్యథా పతేసతి జాయతే. అక్షేణేదం నతథా వృత్తం యథా పూర్వంజయే అక్షపరి. శలాకాపరి. ఏకపరి. ద్విపరి. త్రిపరి. పరమేణ చతుష్పరి. పంచసు త్వేకరూపాసు జయ ఏవభవిష్యతి.)

అణోఽప్రగృహ్య స్యానునాసికః ౮-౪-౫౭. (అణః అప్రగృహ్యసంజ్ఞ స్యావసానే వర్తమానే వానునాసికాదేశో భవతి. దధి. మధు.)"

పైనుదాహరింపబడిన వాక్యములనుబట్టి పాణిని కాలమునను,దత్పూర్వమునను సంస్కృతము సర్వజన వ్యవహారమున నుండినట్లును, నాభాషనే పాణిని యను శాసించినట్లును స్పష్టముగా దెలియుచున్నది. కాత్యాయనుని కాలమునగూడ సంస్కృతమే వ్యవహారములో నుండినది. కాని యతనికాలమున కాభాషయం దాతిదేశికరూపములు ప్రవేశించి యది కొంచెము మాఱినది. కొన్ని ప్రాచీనపదములు వ్యవహారమునుండి జాఱినవి. ఈయంశము లతని వార్తికములవల్లనే మనకు దెలియుచున్నవి. నఙిసమ్బుద్ధ్యోః (౮-౨-౮) అను సూత్రమువలన నకారాన్తనపుంసకలింగశబ్దములకు సంబుద్ధియందు నకారము లోపింపక చర్మన్, బ్రహ్మన్ అను మొదలగు రూపములు సిద్ధించును. పాణినికాలమున నిట్టిరూపములే వ్యవహారములో నుండినట్లు మనకు దెలియుచున్నది. కాత్యాయనుని కాలమున నకారము లోపించి చర్మ, బ్రహ్మ అను మొదలగు రూపములుకూడ వ్యవహారములోనికివచ్చుటచే నతడు "వా నపుంసకానామితి వక్తవ్యమ్" అనువార్తికమును జెప్పెను. "విభాషా ద్వితీయాతృతీయాభ్యామ్" (౭-౩-౧౧౫) అను సూత్రముచే బాణిని ద్వితీయా తృతీయా యను స్త్రీలింగశబ్దములకు జతుర్థ్యాద్యేకవచనములలో ద్వితీయస్యై, ద్వితీయాయై అను మొదలగు రెండేసిరూపములు కలవని చెప్పెను. కాని పుంలింగములగు ద్వితీయతృతీయశబ్దములకు రెండేసి రూపములు కలవని చెప్పియుండలేదు. ద్వితీయస్మై, తృతీయస్మై అను మొదలగు నొక్కొక్కరూపములే కలవని చెప్పియున్నాడు. కాత్యాయనునికాలమున బుంలింగశబ్దములకుకూడ రెండవరూపము వ్యవహారములోనికి వచ్చుటచే "విభాషాప్రకరణే తీయస్య ఙిత్సూపసంఖ్యానమ్"అని వార్తికము నాతడు వ్రాసెను.

" ఇన్ద్రవరుణభవశర్వరుద్రమృడహిమారణ్యయవయవనమాతులాచార్యాణా మానుక్ " (౪-౧-౪౯) అను సూత్రమువలన బాణిని మాతులాచార్యశబ్దములకు స్త్రీలింగమున మాతులానీ, ఆచార్యాణీ అనురూపములు కలవని చెప్పియున్నాడు. ఉపాధ్యాయ శబ్దమునకు "పుంయోగా దాఖ్యాయామ్" (౪-౧-౪౮) అను సూత్రముచే 'ఉపాధ్యాయా' అను రూపముమాత్రము తనకాలమున వ్యవహారములో నుండినట్లు పాణిని చెప్పియున్నాడు. కాత్యాయనునికాలమున మాతులీ, ఉపాధ్యాయానీ యనుశబ్దములుకూడ వ్యవహారములోనికి వచ్చుటచే "మాతులోపాధ్యాయయో రానుగ్వా" అను వార్తికమును వ్రాసెను. మఱియు బాణినికాలమున వ్యవహార

ములోలేని ఉపాధ్యాయా, ఆచార్యా, అర్యాణీ, క్షత్రియాణీ అనుశబ్దములు కాత్యాయనునికాలమున వ్యవహారములోనికి వచ్చినవి. ఇట్లు నూతనశబ్దములను సాధించు వార్తికము లింకననేకములు కలవు. వీనినిబట్టి మనము కాత్యాయనునికాలమున గూడ సంస్కృతమే వ్యవహారములో నుండినదనియు, పాణినికాత్యాయనుల మధ్యకాలమున గొన్ని నూతనశబ్దములు వ్యవహారములోనికి వచ్చినవనియు నిశ్చయముగా జెప్పవచ్చును. మఱియు "అస్త్యప్రయుక్తః" "అప్రయోగః ప్రయోగాన్యత్వాత్" అను వార్తికములనుబట్టి పాణినికాత్యాయనుల మధ్యకాలమున గొన్నిపదములు ప్రయోగమునుండి జాఱినవని కూడ మనకు దెలియుచున్నది. ఇట్లు ప్రాచీనపదములు వ్యవహారమునుండి జాఱుటయు, నూతనపదములు వ్యవహారములోనికి వచ్చుటయు వ్యావహారికభాషలో జరుగును కాని కృతకభాషలో నట్లు జరుగనేరదు.

(సశేషము)

---

# జీర్ణదేవాలయము

సన్నిధానము సూర్యనారాయణ శాస్త్రి

తన్నుఁ జెఱసాల బంధింప సన్నపాన
ములను ముట్టక పెనుమూర్ఛ మునిఁగెనో
కృత్రిమంబైన ప్రజల భక్తికిని రోసి కో!
ఋషులు పిలువంగఁ గానల కేఁగెనో కో!
తనకనులముందె జరుగు పాతకచయంబు
సైఁపరామిని విముఖుఁడై చనియెనో కో!
ఆజగద్వ్యాపి భక్తపరాయణుండు
పుణ్యకార్యానుమోదియై పోలుచు వేల్పు.
చిలుకపోయినయట్టి పంజరమువోలెఁ,
బ్రియతమునిఁ బాసి కుందెడు ప్రేయసివలెఁ
గళదఱిగి ధూళిధూసరగాత్రము నయి
విరహవేదనఁ బడుచుఁ గోవెల తపించు.

---

# తల్లిలేనిపిల్ల

( సాంఘికనాటకం )

విశ్వనాథ సత్యనారాయణ

## షష్ఠాంకము

[రైలుదిగి దారిలో - కళింగరావు, రాజ్యం]

కళింగ—కూలివెధవ ఎంత వెనకున్నాడో!

రాజ్యం—నాకు మీయిల్లు ఎరుగదూ! అదేనా వూరు.

కళిం—అదికాక యింకేదవుతుంది.

రాజ్యం—స్టేషనుకి ఊరికి దూరమే.

కళిం—బండికట్టిద్దామా అంటే వద్దన్నావుగా.

రాజ్యం — సరదాగా నడుద్దామని కాదూ? మనం ఇద్దరమూ కలిసి నడుస్తోంటే సరదా! నన్ను మీయింటికి రానిస్తారా!

కళిం—మనం నాయుడుగారింటికి పోతాంగా. నాయుడుగారు చాలా సరదాఅయిన మనిషి. కవిత్వాలంటే, నాటకాలంటే ఆయనకి చాలా యిష్టం. నా చదువుకి డబ్బిచ్చింది అంతా ఆయనేగా!

రాజ్యం—ఇంతడబ్బిచ్చాడంటే మంచివాడన్న మాట.

కళింగ—మా 'మదరు' ఆయనా మారేజి చేసుకొంటా రనుకొంటా.

రాజ్యం—ఓహో! అల్లాచెప్పు.

కళింగ — కాని మాయింట్లో Old Hag ఉన్నాడు. అతనిమూలంగా వీలులేకండా వున్నది. ఆయన బి. సి. నాటివాడు.

రాజ్యం—వాణ్ణి ఇంట్లో ఎందుకుంచారు?

కళిం — ఊళ్లో మనవంక, చూశావా, ఎట్లా చూస్తున్నారో.

రాజ్యం — నాయుడుగారిల్లు ఇంకా ఎంత దూరం వుంది.

కళిం—ఈసందుమలుపు తిరగాలి. అమ్మో! ఆ మేడ. నీవు ఈవూళ్లో వున్నంతసేపు నాతో చనువుగా వుండొద్దు. మనం పెళ్లిచేసుకొంటామన్నమాట ఎవరికి తెలియకూడదు.

రాజ్యం—వట్టి పిరికిలా గున్నావేం. ధైర్యం వుండాలి.

బుచ్చిమామ—(ప్రవేశించి) ఏమిరోయి కళింగం, అమ్మ వస్తా వనుకొంటూనే వుంది. ఈఅమ్మాయి ఎవరు?

కళింగ—స్నేహితురాలు. డాక్టరుపరీక్ష చదువుతోంది.

బుచ్చి—ఎవరు? బ్రాహ్మలేనా?

కళింగ—కాదు. బ్రహ్మసమాజంవారు.

బుచ్చి—ఇల్లువదలిపెట్టి యిట్లా ఎక్కడికి?

కళింగ—నాయుడుగారింటికి. ఈ అమ్మాయి నాయుడుగారికి చుట్టం. ఈవిణ్ణి అక్కడ దిగబెట్టి వద్దామని.

రాజ్యం — నే నాయన్ని ఎరుగను కూడాను. ఆయన నాకు చుట్టంకాదు, ఏమీకాదు.

బుచ్చి — నేనుకూడా వస్తానుపద, నాయుడింటికి.

కళింగ — నీవెందుకు తాతయ్యా! నీవెళ్లి అమ్మతో చెప్పు, నేను వస్తున్నానని.

బుచ్చి—నాయుడిగారితో నాకు పనుందిలే.

రాజ్యం—(విరగబడి నవ్వుతుంది.)

కళిం—ఎందుకు ఫూలువలె నవ్వుతావు.

రాజ్యం—అవును. ఫూలు అయితే నువ్వు కావాలి, లేకపోతే నేనుకావాలి. ఆయనమట్టుకుకాదు,

బుచ్చి—స్త్రీజాతిలో యిది క్రొత్తసృష్టే.

(తెరయెత్తగా- కళ్యాణి, సంగం, రాధ, రెనడే.)

బుచ్చి—నాయుడుగారూ, చుట్టాలు వచ్చారండి.

కళ్యా—రండి! రండి! ఓ! కళింగం. ఈవిడ ఎవరు?

బుచ్చి — నాయుడుగారేమో మంచివారను కొన్నా చుట్టాలనికూడా మరచిపోతారే మీరు.

రాజ్యం—(విరగబడి నవ్వును.) నేనూ కళింగం స్నేహితులం. అతను బి. ఏ. ప్యాసవటంతోనే మేమిద్దరం పెళ్లిచేసుకొంటాం.

బుచ్చి—బాగుంది.

కళింగ—ఆవిడ ఎప్పుడూ అల్లాగే మాట్లాడుతుంది.

నాయుడు—కూర్చోండి. (అందరూ కూర్చుంటారు).

కళ్యా—ఆయనే కళింగరావు. వసుంధరమ్మగారి కొడుకు. ఈయన ప్రొఫెసరు సంగం అని మెస్మరిస్టు. వీరిద్దరినీ నీవు చూశేవుంటావు. ఆయన మహాకవి. ఈయన మాస్టారు రెనడే.

కళింగ — గుడ్ మార్నింగు. (అందరికీ షేక్ హేండ్లుఇచ్చి) ఈవిడ నాక్లాసుమేటు. పేరు కాంచన. నేను మాత్రం నారాజ్యంఅని పిలుస్తాను. అంతేకాదు రాజ్యం.

రాజ్యం—(నవ్వి - అందరికీ షేక్ హేండు ఇస్తుంది.)

(సంగం షేక్ హేండుయిస్తూ చెయ్యి నెమ్మదిగా లాగుతాడు. రెనడే మొగం వాలుస్తాడు. రాధ నవ్వుతూ ఆవిడవంక చూస్తాడు. రాజ్యం సంగంలాగితే హో అని కేకవేస్తుంది. రాధకు మళ్లీ నవ్వువస్తుంది.)

సంగం—వారికివ్వక్కరలేదా షేక్ హేండు.

బుచ్చి—నేను మళ్లీ స్నానంచెయ్యలేను. కొత్త జంధ్యాలు లేవు. ఎందుకు చంపుతారు?

కళ్యా—(నవ్వుతూ) ముట్టుకుంటేనే స్నానం చెయ్యాలా అండి.

బుచ్చి—నాకు షేక్ హేండు ఎందుకు? నాకేం యింగ్లీషువచ్చా, పాడువచ్చా. పైగా షేక్ హేండిస్తే లాగాలో నవ్వాలో ఏమీతెలియదాయెనాకు. ఎందుకులెండి.

కళింగ—(బుచ్చిమామవంక కోపంగా చూస్తాడు.)

రాజ్యం—ఇంగ్లీషురాని బూర్జువాఇంతే.

బుచ్చి—ఏమన్నా తిట్టా ఏమిటండి, నాయుడుగారూ, అది?

కళ్యా — ఏ త్బే కాదండి.

బుచ్చి—నీకు కోపం ఎందుకమ్మా! నాయుడూ, నీవు చెప్పవయ్యా. ఆవిడ ఏకులమో తెలియదాయెను! మాలదియేమో!

సంగం—బాబూ! మీకు ఇష్టంలేకపోతే వెళ్లండి. ఎందుకు వృథాగా మాఅందరకు కష్టంకలిగిస్తారు.

రాజ్యం—వీళ్లకు కులం, వర్ణమేతప్ప మనుష్యులన్నమాటేలేదు. పదిమందిలో మర్యాదన్నా తెలియదు.

బుచ్చి—మీకు కులభేదం, స్త్రీభేదం తెలియదు. కోపంఎందుకు. నామూలంగా మీకెన్నో అభ్యంతరాలు వుంటయి. నేను వెళతాను. (నిష్క్రమణ)

రెనడే—నాకు పనివుంది, సెలవు.

(నిష్క్రమణ)

నాయుడు—కాఫీ అయిందా!

రాజ్యం—అయిందండి. అదేదో స్టేషనులో చేశాం.

నాయుడు—కళింగం, ఇంటికి వెళతావా?

సంగం—ఈయనవెళ్లి పుస్తేపులు పెట్టడు అక్కడ.

కళింగం—నేను వెళతాగాని రాజ్యం ఇక్కడే వుంటుంది.

కళ్యాణి—అక్కడికెడితే మీ తాతయ్య కర్రుచ్చుకుంటాడు.

కళింగ—రాజ్యం ఒంటిగంటకుగాని భోం చెయ్యదు.

సంగం—ఇవ్వాళ ఏకాదశా!

రాధ—ఇప్పుడు బ్రెడ్ పుచ్చుకొంటారా!

సంగం—ఇవ్వాళ నేనూ అంతే.

కళ్యా—ఏంచేత? మీరుకూడ దొరలపద్ధతేనా? అయితే నీవు వెళ్లు కళింగం. మేము భోంచేస్తాం. మీ వొక్కరూ ఇక్కడ వుంటారా!

రాజ్యం—ప్రొఫెసరుగారుఉంటారన్నారుగా?

సంగం—నాకు కడుపులో జబ్బుగా వున్నది. చెప్పానుగా!

కళ్యా—అయితే బ్రెడ్ వస్తుంది. రాండి. రాధా కృష్ణగారు! నాకు ఇవ్వాళ ఆకలి అవుతోంది.

(రాధ-కళ్యా-నిష్క్రమణ)

సంగం—మీరు స్నానం చెయ్యరూ!

రాజ్యం—రాత్రికేనండి.

సంగం—మీరు డాక్టరు పరీక్ష యెన్నోయేడు.

రాజ్యం—మూడవయేడు.

సంగం—మీకు కళింగరావుగారికి ఎట్లా కలిసింది.

రాజ్యం—మాయింటిప్రక్కనే ఒకగదిలో ఆయనుంటున్నాడు. మీదేవూరండి? ఈవూరేనా!

సంగం— కాదు. నాయకుడుగారి భార్యకు జబ్బుగా వుంటే నయంచేయటానికి వచ్చాను.

రాజ్యం—మీరు వైద్యంకూడా చేస్తారా!

సంగం—ఇది దేహ సంబంధమైన రోగంకాదు; మనస్సంబంధమైంది. దానిని నేను ఆత్మశక్తితో కుదురుస్తాను.

రాజ్యం—ఎల్లాగండి?

సంగం—మా గురువును తలచుకొని నాలో వున్న ఆత్మబలాన్ని ఆవిడమీద ప్రవహింపచేసి ఆవిడ మనస్సు నేను చెప్పినట్లు వినేట్లు చేస్తా. అది యోగశక్తి అంటారు.

రాజ్యం — అల్లా ఎవరిని పడితే వాళ్లని చేస్తారా? ఇపుడు నన్ను చేస్తారా!

సంగం—ఊరికే ఎందుకు? ఏదన్నా ప్రయోజనం వుండాలి.

(బంట్రోతు బ్రెడ్ తెస్తాడు. వెళతాడు)

(ఇద్దరూ చేతులు కడుగుకొని బల్లమీద ఆరగిస్తారు)

సంగం—మీకింకా కొంచెం బట్టరు కావాలా!

రాజ్యం—ఆ చంచా యివ్వండి. నేను తీసుకుంటా.

(సంగం యిస్తూ చేయిచేయి తాకిస్తాడు.)

రాజ్యం— నాయకుడుగారి క్షేమాత్రం ఆస్తి వుందండి.

సంగం—ఒక లక్షరూపాయ లున్నవని చెప్పుకుంటారు.

రాజ్యం—ఆయనభార్య కేమిటిజబ్బు?

సంగం—(నవ్వి) ఏమీ లేదు.

రాజ్యం—ఏదో వుంది. చెప్పాలి.

సంగం—కొందరు దేవతాప్రకృతు లుంటారు. వాళ్లల్లో ప్రేమ అఖండంగా వుంటుంది. కొందరు వట్టి కట్టెలు. వాళ్లే నీతి గీతి అని దేవులాడేది.

రాజ్యం—ఆవిడకి నాయకుడుగారిమీద యిష్టం లేదా! అయితే యింకోళ్లని చేసుకోనేది.

సంగం—మనిషి స్త్రీ అయితే యేం, పురుషుడైతే యేం అనుభవించే శక్తిగల వ్యక్తి. లోకం అనుభవానికైన విషయం. అనుభవంలో ఆనందం వుంది. మనకున్న శక్తిని ఉపయోగిస్తే దానికి ఫలితం కనపడుతుంది. క్రైస్తవమతంలో దేవుడు చచ్చిపోయి స్వర్గా

నికి వెళ్లినవాణ్ణి అడుగుతాట్ట. 'నేను నీకిచ్చిన శక్తిని వృద్ధిచేశావా, నాశనంచేశావా' అని. వృద్ధిచేసినవాడు దేవునికి నచ్చినవాడు. ఈతత్త్వం ఆమతాలకి తెలిసినట్లు మనమతానికి తెలియదు. మనవాళ్లు పట్టె లోభి ముండాకొడుకులండి, యెందులో చూచినాసరే.

రాజ్యం—మాకళింగంకూడా మంచి నూతనాభిప్రాయాలు కలవాడండి.

సంగం—ఏమి నూతనమండి చూడండి. ఇంటికి వచ్చాడా! ఇదిగో తల్లీ తాతా ముక్కుత్రాళ్లు బిగిస్తారు. దానితో గొడ్డు చచ్చిందన్నమాటే.

రాజ్యం—అతను చాలా స్వతంత్రుడు. ధైర్యం కలవాడు చూడండి. నన్నిక్కడికి ధైర్యంలేకపోతే తెస్తాడా!

సంగం—అది మీధైర్యం. మీకేమండి, చదువుకున్నారు. కాఫీ యింకొంచెం పొయ్యనా-మీయిష్టం మీది. కళింగం కాకపోతే I. C. S. ప్యాసయినవాడు వస్తాడు.

(రాజ్యం చెంచా క్రింపపడితే తీసియిస్తాడు)

రాజ్యం—థాంక్సు. మీచెయ్యి చల్లగావుందే?

సంగం—అన్నమేది అసలు, పచ్చడిగా వుంటానికి గాని, చల్లగా వుంటానికిగాని.

రాజ్యం—దీన్ని యింగ్లీషులో పన్నింగు అంటారు. నాకు అదంటే అసహ్యము.

సంగం—బాగా పరిపక్వమైన బుద్ధికలవాళ్లకి అంతే. ఈకవి, యీయాక్టరు వున్నారే. వాళ్లు కొంచెం తక్కువచదువుకొన్నవాళ్లు. వాళ్లు యిట్లామాట్లాడితే చాలా సంతోషిస్తారు.

(రాజ్యం సిగరెట్టు నోటపెట్టుకొనును. సంగం నిప్పుపుల్లగీసి ముట్టిస్తూ)

సంగం—ఇది మిలిటరీవాళ్లకి మహాప్రమాదం. మీసాల కంటుకోవచ్చు.

రాజ్యం—మీసాలుచూస్తే నాకు ఒళ్లు తగలడుతుంది.

సంగం—మీవొళ్లు తగలట్టం ఎందుకు? వాళ్ల మీసాలే తగలడనివ్వండి. మీబుగ్గమీద బట్టరు కావలు అంటింది. (తాను చేతితో దుడుచును)

రాజ్యం—థాంక్సు.

(సేవకుడువచ్చి గిన్నెలు తీసివేయును)

సంగం—నాయడుగారి భోజనం అయిందా?

(సేవకుడు నిష్క్రమించును)

రాజ్యం—నాసిగరెట్టు ఆరిపోయింది.

సంగం—నిప్పుపుల్ల ఒక్కటేవుంది. అది అయిపోయింది. ఇవదండి వెలిగిస్తాను. మావేపున చుట్టలు ముట్టిస్తారు, అల్లా చూపించమంటారా!

(సిగరెట్టు ఇద్దరి నోళ్లల్లో వుంచుకొని వెలిగించి)

రాజ్యం—ఇది నాస్టీ హేబిట్.

సంగం—నోటికి నోటికి రెండుసిగరెట్లంత దూరం వుండగానే నిజంగా అసహ్యమే. పల్లెటూరివాళ్లు చేసుకొనేది. మీకేమన్నా వక్కపొడి అలవాటా అండి?

రాజ్యం—వక్కపొడి దొరలు తినరు.

సంగం—దొరసానులు తినటానికేం?

రాజ్యం—మీరు నన్ను పొగడుతున్నందుకు కృతజ్ఞురాలను. మీరు మధురంగా మాట్లాడుతారు.

సంగం—మీవంటివారు అల్లా అంటే చాలు. ఇల్లా చాలామంది అన్నారు. మీరిక్కడ యెన్నాళ్లు వుంటారు.

రాజ్యం — పదిరోజులన్నా వుంటా మనుకొంటాను. ఈవూరుపొలాలమీదిగాలి పీల్చాలి. పల్లెటూళ్లు చాలా ఆనందంగా వుంటాయండి. పచ్చికబయళ్లు, పచ్చనిచేలు!

సంగం—మీకు కొండలంటే యిష్టమాఅండి?

రాజ్యం—చాలాయిష్టం. అవిఅంటే పడిచచ్చిపోతా.

సంగం — ఇక్కడికి దగ్గరలో ఒకకొండ వుందండి. దానిమీద దొనలున్నవి. చాలా అందమైన ప్రదేశం. ఒకరోజున అక్కడికి వెళదామా!

రాజ్యం—మాకళింగంకూడా వస్తాడు.

సంగం — ఇద్దరికన్న ఎక్కువైతే కంపెనీ బాగుండదు.

రాజ్యం—మరి అతను రాకుండా ఎట్లా? అతను వస్తానంటాడే! రెండుమూడు రోజుల్లో వాళ్లతండ్రి తద్దినంట. ఆరోజున నన్ను వదలిపెట్టాలిపొస్తుందేమో అన్నాడు.

సంగం— సరిపోయింది. ఆనాడు మనం వెళితే సరి. కొండ చాలాబాగుంటుంది లెండి.

కళ్యా—(ప్రవేశించి) అయిందా!

రాధ—(ప్రవేశించును.)

(తెర)

## సప్తమాంకము

[ప్రదేశము-నాయుడి యిల్లు. రాధ, కళింగం, రాజ్యం, కళ్యాణి.]

రాజ్యం—ఇవ్వాళ సంగంగారు కనిపించలేదే?

నాయుడు— మేడమీద వున్నారు. మావాళ్లకు వైద్యంచేస్తున్నారు.

కళింగం—మీ సలహా ఏమిటి?

నాయుడు—ఏం చెప్పమంటావు? ఇందులో నాసలహాకన్న మీ తాతగార్ల సలహాయే మంచిది.

రాధ—తప్పుచేశానని పోయి పోలీసుస్టేషనులో చెప్పినట్లే. వెంటనే లాకప్పులో పెడతారు.

కళింగం—బ్రాహ్మలెవరూ రామంటున్నారు. మా అమ్మ నన్ను చంపేస్తోంది. నాకు రాజ్యం ఎక్కువా, ఈ తద్దినా లెక్కువా!

రాధ—ఈ తద్దినాలంతా నాన్సెన్సు. చచ్చిన వాళ్లని మనం చూశొచ్చామా! మనం యిచ్చింది వాళ్లకి అందుతుందని నమ్మకమేమిటి? ఇదంతా బ్రాహ్మల్ని మేపటం. ఈ బ్రాహ్మలంతా చేసిన దుర్మార్గం. ఏదో రూపేణా వాళ్లకి ముట్టాలి. లేకపోతే మనం తరించము.

కళింగం—వట్టి సూపర్ స్టిషన్. నాకిష్టంలేదు తద్దినాలు పెట్టటం. గోడమీద పిల్లివాటం. నాయుడు గారెటూ మాట్లాడరు.

నాయుడు—వస్తా.　　　(నిష్క్రమణ)

రాధ—నావుద్దేశం చెప్పమంటారా!

కళిం—చెప్పండి.

రాధ—మొదటిపక్షం మానెయ్యండి. ఈబ్రాహ్మల్ని ఏంచేస్తారో చేయనియ్యండి. రెండోపక్షం మీ వాళ్లు యిబ్బంది పడలేక పెట్టారా! నన్ను, ప్రొఫెసరు సంగంగార్ని భోక్తలుగాపెట్టి పెట్టండి. బ్రాహ్మలు రామంటే ఏంచేస్తారు?

రాజ్యం—నేనూ, సంగంగారూ రేపు కొండ కెళదా మనుకొంటున్నామే.

రాధ—ఎల్లుండి అందరం కలిసి పోదాం.

నాయుడు—(ప్రవేశించి) బుచ్చిమామగారు వస్తున్నారల్లే వుంది. మేడమీదనుంచి చూస్తే వస్తున్నాడు. ఈమలుపు తిరిగాడు.

బుచ్చి—(ప్రవేశించి, వచ్చి కూర్చుండును.)

నాయుడు—ఏదండీ, రాధాకృష్ణగారూ, మొన్నటిపద్యాలు చదవండి! బుచ్చయ్యగారు వింటారు. వారు పండితులండోయి!

బుచ్చి—ఇప్పటి కవిత్వాలు నాకేం తెలుస్తయి!

నాయుడు—అంతే! మీకు తెలియకేం! చదవండి.

రాధ—"వెలుగురాచిన."

(రాధ మొదలుపెట్టటంతోనే నాయుడు నిష్క్రమించును.)

రాధ — (వెలుగురాచిన మొ. ౨ పద్యాలు చదువును).

కళింగం—ఆహా! ఏమి వండర్ ఫుల్ గా వున్న య్యండి. నేను ముగ్ధుణ్ణి అయిపోయినాను. యూ ఆర్ ది గ్రేటెస్టు పొయట్.

రాజ్యం—చాలా బాగుందండి. మీగొంతు ఎంత బాగుంది. కళింగం, చూశావా! అడయార్లో మొన్న నెమిలిని చూశాం. కవిగారు 'వెలుగురాచిన' అన్నపుడు ఆనెమిలి కూసినట్లుంది కాదూ?

నాయుడు—(ప్రవేశించి) చదివారా!

రాధ—ఆ!

నాయుడు—ఎల్లా వున్నయ్యండి?

బుచ్చి—బాగానే వున్నయి.

నాయుడు — అల్లాకాదు. మీఅభిప్రాయం చెప్పండి.

బుచ్చి—నాకీకవిత్వాలు ఏమి తెలుస్తయి.

నాయుడు—అయితే బాగావున్నవని ఎందు కన్నారు.

బుచ్చి—మీరు పెద్దమనుష్యులు. మరి ఏమనను.

రాధ—కాదండీ: ఎల్లావున్నయ్యో చెప్పండి. మీఅభిప్రాయం మీరు చెప్పండి. తప్పులుంటే దిద్దు కుంటాను.

బుచ్చి—మొదట అల్లాగే అంటారు. తరువాత కోపాలువస్తవి.

రాధ—నిజంగా కోపంరారు.

బుచ్చి—నిజంగా కోపం రాదన్నా వస్తుంది. కోపంరాదనే స్థితి ఆత్మకి వుంటే రాదుకాని నోటితో అంటే ఆగదు.

కళింగం—మాతాతయ్య అంతే! అదంతా వేదాంతంలెండి.

రాజ్యం—అంత అనుగుతోంటే చెప్పరాదండీ.

బుచ్చి—'బీరనరాలు' అంటే ఏమిటండీ!

రాధ—బీరనరాలంటే? ఏదో అందంగావుందని వేశాను.

బుచ్చి—అర్థం తెలియకుండానే.

రాధ—అప్పుడేదో చూసే వేశానండీ. అది రైటే. (నాయుడు నిష్క్రమించును)

బుచ్చి—ఇల్లావుంటుంది. సరే. చరమార్థగీతిక అంటే?

రాధ—అల్లా అడిగితే చెప్పటం కష్టమండీ! తప్పులుంటే చెప్పండి. కవి ఆవేశంలో సాగసైనమాట వేస్తాడు.

బుచ్చి—ఒళ్లుతెలియని శివం సూడదు. చరమార్థం అంటే చివరిఅర్థం. దేనిచివర, జీవితం చివరా! అంటే చావు. అది అశ్లీలం. తరువాత "మెట్లకిన్నెరతీగలు చిట్లి పోయె." తీగలు తెగిపోతయి. చిట్లవు. అద్దం చిట్లుతుంది. తెగిపోవటానికీ చిట్లిపోవటానికీ భేదం వుందంటారా, లేదంటారా! (నాయుడు ప్రవేశించును-)

బుచ్చి— నాయుడుగారు క్షమించాలి. అడిగారు కనుక చెప్పాలిశొచ్చింది - చూడండి. మెట్లకిన్నెర తక్కువకులాలవాళ్లు వాయించుకొనే వాద్యం. మీరు దానిమీద ఎల్లా వాయిస్తారు. వీణ అనండి. వేణువనండి. బాగుంటుంది.

కళింగ—తక్కువకులాలవాళ్లది కనుకనే దాన్ని తీసుకుంది. లైపు వాళ్లల్లో వుంది. మనలో ఏముంది.

నాయుడు—వారిని చెప్పనివ్వండి.

రాధ—మనకు బీదవాళ్లతో సానుభూతి వుండాలికదండీ!

బుచ్చి—సానుభూతివుంటే డబ్బివ్వండి. వాళ్ల కష్టాలు తొలగించండి. వాళ్లఅప్పులు తీర్చండి! కూటికీ గుడ్డకీ కొరతలేకుండా చెయ్యండి. అంతేగాని సారస్వతంలో వాళ్లసంగతి వ్రాస్తేనే సానుభూతి వస్తుందా!

రాధ—ఇంకా రెండోపద్యం.

బుచ్చి—మళ్లీచదవండి.

రాధ—(చదువును.)

బుచ్చి—సరే, మీరు తమపాకృతులు. అల్లా అనటంలో రసజ్ఞత్వం నాకు తెలియదు. 'కలలొదిగిన' ఏమిటి?

కళింగ—(నవ్వి) కలలంటే డ్రీమ్సు. The flash of lightning in a dream. Some dreamy thoughts అన్నమాట. నీకు తెలియదులే. దానికింగ్లీషు రావాలి.

బుచ్చి—అయితే తెలుగులో వ్రాయటం ఎందుకు.

రాధ—అదంతా తెలుగు చేస్తాం.

బుచ్చి—అప్పటికి అంతా ఇంగ్లీషు అయిపోతే తెలుస్తుంది.

నాయుడు—నాకు పనివుంది, వెళ్తాను.

(నిష్క్రమణ)

బుచ్చి—కళింగం! బ్రాహ్మలమాట ఏమిచేశావు.

రాధ—ఎవరూ రానంటే ఆయ న్నేం చెయ్యమంటారూ?

బుచ్చి—అయ్యో! వస్తూనే ఈ అమ్మాయిని పెళ్లి చేసుకుంటానని టముటమా కొట్టాడాయె. మరి బ్రాహ్మలేలా వస్తారు?

కళింగం—టమాటమా కొట్టింది నువ్వా, నేనా!

బుచ్చి—ఈ పిల్లని తేవటమే కొట్టటం.

కళింగం—నీవు నాతో మాట్లాడొద్దు. వెళ్లిపో.

బుచ్చి—నాకెందుకు లేరా నాయనా! అమ్మ పిలుస్తోంది. వస్తావా!

కళింగం—నేను రానుపో!

బుచ్చి—సరే; అమ్మ పిలవమంది. అందుకని వచ్చాను. నాకేం. (నిష్క్రమణ)

రాధ—వెళ్లిరండి.

కళింగం—(నిష్క్రమించును).

రాజ్యం—నేను పొరపాటు చేశా. ఇక్కడికి రావలసింది కాదు.

రాధ—ఇది మీకెట్లా తెలుస్తుంది. కళింగం చెప్పాలిశింది.

రాజ్యం—పూర్ బర్డ్. అతనికి మేమిద్దరం సరదాగా రావటమే తెలిసింది. ఇంకోటి తెలియలా.

రాధ—మీరు యిల్లాంటి ఇబ్బందులు లేని చోటే పెళ్లి చేసుకోరాదూ.

రాజ్యం—అంటే మిమ్మల్ని చేసుకోమనా!

రాధ—నేనసలు పెళ్లి చేసుకోను. మాది ఫ్రీలవ్ థియరీ.

రాజ్యం—అయితే నన్నందులో చేరనుంటారా!

రాధ—మాకు పెళ్లిచేసుకున్నా యిబ్బంది లేదు.

రాజ్యం—మీ సిద్ధాంతాలు మీ షాయత్రేలో లేవే!

రాధ—మీ రేమూల విన్నారు? ఇప్పుడు సంగంవుంటే ఏమంటాడో తెలుసునా! ఏమూలా అంటే, ఆగ్నేయమూలా, వాయవ్యమూలా అంటాడు. ఆయన విట్ అంతే.

సంగం—(ప్రవేశించి) లెండి; వెళుతున్నాం! మీరు లేస్తున్నారు! అనుగో! బయటికి వెళ్లాం! వెళ్లాం! మీరు లేచారు.

కళ్యాణి—(ప్రవేశించును) (సంగం-రాధ-రాజ్యం సమ్మోహితులై నిష్క్రమింతురు.)

కళ్యా—నేను ధర్మమైన పనిచేస్తున్నాను. కాని మనస్సులో అనుమానం తెగలేదు. ఆత్మ ఒకరిది. శరీరం ఒకరిది. ఏమి యీసంయోగం లేకపోతే? వసుధ నన్నెంత ప్రేమిస్తోంది. కాని మాయిద్దరి శరీరసంయోగం ఆమెకు అక్కరలేదట. ఆదేవతామూర్తి ఆధర్మాన్ని నేనెందుకు స్వీకరించరాదు? ఈపాటికి బయలుదేరివుంటుందా! మెట్లుదిగి వస్తోంది ఇంతా ప్రయత్నంచేసి యిప్పుడు విరాగమెందుకు? ఆహా! నన్ను అందరూ మంచివాడంటారే? అందరూ ప్రేమిస్తారే! నాభార్య నన్నెందుకు

ప్రేమించరాదు. ఒకొక్కడిజన్మచమత్కారం. అన్నీ వున్నవి. నాకు స్త్రీసౌఖ్యం లేకపోయింది. అంత ప్రేమిస్తున్న వసుధవల్లనే లేకపోతే యితరత్రా చెప్పాలా! ఇంకా రాలేదేమి? ఇందాకే మెట్లుదిగుతున్నట్లు వినిపించిందే. ఆవిడే వస్తుంది, మీరటుతిరిగి చూడవద్దన్నాడు సంగం. ఆవిడే వచ్చి పలకరించాలట. సరే! కానియ్యి. నాభార్య నన్నెందుకు ప్రేమించకపోవాలి. నేను ముసలివాడనా! నలభైయేండ్లు దాటలేదు. కురూపినా! చాలామంది స్నేహితులు కాదంటారు. పెద్ద అందగాణ్ణి కాకపోయినా కుంటివాణ్ణి కాదు. గుడ్డివాణ్ణి కాదు. ధనమెంతో దేవుడిచ్చింది వుంది. లోకంలో ఒకానొక స్త్రీపురుషుల సంబంధం చూస్తే ఆశ్చర్యం అవుతుంది. పరమనీచకులంవాడు. పరమ వికారి. నిర్ధనుడు. మనిషి అసహ్యంగా వుంటాడు. స్త్రీమనస్సు వానిమీదికి పోతుంది. ఎవడుచెపుతాడు? పూర్వజన్మలో చేసుకొంటేగాని యేదీ లభించదు. వట్టి బుద్ధిలేనివాణ్ణి, పరమశోభిని లక్ష్మీవరించటంలేదా! అట్లాగే ఇంకోటేను. అదుగోవచ్చింది.

చంద్ర—ఏమిటో ఆలోచిస్తున్నారు.

నాయుడు—నా భాగధేయాన్ని గురించి.

చంద్ర—దానికేమి? ధనవంతులు. మంచివారు. గౌరవం కావలసినంతవుంది. ఇంకేం కావాలి?

నాయుడు—ఏమీ అక్కరలేదు. మనస్సు కష్టంగా వుంది.

చంద్ర—ఉక్కపోస్తోందేమో, విసరనా (పైటతో విసరును.)

నాయుడు—నీచేతులు నొప్పిపెటతై. ఊరుకో!

చంద్ర—రెండుగంటలయింది. ఫలహారం తెస్తా!

(నిష్క్రమణ)

నాయుడు—ఏమిటిది! మెస్మరైజు చేశాడా! మనిషి ఇంత సహజంగా వుంటుందా! నిజమో అబద్ధమో కాని భార్యతో సుఖమనుభవిస్తున్నట్లుంది. కొద్దిలోనే ఆయెను.

చంద్రం—(ఫలహారంతో వచ్చి) ఇంట్లో ఎవ్వరూ లేరేమి!

నాయుడు—మనం ఇద్దరమే వుండాలని.

(ఫలహారంచేస్తూ)

చంద్ర—నామీద అంతప్రేమ యెందుకు?

నాయుడు—భార్యని ప్రేమించటం తప్పా?

చంద్ర—నా అదృష్టం నాకు తెలియలేకపోలేదు. మూతి కంటుకుంది. (చేతితో తుడుచును). తామలపాకులు తెస్తా. (నిష్క్రమణ)

నాయుడు—నాకు కవిత్వమూ రాదు, సంగీతమూ రాదు. అందుకు సంతోషిస్తున్నా. వసుధ ఏమన్నది, సీతాదేవి రామచంద్రుణ్ణి తాకితే హరిచందన కుంకుమల ఆశ్చ్యోతనంలా వుందా! అవును. నిజమే. విషవిసర్పమూ, మదమూ అనుకొన్నాడట ఆయన. చంద్రంచేయి నాకు తాకిందా. తాకింది.

(కన్నీళ్లుకార్చును)

చంద్ర—(ప్రవేశించి)—(ఆదుర్దాతో) కన్నీళ్లు ఎందుకు. (దగ్గరకూర్చుని పైటతో తుడుచును).

నాయుడు—ఇంత ఆనందం నేను భరించలేను.

(కన్నులుమూసికొని పడిపోవును. చంద్రం అతని తల తొడమీద చేర్చుకుంటుంది.)

నాయుడు—(కళ్లుతెరచి) నీవు నాచంద్రానివేనా?

చంద్ర—నేను మీచంద్రాన్నే. తామలపాకు లీనలు తీసియివ్వనా?

నాయుడు—చంద్రం! చంద్రం!

చంద్ర—ఏమిటి చెప్పండి?

నాయుడు—నేనింక చచ్చిపోయినా ఫరవాలేదు.

చంద్ర—అశుభంగా మాట్లాడుతారేమి?

నాయుడు—(లేచి) వీళ్లందరూ ఎక్కడికెళ్లారో?

చంద్ర—ఇప్పుడెవళ్లు కావాలి?

నాయుడు—కవి కావాలి. ఆయన వుంటే ఏదైనా పాట పాడుతాడు.

చంద్ర—మీరు పాడమంటే నేను పాడగలను. కాని మీరు నాతోడమీద పడుకోరాదా! నాచేత అడిగించాలా? మీ ప్రేమంతా ఆత్మలోనే వుంటోంది.

నాయుడు—మనం సావట్లో వున్నాము. పాడు.

చంద్ర—చిన్నపుడు మానాన్నగారు నాకు రుక్మిణీ కళ్యాణం, గజేంద్రమోక్షణం, ప్రహ్లాదచరిత్రా అన్నీ చెప్పారు. రుక్మిణీకళ్యాణంలోది చదువుతాను.

"ఘన్యున్ లోకమనోభిరాము, కుల వి
ద్యారూప తారుణ్యసౌ
జన్యశ్రీబలదాన శౌర్యకరుణా
సంశోభితుఁ నిన్ను నే
కన్యల్ కోరరు, కోరదే గుణ రమా
కాంతాలలామంబు, రా
జన్యానేకప సింహ! నావలననే
జన్మించెనే మోహముల్."

నాయుడు—నన్ను మోసంచేసేందుకు ఏచిన్న కాలునైనా చాలునే. భాగీరథీదేవి బయలుదేరి వచ్చిందెందుకో!

చంద్ర—నేను మోసంచేస్తున్నానా! శ్రీకృష్ణ దేవునిమీద ఒట్టు పెట్టుకుంటున్నా. నేను త్రికరణశుద్ధిగా మిమ్మల్నే నమ్మిఉన్నా! కావలిస్తే నన్ను పరీక్షించుకోండి.

నాయుడు—ఎవరో వస్తున్నారు. నీవు మేడమీదికి పద! (చంద్రం నిష్క్రమించును)

నాయుడు—ఈకృతక సౌఖ్యం అనుభవించనా! వద్దా! వసుంధరా వసుంధరా!

(తెర)

## అష్టమాంకము

[వసుధయిల్లు. బుచ్చిమామ - వసుధ - భగీరథ - శాస్త్రి - కళింగరావు.]

బుచ్చి—బాగానే వుంది. ఎవళ్లూ మాట్లాడక పోతే ఏమిటి లాభం? పదినిమిషాలనుంచి ఒకటే మౌనమా!

వసుధ—ఏమనమంటావు మామయ్యా! ఎవరయినా వస్తారేమో నీవుపోయి మాట్లాడిరా!

బుచ్చి—అమ్మాయీ! నిన్నమొన్న నా పడ్డపాట్లు భగవంతుడికి తెలుసు. ఊళ్లో అంధరూ కట్టు కట్టారు. అప్పటికీ చుట్టుపట్ల నాలుగైదూళ్లకి అబ్బాయిని పంపించాను. ఎవళ్లూ ఒప్పుకోలేదట. ఏంచెయ్యను?

కళింగ—ఎవళ్లూ రాకపోతే నాయుడుగారింట్లో వున్నారు, రాధాకృష్ణగారని కవి. ఆయనానూ, మెస్మరిస్టూ, వీళ్లిద్దరినీ పెడతాను. వాళ్లు మాత్రం బ్రాహ్మలు కారా!

బుచ్చి—నువ్వు పెట్టేటప్పుడు వాళ్లిద్దరూ పనికి వస్తారు.

కళింగ—మీరంధరూ అంతకన్న ఏమెక్కువ? కవిగారు చక్కగా చదువుకొన్నాడు. సంగంగారు మంచియోగి. మీఅందరి బ్రాహ్మలకన్న లక్షరెట్లు నయం.

బుచ్చి—సరే! పెట్టండి. నేనుమాత్రం రాను.

వసు—మరెవ్వరూ రాకపోతే తద్దినం ఏమి కావాలి మామయ్యా!

బుచ్చి—మీరు బ్రాహ్మణ్యంలో వుండాలంటే ఒక్కటేమార్గం. ఆపిల్లని యివ్వాళ ఊరు పంపించేశెయ్యాలి. కళింగాయికి రేపు ప్రాయశ్చిత్తం చేయించాలి. ఇహ వీడు సరిగ్గావుండాలి. అప్పుడుకాని వ్యవహారం కుదరదు.

కళింగ—నే నాపిల్లని పెళ్లిచేసుకుంటాను. మీరెవ్వరూ నన్ను పోషించటంలేదు. నాచదువుకి డబ్బు కూడా నాయుడుగారే యిస్తున్నారు. తక్కిన మూడు నెల్లకి ఆయన్ని నేనే అడుగుకుంటున్నాను. నేను వెళ్లిపోతాను.

వసు—తండ్రి తద్దినం పెట్టవుట్రా. కనీసం రేపు ఆబ్దికమన్నా జరగనీయి. తరవాత నీయిష్టం.

భగీ—తరవాత వచ్చే అన్ని ఆబ్దికాలు చెడిపోయే టప్పుడు రేపటిది వాడితండ్రికి మోక్షం యిస్తుందా?

బుచ్చి—ఆయన చూడు. మధ్యవర్తిఅల్లే మాట్లాడుతాడు. అసలు ఆయనకాదు ఇదంతా చేసింది.

వసు—నాయనా! నిన్ను బతిమాలుతున్నాను. తరువాత నీయిష్టంవచ్చినట్లు చేద్దువుగాని, రేపటికి మాత్రం బుచ్చిమామ చెప్పినట్లు పోనియ్యి నాయనా!

కళింగం—ఈ ప్రాయశ్చిత్తం గీయశ్చిత్తం నేనొప్పుకోను. దీనికి నాకర్మమేమి కాలింది.

భగీ—మళ్లీ కర్మమంటావేమి? కర్మము, ప్రారబ్ధము మొదలయినవన్నీ వదిలితేనే యిల్లాంటి బుద్ధులు.

కళింగం—మీరందరూ మోక్షానికి వెళ్లండి. నేను నరకానికి పోతా. ఈకర్మల్లో నాకు నమ్మకం లేదు. నేను పెట్టను.

బుచ్చి—ప్రతివెధవకీ నమ్మకమే. నీ తాహతెంత, నీకు నమ్మకముండేందుకు. అబ్బో! మహాపండితుడు బయలుదేరాడు. వెధవ నాలుగింగ్లీషుముక్కలు వచ్చేటప్పటికి ధర్మశాస్త్రవేత్త అయినాడు. వీడు! వీడి కొక నమ్మకం! నమ్మకంట! నమ్మకం! వెధవ! నాలుక లాగితే గూబకొరికి తెలుస్తుంది.

కళింగం—ఇదిగోనయ్యో! మాటలు సరిగా రానియ్యి. పెద్దవాడవని చూస్తోంటే.

బుచ్చి—ఎందుకు? పెద్దవాణ్ని అని చూట్టం ఎందుకు. ఏమిటి పెద్ద. నీకు తండ్రియే పెద్దలేదు. పెద్దవాళ్లనివుంటే వాళ్లమాట విను. తద్దినం ఎగకొట్టేందుకు పెద్దలేదూ! దేనికి పెద్ద. తిరిగి తిట్టటానికి పెద్దా! ఎందుకు ఈ పెద్దరికం? మర్యాదా? ఈ మర్యాద ఈ ఇంగ్లీషుచదివినవారికి మహాలావు.

భగీ—ఒరేయి కళింగం, ఇటు చూడు. నీవు మాట్లాడితే రీజన్ రీజనంటావు కదా! ఇందులో రీజనుందేమో చూడు. నీవు పెద్దవాడవన్నావు. పెద్దవాడు కనక ఏమీ అనకూడదని యెక్కడుంది. ఆచారమేనా! అదేదన్నా నీవు చెప్పే కామనుసెన్సా! అలాంటిదే అనుకో, చచ్చినవాళ్లకి తద్దినం పెట్టటం రెండూ ఒకటేగా చూడు.

బుచ్చి—ఆచూట్టం తెలిస్తే ఇల్లా ఎందుకు వుంటాడు?

కళింగం—నేను తద్దినం పెట్టననటం లేదు. బ్రాహ్మలు రాకపోతే నేనేం చేస్తాను.

బుచ్చి—అత్తనోట్లో గిద్దకొట్టి, 'అత్తా! నీకేం కావా'లని అడిగిందట, నీబోటి కోడలు. వాళ్లు రాకండా చేసింది నువ్వేగా. ఎవతెనో మాలదాన్ని తెచ్చి దాన్ని పెళ్లాడతానంటే ఎవడు వస్తాడు నీయింటికి.

కళింగం—రాకపోతే మరీ నయం.

బుచ్చి—నీవంటి వెధవలు ఇంకేమంటారు.

కళింగ—వెధవలంటే మళ్లీ వెధవలంటారు.

వసు—ఒరేయి! నీకు బుద్ధిలేదురా! నోరుముయ్యి! పెద్దవాడాయనంటే మళ్లీ అంటావురా!

బుచ్చి—ఒరేయి! చెపుతున్నా! ఇంక మీ అమ్మ తాతయ్యని చూసి వూరుకొనేదిలేదు. నీఆటలు నీమెడ్రాసుపోయి ఆడు. ఇక్కడ ఆడావంటే ఎముకలు విరుగతవి. జాగ్రత్త. ఎవరనుకొన్నావు.

కళింగ—నీవు ఎవరనుకొన్నావు అంటే మళ్లీ అనేదే.

భగీ—ఎముకలు విరిగించుకొనేదే!

వసుం—ఒరేయి! ఆయన తలుచుకుంటే నీ వెంతరా? నోరుమూసుకు ఊరుకో! చాలులే మామయ్యా! కుర్రకుంకతో ఏమిటి? వీడు నోరుమూసుకొని ఊరుకోడాయె.

బుచ్చి—మీ యిష్టమమ్మా! నేను వెళ్లిపోతున్నాను. (బయలుదేరును)

వసుం—మామయ్యా! ఏదో ఒకటి చెప్పిపో!

బుచ్చి—నిజంగా చెప్పమంటావా! చెపుతున్నా విను. ఆవు చేలో మేస్తోంటే దూడ గట్టున మేస్తుందా? నీవు తలవెంట్రుకలు తీయించవు. చీరలు వాలు



కృ ష్ణ చ తు ర్ద శి
(శ్రీ కాశీనాథరావుగారి తంజాపుర ప్రాచీనచిత్రసంగ్రహమునుండి)

# రాజమోహన హేరాయిలు



శ్రేష్ఠమయిన సువాసనగల తల నూనె. మెదడుకు చల్లదనమును గలిగించి వెంట్రుకలను అభివృద్ధి చేయుటలో అత్యుత్తమ మయినది.

తలపోటు, మాడుపోటు, శిరోవేడిమి, చుండు మొదలగువాటిని పోగొట్టి కన్నులకు చలవ నొసంగి వెంట్రుకలను మృదువుపరచి, నల్లగా పెంచుటలో అత్యుత్తమ మయినది.

స్త్రీలకు ఆనందమును కలుగజేయును.

సీసా 1-కి రు. 0-12-0 6 సీసాలు రు. 4-4-0

పోస్టేజి ప్రత్యేకము.

## పి. శి. ఏ. అండు కంపెని,

ఆయుర్వేదసమాజం,

పెరిదేపి, నెల్లూరుజిల్లా.

---

ఆయుర్వేదశాస్త్రి, అష్టావధాని, కవిరాజ

కందుకూరి వేంకటసుబ్బారావుగారి

# కామామృతము

**కామామృతము:**—దేశదేశములలో ప్రఖ్యాతిం బొందినది. రాత్రి 1 మాత్ర సేవించిన 1 గంటకే ఎంత నిస్సారమైనశుక్లమైనను సంసారసౌఖ్యము నీయఁగలదు. ఏవిధముగా నష్టమగుచున్న శుక్లమునైనను 5 దినములలో నిలిపివేయును. మధ్యనపుంసకులు, నరములశక్తితగ్గినవారు ఈ మందునే పైకి పూతగాఁగూడ నుపయోగించుకొనవలెను. 20 మాత్రల సీసా 1-కి రు. 2-0-0.

**తేజోమృతము:**—సెగరోగము (గనోరియా) ఎట్టిరంగుతో, ఎంతటిబాధతో, ఎన్నిసంవత్సరములనుండియున్నను మొదటిమోతాదునుండియే సుగుణమును జూపించి పూర్తిగ నివారించును. 1 సీసా రు. 4-0-0

**వృద్ధామృతము:**—ఒక్కసీసా చాలును. నల్లమందువేసికొనుదురభ్యాసమునుదొలఁగించి ఆదాయమును బలమును వృద్ధిచేయును. 1 సీసా రు. 5-0-0

**విలాసము:**—అమృతాశ్రమము,

నెం. 2, ఏలూరు, పశ్చిమ గోదావరి.



## మీకు బలహీనత గలదా?

మీ బలహీనత జ్వరము, వ్యాధులవలన యేర్పడినను, లేక అతిగా పనిచేయుటవలన కలిగినను, ప్రసిద్ధిజెందిన బలప్రవర్ధకాహార మగు సనటోజన్ తీసికొన్న మొదల, తిరిగి మీకు వెంటనే మామూలు ఆరోగ్యము శక్తి యొదవును.

బలహీనతనుపోగొట్టుటలో సనటోజన్ ప్రపంచమంతటను పేరుమ్రోగినది. చికాకు, మాంద్యము, కడుపునొప్పులు, ఆకలి లేకపోవుట మున్నగునవి అంతరించును. "సనటోజన్ నా యుద్దేశ్యములో జబ్బుపడినపిదప కోలుకొనువారికి వరప్రసాదమువంటిది. అలసట, బలహీనతలను వెంటనే పోగొట్టును." అని డాక్టర్ యస్. క్రిష్ణమూర్తిరావుగారు శేలమునుండి వ్రాయుచున్నారు.

సనటోజన్ ఒకసారి వాడిచూడుడు. నేడు ఒకసీసా కొని కొంతకాలము క్రమముతప్పకుండ వాడుడు. ఆరోగ్యము, బలము యెంత త్వరగా చేకూరునో తెలిసికొని మీరే యద్భుతమొందెదరు.

సనటోజన్ బజారులలో ప్రతిచోటను దొరకును.

# SANATOGEN

నిజమైన బలప్రవర్ధకాహారము.

చేతితో స్పృశింపబడనిది. (నెం. 2.)

జడలు వేస్తావు. ఆమహాతల్లికడుపున పుట్టావు. నిన్నే మీ అవతేను కాని, లోకము లక్షువిధాల చెప్పుకుంటోంది. చెప్పుకుంటోంది అంటే దానితప్పా లేదు. నీవూ నీతండ్రీ కలిసి యీపుసుకున్ని యింతవరకు తెచ్చారు. రేపు నీతలవెంకిక్షలు తీయించుకుని నీమార్గం నీవు మారిస్తే, ఆయనగారు ప్రాయశ్చిత్తం చేయించుకొంటే రేపు తద్దినం. లేకపోతే ఆయన చెప్పాకుగా. వారిద్దరిని భోక్తలకి పిలిచేది; పెట్టేది. ఇల్లాంటి తద్దినాలు లోకంలో చాలాజరుగుతున్నవి. ఇక్కడింకా వుంటే మీవాడిచేత తన్నులు కూడా తినాలేమో! ఇంకెందుకులే. (నిష్క్రమించును)

వసు—నాయనా! కొంపమీదికి కెంత తెచ్చావురా!

కళిం—నేనేకాదు. నీవూ తెచ్చావంటున్నాడు. ఆయన యెట్లాంటివాడనుకొంటున్నావు. అసలు సంగతి విన్నావా! కడుపులో పుల్లదీఅసలు.

వసుధ—అయితే నేను తలవెంకిక్షలు తీయించుకుంటాను. నీవు ప్రాయశ్చిత్తం చేయించుకొంటావా!

కళిం — నీవు తలవెంకిక్షలు తీయించుకున్నా సరే, ప్రాణాలు తీయించుకున్నా సరే. నేను వెళ్లిపోతున్నాను. ఇవ్వాళరాత్రికే మెద్రాసు బయలుదేరుతాను. నాతో తిప్పలు మీకెందుకు. (పోబోవును)

వసుధ—నాయనా! నన్ను వదలిపోతావా! తల్లికన్న యెక్కువరా ఆపిల్ల నీకు. నిన్ను చేతుల్లో యెత్తుకుపెంచానే! నాయనా! నీకు సర్వనాశిరీ చేశానే. ప్రాణాలన్నీ నీమీద పెట్టుకున్నానే! నీవేమో నాతల పుల్లు కడిగి రక్షిస్తావనుకొన్నానే. ఎవత్తెనో చూశి దానికోసమా యిదంతా!

కళింగ—అది ఎవత్తోనా! అది నాప్రాణం. ప్రేమ అన్నింటికన్న గొప్పది. ప్రేమకి ఇంకో భావానికి ఏమిటి సంబంధం. తల్లికన్న, తండ్రికన్న, లోకంకన్న ప్రేమఎక్కువ. (పోబోవును)

వసుధ—నాయనా! పోకురా! ప్రేమ యేస్త్రీతో పడితే ఆస్త్రీతో కలుగుతుంది. లోకంలో ఎవరినో ఒకరిని కలవటం కలుగుతుంది. ఆసందర్భం పరిచయంగా మారవచ్చు. ఆపరిచయం వృద్ధిఅయితే ప్రేమ అంటాము. పైగా ఆప్రేమలో శరీరసౌఖ్యం, శరీరాభిమానం ఎంతవుంది. ఆస్త్రీకాకపోతే యింకోస్త్రీ అయినా ఆప్రేమ కలుగుతుంది. అది దైవికంకాదు. ఒకవేళ దైవికమయినా తల్లీ తండ్రుల సంబంధమంత దైవికంకాదు. పొరపాటు పడుతున్నావు. దుష్టసిద్ధాంతాలల్లో పడి చెడిపోతున్నావు.

కళింగ—ప్రేమముందర ఇంకోటి నిలవదు. నేను నీకడుపున కాకపోతే యింకోరికడుపున పుట్టేవాణ్ణి. మాతాపుత్రసంబంధం శరీరానికి సంబంధించినది. భార్యాభర్తృసంబంధం ఆత్మకి సంబంధించింది. (పోబోవును)

వసుధ—ఋషులకు, కామక్రోధాలు చంపుకొన్నవాళ్లకి, శరీరసంబంధం వదుల్చుకొన్నవాళ్లకీ ఆత్మసంబంధం ఎక్కువది. అటువంటి ఆత్మజ్ఞానం వుంటే శరీరంతేడు. ఆత్మని ఈశరీరమే క్రిందికి లాగుతోంది. ఈశరీరంతో వున్నవాళ్లు శరీరమే బలవత్తరమైంది. ఆత్మని వెదకటానికి పోతూ శరీరసంబంధాలు కోస్తే న్యాయమేకాని, రెండు శరీరసంబంధాలల్లో అధమమైనదాన్ని అధికమైనదానికన్న గొప్పదని దుర్వ్యాఖ్యానం చెయ్యటం న్యాయంకాదు. నాయనా! పోకురా! తండ్రీ! పోకు.

కళింగం—ప్రేమ శరీరాన్ని దాటించని మహర్షులు చెప్పినమాట. ఆప్రేమముందు తల్లితండ్రులు లెక్కలేదు. నేను ప్రేమిస్తున్నది రాజ్యంలోని ఆత్మను కాని రాజ్యంశరీరాన్ని కాదు. నేను మహావిషయాన్నే గ్రహించాను. (వెళ్లిపోతున్నాడు)

వసుధ—రాజ్యం శరీరాన్ని కాదు నీవు ప్రేమించేది. సరే! ఆపిల్లని పంపించేశెయ్యి. ఆవిడ ఆత్మని ఇక్కడనుంచే ప్రేమించు. ఒక్క ఆవిడ ఆత్మనేమి? సర్వాత్మలను ప్రేమించు. శరీరం కాదుగా నీ ప్రేమకి స్థానం. నాయనా! పొరపాటుపడుతున్నావు. నీవు ఆమెశరీరాన్నే ప్రేమిస్తున్నావు. నాయనా, నీ

ప్రేమ సౌఖ్యాన్ని వాంఛిస్తోంది. ఆ సౌఖ్యం శరీర సౌఖ్యం, మానసిక సౌఖ్యం. ఆత్మని ప్రేమించేవాడికి ఈ రెండు సౌఖ్యాలు అక్కరలేదు.

కళింగ — అవును. నేను దానికోసమే పోతున్నాను.

వసు—అది యితరత్ర యింతకన్న బాగా లభిస్తుంది.

కళింగ—ఇంత చదువుకున్నది, అల్లాంటి సంస్కారంకలది దొరకదు. అంత పరిపక్వమైన హృదయం కల మనిషి దొరకదు. రాజ్యమంటే మరో రాజ్యం.

వసు—సంస్కారం పుస్తకాలు చదివితేనే రా అక్కరలేదు. సాంప్రదాయంలో పెరగటంకూడా చదువే. అసలు నెత్తురులో చదువుంటుంది. ఒకయింట పుట్టిన పిల్లకి ఒక చదువు, ఒక గుణము తెలుస్తుంది. దాని ఆచారాలు వేరు. నీవెంత చెడ్డా మాంసం తినవు. దానికి బజారునుంచి మాంసము తెచ్చిపెట్టలేకన్నా ఇబ్బంది పడతావు. ఒకవేళ అదీ యిష్టమయితే నీవు నాకడుపున పుట్టావు. దానికున్నంత కామం నీకుండదు. నీనెత్తురులో లేదు. రక్తం? రక్తంలో ఎంత వుంది? నీమనస్సు నీనెత్తురునుబట్టి వుంది. నీచదువు, నీ సంస్కారం, నీ యిష్టానిష్టాలు అంతా నీశరీరంలోని రక్తముయొక్క ప్రత్యేకగుణాన్నిబట్టి వున్నయి. అయ్యో! నీతెలివితేటలు మలచినవాడెవ్వడురా! వాడి సిద్ధాంతాలు కాలిపోను.

కళింగ—నీసిద్ధాంతాలకన్న వాడి సిద్ధాంతాలు ఎన్నో రెట్లు మంచివి. నీ వాడదానవు. ఇంట్లో కూర్చుని వంటచేసేదానవు. వాడు రాజ్యం చేస్తున్నాడు. నీకు మల్లే గాజులు తొడిగించుకు కూర్చోలేదు.

వసు—గాజులు బద్దలుకొట్టించుకోవలసిన సమయంలో తొడిగించుకొన్నాను, తప్పే.

కళింగ—అందుచేతనే నోరు మూసుకు కూర్చో. నేను వెళ్లుతున్నాను. (పోబోవును)

వసుధ—నీకింగ్లీషు చెప్పిస్తే ఉద్యోగం చేస్తావనుకొన్నాను. మూలచ్ఛేదం చేస్తావనుకోలేదు.

కళింగ—మరి పెద్ద తెలివికలదానివల్లే మాట్లాడుతున్నావే. ఈమాత్రం తెలియలేదా!

వసుధ—తెలియలేదు. మీనాయన చచ్చిపోవటంతోనే నా తెలివి పోయింది.

కళింగ—అనుభవించు అయితే.

వసుధ—అనుభవిస్తున్నా.

కళింగ—అయితే వెళుతున్నా.

(పోబోవును)

వసుధ—తండ్రీ! వెళ్లకురా! వెళ్లకు. నాగొంతు నిన్ను పిలచి పిలచి బొంగురుపోతోంది.

కళిం—ప్రేమ బలవత్తమంగా వుంది. వెళ్లిపోతున్నా. (నిష్క్రమించును)

వసు—ఓరీ! వెళ్లావా! వెళ్లావా! ఆహా! ఏమి, కొడుకు. ఛీ! ఛీ! నీకు సుఖం లేకుండా పోతుం. దిపో! ఇది తల్లి పెట్టిన శాపం అనుకో! నేనుచచ్చిపోతా ఇంకా బ్రతికియెందుకు. (మూర్ఛ)

భగీ—అమ్మా! కర్మ! పురాకృతకర్మ! లే.

(తెర)

## న వ మా ం క ము

(నాయుడుఇల్లు సావడి. నాయుడు - కళింగం ఒకచోట; సెనడే సంగం ఒకచోట; రాధ - రాజ్యం ఒకచోట.)

కళింగ—నేను యిల్లు వదలిపెట్టాను. మీరు లక్కచెప్పండి నేనుపోను. నా యీచదువు పూర్తిఅయ్యేదాకా మీరు సహాయం చెయ్యండి! ఇది మీకు తప్పదు. చేస్తారో చెయ్యరో చెప్పండి.

నాయుడు—చేస్తానుగాని తల్లిమీద తిరగబడటం న్యాయంకాదు.

కళింగ — ప్రేమ యెక్కువా, ఈ యిల్లు ఎక్కువా? మీరుకూడా చెప్పండి. మీరు ప్రేమ అగ్రస్థానం యిస్తున్నారా, ఇవ్వటంలేదా?

నాయుడు — ప్రేమే అన్నిటికన్న గొప్పది. కాని యీమధ్య నాఅభిప్రాయం కొంచెం మారింది. ప్రేమకన్న ఎక్కువైనవి యింకా ఉన్నయ్యల్లే వుంది. శరీరసౌఖ్యంకోసం ఎందుకు అంత చూడాలి? ఈ శరీరసౌఖ్యం ప్రేమ అని ధర్మాన్ని ఎందుకు పాడు చెయ్యాలి? ధర్మం ఎక్కువా, ప్రేమయెక్కువా?

కళింగ — ప్రేమయే ధర్మం; ప్రేమకన్న ధర్మం లేదు.

నాయుడు — స్త్రీ పురుషుల మధ్యగల ప్రేమ మాత్రమే ప్రేమా? తండ్రీకొడుకులమధ్య ప్రేమలేదా? సర్వభూతములమధ్య ప్రేమలేదా? స్త్రీపురుషులమధ్య కలది ప్రేమకాదు, కామము.

కళింగ — మీరనుకొన్నట్లు నే ననుకోటంలేదు.

నాయుడు — పూర్వం నేనూ అనుకోలేదు.

కళింగం — మీరు మునుపటికన్న బాగా ఊహిం చారని నమ్మకం ఏమిటి? నిజమైనదాన్ని వదలి అబద్ధమైనదానిమీదికే తిరుగుతోందేమో మీ మనస్సు.

నాయుడు — అంతా అనుమానం. పూర్వమే అజ్ఞానంలోవుండి యిప్పుడే జ్ఞానంలో వున్నానేమో? ఈసిద్ధాంతాలు ఇష్టానిష్టాలమీద వుంటయి.

కళింగ — డబ్బుమాట ఏంచెప్పారు?

నాయుడు — ఇప్పుడెంతకావాలి.

కళింగ — ఒక వందరూపాయలు. ఇవికాక ఇంకా రెండువందలు పంపిస్తేచాలు. తరవాత నాబ్రతుకు నేను బ్రతుకుతాను.

నాయుడు — ఇవి నేనిస్తే మీఅమ్మగారికి కోపం వస్తుందేమో.

కళింగ — అయితే యీవందమాత్రమేయివ్వండి.

నాయుడు — సరే. మూడువందలు ఇస్తాను.

సంగం — కళింగం రాజ్యాన్ని తీసుకువెళ్లి పోతాట్ట.

రెనడే — మీరు నాయుడుగారింట్లో నయం చేశారా!

సంగం — ఆ! నేను రేపో ఎల్లుండో వెళ్లిపోతాను.

రెనడే — అబ్బో! మీరు అసాధ్యులు.

సంగం — ఏంచేశాను.

రెనడే — మీకు తెలియదా! ఎవళ్లమనస్సు వాళ్లకే సాక్షి.

సంగం — చెప్పు.

రెనడే — నేనొక్కణ్ణే అన్నానా ఏమిటి? ఊరంతా అంటున్నారు.

సంగం — ఎవళ్లపాపాన వాళ్లేపోతారు. చెపితే సమాధానం చెపుతా. దాస్తే ఒట్టు.

రెనడే — మీకూ, నాయుడుగారి భార్యకూ —

సంగం — సీతాదేవినిగురించి అంటే రాములవారి దగ్గర సాగినట్లు చంద్రమతీదేవిగారిని గురించి అంటే నాయుడుగారివద్ద సాగదు. ఆవిడ చాలా పతివ్రత. భగవంతుడిమీద ఒట్టేసుకొని చెపుతున్నాను. నీవు తెలివితక్కువవాడివి. మంచివాడివి కనక చెపుతున్నాను. ఆవిడని మొదట నేను కొంచెం చెడ్డమార్గంలోకి త్రిప్పుదామని చూశాను. అట్లా ఇదివరకు చాలామందిని చేశాను. ఆపాపం వేరు. ఈవిడ చాలామంచిది. ఆవిడనిగురించి ఏమన్నా అంటే పుట్టుగతులుకూడా వుండవు. ఆవిడా మంచిది. నాయుడుగారూ దేవుడువంటివాడు. వారిద్దరూ సుఖంగా బ్రతకటం లోకానికి కళ్యాణం.

రెనడే — నాయుడుగారికి నమస్కారంచేసినా తప్పులేదు. అయితే మీరు రేపు వెళతారన్నమాటే.

సంగం — నాయుడుగారుండమంటున్నారు కాని నాకూ పనులున్నవి. వెళతాను.

రెనడే — ఒకసహాయం చేసిపెటతారా!

సంగం — చెప్పు.

రెనడే — ఈరాజ్యాన్ని నేనుమద్రాసులో ఎరుగుదును. అక్కడ నేను వేషాలువేసినపుడు ఈవిడ వచ్చింది. నన్ను చాలా మెచ్చుకుంది. తరవాత కొంతగ్రంథం నడిపాను, గాని చివరకు ఆవిడ తిరస్కరించింది.

సంగం—అందరికీ అంతేనా! నాకూ అంతే. ఆ అమ్మాయి పైకి అట్లావున్నా లోపల కళింగాన్నే ప్రేమిస్తోంది. పాపం అతను చూడు. ఆవిడకోసం ఎంత వదిలిపెడుతున్నాడో. ఆవిడను పాడుచెయ్యటానికి ప్రయత్నంచెయ్యటంకూడా తప్పే. సరే. నువ్వు ఎప్పుడు వెళ్లిపోతావు.

రెనడే—నేనూ రేపే వెళతాను. మామామయ్యని చూచిపోదామని వచ్చాను. పనేముంది.

సంగం—ఏదీ! వెళ్లేలోపుగా ఆకీర్తనా పద్యం అనిపో!

రెనడే—పోవయ్యా! నీఅల్లరి.

* * *

రాధ—నన్ను ప్రేమిస్తున్నావా! లేదా!

రాజ్యం—ప్రేమిస్తున్నాను.

రాధ—అయితే కళింగంవెంట వెళ్లిపోతానంటావేమి?

రాజ్యం—కళింగం నారాజు. నేను అతని రాజ్యాన్ని. నిన్ను ప్రేమించటం ఊరికే ప్రేమకోసం.

రాధ—నిన్ను నేను పెళ్లాడతాను. ఒప్పుకుంటావా?

రాజ్యం—నీది Free love గామా! పెళ్లి ఎట్లా ఆడతావు.

రాధ—నీకోసం ఆడతాను. నీవంటిరత్నం దొరకుతూంటే ఒకసిద్ధాంతం లెక్కేమిటి? దాన్ని తృణీకరిస్తాను.

రాజ్యం—ఒకవ్యక్తికోసం ఒకసిద్ధాంతం తృణీకరించేవాళ్లని నేను తృణీకరిస్తాను.

రాధ—అయితే కళింగం అదే చేస్తున్నాడు. నీకోసం తల్లిని, కుటుంబాన్ని వదలిపెడుతున్నాడు.

రాజ్యం—అతనికి ఆసిద్ధాంతంలో నమ్మకం లేదు.

రాధ—నాకూ Free love లో నమ్మకంలేదు.

రాజ్యం—ఛీ! ఛీ! నోరుముయ్యి!

రాధ—నోరుమూస్తే చెయ్యి ముద్దుపెట్టుకుందామనా.

రాజ్యం—నిలకడలేని చెయ్యి ముద్దుపెట్టుకోని ఏమిలాభం.

రాధ—నీవూ పాతసరుకే? పో!

కళింగ—రాజ్యం?

రాజ్యం—వెళదామా?

కళింగం—స్నేహితులతో మాట్లాడుతున్నావల్లేవుందే.

రాజ్యం—నా రాజు పిలుస్తోంటే స్నేహితులడ్డమొస్తారా!

కళింగం—బయలుదేరు.

రాజ్యం—(గంతువేసి) రెడీ!

నాయుడు—నేను వాళ్లని పంపించివస్తా.

(నాయుడు, రాజ్యం, కళింగం తక్కినముగ్గురికి షేక్‌హాండ్లు ఇచ్చి నిష్క్రమింతురు).

సంగం—కవిగారి కేమన్నా లాభం కలిగిందా?

రాధ—ఎక్కడన్నా బావ అనుగాని వంగతోటదగ్గర కాదన్నట్లు.

సంగం—వినవయ్యా! రెనడే! ఏదీ 'మీరజాలగలడా' పాడు.

రెనడే—నాకు రాదు.

సంగం—పాడకపోతే ఎరుగుదువుగా.

రెనడే—ఏహే! పో! నీతోగోల. (పాడును)

సంగం—ఆహా! తెలుగుదేశమంతా మారుమోగిపోతోంది.

రెనడే—ఇందుకునేనా పాడమంది.

సంగం—నీపే రెట్టి అన్నానా?

రెనడే—అయితే ప్రొఫెసరుగారూ! బాగుండలేదా!

సంగం—నే నంటే ఆగుతుందా! నిన్ను దేశదేశాలా మెచ్చుతోంటే, నేను కోన్‌కిస్కాగాణ్ణి అని ఏంలాభం.

రాధ—బుద్ధిమంతులు ఎవళ్లూ మెంచుకోటం లేదు. వాళ్ల సంఖ్య తక్కువేగాదూ లోకంలో.

రెనడే—పూర్వం ఇట్లాఅంటే వూరుకొనే వాణ్ణి కాదుగాని యిప్పుడు మీరన్నమాటలే నిజమాఅని పిస్తోంది.

సంగం—ఒకడవన్నా బాగుపడ్డావు.

నాయుడు—(ప్రవేశించి) ఏదో కాలక్షేపం చేస్తున్నారు.

రాధ—ఏమాత్రం వదిలింది.

రెనడే—అలవాటేగా?

వసుధ—(ప్రవేశించి నిలుచుండును)

నాయుడు—ఆయన్ని తిప్పటం మహాకష్టమైంది. నాశాయశక్తులా ప్రయత్నించాను. అట్లాంటివాణ్ని ఇబ్బందిపెట్టటం ఎందుకని డబ్బిచ్చిపంపించాను. మిమ్మల్ని వదలిపెట్టినా మీకుమారుడన్నమాట మరచిపోలేక యిచ్చాను.

వసుధ—ఎక్కడో అక్కడ మీపుణ్యమా అని బ్రతికివుంటే చాలు. ఇవ్వాళ మీరందరూ మాయింటికి భోజనానికి రావాలి. నాయుడుగారూ మీరు వారి ముగ్గురిని తీసుకురావాలి.

రాధ — మేమందరం కలసి భోంచేస్తాం. మీకిష్టమేనా?

వసుధ—అది నాకొడుకుకన్న ఎక్కువచెడిపోవటం కాదుకదా!

సంగం—కవీశ్వరుడు!

నాయుడు—అలాగేగాని, యెందుకు? సరేలెండి.

(తెర)

## దశమాంకము

[వసుధయిల్లు - రాత్రి - వసుధ, భగీరథశాస్త్రి, రాధ, నాయుడు, సంగం.]

వసుధ—రామనాథంగారు రాకపోవటమే లోపమండి.

రాధ—ఆయన రైలుకి వెళ్లాడు. మరేంచేస్తాం.

వసుధ—దయచెయ్యండి. తాంబూలం స్వీకరించండి.

సంగం—తాంబూలం వేసుకోనేందుకు ఖాళీ లేదండి.

వసుధ—పేదవాళ్లయింట్లో భోజనానికి అంత శ్లాఘ ఎందుకు.

సంగం—మీరు పేదవాళ్లే కావచ్చు. కాని భోజనం అల్లాలేదు.

నాయుడు—ఈభోజనం ఎందుకు ? ఈవిందు ఎందుకుఇచ్చినట్లో తెలియలేదు. కొడుకుపెళ్లికా ?

వసుధ—బాగా ఓదారుస్తున్నారు.

సంగం—బావగారికి బుద్ధి పరారిఅయింది.

వసుధ—మీరుచేసిన పనేగా ఆయన్ని మన మాట వినకండా చేశారు.

సంగం—ఆయన మేఘాలమీద ఎగిరిపోతున్నాడు.

నాయుడు—వరసకాదుకాని, వీలుగా వుంది మీకు?

సంగం—నాకు రైలుటైము అవుతోంది. వెళతాను.

వసుధ—ఇప్పుడే మిమ్మల్ని ఒకటి అడగాలని అనుకుంటున్నాను. అడగమంటారా!

సంగం—అడగండి.

వసుధ—చచ్చిపోయింతరువాత ఆత్మ ఏమవుతుంది? ఆఆత్మపొందే మార్పు చచ్చిపోయేపద్ధతుల ననుసరించి వుంటుందా?

సంగం—మెస్మరిజం అంటే యోగంలో ఒక తక్కువరకం సాధన. మెస్మరిజం చేసేవాడికి ఏమీ తెలియదు. ఈ జీవితంతరవాతసంగతులకి ఋషుల వాక్యాలే ప్రమాణం. ఒక్కొక్కడిమతం ఒక్కొక్క మోస్తరు వుంటుంది. ఋషులు తమయోగసమాధిలో వుండి వాళ్లు చూశారు, చెప్పారు. మనం వాళ్లని అనుస

రిస్తాం. ఇంతే. నా కెక్కువ తెలియదు. మీనాయనగా రుండగా వారికన్న మా కెక్కువ తెలుసునా ?

వసుధ—ఆత్మహత్య చేసుకొంటే నరకలోకానికి పోతారంటారు. నిజమా ?

సంగం—చచ్చేటప్పుడు ఆత్మ ఘోరబాధ అనుభవిస్తుంది. కనుక పోనూవచ్చు.

వసుధ—యుద్ధంలో చస్తే స్వర్గానికి పోతాడంటారు. ఈ జీవయాత్ర యుద్ధంవంటిది. ఇందులో చస్తే ఎందుకు పోరాదు. కత్తితో చేస్తేనేనా యుద్ధం.

రాధ—ఇంగ్లీషులో జీవితాన్ని యుద్ధంతోనే పోలుస్తారు.

సంగం—మీఅబ్బాయి యిల్లా లేచిపోతే మీరు కదలకండా మెదలకండా వున్నారు. మీరు యుద్ధవీరులంటివారనే చెప్పవచ్చు.

వసు—మనంచేసే దేముంది. కలి అల్లా విజృంభిస్తోంది.

భగీ—కళింగమంటే అంతే. కలి అంటే పాపం. 'కలింగచ్ఛతీతి కలింగః' అని, పాపమును పొందేవాడు కలింగుడు. వాడూ వాడిరాజ్యం కళింగరాజ్యంఅయింది.

సంగం—బాగాఅన్నారు బాబూ. సెలవు నాయుడుగారూ!

నాయుడు—బావగారూ అనాలి!

సంగం—మీదయ. సెలవు. అమ్మా సెలవు.

నాయుడు—నేను బావగారిని పంపించివస్తా.

వసుధ—మళ్లీరావట మెందుకు, కష్టాలన్నీ తీరిన హరిశ్చంద్రమహారాజల్లే సుఖించక.

(అందరు నవ్వుదురు)

నాయుడు—బావగారి దయవల్ల మళ్లీ పెళ్లికొడుకల్లే వున్నాను. మీరంతరూ సరాగమాడటం తప్పేమీలేదు.

భగీ—ఇంత అమాయకుడవు కనుకనే దేవుడు నిన్ను దయచూశాడు. బాబూ! సుఖపడు.

సంగం—పెద్దలు, మీఆశీర్వాదము.

(నాయుడు, సంగం నిష్క్ర.)

రాధ—నేనూ వెళతాను.

భగీ—ఇక్కడ పడుకోండి బాబూ ఈరాత్రికి.

వసుధ—నాయుడుగారిని ఏకాంతంగా వుండనీయండి. పాపం. ఎన్నాళ్లకి ఆయనకాపురం పదట పడ్డది. ఆ యస్థితి చూస్తే ఇక నాకు సుఖంగా నిద్దర పడుతుంది.

రాధ—ఆయనకష్టం మీ రేమనుభవించారు.

వసుధ—మేమిద్దరమూ ఒకరికష్టా లొకరు అనుభవించాము.

రాధ—ఆయనకష్టాలు తీరినై. మీ రేంచేస్తారు. ఇంక మీకష్టాలు ఎట్లా తీరుతవి.

వసు—నాకష్టాలు తీరేయోగ్యత వుంటే మాకళింగ అల్లా ఎందుకవుతాడు. పోయి పడుకొంటాను.

(నిష్క్ర.)

భగీ—బాబూ! పడుకోండి.

(ఇద్దరూ పడుకొందురు)

భగీ ..మీరువ్రాసిన పద్యాలు ఏమన్నా చదువుతారా!

రాధ—

ఇంటిలోన సర్పము ప్రవేశించి భయము
కలుగఁజేయు చెల్లెడఁ దిరుగాడినట్లు
అల్ల నల్లనఁ బడి తిరుగాడఁజొచ్చె
నాదు మనసున నేదో విషాదరేఖ.

తొల్లి నిజముగ నే నొక దుఃఖలోక
వాసుఁడను నా కచట నిల్లువాకిలియును
గలదు చిలుగొంతు మలచు చీకటులపాట
పాడిపోవంగ నిచటికి వచ్చినాను.

భగీ—బాబూ! ఎంతగొప్పకవివి ? ఇంకెవ్వయినా ?

రాధ—

పలుగురాచిన నాగొంతు మలగిమలగి
రాగ మెదలించె బీఁటవరాలు బిగిసి
పరమచరమార్ధగీతిక పలుకలేని
మెట్లు కిన్నెరతీగలు చిట్లిపోయె.

ఓ ప్రణయశీల నేను నిశాప్రశాంత
గాఢతమసాకృతిని నీవు కలలొదిగిన
చటులసౌదామనీరేఖ విటుల నాదు
దివ్యసన్నిధికే దారితీసినావు.

భగీ—బాగుంది. చక్కని ధార. ఒకానొక విచిత్రమైన మానసికస్థితిని చిత్రించావు. శబ్దాలుకూడా మధురంగానే కూర్చావు.

రాధ — ఇందులో బుచ్చిమామగారు తప్పులన్నారు. 'కలలొదిగిన' ఏమిటన్నారు?

భగీ—అది మన సాంప్రదాయం కాదు. దాని కేమిలే. వస్తోంది. (నిద్రించును)

రాధ—ఈయన కప్పుడే నిద్రపట్టింది. నాకా నిద్రపటుతుంది. వసుంధర నామనస్సులో కూర్చుంటే నాకు నిద్ర యెలా పడుతుంది. పాపం. ఆవిడను కొడుకు పరిత్యజించాడు. నాయుడు పరిత్యజించాడు. నాయుడు ఇంకా ఈవిడవంక చూస్తాడా? లోకమంతా స్త్రీ ముఖంగా పోతోంది. Ibsen 'Lady of the sea' అన్న గ్రంథంలో ఈసంగతి ఎంతబాగా వ్రాశాడు. లోకంలో నేనొక దుఃఖమయజీవిని. ఈవసుధ నా కన్న. నామనస్సావిడకేసి లాగుతోంది.

రాత్రి రెండుజాములు దాటింది. శాస్త్రులుగారు సుఖంగా నిద్రపోతున్నారు. ముసలివాడి కింత బాగా నిద్రపటుతున్నందుకు చెప్పాలి. జీవితమంతా పరిశుద్ధంగా గడిపాడు కాబోలు. నిద్రపట్టక ఏంచేస్తుంది.

వసుధ నిద్రపోతోందా? ఆవిడకి యివ్వాళ నిద్ర పడుతుందా? నాయుడు ఆనందవీథీవిహారం చేస్తున్నాడు కావలు. నామనస్సు కర్రదెబ్బతిన్న పాముల్లే మధ్యకు తునిగి అల్లల్లాడుతోంది.

తొల్లి నిజముగ నేనొక దుఃఖలోక
వాసుడను నాకచట నిల్లు వాకిలియును
గలదు చిఱుగొంతు మలచు చీకటులపాట
పాడిపోవంగ నిచటికి వచ్చినాను.

వసుధను లేపి అడిగిచూస్తా. ఆవిడయిష్టమైతే నేనెందుకు వెళ్లాడరాదు. ఆవిడ నాయుణ్ణితప్ప ఇంకెవ్వరినీ ఎరగదల్లేవుంది. నాయుడు ధనవంతుడు. నేను కాదు. నేను కవిని. నాయుడుకన్న అందగాణ్ణి. అతని కన్న ఎక్కువసంస్కారంకలవాణ్ణి. ఆవిడకి నామీద ప్రేమ వుండల్లేవుందికూడాను. ఆవిడమనస్సులో కామప్రవృత్తి చాలావుంది. నాయుణ్ణిగూర్చి ఎంతపరాచికం ఆడింది. పోయి నిద్రలేపుతాను. (నడచి) చివరకి ఇది రసాభాసం అవుతుందేమో? ఆవిడకు నామీద ప్రేమ వుందని ఎట్లా? (పోయి పండుకొనును.)

కాదు, పోయి అడుగుతా. మీదుమించివస్తే రైలుకు పట్టిద్దాం. ఛీ! ఛీ! ఇదేమి కర్మమోకాని నా మ న స్సు కవితావిషయాల్లో ఎంతఉత్సాలంగా పోతోందో తక్కినవిషయాల్లో అంతఅధమంగా నడుస్తోంది. నాకు భయమేస్తోందేమిటి? పోయిచూస్తా! వసుధా! వసుధ. (నిష్క్రమించి)

(మరల ప్రవేశించి)—(ఆవేశంతో) శాస్త్రి గారూ! శాస్త్రిగారూ!

భగీ—(లేచి) ఏమిటి? నాయనా!

రాధ—పోయి మీఅమ్మాయిని చూచిరండి.

భగీ—ఏమి? (వెళ్లివచ్చి ఉత్తరంతో)

భగీ—నాయనా అనుకొన్నంతా అయింది. నీవు పోయి నాయుడుగారిని పిలుచుకువస్తావా!

(రాధ నిష్క్రమించును.)

భగీ—(ఉత్తరం చదువుతూ) తల్లీ! ఆత్మహత్య తప్పని చెప్పానుకదమ్మా! ఎంతచక్కనివురి పోసుకొన్నావు. (మూర్ఛ)

(నాయుడు, చంద్రమతి ప్రవేశింతురు)

నాయుడు—అయ్యో! చంద్రం! ఏమిటీగతి?

చంద్ర—పడిపోతారేమో! నన్నానుకు నుంచోండి.

భగీ—(తెలిసి) నాయనా! చివరకు నాగతి యిల్లావచ్చింది.

(నాయుడు, చంద్రమతి లోనికి పోదురు)

రాధ—(ప్రవేశించి) ఎంతచక్కని పురిపోసు కుంది. ఈప్రయత్నం ఈవిడ చాలారోజులనుంచి చేస్తు న్నట్లుంది.

(నాయుడు, చంద్రమతి ప్రవేశింతురు)

రాధ—పెట్టెమీద పెట్టె, పెట్టెమీద పెట్టా పెట్టింది. దానిమీదనుంచి ఉరిపోసుకుంది. నన్ను ని పగ్గం ఆమడంలోతడిపి అట్టిపెట్టింది.

చంద్రం—అది అయిదారురోజులు నానితేగాని అల్లాకాదు.

రాధ—కాళ్లకి తిరగలిరాళ్లు కట్టుకుంది. సరిగ్గా చెరసాలల్లో ఇల్లాగే చేస్తారు.

చంద్రం—కళింగానికి టెలిగ్రాం ఇస్తే.

రాధ—అతను రైలులో వుంటాడు. అయినా తండ్రికి తద్దినంపెట్టనివాడికి తల్లి చచ్చిందంటే లెక్కా!

చంద్రం—(నాయుడితో) ఏమిటి అల్లా వున్నారు.

భగీ—తల్లీ! ఆయన్ని జాగ్రత్తగా చూసుకో!

చంద్రం—(నాయుడిమొగంలో మొగం పెట్టి) నేను బ్రతికేవున్నా!

నాయుడు—(శ్వాసతీసికొని చంద్రాన్ని దగ్గ రకు లాగుకొనును.)

చంద్రం—నన్ను వదలిపెటతారా!

నాయుడు—నీకోసమే బ్రతుకుతా!

చంద్రం—మీరు బ్రతుకుతానంటే నేను బ్రది కాను.

నాయుడు—క్రొత్తగా వచ్చినలాభం ఇంకో నష్టాన్ని పరిగణించనీయదు. (పోయి శాస్త్రిగారి కాళ్ల మీద పడి యేడ్చును.)

భగీ—నాయనా! జంతువులు స్వకర్మాను రూపంగా వికారంపొందుతవి. దానికి దుఃఖించటం ఎందుకు.

నాయుడు—కళింగాన్ని రమ్మని టెలిగ్రాం కొడతా.

శాస్త్రి—నీటెలిగ్రాం వాడికి రేపు చేరుతుంది. వాడు ఎల్లుండి వస్తాడు. తల్లిశవాన్ని ఎల్లాగూ చూడ లేడు. పైగా వాడు వచ్చి కర్మచేసేది లేదు. నే నున్నాగా. నేనే చేస్తాను.

నాయుడు—బాబూ! ఇంక మీరు బ్రతికే దెల్లాగా!

శాస్త్రి—నాయనా! మన మతం అందరికీ చక్కనిఏర్పాట్లు చేసిపెట్టింది. నాకు కూతురిమీద మమత లేకపోతే ఎప్పుడో సన్యసించాలిసింది. ఇపుడు చూడు నిర్విచారంగా చేస్తాను ఆపని. కర్మలు పన్నెండు రోజులు అయినతరవాత యీయిల్లు కళింగానికి. నీవు వాడికి యీకొంచెమాస్తి అప్పగించు.

నాయుడు—మీకున్న ధైర్యంలో ఒక్కలేశం నాకు లేదు.

భగీ—బ్రతికి బట్టకట్టాలసినవాడవు నీవు. నే నొకకాలు ఇక్కడ, ఇంకోకా లక్కడా వున్నవాణ్ని.

రాధ—

ఈమహాంధకారమ్మున నేనొక్కండ
కర్కశకఠోరఘూకసంఘాతరావ
కుటిలముగ గొంతుచీల్చుక కూయుచుంటి
ఈనిపాదకీచకసమావృతసుహాళి.

చిటపెట రగుల్చుకొనుచున్న చితి, మదీయ
జీర్ణదేహాస్థి పెటిలి యుద్దీర్ణరవము
జ్వలదనలజిహ్వోగ్రహాసమ్ము ననుస
రించి నాపూర్వగీతి స్ఫురింపఁజేయు.

భగీ—హా! హా! మహాకవి!

నాయుడు—చంద్రం! నీచేతులు నా మెడమీద వెయ్యి! (చంద్రం అట్లుచేయును)

నాయుడు—నువ్వా ఆవిడా అన్నసందేహం వున్నన్నాళ్లూ ఇద్దరూ బాగానేవున్నారు. నీవని తేలి పోవటంతోటే ఆవిడ తన అగత్యం తీరిందనుకొని వెళ్లి పోయింది. ధర్మమే జయించింది.

భగీ—ధర్మము జయించటమే వసుంధరా కళ్యాణం. (తెర)

(ఓంతత్సత్)



శ్రీ పాండురంగక్షేత్రము
పుండరీకతీర్థ స్నానఘట్టము



రంగనాయక దేవాలయ గోపురము, నెల్లూరు. P. R.




ఆంధ్రసారస్వత పరిషత్సమ్మానితులయిన
కవిరాజహంస శ్రీ వేంకట పార్వతీశ్వరకవులు

# కార్తెలు, వానలు

వేదము లక్ష్మీనారాయణ శాస్త్రి

[ఇరువదేడు కార్తెలయొక్కయు, వాని పరిమాణదినములయొక్కయు, అవిసంభవమగు రాసులయొక్కయు సూచిక]

| | కార్తెలు | ఆరంభము (రమారమి) | పరిమితి దినములు | రాశి | రాశిప్రవేశకాలము | ఋతువు | కాలము (శీతోష్ణస్థితి) |
|---|---|---|---|---|---|---|---|
| ౧ | అశ్విని | 11 ఏప్రిలు | 14 | | | | |
| ౨ | భరణి | 25 ,, | 14 | మేష | 12 ఏప్రిలు | | |
| ౩ | కృత్తిక | 9 మే | 14 | | | వసంతము | లేయెండ |
| ౪ | రోహిణి | 23 మే | 14 | | 13 మే | | |
| ౫ | మృగశిర | 6 జూన్ | 14 | వృష | | | |
| ౬ | ఆర్ద్ర | 20 ,, | 14 | | | | |
| ౭ | పునర్వసు | 4 జులై | 14 | మిథున | 13 జూన్ | | |
| ౮ | పుష్యమి | 18 ,, | 14 | | | గ్రీష్మము | మిడియెండ |
| ౯ | ఆశ్లేష | 1 ఆగస్టు | 14 | కటక | 15 జులై | | |
| ౧౦ | మఖ | 15 ,, | 14 | | | | |
| ౧౧ | పుబ్బ | 29 ,, | 14 | సింహ | 15 ఆగస్టు | | |
| ౧౨ | ఉత్తర | 11 సెప్టెంబరు | 13 | | | వర్షము | కారు |
| ౧౩ | హస్త | 25 ,, | 14 | | 15 సెప్టెంబరు | | |
| ౧౪ | చిత్త | 9 అక్టోబరు | 13 | కన్య | | | |
| ౧౫ | స్వాతి | 22 ,, | 15 | | | | |
| ౧౬ | విశాఖ | 4 నవంబరు | 14 | తుల | 16 అక్టోబరు | | |
| ౧౭ | అనూరాధ | 18 ,, | 13 | | | శరత్తు | చలి |
| ౧౮ | జ్యేష్ఠ | 1 డిసెంబరు | 13 | వృశ్చిక | 15 నవంబరు | | |
| ౧౯ | మూల | 14 ,, | 13 | | | | |
| ౨౦ | పూర్వాషాఢ | 26 ,, | 13 | ధను | 14 డిసెంబరు | | |
| ౨౧ | ఉత్తరాషాఢ | 9 జనవరి | 13 | | | హేమంతము | మునిమంచు |
| ౨౨ | శ్రవణం | 22 ,, | 13 | | 12 జనవరి | | |
| ౨౩ | ధనిష్ఠ | 4 ఫిబ్రవరి | 13 | మకర | | | |
| ౨౪ | శతభిషం | 17 ,, | 13 | | | | |
| ౨౫ | పూర్వాభాద్ర | 2 మార్చి | 14 | కుంభం | 12 ఫిబ్రవరి | | |
| ౨౬ | ఉత్తరాభాద్ర | 16 ,, | 13 | | | శిశిరము | వెనుకమంచు |
| ౨౭ | రేవతి | 27 ,, | 13 | మీనం | 12 మార్చి | | |

హెచ్చరిక:—వసంత గ్రీష్మము లెండకాలమనియు, వర్ష శరత్తులు వానకాలమనియు, హేమంత శిశిరములు మంచుకాలమనియు సామాన్యముగా వ్యవహరించుట గలదు. మలయాళీ దేశమున వసంత గ్రీష్మ వర్షములలో వానలు మిక్కుటముగను, శరద్ధేమంత శిశిరములలో ఎండలు బలముగను నుండును.

కార్తెశబ్దము కృత్తికాశబ్దభవము. దీనిముఖ్యార్థము సూర్యుఁడు కృత్తికానక్షత్ర రాశియం దుండు కాలము అని. మూఁడువేల యేండ్లకుఁ బూర్వము ఇరువదేడునక్షత్రగణములలోను కృత్తిక మొదటిదిగాఁ బరిగణింపఁబడుచుండెను. అటుపిదప నది కృత్తికానక్షత్రమునకు తర్వాతినక్షత్రములనుగూడ సూచించుచుండి ప్రకృత మేనక్షత్రరాశిలోఁగాని సూర్యుఁడుండు కాలమును తెలియఁజేయుచున్నది. ఉదాహరణము: చిత్తకార్తె, స్వాతికార్తె మొ.

ప్రతి కార్తెయు నాల్గుపాదములు కలది. ఈకార్తెల మూలమున రైతులు ఋతుధర్మములను గ్రహించి వ్యవసాయము కొనసాగింతురు. ఐదవకార్తె నుండి పదునేడవకార్తెవఱకును, అనగా మృగశిరకార్తె నుండి అనూరాధకార్తెవఱకును వానకాలము. మూఁడవ కార్తెయగు కృత్తిక మేనెలలో ప్రారంభించును. ఇది కొంచెమించుమించుగా వైశాఖాంతము, జ్యేష్ఠమాసారంభము నగును. ఇయ్యది అత్యుష్ణకాలము; గ్రీష్మకాలమనియు నందురు. ఈకార్తె కధిపతి యగ్నిగావున నిపు డెవరును నూతనగృహనిర్మాణ ప్రయత్నము లొనర్పరు. ఇప్పటి తొలకరితో దుక్కి ప్రారంభమగును. ఈతొలకర్లు నైరృతిఋతుపవన (South West Monsoon) ప్రవేశమును సూచించును. రోహిణికార్తెయం దెండలు కొంచెము తగ్గి చినుకులు పడనారంభించును. ఈ నెలలోనైనను, జూనునందైనను తొలకర్లు విశేషించి యుండిన సామాన్యముగా రాగులు, సజ్జలు, అల్లము, ప్రత్తి మున్నగు మెట్టపంటలు పెట్టుదురు. మృగశిరకార్తె జూనునెల యాదియందే ప్రారంభమగును. "మృగశిర బిందిస్తే ముసలియెద్దు అంకెవేయును" అని సామెత కలదు. ఈఅంకె సంతోషాతిశయమువలన. ఈ కార్తెలో పొటపొటచినుకులు లేకుండిన తర్వాతి యైదుకార్తెలవఱకును, మఖకార్తెవఱకును వాన లుండవు; వఱపు తప్పదు. అప్పటి కాగస్టునెల సగము గడచును. మృగశిర సోమదేవతాకము గావున నీకార్తెయారంభముననే చినుకులుపడిన తోడనే సర్వత్ర వరి, సజ్జ, రాగులు చల్లఁదొడఁగుదురు. ఆర్ద్రకార్తెలో చినుకులు లేక యెండలు మాత్రము ప్రబలియుండిన నిఁక నలుబదిదినములు గడచుపర్యంతము వఱపు తప్పదు. అటుకాక వానకురియఁదొడఁగిన నిఁక నలుబదిదినములవఱకు, అనఁగా సెప్టెంబరుమాసాంతమువఱకు వర్షించుచునేయుండును. "ఆర్ద్ర ఉఱిమిన అఱువైరోజులు", "ఆర్ద్రలో వర్షము వచ్చిన ఆఱుకార్తెలు కురియును" అనులోకోక్తులు కొన్ని మండలములలోఁ గలవు. చల్లికకు, నారునాటు (ఊడ్పు) టకు నీకార్తె యశుభము. ఏడవదగు పునర్వసుకార్తె జూలై యారంభమున ప్రవేశించును. ఇందు మొదటిపంట చెడిన రెండవపంట వేయుదురు. ఈకాలము కందులు, మినుములు మున్నగు కాయధాన్యముల పంటకనుకూలమైనది. పుష్యమికార్తె కంబులు మున్నగువానికి ముఖ్యకాలము. ఆశ్లేషకార్తె (ఆగష్టు)లో చిటపొటచినుకులు విశేషము: 'ఆశ్లేషవాన అరికాలు లేమ' అని లోకోక్తి. ఇందు వరినాట్లు ప్రారంభమై మఖకార్తెయందును సాగుచుండును. ఈమఖకార్తెలో నుఱుములు, మెఱుములు మెండైన సువృష్టిని సూచించును. మఖ యుఱిమిన మదురుమీఁది కఱ్ఱయైనను పండును. అంతేకాదు; మఖ పుబ్బకార్తెలలో నుఱుములతోఁ గూడి వాన లేకుండిన నది రాఁబోవు కఱవునకు సూచన. పుబ్బలో చల్లకము, లేక నాట్లుమాత్రము సాగుచుండును. పుబ్బలో చల్లుటకన్న దిబ్బలో వేయుట మేలని రైతుల యభిప్రాయము. కాని యీకార్తెలో వర్షముండిన వెనుకకును మంచివర్షములుండును. 'పుబ్బ రేఁగినా బూతు రేఁగినా నిలువ' దని సామెత. ఉత్తరకార్తెలో వానయు, నుఱుము నుండిన వర్షము కుఱియుచునేయుండును; అనఁగా నీకార్తె నైరృతిఋతుపవనమును, ఈశాన్యఋతుపవనమును సంధించుకాలము. "ఉత్తర ఉరిమి, కురిసినా, పాము తఱిమి కఱచినా తిరుగదు" అన్నవానుడి యెఱుఁగనివా రుండరు. మఖలోఁగాని, పుబ్బలోఁగాని, ఉత్తరలోఁగాని, అనఁగా సెప్టెంబరాఖరువఱకు వానలు లేని యెడల కాటకము తప్పదు. మఖపుబ్బలు పరుసైన మహత్తైన క్షామము. 'ఉత్తర

మూచి యుత్తరగంప - వేఱూరికి ప్రయాణము కట్ట వలసినదన్నమాట. ఈయుత్తరకార్తెలోనే మెట్టకారు ప్రారంభము. ఇంతకుమున్ను చల్లిన వరినారునాట్లు మునకు నిదియే మొదలు. "ఉత్తరలో చల్లిన ఊబు కొని తినేదానికి లేదు."

హస్తకార్తెలో నీశాన్యఋతుపవనము (North East Monsoon) ప్రారంభించును. "హస్తమీ అతి వానకాలము చస్తిమీ గొల్లబోయలారా" ఇది గొఱ్ఱెలు గొల్లలతో తమ్ము కొట్టకుమని దోలియుంచుడని చేయు మొఱ్ఱ. చిత్తస్వాతి కార్తెలుసైత మిట్టివే. "చిత్త చిత్త గించి, స్వాతి దయచేసి విశాఖ విసరికొట్టకుంటే పీసా నికి పుట్టెడు పండుతా" నన్నది యొకసామెత. స్వాతి వానలు మిక్కుటమైనవి. స్వాతివానకు సముద్రాలు నిండు నన్నారు. చిత్తస్వాతికార్తెలలో క్రొత్తచల్లకము లేకుగదా చల్లినపంట జీవపట్టి నశించుటయుఁ గలదు. నవంబరునెలప్రథమార్ధము విశాఖకార్తె. ఇప్పటి వాన దేహారోగ్యకరమైనది. విశాఖ కురిసిన విషము వట్టు కొనిపోవును. తొలికారుకోఁత కిది తరుణము. తోటపం టల కిది యదను; రాగులలో రెండవపంట కిది సమ యము. నవంబరుతో ననూరాధకార్తెయు నంతరించును; వర్షములు ఆగిపోవును. ఈకార్తెలోని వాన రైతుల మనముల కుల్లాసముపుట్టించును. అనూరాధ కురిసిన మనో రోగా లంతరించును. ఇటుపిదప వాన కెదురుచూడకుం డినను జ్యేష్ఠమూలకార్తెల (డిసంబరు) లో కొంత వర్షము పడవచ్చును. కాని యావర్షము పైరుపంటలకు విచ్ఛేదకారకము. మూల ముఱుగ కురియును, జ్యేష్ఠ చెడ కురియును. మూలవాన ముంచకతీరదు.

ఇంతటితో వానలు నిలిచి మంచుపడ నారంభిం చును. అప్పటికి పైరు చక్కఁగ పండువాటియుండును. పుష్యమాసమున పెద్ద (పొంగలి)పండుగ చేసికొందురు.

అఱవవారు కార్తెలను కారులందురు. వారిమత మున చిత్రిమాసము (April)న బలమైన గాడ్పులు ప్రబ లిన నవి నైరృతిఋతుపవనసూచకములు. సూర్యుని కృత్తికానక్షత్రప్రవేశకాలము తుపానును సూచించును. వైయాశి (May)లోని యీశాన్యమూలయందలి మెఱు ములు ప్రవాహములు కలిగించును. ఆని (జూన్) నిద్రకు గుర్తు. అనఁగా ఆకులుసైత మూడకుండును. ఆని సగమేఱు, ఆడి నిండేఱు. ఆడినలుపు భావిసువృష్టి సూచకము. ఆడినలుపు పలచఁబడినవర్షము మట్టగించును. ఈనెలలో బలమైన ఝుంఝూమారుతములు వీచును. ఆవణి (August)లో వాన యేడ్చువారి కన్నీటిధారతో నీడైయుండును. అల్పిశి(October)యెండలకు నాఁ డొలచిన తోలు నాఁడే యెండును. అల్పిశిలోని యల్పవృష్టి కార్తికిలో నతివృష్టి యగును. అల్పిశి కార్తికిలలో వృష్టిలేనియెడల నన్నయు తమ్ముఁడు నొక్కటేయని ద్రావిడమున సామెతకలదు. అనఁగా జనప్రయాసమంతయు వృథయగును అని భావము. కార్తికిలో వర్షింపకున్న బిచ్చముగూడ పుట్టదు. మార్గళి(గర్భఋతువు)మబ్బు దక్షిణదిశగా ప్రయా ణించును. ఇయ్యది రమారమి డిసంబరు ౧౩-వ తేదినుండి ౧౭-వ తేదివఱకును కురవఁగా శేషించిన జలమును పైనెలలకై దాఁచియుంచునని యందురు. తైమాశినెల లలో నెమ్మదిగా నిద్రింపవచ్చును. పంగునినెలలో (March) ప్రయాణమునలుపువాఁడు వెఱ్ఱివాఁడందురు. అప్పటికే యెండలు ముదురును.

కాల మను శబ్దమునకు శీతోష్ణసితులలోని తార తమ్యమనియు నర్థముగలదు. చంద్రునిచుట్టునుండు పరి వేషము విశాలతనందుకొలఁది శీఘ్రవర్షమును సూచిం చును. అది యిఱుకైన బహుకాలము గడచిననేకాని వానరాదు. తెల్లవాఱుపూట నాకాశ మెఱ్ఱవాఱిన శీఘ్రవర్షము కలుగును; అదే సాయంకాలమందుండిన వాన యుండదు. పరివేషము పెద్దదైన పగటివానయు, ఇసుళ్లుబయలుదేఱిన జడివానయు కురియనారంభిం చును. సాయంకాలమున వర్షింపఁదొడఁగిన వాన యేడ్చి నను నిలువదు. చీమలు గ్రుడ్లుకఱచుకొని బయటఁబడి మిట్టనెక్కిన వాన మిక్కుటము. మిడియెండ వెంబడినే జడివాన. ఆకుచిలుక నేలకు సమీపముగా నెగయు చుండిన తప్పక వర్షముకలుగును. మంచుపడిన వాన లేదు. ఇసుళ్లు బయలుదేఱినా; చెదలు బారులుకట్టినా

వాన తప్పదు. మేఘము వెంటనే వాన యుండును; ఉత్తరదిక్కున నలుపు వానకు గుర్తు.

వ్యాసాదినున్న జాబితాలో నిరువదేడుకార్తెలును, వాని పరిమాణదినములును, అవి సంభవమగు రాసులును, ఋతువులును సూచితములు.

'వృషు సేచనే' (తడుపునట్టిది) యనుధాతువునుండి వర్ష శబ్దము పుట్టినది. వర్షము వలన లోకమంతయు జీవించునుగనుక నది యమృతోపమము. దానివలన నాహారము కలుగును. మేఘములు వర్షింపనిచో క్షుత్పిపాసలు ప్రపంచమును ముంచివేయును. సంపన్నమగు వానయే లేనిచో వ్యవసాయ మడుగంటును. వర్షము తనరామిచే లోకనాశనమునకును, తనరాకచే లోకహాసమునకును ఆస్పదమగును. మేఘములు వర్షింపనిచో తృణమైనను అంకురింపదు. సముద్రజలముం గ్రోలెడి మబ్బు వర్షింపనిచో వారాశియు తన విభవముం గోల్పోవును. ఆకసమెండిన నేలేట వచ్చు పండుగపర్వములును, దేవతలకు హవిర్భాగములును సున్న; తపోధర్మములు నిలువఁజాలవు. జలము లేక యేకార్యమును జరుగదన్న వానలేని జలమెక్కడిది? వృష్టివిభవముంగూర్చి యొకానొక సుప్రసిద్ధద్రావిడకవి నొడివిన నొడువుల కొక మహనీయుఁ డొనర్చిన యాంధ్రానువాదముఁ జదివిన నాదేశమున వర్షముంగూర్చి యేభావము గొనియుండువారో యూహింపవచ్చును:

౧. వారిదము గల్గి జగముండి వచ్చుకతనఁ
దానమృతమంచు నెఱుఁగుత త్త్వంబు కలది.

౨. కుడుచువారికిఁ బ్రియమైన కుడుపు లొసఁగి
కుడుచువారికిఁ గుడుపై తగునదియును జడి.

౩. వానలేక యబ్ధమహానేని జలధి
వేష్టితోరుజగత్తులో నెతనికుగొద.

౪. హలమువలన దున్నరు కృషీవలులు వర్ష
సలిలవిభవసంక్షయము పొసంగినతఱి.

౫. చెఱుచునదియు నాసరయయి చెడినవారి
కటుల మఱలఁ బ్రోచునదియు నంతయు జడి.

౬. భూతలముదిర ప్రవృత్తులు వడినఁగాని
యరిదికనుట హరిత్తృణశిరము లపుడు.

౭. ఘనపయోధియుఁ గుందును దన సహజత
కొని పయోదము దానటఁ గురియదేని.

౮. విభవమును బూజయును నెఱవేఱ దిచట
ఋభులకును వారిదము వఱ పెనయునేని.

౯. దానముఁ దపంబు రెండును దక్కవు వృథ
భూతలమునందు వర్షము పొడమదేని.

౧౦. జలము లేక లే దెవరికిం జగతియన్న
ఘనము లేక లే దుడుగక గాఱుట యది.

వానరాకడ ప్రాణముపోకడ తెలియరాదుకదా! కొన్ని ఋతువులలో నేర్పడు మేఘములకు గర్భమేఘములనియు, నాకాలమునకు గర్భఋతువనియుఁ బేర్లు. అప్పటి మేఘములు నియతకాలములలో కొన్నికొన్ని దేశములలో వర్షించును. ఈవిషయమై వరాహమిహిరాచార్యుఁడు తన బృహత్సంహితయందు ఈక్రిందివిధముగా నుడివియున్నాఁడు. ఆయనవివరణములోని మాసపరిగణన ముత్తరభారతవర్షమున కనుకూలించియుండును. అది మనమండలములోని మాసమున కన్న నొక్కొక్కమాసముముందటి దగును.

"ఆహారము జీవనాధారము. ఆహారమునకు వర్షమాధారము. కనుక వర్షముగూర్చి కొన్ని సిద్ధాంతము లెఱిఁగియుండుటావశ్యకము. గర్భకారకమేఘముల నహర్నిశలు సావధానముగ పరిశీలించుచుండి వానిలక్షణముల నూహింపఁజాలిన జ్యోతిషికుని వార్త ఋషివాక్కును బోలినది. కలియుగమున వర్షఫలాఫలముల నెఱిఁగినవాఁడు తక్కువిద్య లేవియు తెలియకున్నను గౌరవమొందఁగలుగును. వాతావరణస్థితి బోధించు విద్యకన్న మోదము నొసంగఁగలది వేఱేదియుండును?

చంద్రుఁడు పూర్వాషాఢనక్షత్రమునుగాని, ఉత్తరాషాఢనక్షత్రప్రథమపాదమునుగాని మార్గశీర్ష-శుక్లపక్షమున నేతిథియందుఁ బ్రవేశించునో నాఁడు గర్భఋతువారంభమగును. చంద్రుఁ డేనక్షత్రమును ప్రవేశించుకాల

మున మేఘములు గర్భవంతములగునో నాటికి 195 దినములకు పిమ్మట వర్షము కురియును. గర్భధారణము శుక్లపక్షమందైన వర్షపాతము కృష్ణపక్షమందును, కృష్ణపక్షమందైన శుక్లపక్షమునను కలుగును. ఈ గర్భోత్పత్తికి చాంద్రమాసమే గణింపదగినది. గర్భధారణము పగలైన రాత్రియు, రాత్రియైన పగలును, ప్రాతస్సంధ్యయందైన సాయంసంధ్యయందును, సాయంసంధ్యయందైన ప్రాతస్సంధ్యయందును వర్షించును. మార్గశీర్ష శుక్లకృష్ణపక్షము లందును, పుష్యశుక్లమందును గర్భము ధరించిన మేఘములు క్రమముగా జ్యేష్ఠ బహుళ ఆషాఢ శుక్ల బహుళములయందు వర్షించును. ఈసమయమున వర్షము సాధారణముగా నుండును. పుష్యబహుళమున గర్భముధరించు మేఘములు శ్రావణశుక్లమందును, మాఘ శుక్లమందలివి శ్రావణబహుళమందును, మాఘబహుళమందలివి భాద్రపదశుక్లమందును, ఫాల్గుణశుక్లమందలివి భాద్రపదబహుళమందును, ఫాల్గుణబహుళమందలివి ఆశ్వయుజశుక్లమందును, చైత్రశుక్లమందలివి ఆశ్వయుజబహుళమందును, చైత్రబహుళమందలివి కార్తికశుక్లమందును వృష్టికారకము లగును. తూర్పున పుట్టు మేఘములు పడమటను, పడమటివి తూర్పునను వర్షించును. ఇతరదిశలలో దోచు మేఘములయొక్కయు, గర్భోత్పత్తి వర్షాకాలమునందలి వాయుచలనముయొక్కయు స్థితిగతు లిట్టివే.

ఉదీచీఈశాన్య ప్రాగ్దిశలనుండి మందమారుతము వీచినను, సూర్యచంద్రమండలములంజుట్టి పరివేషము స్వచ్ఛమై, దట్టమై యుండినను, మేఘములు పెద్దవై ప్రకాశవంతములై దిట్టముగా నుండినను, అవి సూచ్యగ్రములవలెనైనను, ఖడ్గముంబోలిగాని యుండి యెఱ్ఱవాఱినను, ఆకాశము కాకిగ్రుడ్డురంగు కలదైనను, చంద్రతారకలు నిర్మలములై ధవళముగా గన్పట్టినను, సంధ్యాకాలములం దింద్రధను వేర్పడినను, ఆసమయములం దుఱుముమెఱుములు సన్నముగ నుండినను, ప్రతిసూర్యుడు మనోహరముగ గాన్పించినను, తూర్పు ఈశాన్య ఉత్తర దిక్కులందు పక్షులును, జంతువులును గుమిగూడి యింపుగా పాడుచుండినను, గ్రహబింబములు స్పష్టమై పెద్దవిగా గోచరించినను, వానిచలనము నక్షత్రరాశి కుత్తరముగ నుండినను, వృక్షములు చక్కగా పీడలేక పెరుగుచుండినను, గోవులును జనములును, హాయిగానున్నను ఫలవంతమగు గర్భోత్పత్తిని సూచించును. పూర్వోక్తసందర్భములం దుత్పత్తియగు మేఘములు మీదికి సువృష్టి నొసగును.

మఱియు, సంవత్సరమున నాయాఋతువులలోని గర్భధారణమేఘలక్షణములు నుడువబడును :

మార్గశీర్ష పుష్యమాసములందు సూర్యోదయాత్పూర్వమును, సూర్యాస్తమయానంతరము నధికారుణరాగము కలిగియుండినను, మేఘముల నావరించి పరిధి యేర్పడినను, మార్గశీర్షమున చలి విశేషించియు, పుష్యమున మంచు విశేషించియునుండి మాఘమాసమున చండమారుతము ప్రబలినను, సూర్యచంద్రమండలములు మంచువలన మఱుగువడినను, ఉదయాస్తమయకాలములందు సూర్యుని మబ్బుక్రమ్మి చలి బలముగానుండినను, ఫాల్గుణమున ఝుంఝూమారుతము చెలరేగి మేఘములు చలనముకలిగియు, పరివేషములు భంగపడియు నుండినను, సూర్యుడు బంగారువర్ణముగాని, ఎఱ్ఱరంగుగాని కలవాడైనను, చైత్రమాసమున గాలికి చలనమును, మబ్బువానలును, పరివేషము నుండినను—గర్భోత్పత్తి సులక్షణమై యుండును. గర్భధారిమేఘములు ముత్యము, వెండి, తమాలవృక్షము, నీలోత్పలము, కాటుకచెట్టు మున్నగువాని వర్ణముకలిగియుండిన వానలు మిక్కుటముగా నుండును. ఆమేఘములు సూర్యుని తీక్ష్ణకిరణములకు గుఱియైనను, మందమారుతముచే చలించి జలబిందువులచే నావృతమైనట్లు కన్పట్టినను వర్షసమృద్ధి కలుగు. ఆగర్భఋతువునందు మేఘముతో కూడి యుల్కాపాతము లుండినను, పిడుగుపడినను, దుమ్ము విశేషించి రేగినను,దిఙ్మండలమునొద్ద కృత్రిమాగ్ని తోచినను, ఆతరుణమున మేఘములు నగరములయు, గోపురములయు నాకృతివహించియుండినను, సూర్యబింబమున మచ్చలు కాన్పించినను, గ్రహసంయోగమైనను, రక్తవృష్టి కలిగినను, పరివేషములుగాని, యింద్రధనుస్సుగాని తోచినను, సూర్యచంద్ర గ్రహణములలో నేదే

నొకటి పట్టినను ఈ సందర్భములన్నిట గర్భధారణము విఫలమగును. ఆయా ఋతువుల గర్భలక్షణములలో నేలాటి విచ్ఛిత్తియైనను గర్భవృద్ధి చక్కఁగా జరుగక వఱపు సంభవించును. పూర్వ ఉత్తరాభాద్రలయందును, పూర్వ ఉత్తరాషాఢలయందును, రోహిణియందును చంద్రుఁ డుండుకాలమున కలిగిన గర్భ మవిచ్ఛిన్నమై సువృష్టికారణమగును. శతభిషము, ఆశ్లేష, ఆర్ద్ర, స్వాతి, మఖనక్షత్రములయందు చంద్రుఁడుండునపు డుత్పత్తియగు గర్భము నిరాఘాటమగు బహుదినవృష్టిని సూచించును. కాని యట్టి మేఘముల కవాంతరవిఘ్నము లేవియు కలుగరాదు. గర్భోత్పత్తి మార్గశీర్షాదివైశాఖాంతములలోపల చంద్రుఁడు పూర్వోక్తములగు శతభిషగాది యైదిటిలో నుండునపుడైన క్రమముగా నెనిమిది, ఆఱు, పదునాఱు, ఇరువదినాల్గు, ఇరువదిమూఁడు దినములు విడువక వర్షించుచుండును. గర్భోత్పత్తికాలమున చంద్రసూర్యులకు క్రూరగ్రహదృష్టి తగులుచుండిన దాని వలని వర్షము వడగండ్లతోను, పిడుగులతోను, మీనములతోను కూడియుండును. అటుగాక రవిచంద్రులు మిత్రగ్రహవీక్షణములపాలై యుండిన వర్షము సమృద్ధమగును. గర్భోత్పత్తికాలమున విశేషముగా వర్షించిన మీఁదికి వాన తక్కువ. ఈ ఫలము తటస్థమగుటకు కురిసినవాన ద్రోణమున నెనిమిదవవంతు ఉండవలయును. గ్రహప్రాతికూల్యమున నియతకాలమున వర్షింపకున్న మీఁది గర్భోత్పత్తికాలమునకు తప్పకవర్షించును. అప్పుడు వడగండ్లు తప్పక వర్షించును. పాడియావులను పాలుపిండక చాలసేపు వదలియుండిన పాలు గడ్డకట్టును. అలాగుననే సకాలమున వర్షింపకున్న వాన వడగండ్లరూపము నొందును.

ఫలవంతమగు గర్భోత్పత్తికి తప్పక యుండఁదగిన లక్షణములు ఐదు: (౧) గాలి, (౨) వాన (3) మెఱుము, (౪) ఉఱుము, (౫) సకాలమేఘదర్శనము అనునవి. ఈలక్షణములతో గర్భోత్పత్తియైన వర్షము ౧౦౦ యోజనముల వ్యాప్తి కలదగును. అయిదు లక్షణములలో నేయొకటి లోపించినను ఆవ్యాప్తి సగమేయగును. రెండులక్షణములు కొఱవడిన పాతికవ్యాప్తి యుండును. సకల లక్షణములం గూడి యున్న తరువాతివాన యొక్క ద్రోణముకురియును. ఆతరుణములందు గాలి బలముగా వీవఁదొడఁగిన వర్షప్రమాణము 3 ఆఢకములే యగును. ఆఢకము ద్రోణములో నొకపాదము($\frac{1}{4}$). మెఱుముతోఁగూడియుండిన ఆఱాఢకముల ప్రమాణవర్షమును, ఆకసమంతయు మబ్బు క్రమ్మియుండిన తొమ్మిదాఢకముల వర్షమును, ఉఱుములు సైతముండిన ౧౨ ఆఢకముల వర్షమును.

కొన్ని తిథులును గర్భధారణమున కనుకూలమైనవి.

జ్యేష్ఠమాసమున శుక్లాష్టమి మొదలుగా నాల్గుదినములకు వాయుధారణదినము లని పేరు. ఆదినములలో వీచుగాలినిబట్టి గర్భధారణలక్షణముల నూహింపవచ్చును. గాలిమందమును, మనోహరమునునై ఆకసమున సుందరాకారముగ మేఘములు వ్యాపించియుండిన సువృష్టి కలుగును. కాని జ్యేష్ఠశుక్లమున పూర్వోక్తచతుర్దినములలో చంద్రుఁడు స్వాత్యాదినాల్గునక్షత్రములలో నేయొకదానిం బ్రవేశించుతరుణమున వర్షించినను వానకాలమగు శ్రావణాదికార్తికమాసాంతములోపల సమృద్ధిగా వర్షము కలుగును. గర్భదినము లన్నిటను లక్షణములు సమగ్రములై యొకేరీతి నుండిన దేశము సుభిక్షమగును. వానియం దెంతమాత్రము తారతమ్యము గల్గినను దుర్భిక్షమును, చోరభయమును వ్యాపించును. గర్భధారణకాలమున సూర్యచంద్రులను జలనిబిడమగు మేఘము లావరింపఁగా దుమ్మురేఁగి ఉఱుముమెఱుములతోఁ గూడియుండినను సువృష్టి కలుగును. ఆదినములలో మెఱుపుతీఁగలు సద్దిశలయందు పలుమాఱు తోఁచుచుండిన సకలధాన్యములు పుష్కలముగా ఫలించును. అట్లులేక చినుకులు పడుచు పిశాచపుగాలి రేఁగినను, పసివాండ్రు తమ యాటపాటలలో నోటితో నీలవేసినను, పక్షులు పాడినను నీటమునిఁగినను, దుమ్మున పొరలాడినను, సూర్యచంద్రుల పరిధి స్ఫుటమై ఆకారభంగము పొందకున్నను సువృష్టికలిగి సకలధాన్యములును ఫలించును. ధారణకాలమున మబ్బు సొగసుగా నుండి యెడమవైపునుండి కుడివంకకు పయనించుచు

నొకచో గుమిగూడు నెడ తత్క్షణమే వర్షించును. ఈవాన సకలవిధములైన పంటలకును సుప్రశస్తమైనది.

మఱి వానకును దివ్యజ్యోతులకును గల పరస్పర సంబంధమును వివరించు విషయములు కొన్ని యిక ప్రదర్శించెదను.

జ్యేష్ఠమాసమున చంద్రుఁడు పూర్వాషాఢాదిగా మూలానక్షత్రమువఱకును గతించు కాలమునందును, పున్నమకు తర్వాతను కురియు వాన ననుసరించి రాఁబోవు వానకాలమున వర్షప్రమాణ మెంత యుండునో, వ్యవసాయ మేమేరఁ దాఁకునో జ్యోతిషికుఁడు నిశ్చయింప వలయును. వర్షించునపుడావర్ష జలము నొక వర్తుల ముఖముగల పాత్రమునందు, ఆఢక ప్రమాణము గలదానియందు సంగ్రహింప వలయును. (ఆఢకము= ౫౦ పలములు) పరాశరుఁడు ఆఢకమానము ౨౦ అంగుళముల వ్యాసమును, ౮ అంగుళముల పొడవును గల వర్తుల పాత్రముయొక్క ప్రమాణమని నిర్వచించి యున్నాఁడు. జ్యేష్ఠ మాసమునందు పూర్వాషాఢాదిగ చంద్రుఁడు గతించునపుడెన్ని వాసరములు చినుకులు పడుచుండెనో యన్ని దినములు సరికాలమందు నైతము చంద్రగతి నదేనక్షత్రము ననుసరించి వాన కురియును. లేదా, ఒక గతికపోదను జలబిందువు లెన్ని యంటి యుండునో యన్ని దినములు వర్షించును. దీనింబట్టి వెనుకటి కాలపు వర్షప్రమాణ మింతయని వివరింపనగును. తొలకరిలో విశేషించి వానయుండిన సకాలమున వాన కురియును. కొందఱు తొలకరు లెక్కడ కురిసెనో యా ప్రదేశముల మాత్రమే వాన యుండు ననియు, కొందఱు పది యోజనముల మేర వ్యాపించు ననియు నభిప్రాయపడెదరు. జ్యేష్ఠమున పూర్వాషాఢ నుండి మూలానక్షత్రమునకు చంద్రుఁడు గతించునెడ నేయేదినములలో వర్షించెనో వర్షాకాలమందును చంద్రుఁ డాయానక్షత్రములకు గతించు దినములలోనే వర్షము కలుగును. ఆనెలలో వర్షింపకున్న వర్షాకాలమందును వాన సున్న. జ్యేష్ఠమున చంద్రుఁడు మృగశిర, హస్త, చిత్త, పూర్వాషాఢ, ధనిష్ఠ, రేవతి నక్షత్రములను ప్రవేశించునపుడు వర్షించిన వర్షాకాలమున పదునారు ద్రోణముల వాన కురియును; శతభిష, జ్యేష్ఠా, స్వాతినక్షత్ర ప్రవేశకాలములందైన ౮ ద్రోణములును, కృత్తికా నక్షత్రమునందైన పది ద్రోణములును, శ్రవణము, మఘ, అనూరాధ, భరణి, మూలా నక్షత్రములలోనైన పదునాల్గు ద్రోణములును, పుబ్బలోనైన ౨౫ ద్రోణములును, పునర్వసులోనైన ౨౦ ద్రోణములును, విశాఖ ఉత్తరాషాఢలలో నైన ౨౦ ద్రోణములును, ఆశ్లేషలోనైన ౧౩ ద్రోణములును, ఉత్తరాభాద్ర ఉత్తరలలోనైన ౨౫ ద్రోణములును, పూర్వాభాద్ర పుష్యములలోనైన ౧౫ ద్రోణములును, అశ్వినిలోనైన ౧౨ ద్రోణములును, ఆర్ద్రలోనైన ౧౮ ద్రోణములును సకాలమున వర్షించును.

జ్యేష్ఠాదివర్షాకాల పర్యంత మేయేనక్షత్రరాశి ధూమకేతువులచేతఁగాని, ఉల్కాపాతములచేతఁగాని బాధింపఁబడదో ఆయారాశి ప్రవేశకాలములందు పూర్వోక్త ప్రకారము వర్షించును. పైనక్షత్రరాసులలో సూర్యశనికేతువుల సమాగమ మేర్పడినను, అంగారక చలన మారాసులమూలముగ నుండినను, ఉల్కాపాత ధూమకేతు దర్శనములు తటస్థించినను, గ్రహసంయోగములు సంభవించినను వానయుండదు, దేశము సుభిక్షమును కానేరదు. మంచిగ్రహము లీనక్షత్రరాసులం జరించునెడలను, పూర్వోక్త వికారములు సంభవింపకున్నను సువృష్టి కలిగి, దేశము సుభిక్షమై జనులు సౌఖ్యమందుదురు.”

పైవిషయములను వరాహమిహిరాచార్యుఁడు క్రీ. శ. ఆఱవశతాబ్దమున తనబృహత్సంహితయందు వివరించెను. ఆశాస్త్రము నభ్యసింపమిచే మనల నజ్ఞానమావరించెను. దేశమున ప్రబోధము కలుగు సూచన లేర్పడుచున్నవి. ఇకనైనను ప్రాచీన విజ్ఞానమునెడ కల్గిన నిరసనభావమును త్యజించి పూర్వాచార్యపదముల ననుసరించి దేశౌన్నత్యమునకుఁ గడంగుదురుగాక యని ప్రార్థించుచున్నాఁడను.

# ప్రభాతము

కవిరాజ శ్రీవత్సవాయ వేంకటనీలాద్రిరాజు

నూతన వారయాత్రిక మనోహరకుక్కుట కాహళీనినా
దాతిశయంబు మున్నుగ శుభాంబరపాదసుయాన మొప్ప ను
ద్యోతితమూర్తియై తరలి తోయజబాంధవుఁ డేగుదెంచెఁ బ్రా
భాతసరోజినీ కమలపాణి పరిగ్రహణాభిలాషియై.

వీడకవీడు ఱేకుల నవీనపు సోరణగండ్లత్రోవ న
ట్టాడెడి బాలభాస్కరకరావలి తాఁకునఁ గన్నువిచ్చి పూఁ
బోడులు తాము ఱేడులనుబోలె సుగంధపు మేనిపూఁతతో
వీడఁ దొడంగె భృంగములు విచ్చిన తామరపువ్వుపానుపున్.

రాతిరి నుల్లసిల్లి మకరందము మంచున పుల్లగిల్ల త
ర్వాత ముడుంగు పుష్పనికరంబులతోఁ గయివ్రాలి తోడుతో
నూతనభానుదీప్తుల మనోజ్ఞపుఁదావులు గుమ్ముగుమ్మనన్
మూతులువిచ్చు పద్మముల మూగుచునున్నవి తేటిమొత్తముల్.

వేడివెలుంగుదీధితుల విచ్చిన తమ్ములపెంపుఁ గందుక
క్రీడలఁ బంతముల్ పలికి గెల్చినవారి మొగంబు గెల్వఁగా
నోడినవారి కన్నుఁగవ యోడెఁ గదన్ గుముదచ్ఛదంబుతో
మూడవె గెల్పులోనె గెలుపుల్, మఱి యోటమిలోనె యోటముల్.

---



శ్రీమతి డా. సుమతీబాయి
శ్రీ కండి గారు, యం. బి.

ఆనేగొందిసంస్థానము దివాను, టి. రామారావుగారి కుమార్తె. హైదరాబాదు విక్టోరియా జనానా ఆస్పత్రియందు సర్జను; శస్త్రచికిత్సయం దున్నతశిక్షణ బడయుటకై ఇంగ్లండునకు పయనించిరి.



డా. యం. వి. రాధాకృష్ణరావుగారు,
యం. బి., బి. యస్.

(కూనూరు న్యూట్రిషన్ రిసర్చి ఇన్‌స్టిట్యూటులో పతొలజిస్టుగ నియమింపబడిరి.)



డా. యం. యఫ్. లుక్మానిగారు

బొంబాయి హోమియోపతిక్ వైద్యసంఘ ఉపాధ్యక్షులు. బుడాపెస్టులో జరుగు అంతర్జాతీయ హోమియోపతిక్ సభకు భారతీయ ప్రతినిధిగ ఎన్నుకొనబడిరి.




ఇటలీనియంత ముసోలినీగారు ఒకగ్రామము చూడబోయి అచటి రయితులతోబాటు ధాన్యపుకుప్పల నూర్చుటకు ధాన్యపుకట్టలను స్వయముగ మోసికొనిపోవుట




జినీవాసభకు భారతప్రతినిధిగా పోయివచ్చిన బీగంషా నవాజుగారికి టారిఫ్‌బోర్డు అధ్యక్షులు ఫజుల్‌బాయి రహింతుల్లాగారు బొంబాయిరేవులో స్వాగతమొసగుట

# ఉపజ్ఞాపరీక్షలు

చివుకుల శ్రీనివాసరావు

"ఉపజ్ఞా జ్ఞాన మాద్యం స్యాత్"

ఉపజ్ఞయనగా ఉపదేశము, లేక తనంతటనే మొట్టమొదట పుట్టెడు జ్ఞానము. నూతనవిషయములకు సంబంధించిన ప్రాతఅభిప్రాయములను స్మృతికి దెచ్చుకొనుచు ప్రస్తుతావస్థలో క్రొత్తవిషయములను కనుగొని వాని కనుగుణముగ సమ్మేళనపఱచుకొని చుఱుకుగ ప్రవర్తించునట్లు జేయునది యీ ఉపజ్ఞయే. కనుక నేర్చుకొన్న విషయము నిలుపుకొనుట, నూతనవిషయములోని సంబంధబాంధవ్యములను గుర్తెరుగుట, పూర్వజ్ఞాన ముపయోగించుట, సరిగాను, త్వరగాను స్మృతికి దెచ్చుకొనుట మొదలగువాని కీయుపజ్ఞయే మాతృకయని స్పష్టమగుచున్నది.

మనుష్యులయొక్క అభిప్రాయములు వివిధ రీతులుగా నుండును. గ్రహింపవలసిన నూతనాంశము లొకటిగా నున్నను, మెలగవలసిన అవకాశములలో భేదము గన్పట్టకపోయినను, మనుష్యుల మానసికాభివృద్ధి భేదించుచుండును. దీనికి కారణము వారియొక్క పరిసరములుగావు. శరీరసంబంధమైన గుణములమాదిరిగనే యీ ఉపజ్ఞాది మనస్సంబంధమైన స్వభావములు పూర్వుల నుండి వచ్చును. ఇదికూడ పిత్రార్జితమువంటిదే. ఒకని శక్తిసామర్థ్యములు సాధారణముగా వాని పూర్వులను బట్టి యుండును. అవి వంశపారంపర్యముగా వచ్చును. దానితోబాటు పోషణగూడ తోడ్పడిన నెంతయు యుక్తముగా నుండును. కేవలము పరిసరములనుబట్టి వ్యక్తిలో పెద్దమార్పులు గలుగవు. ఆపరిసరములతనిలో నూతనావేశములు సృజించలేవు. 1 కనుక ప్రతివ్యక్తిలోనూ యున్న ఉపజ్ఞాశక్తిని కనిపెట్టి ఆయోగ్యతకు తగినట్లుగా, ఆశక్తిసామర్థ్యములు పూర్తిగ నాతనిలో వృద్ధిపొందించుటకు దగిన యవకాశముల నేర్పఱచుటయే విద్యయొక్క ముఖ్యోద్దేశము.

సాధారణముగా మన పాఠశాలలలో జరుగు పరీక్షలు, విశ్వవిద్యాలయపు బరీక్షలు వీనినిబట్టి మనము వ్యక్తుల తెలివితేటలను నిర్ణయించలేమనుటలో అనృతమేమియు లేదు.2 గొప్ప తెలివిగలవారని విశ్వవిద్యాలయములలో నిర్ణయింపబడినవారు జీవితములో నెగ్గకుండుట, ఆశాభంగముపొందుట జగద్విదితము. సహజజ్ఞానమునకుతోడు పట్టపరీక్షలలో గెలుపొందినవారే గొప్ప గొప్ప పనులను సాధించుచున్నారు. అట్లు సాధించుటలో యీపరీక్షల తోడ్పాటు బహుకొద్దియని వారే చెప్పుదురు. ఒక్కొక్కప్పుడు సహజజ్ఞానము పూర్ణముగా గలవారు కూడా బడిపరీక్షలలో తప్పుట కనేక

---

1. "A child's abilities are determined by his ancestors and all that envircnment can do is to give cppcrtunity fcr the develcpment of his pctentialities. It cannot create new powers cr additicnal atilities. This, then, is the main functicn cf educaticn, to measure the inherited capacities cf the child and to so arrange the envicnment as to give full oppcrtunity for all these capacities to develcp to the uttermcst." — Rudolf Pintner: Intelligence Testing. Lcndcn University Press Ltd.

2 "Examinaticn is an enemy of true educaticn...I do mcst heartily condemn examinaticn as we have it in Indian educaticn to-day, because it is nct a true reading of a balance, which is the real meaning cf the word (Latin: examen, the indicatcr cf a balance) but is rather a laceraticn, almcst a mental and emotional crucifixicn, and in the preparaticn fcr it is a promctcr cf deceit and lopsidedness and a depressant to perscnal rectitude and general cultural values." Dr. James H. Cousins.

కారణము లుండవచ్చును. అవి ఏవన, ఉపాధ్యాయులు సరిగా చెప్పకపోవుట, ఉపాధ్యాయులు మారుట, బాలురు బడినుండి బడి కదేపనిగా మారుట, ఈడుకు తగిన తరగతిలో నుండకపోవుట, బడికి సరిగా హాజరు కాకపోవుట, ఉన్నతస్థితికి రావలెనని ఆశ లేకపోవుట, స్వతహా తెలివితేటలు లేకపోవుట, కష్టపడి పనిచేయకపోవుట, ఏపనిచేయుమనినను ఆరోగ్యము సరిగా లేకుండుట, గృహపరిస్థితులు చక్కగా లేకుండుట మొదలగునవి. ఈ అననుకూలములవలన బాలురు తెలివితేటలుండియు పైకి రాలేకుండా యున్నారు. వారి సహజజ్ఞానమును, ధారణాశక్తిని శోధించు పరీక్షలు తగినవి లేనేలేవు. ఉన్నను మన మాచరించుటలేదు. ఈ ఉపజ్ఞాపరీక్షల (Intelligence tests) వలన బాలబాలికల శక్తిసామర్థ్యములు కనుగొనవచ్చును.1 వీని విషయమై యుపాధ్యాయులు కృషిసలుపవలెను. 2

ఈ పరీక్షలు పాశ్చాత్య దేశములలో సుమారిప్పటి కిరువది వత్సరములనుండి అమలులోనున్నను మన దేశములో యీధోరణి యంతగా లేకుండుట చాలా హైన్యముగా నున్నది. దేశాభ్యుదయమున కిటువంటి నూతనాభిప్రాయముల దెలిసికొని సమన్వయించుకొనవలయును. జపాను ఎంతత్వరలో ఎందుమూలమున నున్నతదశకు వచ్చినదో పాఠకమహాశయులు గ్రహింపదగియున్నది. మన భారతీయులు పూర్వ మన్నిటిలో మొనగాళ్లని గర్వించుచు ప్రకృత మూరకుండుట శ్రేయస్కరము గాదు. వెనుకవిషయములనుబట్టి మనల నిప్పుడు బ్రహ్మరథము పట్టువారు లేరు. భవిష్యత్తును గూర్చి సదభిప్రాయముల కూర్చుకొని దేశసౌభాగ్యమునకు తోడ్పడి ముందంజ వేయవలయును. ఏదేని కొత్త విషయ మమలులోనికి దెప్పింపవలెనన్న అనేకకష్టనష్టములకు లోనగావలెను.

ఈ ఉపజ్ఞాపరీక్షలు అమెరికాదేశములో అతిత్వరితముగా వర్ధిల్లి ౧౫,౨౦ సంవత్సరములలో పరిపూర్ణత గాంచినవి.

ఈనూతన విధానమువలన పరీక్ష జరుపుటలో తొలుదొల్త ఉద్రేకమును కలిగించి అగ్రస్థాన మలంకరిం

(At the 26th Provincial Educational Conference, Anantapur, Dec. 1934.)

"The school examination is often for the child a source of worry and Anxiety; the mental test is an interesting and pleasant experience".—Terman: Measurement of Intelligence.

"The instability of the marking of examination papers has been thrown into relief by the remarkable constancy of the marking of mental tests".—The Reliability of Examinatisns by C. W. Valentine. University of London Press, 1932.

1 "There is considerable evidence that the tests do reveal intelligence among children who do not excel in school work...Intelligence tests are designed to measure inborn ability and...do reveal a lack of intelligence (or native ability) which is not revealed by the scholarship examination".—The British journal of educational Psychology, Vol. 4, Part 3. November, 1934.

2 "Teachers must master the principles of intelligence testing, because it is an essential part of our equipment as self-respecting craftsmen".—John Adams. (London) వీ రిటీవలనే, అనగా 30-9-1934 తేదీన స్వర్గస్థులయిరి.

చిన శిక్షకాధిపతి ఆల్ఫ్రెడ్ బినే (Alfred Binet.)[1] సుమారు ౧౯౦౦-వ సంవత్సరములో ఫ్రాంసుదేశపు విద్యాశాఖాధికారులు బడికిపోవు విద్యార్థుల మాంద్యమునకు కారణములు (అజాగ్రత్త, తుంటరితనము, తదితర బాధలేమోయని) ఆకాలములో పారిస్ నగరములో నుండు గొప్పమానసికశాస్త్రవేత్తయగు బినేను కనిపెట్ట వలసినదిగా కోరిరి. ఈయనకు సహాయముగా సైమో (Theodore Simon) అనునాతడు పనిచేసి యుండుటచే వారి యుభయులపేర్లు బయటికి వచ్చినవి. అవియే Binet Simon Scale అని అనుచున్నారు. వీరు మొదట ౧౯౦౫ లో పరీక్షాప్రశ్నలను ప్రచురించి యుండిరి. దానిని ౧౯౦౮ లో సవరించి మరల ౧౯౧౧ లో పరిష్కరించి ప్రచురించిరి. ఈవిధముగా ప్రశ్నావళి యందు మార్పుతో బాటభివృద్ధియు గోచరింపదొడగెను. ఒకదానికన్న నొకటి సులువు పద్ధతులతో వ్యక్తులను సరిగాను, న్యాయముగాను పరీక్షించేయేర్పాటుగావింపబడెను.

విద్యాభివృద్ధికై యనర్హులయిన విద్యార్థులను (సాధారణఉపజ్ఞాలోపము గలవారిని) ప్రత్యేకించిన బాగుండుననియు, అట్టివారిని కనిపెట్టుటకును యీపరీక్షలుద్దేశింపబడినవి. Galton, Cattell మొదలగు శాస్త్రజ్ఞులింతకుముందు పరిశ్రమచేసిరి. కాని యీబినే సైమోపరీక్షా విధానములో విశేషమేమనిన యీప్రశ్నావళులు సాధారణమైన తెలివితేటలను పరీక్షించుచున్నవి.

మూడవ సంవత్సరమునుండి కౌమారదశ దాటేవఱకు యీ క్రింద చూపబడిన ప్రకారము పరీక్షలు జరుపవలెనని ౧౯౧౧ లో బినె (తన అకాల మరణమునకుముందు) ప్రచురించి యుండెను.

### 3-వ సంవత్సరము

౧. ముక్కు, కన్ను, నోరు చూపుట.
౨. రెండంకెలను తిరిగి చెప్పుట.
3. ఒక చిత్తరువులోని వస్తువులను వరుసగా చెప్పుట.
౪. ఇంటిపేరు చెప్పుట.
౫. చిన్నవాక్యమును తిరిగి చెప్పుట.

### ౪-వ సంవత్సరము

౧. స్త్రీ పురుష భేదమును చెప్పుట.
౨. తాళముచెవి, కత్తి, పెన్నీ - వీనిపేర్లను చెప్పుట.
3. మూడంకెలను తిరిగి చెప్పుట.
౪. రెండుగీతలను పోల్చుట.

### ౫-వ సంవత్సరము

౧. రెండు బరువులను పోల్చుట.
౨. ఇచ్చిన చదరమునకు నకలుగీయుట.
3. ఒకమాదిరి పెద్దవాక్యమును తిరిగి చెప్పుట.
౪. నాలుగు పెన్నీలను లెక్కించుట.
౫. వేఱుచేయబడిన దీర్ఘచతురస్రముయొక్క భాగములను కలుపుట.

### ౬-వ సంవత్సరము

౧. ఉదయ సాయంకాలముల భేదముల గుర్తించుట.

---

1. "Without Binet the development would have been much slower and would probably not have taken the decidedly practical turn at the outset which the work of Binet gave it".— Pintner.

2. "Binet began with the hypothesis that every child has a definite fund of native capacity or intelligence that would carry him, even if he received no teaching, a certain distance forward during each of the formative years of life".—Sir Percy Nunn's "Education: its Data & First principles".

౨. అలవాటుపడిన మాటలను వాడుకపదములలో వివరించుట.

౩. డైమండుపటమునకు నకలు వ్రాయుట.

౪. పదమూడు పెన్నీలను లెక్కించుట.

౫. అందమైన, అనాకారిగ నున్న ముఖములలో భేదమును గుర్తించుట.

## ౭-వ సంవత్సరము

౧. కుడిచేయి, యెడమచెవి చూపించుట.

౨. ఒక బొమ్మను వర్ణించుట.

౩. ఒకసారి మూడుపనులను నిర్వర్తించుట.

౪. మూడుపెన్నీలు, మూడర్ధపెన్నీలు—వీని విలువలను చెప్పుట.

౫. నాలుగుప్రధాన రంగులను పేర్కొనుట.

## ౮-వ సంవత్సరము

౧. జ్ఞాపకశక్తినిబట్టి రెండువస్తువులను బోల్చుట.

౨. ౨౦ నుండి ౦ వరకు లెక్కించుట.

౩. బొమ్మలలో విడిచిపెట్టిన అవయవములను దెలిసికొనుట.

౪. తేది, వారము చెప్పుట.

౫. అయిదంకెలను తిరిగి చెప్పుట.

## ౯-వ సంవత్సరము

౧. ఇరువై పెన్నీలను మార్చుట.

౨. అలవాటుపడిన మాటలను వాడుకలోనున్న భావకంటె మంచిభావములో నిర్వచించుట.

౩. ద్రవ్య నాణెములను పోలికపట్టుట.

౪. సంవత్సరములో, నెలల పేర్లు వరుసగా జెప్పుట.

౫. సులభప్రశ్నలకు జవాబులు చెప్పుట.

## ౧౦-వ సంవత్సరము

౧. అయిదుమొద్దులను బరువులప్రకారము వరుసగా బెట్టుట.

౨. జ్ఞాపకమునుబట్టి చిత్తరువులను వ్రాయుట.

౩. న్యాయవిరుద్ధముగా జెప్పబడినదానిని విమర్శించుట.

౪. కఠినప్రశ్నలకు జవాబులు చెప్పుట.

౫. మూడుమాటలను రెండువాక్యములలో నుపయోగించుట.

## ౧౨-వ సంవత్సరము

౧. సూచనలయొక్క నిజానిజములను దెలిసికొనుట.

౨. మూడుమాటలచే వాక్యమును కూర్చుట.

౩. మూడు నిమిషములలో అరువదిమాటలను చెప్పుట.

౪. కొన్ని గూఢపదములను నిర్వచించుట.

౫. వరుసతప్పి తారుమారైన వాక్యమున కర్థమును కనుగొనుట.

## ౧౫-వ సంవత్సరము

౧. ఏడంకెలను తిరిగి చెప్పుట.

౨. ఒకపదమునకు మూడుయమకములను దెలిసికొనుట.

౩. పెద్దవాక్యమును తిరిగిచెప్పుట.

౪. బొమ్మలను వివరించుట.

౫. జరిగిన సంగతుల యర్థమును వివరించుట.

## కౌ మా ర ద శ

౧. మడచిన కాగితముమీద కత్తిరింపులను వ్యక్తపఱచుట.

౨. త్రిభుజములను తిరిగి క్రమపఱచుట.

౩. గూఢపదముల వరుసల భేదములను గుర్తెఱుగుట.

౪. ప్రెసిడెంటునకు రాజునకును గల మూడు భేదములు.

౫. తాను చదివిన విషయములో ముఖ్యోద్దేశమును జెప్పుట.

ఈపరీక్షావళులపేర్ల నిట్లు చెప్పుటలో నొకవిధమైన భావము పాఠకులలో దృగ్గోచరమగును. వీనివిషయమై పూర్తిగ తెలియనిదే బాలురమీద ప్రయోగించ రాదు.*

ఈ బినేసైమో పద్ధతి ననుసరించి టర్మను ప్రయోగించి ౧౯౧౬ లో ప్రచురించిన పరీక్షావళి (Terman : Stanford Revision of the Binet-Simon Scale) యు, ప్రొఫెసరు బర్టుకొరగారిచే వ్రాయబడినదియును (Prof. Cyril Burt : Mental and Scholastic Tests) చాలా యుపయోగముగా నుండును. వీని విషయమై Yerkes, Goddard, Thorndike, Ballard మొదలగు ప్రముఖులు యొక్కువ కృషిచేసి యీ శాస్త్రము నభివృద్ధిలోనికి తీసికొని వచ్చిరి.

బినే తన యుత్కృష్టకార్యమును నిర్విఘ్నముగాను, జయప్రదముగాను జరుపుటకు ఈక్రిందవివరించిన సూత్రము లాయనకృషికి మూల బీజములై యొప్పారుచున్నవి. వీనినే ఆయన తర్వాత వారుకూడ అనుసరించిరి.

౧ కలగూరగంప ప్రశ్నలతో నిండిన మిశ్రములయిన శోధనలచే అనేకవిధములుగ నీయుపజ్ఞను కనుగొనెనని తెల్లముచుచున్నది. పాఠశాలలో గఱపు విద్యమూలమున అందఱు విద్యార్థులు సమముగ మేలుపొందరుగనుక బడిలో చెప్పు చదువుమీదనే ప్రశ్నించిన ప్రయోజన ముండదని గ్రహించి, పరిసరములనుండి క్రమేపి సాధారణ విద్యార్థి గ్రహించువిషయముల మీదనే ప్రశ్న లాధారపడియుండునట్లుజేసెను. మఱియు ప్రశ్నలు వివిధజాతులకు చెందినవి గనుక అధికముగను ఉన్నవి. ఇట్లుండుటవలన పరీక్షకు హాజరగు విద్యార్థికి విశేషలాభముగాని, నష్టముగాని యుండనేరదు.

౨. పరీక్షలు ఫలానా ఫలానావయస్సు పిల్లలకే యని మొదట నిర్ణయింపబడలేదు. ఈవయస్సు పిల్లల కీపరీక్ష తగియుండునా యని యోచించలేదు. ప్రతి పరీక్ష వివిధవయస్సుగల పిల్లలపై (భాగ్య భోగములు లెక్కచూడక) ప్రయోగించి స్వానుభవముమీదనే ఫలానా పరీక్షలు, ప్రశ్నలు ఫలానావయస్సుగల విద్యార్థులకే యుక్తముగ నుండునని కనిపెట్టబడెను. ౧౦౦కి ౭౫ లేక ౭౦మంది బాలు రాయాప్రశ్నలలో నుత్తీర్ణులయినపిదపనే ఏవయస్సున కే పరీక్షాపత్రము లిచ్చిన వారు జవాబులను చెప్పగలుగుదురో కనిపెట్టబడెను.

3. మెంటల్ యేజి (Mental Age)ని ఉపయోగపఱచెను. ఒకవయస్సుగల బాలు డింకొకవయస్సునకు నిర్ణీతమయిన పరీక్షలో గెలుపొందిన దానిని బట్టి వాని "మెంటల్ ఏజి"(M.A. అని సాంకేతికముగ దెలుపబడును) నిర్ణయించబడును. ౭ ఏండ్లబాలుడు అనగా (Chronological Age)"క్రానొలాజికల్ ఏజి"(సాంజ్ఞికపరిభాషలో C.A.) ౭ గలబాలుడు ఆఱవసంవత్సరపు పరీక్షలో నెగ్గిన వాని M.A. ౬ అని అందుము. విద్యార్థులలో నీరెండింటిలో(M. A. ను C.A.ను) M. A. ఎక్కువగానున్న తీక్ష్ణబుద్ధిగలవారనియు, C.A. ఎక్కువగానున్న (అనగా M. A. తక్కువగా నున్నప్పుడు) మందబుద్ధిగలవా రనియు, మొద్దు లనియు చెప్పెదము. అయితే ఎంతమొద్దయినది, ఎంతచుఱుకుదనము గలవా రయినది యీ M. A. వల్ల తెలియదు. ఈఅభివృద్ధిగాని, ప్రతిబంధకము గాని తెలిసికొనుటకు "ఇంటెలిజెన్సె కోషంట్" (Intelligence Quotient, సాంకేతికముగ I. Q. అనునది) తెలిసియుండవలయును.

---

*. "The Binet scale, it must be understood is an instrument of precision, not to be handled except by one who has been thoroughly trained in its use......the whole scale has been standardised by try-out on many children of each age, and so adopted that, when given according to instructions, it will give a correct measure of the child's mental age. But when given by persons in ignorance of its true character, it gives results very wide of the mark. So much by way of caution".—R. S. Woodworth.

M. A. ను C. A. చేత భాగించగా వచ్చు లబ్ధము (అనగా భేదము, quotient) ను I. Q. అందురు. ఈభాగహారములో దశాంశ భాగములు రావచ్చును. కనుక దశాంశబిందువు (Decimal point) లేకుండజేయుటకై I. Q. ను శాతములో తెలిపెదము. I. Q. కనుగొనుటకు సూత్రమేమనిన:

$$\text{Intelligence Quotient (I. Q.)} = \frac{\text{Mental Age (M. A.)}}{\text{Chronological Age (C. A.)}} \times 100$$

ఒకని M. A. ౧౨ ను, C. A. ౮ అయిన I. Q.

$$= \frac{౧౨}{౮} \times ౧౦౦ = ౧.౫ \times ౧౦౦ = ౧౫౦\%$$

ఈ I. Q. ఒకటి అనగా ౧౦౦% అయినపుడు ఆబాలుడు మధ్యస్థముగా నుండునని చెప్పుదురు.

ఈ I. Q. వలన అనేక విషయములు కనుగొనవచ్చును. సాధారణముగా పిల్లలలో I. Q.

| | | | | | |
|---|---|---|---|---|---|
| 70కన్న | తక్కువ యున్నవారు | 100కి 1 | చొప్పున అనగా | 1% | న్నూ |
| 70-79 | మధ్యయున్నవారు | 5 | ,, | 5% | ,, |
| 80-89 | ,, | 14 | ,, | 14% | ,, |
| 90-99 | ,, | 30 | ,, | 30% | ,, |
| 100-109 | ,, | 30 | ,, | 30% | ,, |
| 110-119 | ,, | 14 | ,, | 14% | ,, |
| 120-129 | ,, | 5 | ,, | 5% | ,, |
| 129 పైన | ,, | 1 | ,, | 1% | ,, |

ఉందురు.

I. Q. ౭౦ కన్న తక్కువగాయున్న బాలురు బుద్ధిబలములేనివారై సాధారణమానవుల కుండు వివేచన శక్తి లేనివారై యుందురు.

I. Q. ౯౦-౧౧౦ మధ్యయున్నవారు మధ్య రకముగా (అనగా అంతచురుకుగాను, అంత మందబుద్ధి గలవారుగను ఉండరు.) నుందురు.

I. Q. ౧౧౦ మొదలు ౧౪౦ వరకు యున్న వారు శ్రేష్ఠమని దెల్పును.

I. Q. ౧౪౦ కి పైనయున్న బాలుడు ప్రతిభాశాలిగను, మేధావిగను ఉండును. ఈవిషయములు [1] పరిశోధనవలన కనుగొనగలిగిరి.

ఈ I. Q. వల్ల కొద్దిగా జ్యోతిషము చెప్ప వచ్చును. ఇందులో పెద్దవిశేష మేమనగా ఒకవ్యక్తి యొక్క I. Q. వానిజీవితములో ఒకటిగానే యుండును. దానిచే ఏసంవత్సరములో M. A. ఎంతయుండు నది కనుగొనవచ్చును. ఉదాహరణము: ౮ ఏండ్ల బాలుని I. Q. ౧౫౦ అయిన వానికి ౧౬ యేండ్లప్పుడు M.A. ఎంతయుండును?

$$\text{సూత్రముచే } ౧౫౦ = \frac{M.\ A.}{౧౬} \times ౧౦౦.$$

$$\therefore M.\ A. = \frac{౧౬ \times ౧౫౦}{౧౦౦} = ౨౪.$$

కాని పరిశోధనల వలన దీనివిషయమై తేలిన సారాంశమేమనిన: ఈ యుపజ్ఞ ౧౩, ౧౪ యేండ్లు దాటిన పిదప అభివృద్ధిచెందదని కొందఱి అభిప్రాయము. కొందఱు ౧౬ వ సంవత్సరమని యూహించు చున్నారు.[2] ౧౮, ౨౦ సంవత్సరముల వఱకు నెమ్మదిగా

---

1. I. Q. Below 25 ... Idiot.

| | | |
|---|---|---|
| ,, | 70 | ... Definite feeble mindedness. |
| 70 | —80 | ... Bordering or feeblemindedness. |
| 80 | —90 | ... Dull. |
| 90 | —110 | ... Average or normal intelligence (roughly.) |
| 110 | —120 | ... Superior intelligence. |
| 120 | —140 | ... Very superior intelligence. |
| Above | 140 | ... Genius or Near genius. |

2. The startling view is gaining ground that the period at which intelligence ceases to develop is somewhere round about 16, so that after a pupil has attained that age, we may leave age out of account altogether in estimating his natural intelligence".—John Adams.

యీ యుపజ్ఞ యభివృద్ధి యనునది కొందఱి మతము. ఏ అభిప్రాయమైనను ఆఖరిమాట ౨౦ వ సంవత్సరము (అత్యధికముగా) దగ్గఱనుంచి అభివృద్ధిగా నేరదనియు, తర్వాత ఈడు ముదిరిన కొలది యదియే పూర్ణవికాసము నొందుననియు తెలియుచున్నది. కనుక ఆ సంవత్సరమునుండి జ్యోతిషము చెప్పుట కట్టిపెట్టవలయును. ఒకవేళ చెప్పిన న్యాయ విరుద్ధముగ నుండును. ప్రకృతము పై యుదాహరణములో M. A. ను ౨౪ గ కనిపెట్టినాము. ఇది అసంగతముగా లేదా? ఇటువంటి పరిస్థితులలో ఆ బాలుడు మేధావియని చెప్పవచ్చును.

ఈ బినేసైమో పరీక్షలలో కొన్ని వ్రాతమూలముగాక నోటితో చెప్పవలసినవి యుండుటచేత భాషముఖ్యావశ్యకత తేటతెల్లమగుచున్నది. కనుక నివి మూగవారికి, చెవిటివారికి, మాటలాడుటలో కొఱత గలవారికిని పనికిరావు. వారి యుపయోగార్థమై భాషతో బనిలేకుండా Dr. Pintner, Dr. Paterson లచే కల్పితమైన "Performance Tests" 1 మూలమున ఉపజ్ఞను బరీక్షించవచ్చును. ఇవి పైపరీక్షలతో బాటుపయోగించిన బాలుర కవగాహనశక్తి వృద్ధి పొందును.

ఈ పరీక్షలవలన ముందుముందెవరు బాలురు దేశనాయకులుగా నుండెదరో చెప్పుట కష్టము. ఏలనన నాయకుడు ప్రజల నాకర్షించి వారి కష్టసుఖముల గ్రహించి సామాన్యప్రజతో కలుపుకోలుతనముగా నుండవలయును. తెలివితేటలు సహజముగా నున్నప్పటికిని దానికి తగిన దేహతత్త్వము, నిదానము, ఓర్పు, శాంతము మొదలయిన మహోత్తరమయిన గుణము లుండినగాని యథార్థముగా నాయకుడు గానేరడు.

మఱియు నీ పరీక్షలవలన I. Q. ఎక్కువగా నున్న బాలురు కవులు గాని, లేక రాజకీయవేత్తలు గాని యగుదురేమో యని నిర్ధారణ చేయలేము. వృత్తిలో వికాసమునొందుట కియుపజ్ఞ ఒకటియే చాలదు.

కాని యీపరీక్షలు చాలా ప్రయోజనకరముగా నుండును. ఎవరు ప్రతిభాశాలురో, ఎవరు పెద్దన్యలో నిర్ణయించి బాలురందఱిని తరగతులుగా ఏర్పాటుచేయవీలగును. ఇందుకు I. Q., M. A. నూతోడ్పడును. ఎవ రేవృత్తికి తగుదురో కనిపెట్టి తదనుకూలముగ ప్రోత్సహింపవచ్చును.

కేవలము ఒకపరీక్షనుబట్టి బాలుని తెలివితేటలు కనిపెట్టలేము. అపుడపుడు పరీక్షించి, ఫలితములను పరికించినపుడు నిర్ణయించుటకు వీలగును. 2

ఈ యుపజ్ఞాపరీక్ష లితరదేశములలో వ్యాప్తిజెందుటకు ముఖ్యకారణ మేమనిన, మనదేశములోవలెగాక ఉపాధ్యాయుల కొనసు సావకాశములు మెండు. ప్రోత్సాహ మన్ని ప్రాంతములందు గన్పట్టును. ఆయా ప్రభుత్వములవారుకూడ తగినశ్రద్ధ తీసికొని సాహాయ్యపడెదరు. పండితు లాశీర్వదించెదరు. ఇంతకన్న నింకేమి కావలెను?

మనదేశములోనైనను వారివారి యవకాశములను బట్టి విద్యాశాఖయందు ప్రవేశించినవారియంశములో విశేషమును గుర్తెఱిగి తమ విధ్యుక్తధర్మముల నాచరించుచు, ఈ పరీక్షలందు కృషిసలుపవలయును. విద్యావిధానములో ఇటువంటి పరిశోధనలుజరుపుటకు భౌతికరసాయన శాస్త్రములమాదిరిగ ఉపకరణములను వేఱుగ కొననక్కరలేదు. గాజుసామానులే పగిలిపోవునని బెంగ

---

1. Form Board Tests, Picture Drawing Tests, Picture completion Test, Maze Test.

2 The differences of intelligence which we measure with our tests, between one year and another, and one individual and another, though important from a practical point of view, will often be quite small when viewed against the background of the absolute scale". —The growth of variability of intelligence: by C. A. Richardson and C. W. Stokes. (Cambridge University Press 1933.)

పడనక్కఱలేదు. కావలసినది ఉపాధ్యాయుల ఓపిక. ఈ పరీక్షలు మా విద్యాలయములో మ-రా-శ్రీ, ఆచార్య, జి. వి. సుబ్బారావుగారి (Principal) యాజమాన్యమున జయప్రదముగా జరుగుచుండును. ఈ పరీక్షలవలన బాలురలో (బాలికలలోగూడ!) విద్యయం దభిరుచియు, పరిసరములనుండి జ్ఞానము గ్రహించుశక్తియును, తదితరనూతనాదేశములు సృష్టించి వయసు రాగానే ఆ శక్తులన్నియు పూర్ణతగాంచునని అనుభవైకవేద్యులకు వేఱుగ జెప్పనక్కఱలేదు. అందువలన ఈ మహోత్కృష్టమైన కార్యమును నెఱవేర్చుటలో ఉపాధ్యాయులలో ఒకరికన్న నొకరు వారివారి బుద్ధి వికాసముల జూపించి చుఱుకుగ పనిచేయవలెను. పరిశోధనలకు తగిన యవకాశములు గాని, ప్రోత్సాహము గాని మనకు లేనేలేవని కుందుచుండిన లాభము లేదు.

ఈ పరీక్షలు మనదేశభాష లన్నిటిలోనికి తగు సమర్థులచే తర్జుమాగావించి ఆయా రాష్ట్రములలో ఉపయోగించుటకై విద్యాధికులు తోడ్పడవలయును. లాహోరులో ఆచార్య సి. హార్బర్టు రైస్ హిందుస్థానిలో బాలురనుమాత్రము ఈ నూతన విధముగ పరీక్షించినారు. బాలికలనుగూడ పరీక్షలందు పాల్గొనునట్లు చేయవలెను. ఇటీవలనే శ్రీ R. M. Savur, B. A. (Cantab)., M. E. S. గారు అజివములో చేయదగు పరీక్షలు ఒక చిన్నపుస్తకముగా ప్రచురించి మన దక్షిణదేశమునకు మార్గదర్శు లయినారు.

ఈ తర్జుమాలు గావించు విషయములో ఒక సూచన అంగీకరించ వలసి యున్నది. భారతిదేశభాషల కనుగుణముగాను, పొందికగాను, అందఱికి ఉపయోగకరముగాను ఉండునట్లు పరీక్షలను తయారు చేయవలయును. నాణెములు, బొమ్మలు మొదలగునవి మార్చి మనదేశము ననుసరించినవై యుండవలయును. ఏయే పరీక్ష యెంతకాలములో జరుపవలసినది స్వానుభవము మీద కనిపెట్టి ప్రశ్నపత్రికయం దుదాహరించవలయును.

న్యూటను మహాశయుడు జెప్పినట్లు మహాబ్ధి ప్రాంతమున ద్రిమ్మరుచున్నవాడనే తన్మధ్యను గల సంపద్విశేషముల గొనివచ్చి ధన్యులుకండని, యీ మహాశాస్త్రము నభివృద్ధిచేయ సమకట్టుడని బుధజనులను ప్రార్థించుచు ఇంతటితో విరమింతును.

---

# తేటి బోటి

బొడ్డు బాపిరాజు

ఏమే భ్రమరాంగన, యిట్టీమెయి తిరుగాడుచుంటి వేటికె? ప్రణయ
శ్రీమహితుడు ప్రాణేశ్వరుడేమే పెడబాసి చనియెనే; నుడువగదే?

ఎక్కడివాడె యింత బులిపింపులు బుచ్చెడి మాయకాడు? ప్రా
ద్దెక్కకమున్నె లేచి పనియేమొ మునింగిన తీవి పూవుట
మ్మక్కల చేరి యిచ్చకములాడుచు కాలము ద్రోసిపుచ్చు నీ
టక్కరిమాయదారుల తుటారిని నీ వెటుగట్టికొంటివే?

అవ్వ! వచింపసిగ్గు; అదియా మరియాద? కులాని కంతకుఱా
రవ్వను దెచ్చు పోకిళులె? రాతిరియుం బవలంచు లేదె! యి
ట్లివ్విధి రామరామ!! చరియించుట యించునె నీకుగూడ? ఆ
పువ్వులు రాలిపోను! తలపుం గొనడేమి రవంత నీమెడన్!

తూరుపు తెల్లవారినదిదొట్టి, చెలీ, మునిమాపుదన్క నం
చారము, లింటి యాబిడవిచారము దూరము; వాడవాడ సిం
గారపు టుత్సవమ్ములు! బికారిమగం డికచాలు! ఏల క
న్నీరొలికింతు వింతయు గణింపని యావెడచెల్మి సేతకున్?

ఓపిక యేది కాళ్ళిలిపియుంచి సుఖింపగ యింటిపట్టునం;
దీపరువంపు నీవయసు కేది సమానము? రేపు విచ్చి యీ
మాపున వాడిపోవుచు దుమారము దోగెడి రాలుపూవులే
తీపులు గూర్చు వానికి, సతీ,అత డీవలపే యెగుంగడే!

ఇంటినె కాదుపో, నిమున మెచ్చట పాదము మోప! డొక్కవా
ల్గంటియె కాదు, రోజునకు లక్షలు, కోటులు, నర్బుదాలు, మి
న్నంటులు! చూడ, మీ మమత లామొనగానికి చెల్లెగాక! ఇ
ట్లంటియు నంటకుండ తిరుగాడుటయే మతమేమొ వానికిన్!

ఇంతకు నీ వెరుంగ వనియే తలపోసెద పీఢిబడ్డ నీ
మంతిను లిందరుండ మతిమాలిన సేతలుగాక పద్మినిం
జింతన సేయునే! బ్రదికె సీదగు తాళిబలాన; భూమిపై
నింతకు నూకలున్నవి చెలీ, యినుడన్న మహాప్రచండుడే!

పాయని యీవియోగమున పాపము! సామయినావు నీవు; మీ
యాయనతోడి చెల్మి మలయానిలనందను డప్పుడప్పు డా
ప్యాయన మేర్పడం దిరుగు; వా డగుపించిన వాని జాడలం
దీయనువచ్చు నెట్లొ; యెరిగించితి నాయెరిగున్న సంగతిన్.

అమ్మ! నిజాన కాత డెడమై చనినప్పుడు పట్టరాని క్రో
ధమ్మున, ఉన్న బంధ మెడదన్ తెగతెంపులు సేసుకొందు కా
నిమ్ము, హఠాత్తుగా నెదురనిల్చిన వేళల నే నెరుంగకే
సొమ్మసిలున్ మనమ్ము, ఒడిజొచ్చును మేను, ముఖమ్ము ముద్దిడున్.

అతనిదైపోయె నీహృదయమ్మునమ్ము-మరుదుగావాని స్మరణమేమరదుగడియ
సన్నిధిని నున్నలేకున్న జాలువారు - ఏటి మమతలో మెరుగ కన్నీటివరద!

---

## రాయలసీమ క్షామదృశ్యములు



౧. క్షామనివారణ సంఘమువారు చిలమతూరువద్ద పనిచేయు స్త్రీలకు బట్టలుపంచుట



౨. కూలీలు భత్యమునకై వేచియుండుట

# రంభ

'గిరి'

## ౧

"దొరసానిగారు వున్నారా!"

"ఉన్నారండి ఇప్పుడే వొచ్చారు."

"అయితే యీకార్డు తీసికెళ్లి యివ్వు"

అందమైన వెండిపెట్టెలోంచి కార్డుతీసి నౌకరుకు యిచ్చాడు చటర్జీ. నౌకరు తొందరగ వెళ్లాడు లోపలికి. చటర్జీ కార్లో కిటికీదగ్గిరకి జరిగి ఆయింటిని బాగా పరికించిచూసాడు. దేశాన్నంతా తన రూపలావణ్యంచేత, నటనాకౌశల్యంచేత, గానమాధుర్యంచేత తన్మయత్వం నొందించి, తనుపాడిన పాటల్ని యువకలోకంచేత తారకమంత్రంగా జపింపజేసిన నళినీదేవి అంటే యెంతపెద్దయింట్లో ఆమెది, యెంతవైభవమో అనుకున్నాడు చటర్జీ. సులోచన, మాధురి మొదలైన వాళ్లమల్లె మహారాణిభోగం అనుభవిస్తోం దనుకున్నాడు. కాని యీచిన్నకాంపౌండు, యీచిన్న యిల్లు, ఆడంబులేని నౌకర్ని చూసి కొంతవిస్మయం కలగకమానింది కాదు. ఆగేటుకి యెడమపక్కన కొద్దిపాటివెడల్పుతో గోడకి అమర్చబడిన మెరిసే నల్లరాతి పలకమీద వెండితీగతో తెనుగులో పొదిమిన ఆమె పేరును చూట్టంతోటే ఆమెనిగురించి తనువిన్న విషయాలన్నీ జ్ఞాపకంవొచ్చాయి — ఆమెఉత్కృష్టమైన కళోపాసన, వ్యక్తిత్వజీవితం, అన్నిటికీమించిన ఆమె స్వదేశాభిమానమతం.

నౌకరు త్వరగా వొచ్చాడు. "లోపలికి వేంచేయండి" అని కారుతలుపు తెరిచి పక్కకు నుంచున్నాడు. చటర్జీ కారుదిగి లోపలికి నడిచాడు. లోపల గోడవానుకొని నానారంగుల్తో వికసించిన పూలమొక్కలు దుమ్ముపారని పచ్చని చిగురుటాకుల్తో నిగనిగలాడుతోన్నాయి. తీర్పుగా బండలుపరిచిన దారికి యిరుప్రక్కల తెల్లగా చేమంతిపూలు వికసించాయి వసారమెట్లదాక. నాలుగుకుర్చీలకు యెక్కువస్థలంలేని ఆచిన్నవసారాలో తలుపుకి రెండువేపుల రెండుపేము కుర్చీలు వున్నాయి. ముందుకి స్ఫటికపురాతిబల్లమీద బంగారంలా మెరిసే తొట్టిలో నిగనిగలాడే చెట్టు వుంది. అప్పుడు పాలిషుచేసినట్టు మెరిసే తలుపులోపలికి దారిచూపించి, "కూర్చోండి, అమ్మగారు స్నానం చేస్తోన్నారు, యిప్పుడే వొస్తారు" అని సన్నగా వేలాడే పరదాను పక్కకుతొలిగించి పట్టుకున్నాడు నౌకరు. చటర్జీని మొదట ఆకర్షించింది ఆగదిలోని అసాధారణ పరిశుభ్రత. ఆతెల్లనిగోడలు చాలామటుకు వుత్తవిగానే వున్నాయి. ఎడమవేపుతోటలోకి చూసే పెద్దకిటికీ వొహటుంది. పసుపురంగుపరదా ముడతలు ముడతలుగా వేళ్లాడుతోంది దానికి. పెద్ద యిత్తడి పంజరంలో జామపండుని తింటోన్న చిలుకొహటి — మెడచుట్టు యెర్రనిపట్టె వున్నది — వేళ్లాడుతోంది ఆకిటికీమధ్య. ఎదురుగోడకి మధ్యప్రదేశంలో తెల్లఫ్రేముకట్టిన దామెర్ల రామారావు 'నటరాజు' పెద్ద త్రివర్ణచిత్రం వుంది. కుడివేపుగోడకి భగీరథుడు వ్రాసిన 'అస్తమయం' వుంది. గోడలపొడువున గజంనరపాటి వెడల్పుతో యెత్తైన తెల్లని పరుపుంది కూచోటానికి. వెనక్కీ, పక్కలకీ వొరగటానికి మహమల్‌గవచన్నమెత్తలు. మధ్యప్రదేశంలో మంచితివాచీ. దానిమీద నక్షీచేసిన మట్కోణపు కర్రపీటమీద మూడడుగుల యెత్తుతో అనాచ్ఛాదితదేహంతో నృత్యంచేస్తోన్న రాధికవిగ్రహం పాలరాతిది వుంది.

తలవని దృశ్యం తటస్థపడ్డందున వొక్కనిమిషం నిర్విణ్ణుడై అట్లాగే గనమలో నుంచున్నాడు చటర్జీ. తరువాత హ్యాటుని తలుపుపక్కన నిర్దేశింపబడిన స్టూలుమీద పెట్టి, బూట్లు విప్పి ఆశిలావిగ్రహం దగ్గిరకెళ్లి అక్కడే తివాచీమీద కూచొని ఆవిగ్రహాన్ని అన్నివేపుల్నుంచీ విమర్శదృష్టితో పరీక్షిం ఆంనాచూసి ఢుక్కడుచా. నని!డైచతుతప.

లోపలివేపు తలుపులోంచి నళిని ప్రవేశించింది. అప్పుడే స్నానంచేసి శుభ్రమైన నుదుటికి కెంపులాంటి కుంకమ పెట్టుకుంది. కేసరవర్ణపు సన్నని చీర కట్టుకుంది. జుట్టుని వొదులుగా మెడమీదికి జారవిడిచింది. చటర్జీని చూసి నమస్కరిస్తో, "క్షమించండి, స్నానం చేస్తోన్నాను మీరొచ్చే వరకు" అంది.





"చటర్జీని చూసి నమస్కరిస్తో, "క్షమించండి, స్నానం



చటర్జీ లేచినుంచోని నమస్కారం చేసాడు. చెప్పులను గనములో వొదిలి ఆ తెల్లనిపరువులో పాదం దిగపడేట్టు వొక్కొక్క అడుగు వేస్తూ ఆపాతికేళ్ల పడుచు నడుస్తోంటే వొయ్యారం వొలికింది. కవిత్వంకన్న యెక్కువ మాధుర్యం పుట్టించింది. చటర్జీకియెదురుగా కూచోని వోహ మెత్తని దిండుని దగ్గిరకి లాక్కుంది.

"ఈవిగ్రహాన్ని చూస్తోన్నట్టున్నారు మీరు అప్పణ్ణుంచి. అయినా వీటికన్న వేయిమ్మళ్లు అందమైనవాటిని సృష్టించే మీకు యిదేంనుకు నచ్చుతుంది!"

"నేను చేసేవన్నీ ప్లాస్టరుతోనే. అయినా ప్లాస్టరుతోకూడా యింతజీవకళ కలిగించటమంటే యెంతో నైపుణ్యం కావాలి. నా పదిహేనోయేడునుంచి యీయిరవైయేళ్లు యీకళ కోసం కృషిచేసినా యీశిల్పిదగ్గిర యెంతో వుంది నేర్చుకోవాల్సింది. ఎవరా శిల్పి మహాశయుడు?"

"అతనిపేరెవరికి తెలుసు! రెండేళ్ల క్రింద శ్రీశైలం వెళ్లినప్పుడు వోహచెట్టు నీడలో మురికి గుడ్డ నోహదాన్ని పరిచి దానిమీద యిట్లాంటివిగ్రహాలు పెట్టుకొని అమ్ముకొంటున్న చెంచుకి రెండుసేర్ల బియ్యం పెట్టి కొన్నా దీన్ని."

"నిజమే? మాకలకత్తాలో దీనికి రెండువేలకు చావులేదు. హిందోళనం నృత్యంచేయటమే గగనం. అందులో అట్లాంటిపోజుని దృక్పథంలో నిల్పి యీరాతిలోకి దింపి యిట్లా జీవంపోయటం అంటే ఆశిల్పి వంద్యుడు."

"అయితే మీరు చేసే విగ్రహాలు సాధారణంగా యెక్కువ యెక్కడ అమ్ముడుపోతాయి?"

"చాలావరకు మాబెంగాలులోనే. గత సంవత్సరం బొంబాయిలో జరిగిన ప్రదర్శనంలో పదహారు విగ్రహాలు అమ్ముడుపోయాయి. సిమ్లాలో వైస్రాయియింట్లో రెండువిగ్రహాలు చేయటానికి ఆర్డరిచ్చారు. ఈయేడు బొంబాయిలో జరుగబోయే ప్రదర్శనంలో మొదటిబహుమతి

చేస్తోన్నాను మీరొచ్చేవరకు" అంది."

పోందేట్టు విగ్రహం తయారుచేయాలని రాత్రింబవళ్లు ఆలోచిస్తోన్నాను. అందుకనే మీ సహాయం అపేక్షించి కలకత్తానుంచి వొచ్చాను."

"సెలవీయండి, నాచేతేం కాగల్దో."

"మీరు నటించిన 'మోహినీ' అనే ఫిలిం బెంగాలునంతా ముగ్ధులనుచేసింది. దర్బారీకానడాను మీరు నృత్యంచేస్తో పోజులని యిచ్చారు చూడండీ, దాంట్లోని యీపోజు విగ్రహంతయారుచేసి ప్రదర్శనానికి పంపాలనుకున్నాను."

జేబులోంచి వొహ ఫిలింముక్కను తీసి ఆమె కందించాడు. ఆమె దాన్ని వెల్తురుకు పట్టిచూస్తోంది.

"కాని కేవలం ఫోటోను చూసి విగ్రహంచేయటం అంత చులకనికార్యం కాదు. కాబట్టి మీరు కొన్నిసార్లు ప్రతిమలా (Model) నుంచోటానికి వొప్పుకుంటే నాయదృష్టం. ఆఆశతోనే మాకలకత్తానుంచల్లా వొచ్చింది."

జేబులోంచి బంగారుసిగరెట్టుపెట్టె తీసి "తీసుకోండి" అంటో ఆమె కందించబోయాడు. కాని ఆమె చేతులుజోడించి, "అలవాటులేదు" అంది వినయంగా.

"క్షమించండి" అంటూ సిగరెట్టుతీసి వెలిగించాడు. సిగరెట్టు వెలిగించేఅప్పుడు నళిని ఆతన్ని నిదానించి చూసింది. వోపికతో దువ్విన ఆతల, గుత్తమైన కాలరు, టై, మడతచెదరని సిల్కుకోటు, జగజగ మెరిసే మంచిరాతి వుంగరం, ఎక్కువకిమ్మతుచేసే చేతిగడియారం యివన్నీ వొక్కచూపులో చూసింది. కళ్లని ద్వారంవేపు త్రిప్పుకుంది. అక్కడ ఆతని పేటెంటుతోలుబూట్లు అవుపడ్డాయి. ఇవన్నీ ఆమె గమనించిందని చటర్జీ కూడా కనిపెట్టాడు.

"మిమ్మల్ని చూడటంతోటే శిల్పి అనుకోటం కష్టం."

"అవును, సాధారణంగా యీకళోపాసకుల్ని పీడించే దారిద్ర్యం నా కంతగా లేదు కాబట్టి."

"కాని శ్రీమంతులు కళని ఉపాసించడం అంటే కూడా ఆశ్చర్యం కలుగుతుంది."

నవ్వాడు చటర్జీ. "సరేకానీండీ, ఎప్పణ్ణుంచి నుంచుంటారు మీరు నాకోసం? రెండుమూడ్రోజుల కొహ గంట నుంచుంటే చాలు. గంటకి మూడువందలు తక్కువప్రతిఫలం కాదనుకుంటాను."

"క్షమించండి. నాకు వీలుపడదు."

"ఎందుకని? అయితే అయిదువందలు తీసుకోండి."

"నాకు డబ్బుతో అంతఅవసరం లేదు. డబ్బే నాకు ప్రధానమైతే యేబొంబాయిలాంటి పట్టణానికో వెళ్లి యెక్కువడబ్బూ, యెక్కువపేరూ గడించేదాన్ని."

"మరి అభ్యంతర మెందుకు నాకు సహాయపడడానికి?"

"క్షమించి కారణా లడగకండి."

లేచి నుంచుంది. చటర్జీ కూడా లేచాడు విధిలేక.

"తొందరేంలేదు. ఇంకా నెలవరకూ యీవూళ్లో వుంటా. ఈకార్డు వుంచండి. మీరు అభిప్రాయం మార్చుకోటంతోటే నాకు తెలిపితే ధన్యుడిని. నమస్కారాలు."

కారు వెళ్లిపోయింది. నళిని కార్డుచూసింది. "స్పెన్సరుహోటలులో నా వీరుండటం!" అంది. దాన్ని రెండుగా చించి కిటికీలోంచి బైటపడేసింది.

## ౨

ఆకొత్తఫిలింలో ఆనాడు వుదయంనుంచి నటించడంవల్ల చాలా అలసిపోయింది నళిని. నాలుగింటికి స్టుడియోలోంచి బైటికి వొచ్చి సిద్ధంగావున్న కార్లో కూచుంది. అందాకా గేటుపక్కన నీడలో నుంచొని వున్న యిరవై యేళ్ల యువకు డొకాడు మెల్లగాచేతులు నలుపుకుంటో కారువేపువొచ్చాడు. ఎదో అనాలని ప్రయత్నించాడు. కాని మాట పెకల్లేదు. పెదిమలు

చప్పరిస్తో చేతుల్ని మరీగట్టిగా పిండుకుంటో నుంచున్నాడు. ఆజుట్టంతా చెదిరిపోయినా, గుడ్డలు అశ్రద్ధగా వున్నా, ముఖం రక్తవిహీనంగా వున్నా అతడు సామాన్యబిచ్చగాడు కాదని స్పష్టంగా తెలుస్తుంది. ఆముఖంలో యేదో గొప్ప, యేదో కాంతి, కళ తాండవమాడుతోన్నాయి. నళిని వొక్క నిమిషం నిదానించి అతని వేపు చూచి అతడు యేమీ మాట్లాడకపోవటంచేత, "ఎవరు నువ్వు ? ఏంకావాలి?" అని అడిగింది.

ప్రయత్నంతో తల పైకెత్తి నీళ్లు తిరిగే ఆకళ్లతో దీనంగా చూస్తో అన్నాడు, "వొహసెలరోజులు నాకు ప్రతిమలా వుండాలి మీరు. నేను శిల్పిని." పెదిమలు చప్పరిస్తో మరీదీనంగా అన్నాడు. "డబ్బు లేదు మీ కివ్వటానికి. కనకగిరిరాజాగారు "రంభ" విగ్రహంకోసం పెట్టిన యిరవైవేల బహుమతి నాకు దొరికితే మీరడిగినంత యిస్తా. కావాలంటే ఆ మొత్తమంతా మీకే."

"శిల్పివా నువ్వు ?"

"అవును ; ప్లాస్టర్తో విగ్రహాలుచేస్తా"

ఆమె అట్లాగే అతనిముఖంలోకి చూస్తో వూరుకుంది.

"అయితే వొప్పరా ?" కిందిపెదిమ మరీ వొణికింది. గ్రుడ్లల్లో నీళ్లు గిఱ్ఱున తిరిగాయి.

నళిని తలుపుతెరిచి, "లోపలికి రా" అని ఆవేపు జరిగి ఆతనికి కూచోటానికి స్థలంచేసింది.

"వొప్పుకుంటారా ?" అన్నాడాతడు నోరు తెరిచి అమితానందంతో.

"ఆలోచించాలి. ముందైతే నీస్టుడియో చూద్దాం. డ్రైవర్తో చెప్పు అదెక్కడో."

అతడు కార్లోకి యెక్కాడు. డ్రైవరుకి అవసరమైన మాటలు చెప్పాడు. కారు కదిలింది. ఆతను వెనక్కి జరిగి నళినివేపు చూసాడు. ఆమెసిల్కుచీర, పొట్టిచేతుల జేకెట్టు, యింకా వేంటు పూర్తిగాపోని చెంపలు చూసి తనకాలర్ని సరిచేసుకున్నాడు. కోటు లోపలికి యీడ్చుకోపోయిన షర్టుచేతుల్ని ముందుకి లాక్కున్నాడు. మళ్లీ ఆమెవేపు చూసాడు. ఈతని చర్యల్ని గమనిస్తోన్న నళిని ముసిముసిగా నవ్వుతోంది.

"నీపేరేమిటి ?"

"కిశోరుడు."

"బెంగాలి అనుకరణం ?"

"మానాన్న ముద్దుగా పెట్టాడట యీపేరు."



"ఎవరు నువ్వు ? ఏం కావాలి ?" అని అడిగింది.

కారు మూలమూలలు తిరిగి చిన్నచిన్న సందు ల్లోంచి వెళ్లుతోంది. వోహ చిన్న రెండంతస్తుల పాత పెంకుటింటిముందు ఆగింది. చీకటిగదిలోంచి పొగ మూరిన గోడల్ని పునుక్కుంటో పాత మెట్లని యెక్కి రెండో అంతస్తుపైకి వెళ్లారు. అక్కడ వోహగనితాళం తీసి కిశోరు ముందు లోపలికెళ్లి కిటికీలు తెరిచి నళినిని రమ్మన్నాడు. మంచంలో పక్కమీద పడివున్న పుస్తకాలు, పెన్సిళ్లు తీసి గుడ్డతో దుమ్ముదులిపి నళినికి కూచోటానికి స్థలంచేసాడు. నళిని అక్కడ కూచొని వొక్కసారి గదినంతా పరికించి చూసింది. గదంతా చెత్తకుప్పలాగుంది. పెన్సిల్‌తో బొమ్మలుదించిన కెన్వాసుచుట్టలు మూలమూలలకి పడివున్నాయి. రుద్ర దేవునివి, కృష్ణరాయలువి, తిక్కనవి, వరూధినివి మొదలైన విగ్రహాలు పూర్తిఅయినవి కొన్ని, కానివి కొన్ని గదంతా వున్నాయి.

"ఈగదిలోనేనా నువ్వు వుండటం ?"

"అవును. క్షమించండి. రేపు మీరు వొచ్చేవరకు శుభ్రపరిచి వుంచుతాను." బొమ్మలు చిత్రించే బోర్డుకి పిన్నుల్తో కాగితం చెక్కతో పనిలో మున్నైపోయాడు కిశోరు. నళిని లేచి మెల్లిగా ఆబొమ్మల్ని చూస్తో పచారుమొదలు పెట్టింది. కిటికీ దగ్గిర గుడ్డకప్పబడివున్న విగ్రహందగ్గిరకెళ్లి ఆగుడ్డ తీసింది. అది "అహల్య" నడుంపైన చెయ్యి ఆనించుకొనివున్నచోట సాలెపురుగు గూడుకట్టింది. తనకు తెలీకుండానే నళిని ఆగుడ్డతో ఆవిగ్రహాన్ని శుభ్రంగా తుడిచింది. దానిపక్కనే వీరవనిత "రుద్రమదేవి" వుంది. దాన్నికూడా తుడిచింది. అట్లాగే వరసగా ఆవేపువున్న విగ్రహాలన్నిటినీ తుడిచి శుభ్రపరిచి చక్కగా అమర్చింది. పక్కనవున్న పెట్టెమీద పడేసిన పుస్తకాలనికూడా గుమ్మదులిపి వొకచో పెట్టింది.

"ఇహ వొచ్చి నుంచుంటారా ?"

కిశోరు పెన్సిల్, రబ్బరు చేతులో పట్టుకొని బోర్డుదగ్గిర సిద్ధంగా నుంచున్నాడు. ఆతనిమాటలు విని పులికిపడ్డది నళిని. అప్పుడే మెలుకవవొచ్చినట్టయింది. చేతులోని మురికిగుడ్డని చూసి సిగ్గుతో కిందపడేసి వెళ్లి మంచంలోకూచుంది.

"ఈవాళ చాలా అలిసాను. రేపణ్ణుంచి నుంచుంటా"

"సరే అట్లాగే కానీయండి. మరి గట్టిగా వొస్తారుకదూ రేపు ?"

"రాజాగారు "రంభ" కోసం పెట్టిన బహుమతి నీకే వొస్తుందని యేంనమ్మకం, భారతదేశంలోని శిల్పులంతా దానికోసం ప్రయత్నిస్తోంటే ?"

"వొస్తుంది. తప్పకుండా నాకే వొస్తుంది. వొక్కనెలరోజులు మీరు నాకోసం శ్రమపడితే చాలు. వోడానా అదే నాఆఖరిపరాజయం. దాంతో నాఆశలు, వూహాసౌధాలు అన్నీ చెల్లు."

ఉద్రేకమైన ఆముఖాన్ని నిదానించిచూసింది.

"వుండండి టీ కాచిపెడ్తా, వొక్కనిమిషంలో."

పెద్దపెట్టెవెనకాల పడివున్న స్టవును తీసి వెలిగించ ప్రయత్నిస్తోన్నాడు. అట్లాశ్రద్ధతో నిమగ్నుడైన ఆకిశోరుని చూస్తో నళిని ముసిముసిగ నవ్వుతోంది. స్టవు వెలుగదు. చెవుదగ్గిర వూపి చూసాడు. నూనె లేదు దాంట్లో. నళిని ఫక్కున నవ్వింది. కిశోరు సిగ్గుతో ఆమెవేపు చూసాడు.

"మీలాంటి కళోపాసకులు వాయుభక్షణమీద బతగ్గలరు, కోకిల మామిడిచిగుళ్లమీద బతికినట్టు. పద యేమైనా తిందాం."

కిశోరు ఆమెవెంటనే వెళ్లాడు. ఆతడు మరిచిపోతే గదికి తాళం ఆమే వేసింది.

## 3

మర్నాడు సరిగ్గా రెండింటికి వొచ్చింది. పొద్దుణ్ణుంచి గదంతా శుభ్రపరిచాడు కిశోరు. కొత్తబ్లేడుతో క్షవురం చేసుకున్నాడు. స్నానంచేసి దుస్తులు మార్చాడు. దగ్గిర మిగిలిపోయిన నాలుగురూపాయిలు పెట్టి మంచిపరికరాలు, కాగితాలూ అవీ కొన్నాడు.

నళిని రావటంతోటే బోర్డుదగ్గిరకి పరుగెత్తి, "వెళ్లండి ఆపరదా వెనక్కి వెళ్లి గుడ్డలు విప్పేయండి."

నళిని అదిరింది అతనివేపు చూసింది. మిక్కిలి వుల్లాసంతో పరికరాలుఅమర్చుకుం టోన్నాడు.

బోర్డుకి దగ్గిరగా వోహ చౌకపీట వేసి దానిమీద తువాలుపరి చాడు. ఆమెవేపు చూ సాడు.

"వెళ్లండి. ఆలస్య మెం దుకు?"

అతనికళ్ల ల్లోకి చూసిం

"ఆమెకి చప్పన గుడ్డని దేహంమీదకి లాక్కుంది."

నళిని. అమాయకత్వం తప్ప వేరేమీ అవుపడ్లేదు. అతను వేరే ప్రపంచంలో వున్నట్టు సూచిస్తోన్నాయి అవి. మెల్లిగా ఆ తెరవేపు వెళ్లింది. వో హుకుర్చీ వుంది లోపల. దానిమీద కూచొని వొక్కొటొక్కటిగా వొస్తువులన్నీ విప్పి పక్కస్టూలుమీద పెట్టింది. చెప్పులని కూడా వొదిలింది. అక్కడపడివున్న నల్లని గుడ్డని ఆ తెల్లని దేహంమీద కప్పుకుంది. మెడదగ్గిర, నడుం దగ్గిర ఆ గుడ్డని గట్టిగా ముదిరిపట్టుకుంది. మెల్లిగా బోర్డుదగ్గిరకి వెళ్లినుంచుంది.

"ఆస్టూలుమీద నుంచోండి...ఆఁ.నావేపు తిరగండి. ముఖం కాస్త కిటికీవేపు తిప్పాలి. ఆఁ... అట్లాగే. ఇహ ఆగుడ్డని వొదిలేయండి."

నళిని ఆగుడ్డని మరీదగ్గిరగా లాక్కొని అతని ముఖంలోకి చూసింది. ఆమెసంకోచమే అతనికి స్ఫురించనట్టుంది.

"ఊఁ...తీసివేయండి."

ధైర్యంతో తల పైకెగేసి కళ్లుమూసుకొని గుడ్డని కిందికి జారవిడిచింది.

"ఓ! అందం. అట్లాగే వుంచండి తలని."

పదినిమిషాల్లో చిత్రం పూర్తిచేసి ప్లాస్టరు ముద్దని విగ్రహంచేయటం ఆరంభించాడు. నళిని కొంచెంగా కళ్లుతెరిచి చూస్తోంది. ఆమెదేహాన్ని చూస్తో ఆమట్టివిగ్రహానికి ఆకృతి కలిగిస్తోన్నాడు. ఆతనిచేతులు ఆవిగ్రహపు భుజాల్ని తాకినప్పుడల్లా తన భుజాల్ని అతను తాకినట్లే అనిపించింది నళినికి. ఆమె దేహాన్ని చూస్తో ఆబొమ్మకి అంగసౌష్ఠవం, ముడుతలు, వొంపులు ఆతను కల్పిస్తోంటే వొళ్లు పులకరించిందామెకి. తనదేహాన్ని అట్లా చూస్తో యేమాత్రం వుద్రేకంలేక శాంతంతో శిల్పిస్తోన్న ఆకిశోరు మనిషేనా అనిపించిందామెకి. చేతులకి సుందరతనం చేస్తో తొడల్ని స్పృశించాడు. వాటికి ఔన్నత్యం తేవాలని రెండుచేతుల్తో ప్రయత్నిస్తోన్నాడు నళినితొడలవేపు చూస్తో. ఆమె చప్పున గుడ్డని దేహంమీదికి లాక్కుంది. చీలమండలు సైతం అవుపడకుండా కప్పుకుంది. బిగువుగా పట్టుకుంది.

కిశోరు ఆశ్చర్యపడ్డాడు.

"ఏం, అప్పుడే?"

"అబ్బ, చేతకాదు. అలసిపోయాను."

చప్పున తెరచాటుకి పరుగెత్తింది. వొక్క నిమిషం అట్లాగే వుండిపోయిండు కుర్చీలో. వెళ్లిపోతోన్నప్పుడు ద్వారందగ్గిర కిశోరు

"రేపు యిదేసమయానికి వొస్తారు కదూ?"

"ఆ."

మర్నాటినుంచి అతన్ను అయింది అన్నదాకా కళ్లని గట్టిగా మూసుకొని నుంచునేది.

ఇరవైరోజులు గడిచాయి. స్థూలదృష్టితో చూసేవాళ్లకి ఆ అందమైన విగ్రహం సమగ్రమైనట్లే అవుపడుతుంది. కాని యింకా దాంట్లోకి ప్రాణం రాలేదు. ప్రాణంపోయటంలోనే వుంది కళంతా అంటాడు కిశోరు. ఈయిరవైరోజుల్లో వొకరి చరిత్ర వొకరికి వొకింత తెలిసింది. కిశోరుతండ్రి శ్రీమంతుడు. కాని కిశోరు చిన్నప్పటినుంచి యీకళలో అభిరుచికలవాడవటంచేత చదువులో శ్రద్ధవహించనందున తండ్రీ కొడుకులకు సరిపడకుండా అయింది. మరీభరించటానికి వీలులేకుండ అయినాక కిశోరు యింట్లోనుంచి వెళ్లిపోయినాడు. అప్పణ్ణుంచి వొకపూట తిండితో వొకపూట మడుతో శిల్పకళకు తనజీవితాన్ని ధారవోస్తోన్నాడు. నళినికి చిన్నతనంలోనే భర్తపోయాడు. అత్తవారిఆస్తి యేమాత్రం అబ్బలేదు. ఆధారంగావున్న తల్లికూడా పోయింది. అప్పణ్ణుంచి ఫిలింకంపెనీలో చేరింది. తన సర్వశక్తుల్ని ఆకళకి ధారవోసి ఆంధ్రదేశానికి వొక అలంకారం యివ్వాలని నిశ్చయించుకుంది. అందుకనే తక్కువవేతనానికైనా ఆంధ్రదేశంలోనే వుంది.

ఆనాళ మధ్యాహ్నం సరిగ్గా రెండుగంటలకి కిశోరుయింటికి వెళ్లింది నళిని. ద్వారందగ్గిరే అల్లరిగా

వుంది కాస్త. నుంచున్నవాళ్లని త్రోసుకొని లోపలి కెళ్లింది. క్షీణించి రక్తవిహీనమైన ముఖంతో కిశోరు వొహనూల కూచున్నాడు. నళినిని చూసి సిగ్గుతో తల వంచుకున్నాడు. చేతులో కాగితాలకట్ట పట్టుకున్న లావాటి ప్రభుత్వోద్యోగి వొహను సిగారుపేలుస్తో కాలుమీద కాలు వేసుకొని పాతయీజీచేర్లో కూచున్నాడు. ఇదంతేమీ బోధపడింది కాదు నళినికి. మెల్లిగా కిశోరుదగ్గిర కెళ్లి ఆతనిభుజాన్ని తట్టుతో, "ఏమిటివిషయం కిశోరు?" అని అడిగింది. కిశోరు రెండుచేతుల్లో ముఖం దాచుకున్నాడు. ఆ పెద్దమనిషి చెప్పాడు "ఈతను యీమార్వాడీవద్ద రెండువందలు తీసుకున్నాడు. అది వడ్డీతో అయిదువందలయింది. కోర్టువాళ్లు బాడీ వారెంటు యిచ్చారు." డిక్రీ కాయితం అందించాడు. అది చదువుకొని మళ్లీ కిశోరువేపు చూచింది నళిని. అట్లాగే నుంచున్నాడు.

"నేనిస్తాను, నావెంట రండి."

మార్వాడీ, జేలిఫ్ సంతోషంగా లేచారు. కిశోరు ముఖం పైకెత్తి నిర్ఘాంతపోయి చూస్తోన్నాడు. ఉన్నారనికూడా యెరుగడు.

నళినిదగ్గిర అయిదువందలు కాదుగాని అయిదు రూపాయాలుకూడా ఆముహూర్తాన లేవు. ఏంచేస్తుంది! ఎవరిదగ్గిర కెడ్తే యెవరిస్తారు? విక్రయిద్దామన్నా అంత విలువైనవొస్తువు యేదీలేదు. అనేకవిధాలుగా ఆలోచించింది. ఏదో నిశ్చయించుకుంది.

వాళ్లందర్నీ తనయింట్లో దింపి యిప్పుడే వొస్తానుండమని స్పెన్సరుహోటలుకి వెళ్లింది. చటర్జీ దగ్గరకి తనకార్డు పంపింది. తక్షణమే జపానుపట్టుగౌను తొడుక్కొని సిగరెట్టు కాలుస్తో చటర్జీ బైటికి వొచ్చాడు. అతివినయంగా స్వాగతంచేసి గదిలోకి తీసి కెళ్లి మెత్తని దిండ్ల సోఫాలో కూచోపెట్టాడు.

"నాకు తెలుసు తప్పకుండా మీరు మీఅభిప్రాయం మార్చుకొని నాకు సహాయపడతారని."

"కాని వొక్కషరతుపైన నేను మీవిగ్రహానికి ప్రతిమగా వుండటానికి వొప్పుకుంటాను."

"ఏమిటది?"

"మాకనకగిరిరాజాగారు "రంభ" కోసం పెట్టిన బహుమతికి మీరు పోటీచేయొద్దు."

"సంతోషంగా వొప్పుకుంటాను." చప్పున లేచి డ్రాయరు తెరచి పది వందరూపాయిల నోట్లు యెంచి నళిని కిచ్చాడు.

"నాకు యెక్కువ అవసరంలేదు. ఈపదిరోజులు రోజొక అర్ధగంట నుంచుంటే చాలు"

"సాయంత్రం అయిదింటికి వొస్తాను."

"చిత్తం."

నళినికి తెలుసు కిశోరు నిన్నటినుంచి ఉపవాసమే వుండివుంటాడని. అందుకనే జేలిఫ్ వాళ్లని పంపేసి త్వరగా రుచ్యమైన వంటని అతిశ్రద్ధతో స్వయంగా వండి కేరియర్లో పెట్టుకొని కిశోరుయింటికి వొచ్చింది. గదితలుపు తెరిచివుంది. లోపలి కెళ్లింది. ఎప్పుడూ కిశోరు కూచునే కుర్చీవేపు చూసింది. అక్కడలేడు. కిటికీదగ్గిర పెట్టెపక్కన పడివున్నాడు. ఆపెట్టెమూల మీద పడటంచేత నొసటినుంచి నెత్తురు కారుతోంది. కిటికీలోవున్న కూజాను తీసుకొని చప్పున ఆతనిపక్కకి పరుగెత్తింది. పక్కన కూచొని తలయెత్తి రక్తం అంటుతుందని లెక్కపెట్టక వక్షానికి అదుముకుంది. నోట్లో వుంచుకొని పైటని గ్లాసులో అద్ది నుదుటిరక్తం తుడిచింది. ముఖాన్నంతా చల్లనినీటితో అద్దింది. వొక్క నిమిషంతరువాత మెల్లిగా కళ్లుతెరిచాడు కిశోరు. కళ్లు పైకెత్తి నళినిముఖంవేపు చూసాడు. ఆమె ఆతనిచేతిని గట్టిగా అదుముతో, "మంచినీళ్లు యివ్వనా కిశోరు త్రాగటానికి? "గ్లాసుతో నీళ్లు త్రాగించి మెల్లిగా లేపి కుర్చీలో కూచోపెట్టింది వొక్కనిమిషం నేలవేపు చూసి చప్పున చేతుల్లో తలపెట్టుకొని యేడ్వటం మొదలెట్టాడు. నళిని కుర్చీచేతిమీద కూచొని ఆతని భుజం మీద చెయ్యివేసింది. "ఎందుకు యేడ్వటం కిశోరు? ఈమాత్రం వొహరికొహరు సహాయం చేసుకోకపోతే యెట్లా?"

"అది కాదు. అదికాదు. ఎందుకోసరే యీ మొండిప్రాణాన్ని యిన్నాళ్లు నిలిపానో, యెందుకోసం యీపాట్లన్నీ పడుతోన్నానో అదంతా అయిపోయింది. అయిపోయింది."

"ఏమిటికిశోరు ? నాకేమీ అర్థమవడంలేదు."

లేచి చక్కగా కూచొని, వొక్కవిషయం మీతో చెప్పకుండా దాచాను. క్షమించాలి. సరసం మా మేనమామకూతురు. దాన్ని వొదలి ప్రపంచమంతా అంధకారం నాకు. అంతా చీకటి. ఈవిషయం అందరికీ తెలుసు. కాని నేను వాళ్ల అభిప్రాయంప్రకారం బుద్ధికలిగివుండక యీకళను ఉపాసించినందుకు ఆమె వాళ్లకి నేనంటే గిట్టదు. ఈకళలోనే ద్రవ్యవంతుడనై, పేరుప్రతిష్ఠల్తో ప్రపంచాన్నంతా గింగురుమనిపించి వాళ్లచేతనే నాసరసాన్ని యిప్పించుకోవాలని యిట్లా తిండితిప్పలు మాని పాటుపడ్తోన్నా. అదంతా కథ అయిపోయింది. నాస్నేహితుడు వుత్తరం వ్రాసాడు. ఆమెను, నాసరసాన్ని వొహబేరిస్టరుకిచ్చి పెళ్లిచేసారు. ఇహ నాకేంవుంది యీప్రపంచంలో ? ఎందుకు బతకాలి ?"

"కిశోరు, యేడవకు కిశోరు ! నీదేశంకోసమైనా ధైర్యం తెచ్చుకో. నీమీద దేశం యెంతో ఆశపెట్టుకుంది. మనదేశాన్ని తక్కినవాటిముందు తలెత్తుకొని గర్వపడేట్టు చేయటం నీచేతుల్లో వుంది. అట్లాంటి బాధ్యతని మీదవుంచుకొని సామాన్యమైన వొకస్త్రీ చేతినుంచి జారిపోతే యిట్లా చేయకూడదు."

"దేశం, దేశం ! దాంతో నాకేంపని ? నేనీకళనభ్యసించింది దేశాన్ని పైకెత్తాలని కాదు. నాప్రేమకోసం, నాప్రేయసిని జయించటంకోసం."

నళిని వూగిపోయింది. ఈతనిలో, యీబొమ్మలుచేసే కుమ్మరిఅబ్బాయిలో యింతప్రేమ యిమిడి వుంటుందనుకోలేదు. చప్పున ఆతనితలని దగ్గిరగా లాక్కొని దానిపైన తనచెంప నానించి కళ్లు మూసుకుంది.

"కిశోరు, ఆడదానికి కూడా హృదయం వుంటుంది. ఆడదికూడా ప్రేమించగల్దు."

కళ్లు తెరిచి ఆతనివేపు చూస్తూ, "నాహృదయాన్ని పగలకొట్టవుకదూ కిశోరు?"

ముహూర్తకాలం జవాబుకోసం నిరీక్షించింది. ఆతలని అట్లాగే వెనక్కియెత్తింది. మెడచుట్టూ చేతులు వేసి ఆపెదిమలకేసి చూసింది. కిశోరు ఆమెని తనమీదికి లాక్కున్నాడు.

## ౪

ఆయెనిమిదిరోజులు యెనిమిదినిమిషాలులా గడిచిపోయినాయి ఆజతకి. ఏమీ అభిరుచిలేని యీప్రపంచం వొక్కసారి మారిపోయింది నళినికి. ఆమెకే తెలీని వొహ నూతనానందం, నూతనశక్తి పొంగిపోతోంది. పొద్దస్తమానం కూనరాగాలుతీస్తూ పరుగులిడ్తోంది. ప్రతి వొస్తువులో యేదోఅందాన్ని చూసి ముద్దుపెట్టుకుంటుంది మాటిమాటికి. ఎదకి గట్టిగా అదుముకొని రెప్పలువాల్చుకుంటుంది. అద్భుతమైన ఆమె నటనని చూసి సినిమా డైరెక్టరు ఆశ్చర్యపడ్డాడు. వొచ్చేనెల నుంచి వేతనం హెచ్చిస్తా నన్నాడు. కిశోరుకూడా యేదో కొత్త సంతోషంతో కళకళలాడుతోన్నాడు. అతని "రంభ" అప్పుడే స్వర్గంనుంచి అవతరించినట్టు నుంచుంది. ప్రతిఅంగం నవనవలాడుతో వుద్రేకాన్ని కలిగిస్తోంది. అయినా యింకా కిశోరు దాన్ని దిద్ది తీరుస్తోనే వున్నాడు.

ఇహ మూడురోజులుంది రాజాగారి దివాణంలో పోటీవిగ్రహాలని దాఖల్ చేయటానికి. ఇహ "రంభ"ని ముట్టుకోనని నళినితెచ్చియిచ్చిన పట్టుగుడ్డని దాని మీద కప్పాడు కిశోరు.

కిశోరుకి విస్మయంకలిగించా లనుకుంది నళిని. ఆవాళ పున్నమ. పండువెన్నల రాత్రంతా. కిశోరుకి యేమాత్రం తెలీనీకుండా ఆతన్ని పట్టుకెళ్లి అక్కడికి యెనిమిదికోసుల దూరంలో సముద్రపువొడ్డున వున్న కొబ్బరితోటలో యిన్నాళ్లనుంచి యెదిరిచూసిన ఆరాత్రిని స్వర్గంలా అనుభవించా లనుకుంది. ఆమర్నాడు కూడా అక్కడే గంధర్వుల్లాగ వుండిపోవాలని నిశ్చయించుకుంది. అందుకని అవసరమైన వొస్తువులన్నీ

సమకూర్చుకుంది. ఎన్నో కొత్తవొస్తువులని కొన్నది. అవన్నీ కార్లోపెట్టుకొని సరిగ్గా సాయంత్రం ఆరింటికి కిశోరుయింటికి వొచ్చింది. ఆమసకచీకట్లో మెట్లెక్కి పైకివెళ్ళింది. ఆగదితలుపు దగ్గిరవేసివుంది. కిశోరు మాటలు వినపడ్తోన్నాయి. అట్లాగే తలుపుదగ్గిర ఆగింది. ఆడమనిషిగద్గదస్వరం వినపడ్డది. వొళ్లు జల్లుమంది. గుండె కొట్టుకుంది. ఆతురతతో ఆమాటల్ని పాటించివిన్నది.

"వెళ్లు, వెళ్లు సరసం. వెళ్లి ఆతన్తోనే వుండు. ద్రవ్యవంతుడు. సుఖపెడ్తాడు."

"నోరెట్లా ఆడుతోంది,కిశోరు,అట్లా అనటానికి! నీయీచేతుల్లో నన్ను గట్టిగా యిముడ్చుకొని నేను నీకు దక్కకపోతే వొక్కనిమిషంకూడా బతకనని ఆ రాత్రంతా జపిస్తినే, ఇప్పుడు వచ్చినభేదమేమిటి ?"

"అదికాదు సరసం. నేను ఛాందసుణ్ణి అనుకోకు. నీతో దాచట మెందుకు. నాజీవితంలోకి వుంకొకామె వొచ్చిం దిప్పుడు."

"అవును. తెలుసు. ఆమెవిషయం యీవాళ్లే తెలిసింది. కాని, కాని కిశోరు, వొక్కమాట చెప్పెయ్యి. మాట్లాడకుండా వెళ్లిపోతా. ఆమెకి నీహృదయం యిచ్చావా? నిజంగా హృదయపూర్వకంగా ప్రేమిస్తోన్నావా?"

నళిని వూపిరిబిగపట్టి తలుపుకి చెవి ఆనించి కిశోరుజవాబుకోసం నిరీక్షిస్తోంది, హంతకుడు న్యాయాధికారి తీర్పుకోసం నిరీక్షిస్తోన్నట్టు.

"లేదు, లేదు సరసం. నాది వొక్కటే హృదయం. అది వొక్కసారే, వొక్కరికే యిచ్చాను. అది నీకు."

నళిని నోట్లో పైటకుక్కుకొని పరుగెత్తింది. మెట్లమీదనుంచి క్రిందకి ద్రొళ్లింది. ఆదెబ్బనికూడా లెక్కచేయక లేచి పరుగెత్తింది. కార్లో పడ్డది. ఊపిరి సెరపటంతోటే పళ్లుబిగపట్టి కారుని స్పెన్సరుహోటలు వేపు నడిపింది

ముందు కార్డు పంపకుండానే చటర్జీగదిలోకి పరుగెత్తింది నళిని. చటర్జీ టేబిల్ దగ్గిర కూచొని అందమైన ఆకుపచ్చని దీపపువెలుగులో యేదో వ్రాసుకుంటోన్నాడు. నళినిని చూసి ఆశ్చర్యంగా లేచి నిలిచాడు. ఆమె ఆతని ఆహ్వానానికికూడా నిరీక్షించకుండానే సోఫాలో కూచున్నది. ఆతను మెరిసిపోయే ఆమెకళ్లు, ముఖం దీపపువెలుగులో చూసి బెదిరాడు కూడ.

"ఏమిటి తలవనితలంపుగా వొచ్చారు?"

"రాజాగారి 'రంభ'కు పోటీగడువుయింకా మూడురోజులుంది. మీతో దానికి పోటీచేయొద్దని వాగ్దానం తీసుకున్నాను."

"దానికి విరుద్ధంచేయటం లేదే నేను?"

"దానికి మీరు పోటీచేయాలి. ఆ 'రంభ'ని యిప్పుడే మొదలుపెట్టండి."

"నన్ను పోటీచేయొద్దన్నారుగా ? దానికి పోటీ చేయాలన్న అభిలాషకూడా నాకు లేదు."

"కాదు, మీరు తప్పకుండా దానికి పోటీ చేయాలి."

"వ్యవధికూడా లేదే"

"రాత్రింబవళ్లు నేను నంచుంటాను. ఈనాలుగు రోజులు కష్టపడండి. నా కొహామిత్రుడీ కూడా యీవకండి."

చటర్జీ ఆమెకళ్లల్లోకి నిదానించిచూసాడు. వాటి గుండా ఆమెహృదయాన్ని కనుగొనప్రయత్నించాడు. ఆతను అనుమానిస్తోన్నాడని నళిని కనిపెట్టింది.

"నేనిట్లా మారటానికి కారణం యిది. కిశోరు మీకు తెలుసనుకుంటా. విఖ్యాతాంధ్రశిల్పి. ఎట్లాగైనా ఆతని 'రంభ' వోడిపోవాలి."

"నిజంగా నాకు బహుమతి రావాలనివుందా?"

"అవును. ముమ్మాటికి."

తనవెంట రమ్మని చేత్తో సౌజ్ఞచేసాడు. ఆమె లేచివెళ్లింది. కుడివేపుమూలకి అడ్డంగా కట్టివున్న పర

దాని తొలగించాడు. కప్పివున్న తెల్లగుడ్డని తీసాడు. పక్కకి జరిగాడు. నళిని కళ్లు పెద్దగా విప్పి ముందుకి జరిగింది. అచ్చం తనే నుంచున్నట్టు ఆ "రంభ" కిశోరు విగ్రహంకన్న యెంతో ఆకర్షణీయంగా వుంది. మాట్లాట్టానికి పెదిమలు విప్పుతోన్నట్టుంది. చటర్జీవేపు చూసింది నళిని. వెలిగించని సిగరెట్టు నోట్లో పెట్టుకొని తల వెనక్కివేసి నవ్వుతో "అప్పుడే మీతో నిజం చెప్పుతే నొప్పుకునేవారు కారు."

మళ్లీ "రంభ" వేపు చూసింది నళిని. పక్కనే వున్న సుత్తెను చప్పున అందుకొని పిచ్చిదానిలాగ ఆ రంభ"మీద పడ్డది. ముక్కలుముక్కలుగా కొట్టింది. ఆముక్కలన్నీ చూశైనాక సుత్తెను కిందపడేసి, నడుం మీద చేతులు ఆనించి పళ్లుబిగపట్టినుంచున్న చటర్జీదగ్గిరికెళ్లి నిర్లక్ష్యంగా వెక్కిరింపునవ్వునవ్వి, "ఇహ పోలీసుని పిలవండి."

పక్క టేబిల్ మీదనుంచి ఫోను అందుకున్నాడు చటర్జీ.

ఆరునెల్లతరువాత మళ్లీ ఆచిన్నయింటిగేటు తెరిచారు. ఆనల్లరాతిపలకని శుభ్రంగా తుడిచారు. వాడిపోయినచెట్లు నిగనిగలాడినాయి. కిటికీలోని చిలక యిత్తడిపంజరంలో జామపండు తింటోంది.

---




లండను రాయల్ విమానప్రదర్శనమునందు పడిపోయిన విమానము

---

# కావ్యాత్మ: పరిచయవాక్యములు

ఆత్మానందము సకలపదార్థములకును పరమార్థము. ఆనందమునకు జ్ఞాన మాధారము. జ్ఞానమునకు సత్యము శక్తి. సత్యమునకాత్మ కీలకము. సచ్చిదానందాత్మకమైన పరమార్థానందానుభవమునకు విశ్వహృదయ సౌందర్య విలాసములు నిత్యసాధనములు. పిపీలికాది బ్రహ్మపర్యంతమును గల జీవజాలములు విశ్వవ్యాప్తములైన కళాసాహిత్యముల యాధారమునను నాత్మరసానందము ననుభవించుచున్నవి. సాహిత్యకళోపాసకు లాత్మ సంకల్ప సంస్కారానుభవరూపముగ ననంతము లైనకావ్యకళలను సంకల్పించి, ధ్యానించి, సందర్శించి, నిర్మించి, ఆత్మరసానందానుభవమున కధికారు లగుచున్నారు.

ప్రకృతి పురుషలీలావిలాస సంభవమైన విశ్వరసానందానుభవమునకు కావ్యములుత్తమసాధనములు. కావ్యములు కవుల సంకల్పసంస్కారానురూపములు. మహాకవులు రసోపాసకులు; రససిద్ధులు; రసానుభవజ్ఞులు. కావ్యార్ణవసంభవము లైన యనంతకావ్యములు కవుల సంకల్ప జ్ఞాన క్రియాశక్తులకనురూపములగను ఆత్మరసానందానుభవమునకు సాధనము లగుచున్నవి. అనంతమైన కావ్యపరిణామపరిజ్ఞానమునకు కావ్య తత్త్వ మీమాంసయును, కావ్యాత్మ నిర్ణయమును సాధనములు. చిరకాలరసానుభవ సంవర్ధితములైన కావ్యసంప్రదాయసంకేతములును, భావాలంకార విశేషములును, రసవిభేదములును కావ్యాత్మపరిజ్ఞానమును దుర్ఘటము చేయుచున్నవి. అవ్యక్తమైన బ్రహ్మానందమును కావ్యములు భావభాషాలంకారరసానందానుభవపర మైన ఆత్మానందానుభవ ప్రమాణమునను సువ్యక్తముచేయుచున్నవి. కావ్యాత్మస్వరూప స్వభావములను నిర్ణయించుటకును, గ్రహించుటకును బెజవాడ వాస్తవ్యులు శ్రీ శేట్లూరి వేంకటరాఘవయ్యంగారు రచియించిన 'కావ్యాత్మ' వినియోగపడుచున్నది.

అతిప్రాచీనమైన సంస్కృత సాహిత్యమునందు కావ్యాలంకారశాస్త్రములు వికాసమును పొందిన విధము నపారమైన శాస్త్రగ్రంథములు విశదముచేయుచున్నవి. ప్రాచీనమైన దేశమునకు వలెను సాహిత్యకళాశాస్త్రములకును భరతనామము సార్థకముగ నున్నది. భరతముని ప్రారంభించిన కావ్యమీమాంస క్రమపరిణామమును పొంది కావ్యాత్మ జిజ్ఞాస కవకాశమును గలుగజేయుచున్నది. అనంతమైన కావ్యాలంకారశాస్త్ర పఠనాభ్యాసము సామాన్యులకు దుర్ఘటము. భావభాషాలంకారరసయోగానందాత్మకమైన కావ్యాత్మ విశ్వసాహిత్యమునందు సర్వత్ర

మహాకవులకు, కళాభిజ్ఞులకు, పండితులకు ప్రత్యక్షమగుచున్నది. పరమాణువు మహామేరువులందును, పిపీలికపరబ్రహ్మలందును కవులు రసానందానుభవమును కల్పించి, సందర్శించి, ప్రత్యక్షము చేయుటకు సమర్థులు. కావ్యాచార్యులు కావ్యములను పరిశీలించి వ్రాసిన శాస్త్రగ్రంథముల సారాంశమును 'కావ్యాత్మ' సుబోధకముగను విశదము చేయుచున్నది.

భరతుడు, భామహుడు, మమ్మటుడు, విశ్వనాథుడు, దండి, హేమచంద్రుడు, దీక్షితుడు, వామనుడు, జగన్నాథుడు మొదలగు కావ్యాలంకారశాస్త్రజ్ఞులు వ్రాసిన కావ్యమీమాంస లీగ్రంథమునందు వివిధాధ్యాయములందు సుబోధములుగ వివరింపబడినవి. కావ్యము లనంతము లైన శబ్దార్థాలంకారశోభితములు, గుణరీతిబద్ధములు, ధ్వని సాధనములు, రసాత్మకములు. కావ్యపరిణామమునందు కావ్యాత్మ రసపరిణామమును పొందిన విధమును గ్రంథము పరిస్ఫుటము చేయుచున్నది. గ్రంథమునందలి యీ క్రిందివాక్యములు కావ్యాత్మ సంకల్పమునకు మనోహర నిదర్శనములు.

కావ్యసౌందర్యము కేవలబాహ్యము, అస్థిరము నైనదానిపై గాక ఆంతరంగికము, ఆనందదాయకము నైన ఆత్మతత్త్వముపై నాధారపడి యుండును. అందువలన 'డెందమున కనువైన రసము లొలుకు భావమే కావ్య'మని భరతుడును, 'సువర్ణమయాలంకార విశేష భూషితమైన వాక్యమే కావ్య' మని భామహుడును, 'శబ్దార్థముల జంటయే కావ్య' మని రుద్రటుడును, 'ఇచ్చవచ్చిన తలపుల మొలక లెత్త జేయజాలు నీటు గులుకు మాటలహరుపే కావ్య' మని దండియు, 'మంచి గొనముల నెలవగు మేలిపదముల పొందికయే కావ్య' మని వామనుడును, 'ఇంపుసొంపుల ముంపును క్రొత్త వింతకోరికల నన లెత్తగా సలుపు పలుకునుడికారముం గల వలపుతలపే కావ్య' మని ఆనందవర్ధనుడును, 'నెరజాణతనపుమురిపెముల గురియు ముద్దుసద్దుల మాటయే కావ్య' మని కుంతలుడును, 'సరసమైన వాక్యమే కావ్య' మని విశ్వనాథుడును, 'అందముం జిందు భావముం బొందుపరచుటచే నెరయమెరయు పదమే కావ్య' మని జగన్నాథుడును వచించిరి.

సాహిత్యపరిణామమునకు శాంతసుందర శివాత్మకము లైన భావార్థాలంకారములు, పదార్థాలంకారములు, ధ్వని గుణాలంకారములు నియతసాధనము లైనను రసాత్మయె కావ్యాత్మ యని కావ్యమీమాంస సువ్యక్తము చేయుచున్న విషయమును పండితపామరులు గ్రహించుట కావ్యోపాసనకు పరమార్థము.

ఆంధ్రగ్రంథమాలయందు కావ్యాత్మను ౨౬ వ ప్రచురణముగను సమకూర్చి గౌరవించినందులకు శ్రీయుత శేట్లూరి వేంకటరాఘవయ్యంగారికి నిర్వాహకులు కృతజ్ఞులు. 'కావ్యాత్మ' ఆంధ్రలోకాదరణ పోషణములను, ముఖ్యముగను విద్యార్థిపండితాదరణమును గలిగి వర్ధిల్లుటకు భగవంతు డనుగ్రహించుగాక!

కా. నాగేశ్వరరావు

---

## భక్త కుచేల



కృష్ణ కుచేల సమాగమము

(శ్రీ కృష్ణపాత్రధారి: శ్రీ కే. రఘురామయ్యగారు, కుచేలపాత్రధారి: కే. యస్. రామచంద్రరావుగారు)

## 'కాటాస్' నగర దేవాలయములు (G. S. A.)

['కాటాస్' నగరము పంజాబునం దున్నది.]

౧. కాటాస్ నగర దృశ్యము



౨. అశోకస్తూపముయొక్క శిథిలావశేషములు

# ఆత్మరక్షణ

ఏలేశ్వరపు కృష్ణమూర్తి

రక్షణకు కర్త రక్షకుడు; రక్షితుడు ఫల మనుభవించువాడు. బాల్యమున మాతా పితరులు రక్షకులు; పుత్రులు, పుత్రికలు రక్షితులు. విద్యాపీఠమున గురుడు రక్షకుడు; శిష్యుడు, శిష్యురాండ్రు రక్షితులు. గృహమున భర్త రక్షకుడు; భార్య రక్షిత. భార్యయే రక్షక యగుచో భర్త రక్షితు డగును. పాలనలో రాజు రక్షకుడు; పౌరుడు రక్షితుడు దేవుడు సర్వలోకరక్షకుడు; రక్షితుడు సర్వత్రా భక్తుడు.

పాలనకు మూలం పాలకులు, పాలితులు; ప్రభువు, ప్రజలు. కాపాడబడునవి ప్రజలహక్కులు. హక్కులతోకూడ పుట్టినది శాసనము. హక్కులు లేకున్న శాసనము లేదు. శాసనంలో రాజనీతి, రాజభక్తి ప్రతిఫలించును. నీతిలేకుంటే భక్తియుండదు; భక్తి లేకుంటే నీతి యుండదు. రక్షకునిది నీతి; రక్షితునిది భక్తి. ఏది ఎటున్నా ప్రభుత్వమునకు, ప్రజలకు ఆత్మరక్షణ అవసరము.

ప్రభుత్వమునకు ఆత్మరక్షణ యెట్టి దని ముందు గమనింతము. రాజ్యాంగ విధానము లెన్నిరూపములు దాల్చినా రాజులేని రాజ్యము ఉండదు. శ్రీమంత ప్రభుత్వంలో రాజున్నాడు. సంఘ స్వామిత్వంలో రాజున్నాడు. జనాధిపత్యంలో రాజరికం వుంది. ప్రజాప్రభుత్వంలో రాజున్నాడు. ప్రాతినిధ్య ప్రభుత్వంలో రాజున్నాడు. ప్రతి రాజునకు అంగము, ఆత్మ వున్నాయి. అంగరక్షణకుగాను యేర్పడినది బలం. ఆత్మరక్షణకుగాను వెలువడినది శాసనం. ఈబలమును, శాసనమును ప్రయోగించుటయందలి యుక్తివిశేషం ఉపాయం. శాసనమునకు, బలమునకు లోబడువాడు పౌరుడు; లోబడనిది రాజు. శాసనమును ప్రయోగించువాడు రాజు; శాసనమునకు బద్ధుడు పౌరుడు. రాజరికమున ప్రభువే బలవంతుడు, శాసనకర్త. అరాజకమున అందరు బలవంతులే; ఎవరికి వారు శాసనకర్తలు. రాజరికము శాంతియుతము. అరాజకము అశాంతియుతము. ఇంతకు రాజునకు ఆత్మరక్షణకు మూలం బలం, శాసనం, ఉపాయం అందాం.

ఇక పౌరునికి ఆత్మరక్షణ ఎటులో గమనింతము. తన్ను తను రక్షించుకోవలె ననెడి ఆశ ప్రాణికోటులకు ప్రకృతి అంతరంగమున కలుగ జేసినది. పౌరుడు ముఖ్యముగా గణింపదగినవి రెండు: ఒకటి ప్రాణము, రెండుఆస్తి. ముఖ్యముగా కాపాడవలసినవి యీ రెండే. వీటిని రక్షించెడి విధి రాజుది. కాని ప్రతి పౌరునీ రాజు ప్రత్యక్షముగ వచ్చి రక్షించుట అసంభవము. అందువలననే పూర్వులు రాజా

పశ్యతి కర్ణాభ్యాం' అన్నారు. ఎంత విన్నా రాజపరోక్షమున రాజభటులే రక్షకులు. రాజభటులుకూడ రక్షించుటకు దరిని లేన పుడు రాజశాసనము ప్రతిపౌరునికి ఆత్మ రక్షణహక్కు నొసగుచున్నది. ఈ హక్కుతో ఏపౌరుడైనా తన ప్రాణమును, దేహమును, ఆస్తిని రక్షించుకోవచ్చును; వేరొకని ప్రాణమును, దేహమును, ఆస్తిని రక్షింపవచ్చును. ఈహక్కు ప్రత్యేకముగా ప్రజల కాపుదలకుగాను ఏర్పడినది.

రాజు జనరక్షకుడు. పౌరుడు తన్ను తనే రక్షించుకొనరాదు. ఎవరికివారు రక్షణకు పూనుకొనిన అశాంతి ప్రబలును. గాన రక్షణకు పౌరుడు రాజునే కోరవలయును. రాజభటులు దరినున్నచో పౌరుడు ఆత్మ రక్షణహక్కును వాడుకొనరాదు. రక్షణకు రాజభటుల కోరుటకు తగినవ్యవధి యున్న పుడుకూడా యీహక్కును పౌరుడు వాడ రాదు. ఆత్మరక్షణహక్కుతో పౌరుడెన్న డును రాజు నెదుర్కొనరాదు. రాజభటు లపై తిరుగబడరాదు. ఉద్యోగరీత్యా రాజ భటులు రాజశాసనమునకు మరీ హద్దుమీరి వ్యవహరించి పౌరునికి ప్రాణాపాయం కలుగ జేయునపుడు పౌరునికి యీహక్కు కలు గును.

హాని కలుగనున్నపుడు పౌరుడు కాపు దల నుద్దేశించిమాత్రమే బలము నుపయో గించవలయును. హాని నెదుర్కొనుటకు వలయు బలమే ప్రయోగింపవలయునుగాని అత్యధికమగు బలమును పౌరుడు వాడరాదు గోళ్లతో నివారించుకొనుదానికి గొడ్డళ్లు నుపయోగింపరాదు. ఈ హక్కు రక్షణ కేర్పడినదిగాన యీసూచన.

ప్రాణమునకుగాని, దేహమునకుగాని, ఆస్తికిగాని హానికలుగునపుడే పౌరునికి యీ హక్కు భుక్తమగును.

సాధారణముగ ఆత్మరక్షణకుగాను ఇత రులను చంపుటకు శాసన మొల్లదు. పూర్వులు 'జిఘాంసంతం జిఘాంసీయాత్' అన్నారు. కాని నవీనుల తీరు వేరు. ప్రాణ హాని కలిగించడానికో, బలంగా ఘాతచేయ డానికో, మానభంగం జరిపించడానికో, మదనపీడతో అమానుషకృత్యాలు నెరవేర్చ డానికో, అక్రమంగా ఎవరినైనా లేవదీసుకు పోయేటందుకో, అక్రమంగా ఎవరినైనా నిర్బంధపరిచేటందుకో ఎవరైనా దౌర్జన్యం చేసినపుడు పైబడినవారికి చావుపర్యంతం, సందర్భానుసారముగ, ఆత్మరక్షణకుగాను పౌరుడు కలిగించవచ్చును. దౌర్జన్యమును ఎదుర్కొనుటకు వలయు బలము సమయో చితముగ నుండవలయును. అగత్యము లేనిదే బల ముపయోగింపరాదు. దేహమునకుగాని, ప్రాణమునకుగాని హాని కలుగునసెడిభయము పౌరునికి కలిగినంతసేపుమాత్రమే యీ హక్కు పౌరునికిగలదు. అట్టిభయము తొల గిన పౌరునికి యీహక్కుండదు.

ఇక బందిపోటు జరిగినా, రాత్రిపూట కన్నపుచోరీ జరిగినా, గృహదహనంఅయినా,

చంపాలనీ, బలంగా ఘాత కలిగించాలనీ దొంగతనమో, అక్రమప్రవేశమో జరిగినా ఆ స్తిని రక్షించుకొనుటకుగాను పైబడినవారికి ప్రాణహానిపర్యంతం పౌరుడు కలుగజేయవచ్చును. కాని అనవసరముగ బలముపయోగించి చంప నుద్యమించరాదు. 'తస్కరస్య వధో దండః' అని పూర్వులన్నారు. వారికీ ఆత్మరక్షణ తెలుసునేమో. కన్నపుదొంగగాని, గృహదహనంగాని జరిగినపుడు ఆనేరం జరిగినంతసేపు పౌరునికి ఆత్మరక్షణహక్కున్నది. దానితో నేరస్థుని పౌరు డెదుర్కొనవచ్చును. చోరీవిషయంలో సొత్తును వెంటనే కాబట్టిన దాకాను, రాజభటులు రక్షణకు తోడ్పడిందాకాను, దొంగాడు సొత్తుతో పుడాయించిందాకాను యీహక్కు పౌరునికి గలదు. బందిపోటు జరిగినపుడు దొంగలు భయం కలిగించినంతసేపు పౌరునికి యీ హక్కు కలదు.

ఈహక్కు కేవలము కాపుదలకుగాని కసితీర్చుకొనుటకు కాదు; చిత్రవధ గావించుటకు కాదు; శాసనము నతిక్రమించుటకు గాదు. ఆత్మరక్షణకుగానే ప్రతి పౌరునికి యీ హక్కు యివ్వబడింది. సమయోచితముగ వాడి నేరములకు తావియ్యకుండుటకే యీహక్కు ప్రజలకు యివ్వబడినది. శాసనోల్లంఘన గావించిన ప్రజలు దండనార్హు లగుదురు. ఏ రాజ్యమునను రాజునకు విధులు రెండు: దుష్టశిక్షణ, శిష్టరక్షణ. ఈ రెండు నియమములను రాజు పాటించును. పూర్వులు లోకానుభవంతో 'ఆత్మానం సతతం రక్షేత్' అన్నారు. వారికి రాజే దైవము; రాజభక్తే దైవభక్తి; పాపమే నేరము; నీతియే శాసనము. కాని నవీనులకు రాజు వేరు; దైవము వేరు. రాజభక్తి వేరు; దైవభక్తి వేరు. శాసనము వేరు; నీతి వేరు. నేరము వేరు; పాపము వేరు. అయినా ప్రాచీనులు, నవీనులుకూడా 'దుర్బలస్య బలంరాజా' అనే విషయాన్ని మరచిపోలేదు గనుకనే ఆత్మరక్షణహక్కు ప్రజలకు కలిగినది. జాగరూకతతో దీనిని వాడుకొనుట ప్రజల కర్తవ్యము. ఈహక్కును విషమసందర్భములలో సవ్యముగ వాడుకొనినటుల రుజువుపరచుట ప్రజల భారము. తీర్పుచెప్పుట రాజుభారము.

---

# కాలమహిమ

శ్రీరంగనాయకమ్మ

కాలమహిమంబు దెలియంగ గలరె నరులు
కాలగతి దాట వశమౌనె; గాంచిచూడ,
నజునకైనను మరి హరియబ్బకైన;
ప్రకృతియే కాలరూపమై పరగు నేమొ!
అన్నియర్థంబు లీకాలమందె యిమిడి
యుండుటను గాంచజాలుదు ముర్వియందు
కాలగర్భంబునందున గలసినట్టి
జీవకోటు లసంఖ్యమై చెలగు, నెంత
మాననీయులు గురుతరమానసులును
లోకకల్యాణ తత్పరాలోకనులును!
త్యాగశీలురు భక్తులు తత్వవిదులు
శౌర్యగాంభీర్యగుణగణ శోభితులును
నై చెలంగెడు, మహనీయులైన కాల
గర్భమందున లీనమై కానరారు
నెమ్మి నవతారపురుషులై నెగడు రామ
కృష్ణులాదిమహాత్ములు క్లిష్టకాల
గతికి వశులైన నితరుల గాంచనేల!
ఆదిమధ్యాంతరహితుడై యలరు దేవు
లీలయే కాలరూపమై గ్రాలునేమొ!
ఔర! కాలప్రవాహంబు నడ్డవశమె!
కాలమా, యెంతవేగంబు గలదు నీకు?
యుగయుగంబుల క్షణములో నుత్తరించి,
పరుగువారెదు నిను బట్ట పగ్గములును
గలవె నీరూపు దెలియంగగలరె నరులు;
రేలుబవలును గల్పింపజాలు సూర్య
చంద్రులే నీదుగతి నడ్డజాల; రౌర!

యీవె దైవంబవో కాక నిన్ను నెమ్మి
గల్పనముచేసి నడపెడు ఘనుడు గలడో;
కాలక్రమమున దెలియంగగలమొ లేమొ;
యన్నిటను నీవె ఘనమంచు నాత్మనెంతు!
కాలగర్భంబునం దేమి గలదొ దెలియ
జాల; నీలీల యేలీల గ్రాలునొక్కొ!
కాలవశమున గలిగెడు కష్టసుఖము
లోర్పుమై బొందు సుజనుల నూహ సేతు!
జననమరణంబులను బొందు జాడ లీవె
గలుగజేయుదు వెంతటి ఘనులకైన;
కాలచక్రంబు తిరిగెడు క్రమము బట్టి
మానవుని యూహాపోహలు మసలుచుండు;
కాల మేమార్పునైనను గలుగజేయు
కలనయిన నెంచనట్టి మార్పులు ఘటించు
కాలమనుకూలమైయున్న కాలమందు,
సర్వతోభద్రములు గల్గు జనతతులకు,
బుద్ధివైభవయుతులైన పురుషులైన
కాలకర్మంబునను గల్గు గతులుదాట
నేర రో కాలమా నీదునేర్పు నెంతు
నీవె దైవస్వరూపమం చెంతు! నతుల
గతులచే నన్ను నలయింపగడగవలదు;
క్రమము విడబోకు నాకును శ్రమల నిడకు;
ఘనమతులుబోవు దారి నే ననుగమింప
గూర్మి జేయూతనొసగి నాకుశుభంబు
లొసరగూర్పుమునీనేర్పు నోలి నెంతు
కాలమా నీ కిదే నమస్కార శతము!

---

చెన్నరాజధానియందు 1933 సంవత్సరము అక్టోబరు ప్రారంభము మొదలు
డిసెంబరు తుదివరకు గల మూడునెలల కాలమున ముద్రితములయి ప్రకటితములయిన

# ఆంధ్ర గ్రంథముల పట్టిక*

## ఇతిహాసము

శ్రీమదాంధ్ర వచనమహాభారతము, భా. ౬—(ప్ర వి. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్, మద్రాసు)

## కథలు, ఐతిహాసికములు, పౌరాణికములు

మహాపతివ్రతలకథలు—వి. సూర్యనారాయణరావు

రంతిదేవుడు—బి. రామానుజులురెడ్డి

## —కల్పితములు

శివకారుణ్యము—యన్. సి. రంగస్వామిఅయ్యంగారు

శుకసప్తతికథలు—యం. శ్రీరామమూర్తి

## —చారిత్రకములు

బళ్లారిచరిత్రయందలికథలు—(ప్ర) సి. శ్రీనివాసరావు, అదోని

## కావ్యము

శ్రీరామాయణ సారోద్ధారము— (ప్ర) యం. నరసింహావధాని, చీరాల

## గణితశాస్త్రము

నూతనపద్ధతుల గణితము, బుక్ ౨, ౪ — కె. యస్. సుబ్రహ్మణ్యం

ప్రాథమికగణితము, తరగతి ౫—కె. సుందరరామయ్య కె. వెంకటసుబ్బరావు

బాలురగణితము, బుక్ ౧, ౨—యం. యస్. సుందరేశ్వరన్

మారుతిగణితబోధిని, ఫారం ౨—జి. రంగరావునాయుడు, పి. సత్యనారాయణ

## గేయములు

గ్రామఫోనుపాటలు—(ప్ర) గృహసరస్వతి బుక్ డిపో, కడప

తారాచంద్రవిలాసము—పి. శ్రీరామమూర్తి

నల్లతంగాళ్ కథ—(ప్ర) యన్. వి. గోపాల్ అండు కో; మద్రాస్

నూతననామసంకీర్తనలు— బి. వీరాస్వామిదాసు

పాండురంగవిఠల్ భగవాన్ నామములు - భజన కీర్తనలు—(ప్ర) టి. రామకృష్ణయ్య, చిలకలపూడి

భక్తికీర్తనలు—గంగేశ్వరానందస్వామి

భావతరంగాలు—వి. లక్ష్మీనారాయణ

రామదాసుచరిత్ర—కె. వీరవెంకయ్య, రాజమహేంద్రవరము

శ్రీపాండురంగ బృందావన భజన కీర్తనలు — కె. సుబ్బన్న

శ్రీరంగనాథనామ భజనకీర్తనలు—వెంకమాంబ

శ్రీవేంకటేశ్వరభజనకీర్తనలు — బి. నరసింహదాసు

శ్రీహరిభజనకీర్తనలు—డి. కోటయ్యదాసు

షట్కాండల రామాయణకీర్తన—పి. రంగరాజు

సతీసావిత్రికీర్తనలు— (ప్ర) వరదన్ సినిమాకంపెని, త్రిచూరు

సుబోధామృతము—ఖాదర్ మొదీన్ మకాద్రి

హరిభజనకీర్తనలు—(ప్ర) యన్. వి. గోపాల్ అండు కో, మదరాస్

## చరిత్ర

హిందూదేశచరిత్రము—యన్. వి. అయ్యర్, యన్ యస్. యన్. మూర్తి

## జంతుశాస్త్రము

జంతుశాస్త్రము—వి. యస్. సోమయాజులు

## జీవితములు

ప్రహ్లాద గాంధి—టి. రామస్వామిగుప్త

భక్తనరసింహము, భా. ౧—టి. రామకృష్ణయ్య

---

* ఈ పట్టికయందుగల సంకేతపదముల వివరణము : అ.—అధ్యాయము. అను.—అనువాదము, అనువాదకులు. పద్యము. ప—ప్ర.—ప్రకాశకులు. భా.—భాగము. వ.—వచనము. సం.—సంపాదకులు. సటీ.—సటీకము.

## జ్యోతిష శాస్త్రము

గౌతమసంహిత—(ప్ర) కె. నరసింహశాస్త్రి, గోపాలపురము

గ్రహతారాదర్పణము—సి. వెంకటరమణ శాస్త్రి

జాతకరాజీయము — (ప్ర) కె. నరసింహ శాస్త్రి, గోపాలపురము

## దండకములు

ఆంజనేయదండకం, ఈశ్వరదండకం, భాస్కర దండకం—(ప్ర) గృహసరస్వతిబుక్ డిపో, కడప

వీరాంజనేయదండకము— (ప్ర) పి. వీరయ్య, మచిలీపట్టణము

శ్రీరామదండకము, శ్రీకృష్ణస్తుతి — గృహ సరస్వతి బుక్ డిపో, కడప

పాండురంగదండకము — (ప్ర) పి. వీరయ్య, మచిలీపట్టణము.

శ్రీశివదండకము, శ్రీవీరభద్రదండకము—(ప్ర) యం. వీరభద్రేశ్వరారాధ్యులు, నందిగామ

## నవలలు

గులేబకావలి—యం. శ్రీరామమూర్తి

రాధ—(అను) కె. కనకమ్మ

## నాటకములు

అనార్కలీ—వి. సత్యనారాయణ

అభిజ్ఞానశాకుంతలము—(అను) వి. వెంకటనీలాద్రిరాజు

చుక్కలూరు రామనాటకము—నై. వెంకటసుబ్బయ్య

ప్రమీలార్జునీయము—యం. శ్రీరామమూర్తి

ప్రేమచంద్రయోగి లేక అస్పృశ్యవిజయము— గోపాలాచార్యులు

భక్తకుచేల—కె. సుబ్రహ్మణ్యశాస్త్రి

భక్తకుచేల—వి. బలరామదాసు

బెడుదూరి హరిశ్చంద్ర నాటకము — నై. వెంకటసుబ్బయ్య

రామదాసు—వి. సూర్యనారాయణరావు

విచిత్రరాఘవము—వెంకటపార్థసారథి కవులు

విహారలీల—డి. గోపాలకృష్ణరావు

వేములపల్లె విరాటపర్వ నాటకము — నై. వెంకటసుబ్బయ్య

శ్రీశంకరప్రబోధము—తత్త్వానందస్వామి

సావిత్రీనాటకము—యస్. సచ్చిదానందశాస్త్రి

సుభద్రార్జునీయము—పి. సుబ్బరామప్ప

## నీతి

నీతివాచకము, బుక్కు ౧— యం. వెంకటరత్నము, యం. గురునాథశర్మ

మంచిచీమ—బి. టి. నరసింహాచార్యులు

సత్ప్రవర్తనము—జి. శేషాద్రిశర్మ

సదుపదేశము—జి. శ్రీరామశాస్త్రి

## పరిశిష్టము

అందరకువిద్య, నూతన అక్షరాభ్యాసము—(ప్ర)రంగ అండ్ కో, ఏలూరు

అయిదవవాచకపుస్తకము—కె. వీరేశలింగం పంతులు

అష్రాప్రాకిగంథములోని కొన్ని భాగములు — (ప్ర) క్రిశ్చియన్ లిటరేచర్ సొసైటి, మదరాసు

ఇండియా ప్రపంచము, బ్రిటిషుసామ్రాజ్యము— హెర్బర్టు పికిల్సు

ఉపదేశామృతము, భా. ౨— హరనాథఠాకూరు

కపోతవాక్యము—(ప్ర) యన్. వి. గోపాల్ అండ్ కో మదరాసు.

కరుణలేనికమతము—తత్త్వానందస్వామి

కవితాకుసుమమాలిక—(ప్ర) కళానిలయం, సోంపేట

కృష్ణరాయాంధ్రవాచకము భా. ౧ — (ప్ర) రామచంద్రబుక్ డిపో, చిత్తూరు

గీతారామాయణము— వి. సూర్యనారాయణ

తిరుపతిగంగజాతరపచ్చవేషపుకథ—కె. మునిరత్నం

తెలుగుపుస్తకము—డాక్టర్ (స్కూల్ జి)

దసరాసమయమందు రచియింపబడిన పద్యము— సి. యల్లమందనాయుడు

నర్సులసహకారము—(ప్ర) మిస్. మండె మెల్‌డేనియల్, ఒంగోలు

పాదపూజ—పి. శేషగిరిరావు, సి. జానకిరామయ్య

ప్రారంభవిద్య—(ప్ర) వెంకటరాం అండ్ కో, ఏలూరు

బాలరామాయణము—(ప్ర) యన్. వి. గోపాల్ అండ్ కో, మదరాసు

మందలింపు—పి. శ్రీరాములు రెడ్డి

మానవధర్మ రహస్యబోధిని—పి. నరసింహస్వామి

లాయర్ గిరీశం, భా. ౨—డి. వెంకటసుబ్బరావు

విజ్ఞానవాచకము తరగతి ౧ — ఏ. శంకరరావు, డి. సోమలింగాచార్యులు, బి. సుబ్బరాయుడు

శృంగారపద్యములు—(ప్ర) గృహసరస్వతి బుక్ డిపో, కడప

శ్రీకపోతీశ్వరీయము—పి. శ్రీనివాసరంగేశ్వరశర్మ

శ్రీనలచరిత్ర—బి. రామకృష్ణకవి

శ్రీనవరాత్రోత్సవాదిక దివ్యదర్శనము—ఏ. సీతారామశాస్త్రి

శ్రీవాచకము—డి. కోదండరామస్వామి

శ్రీసత్యహరిశ్చంద్రచరిత్రము—కె. శివరామదాస్

సన్మానపద్యరత్నాకరము, భా. ౧—(ప్ర) కె. సంగమేశ్వరకవి, తెనాలి

సమస్యాశ్లోకము—ఆర్. జగన్నాథకవి

సహకారవస్తునిలయోద్యమము— డి. వెంకటశివరావు

సామాన్యజ్ఞానము, తరగతి 3 — టి. దొరసామిపిళ్లె

స్వదేశసంస్థానాలు—యన్. వెంకటేశ్వరరావు

హరిజనసమస్య—యన్. వెంకటకృష్ణమాచార్యులు—(ప్ర) జాతీయగ్రంథమాల, కాకినాడ

హరిజనసేవామృతము—యస్. వరదదాస్

## పురాణములు

గజేంద్రమోక్షము — (ప్ర) కె. వీరవెంకయ్య రాజమహేంద్రవరము

శ్రీరామచరిత్రము—(ప్ర) జి. హరిసర్వోత్తమరావు నంద్యాల్

## ప్రబంధము

ప్రభావతీప్రద్యుమ్నము—పింగళి సూరన్న

## ప్రకృతిశాస్త్రము

బాలవిజ్ఞానశాస్త్రము—కె. వీరభద్రయ్య

భౌతికశాస్త్రము — సి. సత్యనారాయణరావు కె. వి. సుబ్బరావు

రసాయనశాస్త్రము—కె. రంగాచారి

రసాయనశాస్త్రము—వి. సుబ్బరావు

వస్తువిజ్ఞానము, ప్రయోగములు—కె. వీరభద్రయ్య

శారీరకశాస్త్రము—వి. యస్. సోమయాజులు

## భూగోళశాస్త్రము

ప్రపంచభూగోళము—యన్. సుబ్రహ్మణ్యం

బళ్లారిజిల్లా భూగోళశాస్త్రము—(ప్ర) సి. శ్రీనివాసరావు, ఆదోని

భూగోళశాస్త్రము—ఆర్. శేషగిరిరావు

భూవర్ణనగ్రంథము, బుక్ ౨—యన్. వెంకటరామన్, యం. కె. సుందరవరదాచార్యులు

మానవభూగోళము, భా. ౧—యం. సీతారామరావు

## యక్షగానములు

మయూరధ్వజచరిత్ర—ఇ. సత్యనారాయణశర్మ

## రాజకీయములు

భారతజాతీయఋణములు—జె. సి. కుమారప్ప

## వృక్షశాస్త్రము

వృక్షశాస్త్రము—వి. యస్. సోమయాజులు

## మతము—హిందు

ఆబ్దికమంత్రం — (ప్ర) వి. వెంకటప్పయాచార్యులు తెనాలి

గార్హస్థ్యం—భేదానందస్వామి

బ్రహ్మచర్యం—భేదానందస్వామి

బ్రహ్మర్షి—డి. కృష్ణశాస్త్రి

వేదకాలపుస్త్రీలు—జె. పురుషోత్తం

శివరహస్యఖండము — (ప్ర) యం. వీరభద్రేశ్వరారాధ్యులు, నందిగామ
హిందూధర్మబోధిని—యం. సింహాద్రిఅప్పలాచార్యులు

## —ఇతరములు

క్రొత్తవింతలు—(రెవ్) యం. డేవిడ్
క్రైస్తవగీతావళి—గేబ్రియల్
క్రైస్తవనీతిప్రకాశిక — (ప్ర) క్రిశ్చియన్ లిటరేచర్ సొసైటి, మదరాసు
క్రైస్తవమతసారము—పి. అప్పలస్వామి
జ్ఞానబోధిని—(ప్ర) లిటరేచర్ కమిటి ఆంధ్రయవాంజిలికల్ లూథరన్ చర్చ్, గుంటూరు
జి. డి. యం. జనరల్ గాస్పెల్ హాండ్ బిల్స్ ౭౧-౭౫—ఇ. హెచ్. ఆడమ్స్
మూలపురుషులచరిత్ర — (ప్ర) క్రిశ్చియన్ లిటరేచర్ సొసైటి మదరాసు
వాక్యములపుస్తకము — లిటరేచర్ కమిటి, ఆంధ్రయవాంజిలికల్ లూథరన్ చర్చ్, గుంటూరు
విలేజ్ ఫోక్ సీరీస్, నెం ౧-౧౨ ఇ. హెచ్. ఆడమ్స్
వేదకార్యవివరణము—(రెవ్) యం. ఇగ్నాటిస్
సత్యశీలుడు ప్రసాదమ్మలచరిత్ర — (ప్ర) క్రిశ్చియన్ లిటరేచర్ సొసైటి, మదరాసు.

## మాహాత్మ్యములు

శ్రీమదాంధ్రకార్తిక మాహాత్మ్యము—సి. వెంకటాద్రి
శ్రీయోగలింగేశ్వరస్వామిమాహాత్మ్యము — సి. లక్ష్మీకాంతకవి
శ్రీవేంకటేశాష్టోత్తరశతనామప్రభావము — (ప్ర) పి. రంగనాయకులు, తిరుపతి

## వేదాంతశాస్త్రము

ఆత్మసుధా—(ప్ర)స్వామి రాజేశ్వరానంద, మద్రాసు
తత్త్వోపన్యాసము—కె. హనుమంతాచారి
ధ్యానామృతము—(ప్ర) వ్యాసాశ్రమము, ఏర్పేడు
వాసుదేవ మననము—వాసుదేవయతీంద్ర
శ్రీభగవద్గీత—(ప్ర) గుంటూరుడిస్ట్రిక్టు హరిజన్ అసోసియేషన్, కొవ్వూరు
భగవద్గీతాసారము— (ప్ర) యం. తిమ్మయ్యశెట్టి, మదరాసు.

శ్రీసీతారామాంజనేయ సంవాదసార సంగ్రహము — వి. రామకోటదాస్
శ్రీస్వబోధసుధాకరము—మలయాలస్వామి

## వైద్యశాస్త్రము

ఆయుర్వేదవైద్యామృతము—ధ. సోమలింగాచార్యులు
ధన్వంతరివిజయము—ధ. సోమలింగాచార్యులు
ప్రసవశాస్త్రము — (ప్ర) క్రిశ్చియన్ లిటరేచర్ సొసైటి మదరాసు
రాజయక్ష్మ — (ప్ర) గంజాం ఆయుర్వేదిక్ ఫార్మసి, బరంపురం

## వ్యాకరణశాస్త్రము

తెలుగువ్యాకరణము—డి. సూర్యనారాయణశాస్త్రి

## శతకములు

భారతకృష్ణశతకము—భ. లక్ష్మీకాంతము
భాస్కరశతకము — యన్. వి. గోపాల్ అండ్ కో, మదరాసు
మననజనకశతకము—ఎ. అప్పలస్వామి
మాటూరివాసశతకము—యం. వెంకటేశ్వరులు
వేంకటేశ్వరశతకము— (ప్ర) టి. వెంకాజిరావు, తాడిపత్రి
శ్రీ బాలకృష్ణశతకము—బి. పట్టాభిరామయ్య
సుమతీశతకము — (ప్ర) కె. వీరవెంకయ్య, రాజమహేంద్రవరము
హంసయోగశతకము—వెంకటరామయోగి

## సాముద్రికశాస్త్రము

సాముద్రికశాస్త్రము—పి. శరభయ్య

## సారస్వతము

కవిత్వతత్త్వవిచారము—సి. రామలింగారెడ్డి

## స్తోత్రములు

నిత్యప్రార్థనారత్నమాల—గంగేశ్వరానందస్వామి
పంచముఖిఆంజనేయస్తోత్రము—కె. వెంకటకోటయ్య
శ్రీరామకృష్ణాంజలి—కె. వి. ముకుందరావు
హనుమత్పంచవింశతి — (ప్ర) యన్. వి. గోపాల్ అండుకో, మదరాసు

## హరికథ

శ్రీతొండమానుచరిత్ర— సి. నరసింహకవి

అనంతపురము మ్యునిసిపల్ హైస్కూలునందలి బాలురకును, రాజకీయోన్నత మహిళాపాఠశాలయందలి బాలికలకును ఆంగ్లవాఙ్మయమున ప్రథమ స్పర్థపరీక్షలు. బాలికలలో నొకర్త సభాసదులముందు నుపన్యసించుచున్నది—౧౯౩౬.




అనంతపురము శ్రీ రాజకీయోన్నత బోధనాభ్యసన మహిళాపాఠశాల విద్యార్థినుల రాసక్రీడా వినోదము.

# మనరాష్ట్రమున ప్రత్తిసాగు

మోచర్ల లక్ష్మీకాంతం

ప్రపంచములో నివసించు ప్రతిమనుజునకుగూడ అన్నము, బట్ట అనురెండును అత్యావశ్యకములు. వరి, గోధుమలు, మొక్కజొన్నలు ఆహారపదార్థములుగా నెంత ప్రాముఖ్యము వహించెనో, అటులనే ప్రత్తిగూడ వస్త్రములవిషయములో నంత ప్రాముఖ్యము వహించెను.

ప్రత్తిపండించుదేశములలో అమెరికా(సంయుక్త రాష్ట్రములు) మొదటిది. రెండవది మన భారతవర్షము. అమెరికాలో ప్రత్తిపంట ౧౪౦ లక్షల బేళ్లు. హిందూ దేశములో ౪౫ లక్షల బేళ్లే పండింపబడుచున్నవి. మనము పండించు ప్రత్తికిని, అమెరికాప్రత్తికిని చాల వ్యత్యాస మున్నది. అమెరికాప్రత్తి పొడుగాటి 'స్టేపిల్' కలిగినది. స్టేపిల్ అనగా పత్తిగింజనుండి వచ్చు పోగుల (Hairs) పొడుగు. పొడుగాటి స్టేపిల్ పత్తితో సన్నటి బట్టల నేయవచ్చును. అమెరికావారివలెనే మనము కూడ ప్రత్తి నభివృద్ధిపరచినచో ఇతరదేశములనుండి దారము, బట్టలు కొనవలసిన ఆవశ్యకత తప్పును.

మనదేశములో ప్రత్తిసాగు ౨౫-30000000 ఎకరము లుండును. అందులో ౨౫ లక్షల యకరములే మనరాజధానిలోనున్నవి. మన దేశములో ఈ పంట పండించు రాష్ట్రములలో ప్రత్తిక్రింద నున్న భూమిని పరికించి చూచినచో మనరాజధానిది ఐదవస్థాన మగును. ప్రత్తిసాగునం దైదవస్థానమైనను ప్రత్తి నుపయోగించుటలో మనరాజధాని రెండవది. మనరాష్ట్రమునం దుపయోగింపబడుప్రత్తి 3 లక్షల బేళ్లకుపైగా నుండును. కావున మనరాజధానిలో ప్రత్తి నెక్కువచేయవలయును.

మనరాజధానిలో నున్న ప్రత్తిభూమిలో సగము రాయలసీమ (Ceded districts)లో నున్నది. మిగత సగము సేలము, తిరునల్వేలి, రామనాడ్, కోయంబత్తూరు, మధుర, ఉత్తరసర్కారులలో నున్నది.

మనము మేలురకములైన ప్రత్తుల పండింప శ్రద్ధగా మొదలుపెట్టి సుమారు ౨౫౦ ఏండ్లయినది. అమెరికా తన స్వాతంత్ర్యమునకై పోరాడుసందర్భమున, ఇంగ్లండునకు ప్రత్తి నెగుమతిచేయుట మానివేసెను. అందువలన ఆంగ్లేయులు ఈస్టు ఇండియా కంపెనీవారిద్వారా మంచి ప్రత్తిపంటల నీదేశములో ప్రవేశపెట్టిరి. అప్పటినుండియు ఈపంట అభివృద్ధి చెందుచు వచ్చినది. ప్రస్తుతము మనరాజధానిలోని వివిధజిల్లాలలోను ఈ క్రిందిరకముల ప్రత్తిని పండించుచున్నారు.

| పండించు ప్రదేశము | ప్రత్తిపేరు | వృక్షశాస్త్రసంబంధమైన పేరు |
|---|---|---|
| కోయంబత్తూరు, మధుర, రామ్‌నాడ్, తిరునల్వేలి | ఉప్పం | Gossypium herbaceum |
| బళ్లారి, అనంతపురం | జవారిపత్తి | ,, |
| కర్నూలు (కొంత) | గడగ్ పత్తి | ,, |
| కర్నూలు, కడప | తెల్లపత్తి, ఎఱ్ఱపత్తి | Gossypium indicum |
| మధుర, రామ్‌నాడ్, తిరునల్వేలి | కరుంగన్ని | ,, |
| కోయంబత్తూరు సేలం | నాడమ్ | G. Obtusifolium |

| | | |
|---|---|---|
| గుంటూరు, కృష్ణ, నెల్లూరు, గోదావరి | ఎఱ్ఱపత్తి | ,, |
| బళ్లారి(ఎఱ్ఱనేల) | ముంగారి లేక బోకడ | G. Neglectum Roseum |
| మలబార్, దక్షిణకనడా | పూనమ్‌పత్తి | G. Neglectum |
| విశాఖపట్నం | పోనుపత్తి | G. Obtusifolium |
| విశాఖపట్నం, గోదావరి | బూరుగమూది | G. Neglectum |
| కోయంబత్తూరు మధుర, తిరునల్వేలి | అమెరికాపత్తి లేక కంబోడియా పెరియపరుత్తి | G. Hirsutum |
| కర్నూలు | ధార్వార్ అమెరికాపత్తి | G. Hirsutum cr Mexicanum |
| కోయంబత్తూరు | పూనాల్‌పరుతి | G Purpurescens |

ఈపైన ఇచ్చిన పట్టికనుబట్టి మనరాజధాని వివిధ జిల్లాలలో నేయేరకముల ప్రత్తి పండించునదియు, ఒకే రకము పత్తి వేరువేరుజిల్లాలలో వేరువేరు విధములుగా నెటుల పిలువబడుచున్నదియు వ్యక్తమగుచున్నది. కోయంబత్తూరు, మధుర, రామనాడ్, తిరునల్వేలిజిల్లాలలో ఉప్పం అనబరగుపత్తి బళ్లారి అనంతపురములలో జవారిహత్తి అనియును, కర్నూలులో గడగ్ ప్రత్తి అనియును పేర్లు కలిగియున్నది. కోయంబత్తూరు జిల్లాలో అన్నిరకముల పత్తిని పండింతురు.

ప్రత్తిని వృక్షశాస్త్రానుసారముగాను, వ్యవసాయమునుబట్టియు, వాణిజ్యమున కనుపూలమునునట్లును మూడువిధములుగా విభజించవచ్చును.

వ్యవసాయవిషయక విభజనము ప్రత్తికి నీరు కావలెనా, లేదా అను విషయముపై నాధారపడి యుండును. తోటపంట, మెట్టపంట అని రెండు విధములు. ఉ: కంబోడియా, ఉప్పం. ఎక్కువపత్తి మెట్ట భూములలో వర్షాధారమువల్లనే పండించబడుచున్నది.

వృక్షశాస్త్రసంబంధమైన విభజనము మొక్కకున్న రంగునుబట్టి, ఆకురంగు ఆకృతినిబట్టి, మొక్కమీదనున్న నూగు (Hairs)నుబట్టి నిర్ణయింతురు. పైన చెప్పిన పట్టికలో ఈశాస్త్రసంబంధమైన పేర్లను ఇచ్చియుంటిని. ఇక వ్యాపారములో నుపయోగించు పేర్లెవనగా,

Westerns (పడమరలు) :— కర్నూలు (పడమర), బళ్లారి, మైసూరు, అనంతపురములలో కొంత భాగములోను, దక్షిణహైద్రాబాదునందును పండింపబడుపత్తికీపేరు పెట్టబడినది. ఈ ప్రదేశములు ఎర్రమలై కొండలకు పడమర నున్నవి. ఈపత్తిలో గడగ్ పత్తి, జవారిహత్తి అనురకములపత్తి కలిసియుండును.

Northerns (ఉత్తరములు) :— ఇది కడప, కర్నూలు, నంద్యాల లోయలలోని పత్తి. దీనికి తెల్లపత్తి, ఎర్రపత్తి అనిపేర్లు. కొంచెము 'గడగ్' కూడ కలుపవచ్చును.. ఈపత్తితో నేసినదారము 'పడమరల' కంటె గట్టిగా నుండును. కాని ఇది కొంచెము ఖరీదెక్కువ.

Cocanadas(కాకినాడలు) :— కాకినాడనుండి ఎగుమతి చేయబడును గనుక ఆవైపు పత్తికి 'కాకినాడలు' అని పేరు పెట్టిరి. ఇది గుంటూరు తూర్పు ఉత్తర భాగములనుండియు, పశ్చిమగోదావరి తూర్పుపడమరల నుండియు, కృష్ణా, విశాఖపట్నం, గంజాంలనుండియు తీసికొనిరాబడి కాకినాడనుండి ఎగుమతిచేయబడును. దీనికి ఎర్రపత్తి అనిపేరు. కాకిరంగుబట్టలు దీనితో నేయుదురు.

Salems (సేలములు) :— కోయంబత్తూరు, సేలం, తిరుచునాపల్లి జిల్లాలలోని మెట్టపొలముల పత్తికీపేరు పెట్టిరి. ఇందులో 'ఉప్పం', 'నాడమ్', 'పూనాల్‌పరుతి' మున్నగునవి కలిసియుండును. ఇవి చాల తక్కువజాతి పత్తులు.

**Tinnies** (టిన్నీస్) :— టిన్నెవెలీ, రామనాడ్, మధుర మున్నగు జిల్లాలలోని ప్రత్తికరుగంన్ని అని దీనిపేరు. దీనిలో కొంచెం ఉప్పంకూడ కలియవచ్చును.

కాంబోడియా:—కోయంబత్తూరు, మధుర, తిరునల్వేలి జిల్లాలలో పండించబడి తిరుప్పూరులో అమ్మబడుచున్నది. 'పెరియపరుతి' (పెద్దప్రత్తి) అని పేరు.

## నేల

సాధారణముగా వర్షాధారముచే పండింపబడు ప్రత్తియంతయు 'నల్లప్రత్తినేల'లను (Black cotton soil) నేలలోనే పండింపబడుచున్నది. ప్రత్తిని అరుదుగా ఎర్రగానుండు మెరకభూములలో వేయుదురు. ఎర్రనేలలు తగినంత నీటిని నిలుపుకొనలేకపోవుటయే దీనికి కారణము. తోటభూములలో నీరు పెట్టుదురు గనుక ఎరుపునేల, నలుపునేల (అనగా బాగా రేగడిలేక ఎర్రవాడుగా నుండునేల, రేగడి కొంచె మెక్కువై నల్లగానుండునేల) అనువిచక్షణ నంతగా పాటించకుండనే ప్రత్తి నాటుదురు.

## పైరులమార్పు

మెట్టపంట:—ప్రత్తిమండలములలో ఈసీమప్రత్తి వేసినపొలములలో మరుసంవత్సరము జొన్న, తరువాతి వత్సరము ప్రత్తి, మరల జొన్న, ఈవిధముగా పైరులు మారుచుండును. సాధారణముగా ఈజిల్లాలలో కొర్రలు, ప్రత్తి కలిపివేయుదురు. ౨ వరుసలు కొర్ర, ౧ వరుస ప్రత్తి ఒకటివిడిచి ఒకటి వచ్చుచుండును. కోయంబత్తూరుజిల్లాలో కొంత భాగములో ప్రత్తి, ఏదైన ఒక ధాన్యము (Cereal), ఒక పప్పుపంట (Pulse) సంవత్సరమున కొకటి చొప్పున ఒకదానితరువాత నింకొకటి వచ్చుచుండును. తిరునల్వేలిజిల్లాలో కంబు (సజ్జ) గాని, ఇరుంగుచోళం (ఇది పశువులమేతకై ఉపయోగింతురు. గింజ చాలతక్కువ. ౧ యకరమునకు ౧౦౦ పవునులు రావచ్చును. ఇవి బహు సన్నటి మొక్కలు) గాని ప్రత్తితరువాత వచ్చును. ఈజిల్లాలో ప్రత్తి మినుములుకూడ కలిపి చల్లుదురు.

ఉత్తరసర్కారులలో పెద్దరైతులుతప్ప చిన్నరైతులందరు, ప్రత్తితో కొఱ్ఱనో, సజ్జనో కలిపివేయుదురు.

ఎఱ్ఱనేలల్లో సాధారణముగా ప్రతివత్సరము పైరులమార్పు క్రమముగా చేయుటకు వీలులేదు. సెప్టెంబరు మాసాంతములో వానవచ్చినయెడల ప్రత్తి వేయవచ్చును.

తోటపంట:—తోటభూములలో ప్రత్తి సెప్టెంబరునెలలో వేయుదురు. ఇది తీసివేసినతరువాత చోళ్లు నాటుదురు. తరువాత నొకపచ్చపైరు వేయవచ్చును. ఈపచ్చపంటను భూమిలో దున్నివేసి చైత్రమాసం జొన్న (చైత్ర చోళం) ను వేయుదురు. తరువాత మరల ప్రత్తివేయవచ్చును.

| | | | | |
|---|---|---|---|---|
| సెప్టెంబరు | మొదలు | మే | వరకు | ప్రత్తి |
| జూన్ అంతము | ,, | అక్టోబరు | ,, | చోళ్లు |
| నవంబరు | ,, | జాన్యుయరి | ,, | పచ్చపైరు |
| మార్చి (రెండవవారం) | ,, | జులై | ,, | జొన్న |
| అక్టోబరు | ,, | ఫిబ్రవరి | ,, | పొగాకు |

మరల ప్రత్తి ఈవిధముగా పైరులు మారుచుండవచ్చును. వీటిలో ఏటేట కొన్నిమార్పు లుండవచ్చును.

తోటపంటవిషయమై కోయంబత్తూరులోని సర్కారువారి 'ప్రత్తిపరిశోధనాలయము'వా రీక్రింది అంశములను కనుగొనిరి:

(౧) ప్రత్యేకము నీరుపెట్టి పండించుప్రత్తి పచ్చఎరువు వేసినతరువాత నాటినయెడల బాగుగా పెరుగును.

(౨) ప్రత్తికిముందు ఏపంట వెయ్యకుండ దానిని సకాలమున నాటిన పైపంటకంటె కొంచెము తగ్గును.

(3) ముందుగా వేరుశనగవేసి, తరువాత ప్రత్తి వేసినయెడల వచ్చుపంట పై రెంటికంటె కొంచెము తగ్గును.

## శీతోష్ణస్థితి

ఈపంట మొట్టమొదటి రోజులలో శీతోష్ణస్థితి కొంచెము వేడిగా నుండవలెను. అపుడపుడు వానజల్లులు

పడుచున్న మంచిది. నాటి ౧౪ నెల లయినతరువాత బాగుగా వానలు కురవవలెను. అప్పుడుమొక్కలు బాగుగా పెరుగును. పువ్వులుపూయు కాలమునను, తరువాతను మంచియెండలు కాయవలెను. పైరుగాలి ఈపంటకు చాల మంచిది. ఈ శీతోష్ణస్థితి ఏవిధముగా మార్పుచెందినను ప్రత్తిలక్షణము మారును. ఈవిధమైన ఆవర్శప్రాయ మగు శీతోష్ణస్థితి బొంబాయిరాజధానిలో 'బ్రోచ్' అనుప్రత్తి పండించుప్రదేశమున లభించును.

పంట వేయుటకు భూమిని తయారుచేయువిధము:—దత్తమండలములలో ప్రత్తి వేయుటకు భూమిని తయారుచేయుట సంవత్సరాదిపండుగ దాటిన తరువాత మొదలుపెట్టుదురు. చిన్నరైతు లదివరకున్న పంటయగు జొన్నదుబ్బులను నాగలితో దున్ని తీసివేసి పొలమును మరల దున్నుదురు. పెద్దరైతులు ఊసిగొఱ్ఱులను తోలుదురు. తరువాత నేలలో నున్న తడి ఆరకుండా గుంటకలను తోలుదురు. సుమారు అయిదేండ్లకొకతూరి భూమిని పెద్దమడక(పెద్దనాగలి, ౨,౩ జతల ఎద్దులాగును)తో బాగుగా దున్నుదురు. ఇప్పుడు పెద్దమడకస్థానే మంచి బరువైన ఇనుపనాగళ్లనుపయోగించుచున్నారు. ఈనాగళ్లతో దున్నినతరువాత బెల్లులను పగలగొట్టి భూమిని సమముచేయుటకు పెద్దగుంటకను తోలుదురు. తరువాత ప్రతివిత్తనములను గొఱ్ఱుల ద్వారా చల్లెదరు.

తిరునల్వేలిలో భూమిదున్నుటకు గొఱ్ఱు నుపయోగించరు. నాగలితోనే మూడునాలుగుసార్లు నెలకొకసారిచొప్పున పొల మంతయు దున్నుదురు. తరువాత ప్రత్తిగింజలను చేతితో వెదజల్లెదరు.

కోయంబత్తూరుమున్నగు ప్రదేశములలో మెట్టపంట కంతగా శ్రద్ధవహించరు. అచటకూడ పొలము దున్నుటకు నాగళ్లనే ఉపయోగించెదరు. ఉత్తర సర్కారులలోకూడ భూమిని ఎక్కువ జాగ్రత్తతో తయారుచేయుదురు. రెండుమూడుసార్లు నాగలితో దున్నుదురు.

కంబోడియాప్రత్తి మెట్టపంటగా వేయరు. వేసినను లాభ ముండదుగాన తోటపంటగానే పెంచుదురు. పొలమంతయు ముందు మూడునాలుగుసార్లు దున్నుదురు. తరువాత పొలమంతయు గట్లు, చాళ్లుగా చేయబడును. (చాలుకు చాలుకు ౨౪ అంగుళుల దూరము) గట్లమీద రెండేసి అంగుళుల కొకొక్కగింజ చొప్పున నాటుదురు. సర్వసాధారణముగా గింజలను వెదజల్లి తరువాత గట్లు చాళ్లుచేసి చాళ్లద్వారా నీళ్లుపెట్టుదురు.

## ఎరువులు

దత్తమండలములలో ఎరువు వేయుట అరుదు. ఎరువువేయుటవలన వచ్చినలాభము ఎరువుఖరీదుకే చాలదు. ప్రత్తికి ఎరువువేయుటయే మంచిదికాదందురు. దాని ముందుపంటకు(జొన్న, వోళ్లు) బాగుగా ఎరువు వేసినయెడల ప్రత్తికూడ ఆలాభమును పొందునని నమ్మకము. రాయలసీమలోని జనులు పసువులపంటను ప్రత్తికి వేసెడివారు. అదివరకు నీలిపంట యున్నప్పుడు నీలిఆకు జొన్న కెరువుగా వేసెడివారు.

ప్రత్తికి తిరునల్వేలిలో గొఱ్ఱెపెంట వేయుదురు. కొన్నిపొలములలో ఎరువులేకుండానే ప్రత్తిని పండింతురు. అచట జనులందరు సజ్జ భుజింతురు. ఈపంట ప్రత్తికి ముందుగా వచ్చును. దీని కెప్పుడును బాగుగా ఎరువు వేయుదురు. ఆ యెరువు ఫలితమునే ప్రత్తికూడ పొందును.

ఉత్తరసర్కారులలో ఎరువు వేయరు. పసువుల శాలలు తుడువగా వచ్చిన తుక్కు, పేడ కొంచెము వేయవచ్చును.

తోటపంటలో భూమిని చివరసారి దున్నుటకు ముందు ఎరువువేసి కలిపి దున్నివేయుదురు. సాధారణముగా ప్రత్తిముందు వచ్చు చోళ్లకు బాగా ఎరువు వేయుదురు.

## విత్తనములు నాటుట

ప్రత్తిగింజలకు కొంచెము ఎఱ్ఱమట్టి, పేడనీళ్లు కలిపి రాసి ఎండబెట్టి తరువాత జెదచల్లుదురు. విత్తనములు చల్లుటకు దత్తమండలములలో, సాధారణముగా గొఱ్ఱులనే వాడుదురు. రా పవునులవిత్తనము ఒకయకర

మునకు చాలును. దక్షిణాదిని తిరునల్వేలి, కోయంబత్తూరు, రామ్‌నాడ్ మున్నగు ప్రదేశములలో విత్తనములు చేతితోనే వెదచల్లెదరు. అందువలన ౧౦-౧౫ పవునుల విత్తనములు కావలెను. కంబోడియా గింజలు ౧౨-౧౫ పవునులు జాగ్రత్తగా వాడినచో, ఒకయకరమునకు చాలును. లేకపోయినయెడల ౨౦-౨౫ పవునులదాక కావలసివచ్చును. దత్తమండలములలో ఆగస్టు ౧౫ మొదలు సెప్టెంబరు ౧౫ లోగా ప్రత్తిని వేయుదురు. మరీ రేగడి అయినచో జూన్ ౧౫ మొదలు జులై ౧౫ లోపుగా వేయవచ్చును. తిరునల్వేలిజిల్లాలో అక్టోబరులో ప్రత్తిని వేయుదురు. కోయంబత్తూరు జిల్లాలో సెప్టెంబరు మొదటివారము కంబోడియాప్రత్తిని (తోటపంట), చివరవారములో మెట్టప్రత్తిని వేసెదరు. ఉత్తర సర్కారులలో సెప్టెంబరు మాసములో ప్రత్తిని నాటుదురు.

## తరువాతి సాగుబడి

ప్రత్తిమొక్కలతోపాటు పెరుగుచుండు కలుపుమొక్కలను అప్పుడప్పుడు తీసివేయుచుండవలెను. దత్తమండలములలో రెండుసార్లు మొల్లనుంటకను, దాని వెనుక దంతులను తోలుదురు. దీనివలన కలుపంతయు చచ్చిపోవును. పైనేల యంతయు గుల్లగా చేయబడుటవలన చెమ్మ ఆరకుండాయుండును. ఇదితోలిన రెండుమూడునెలలకు మరల పత్తిగుంటకను తోలుదురు. మరల ఇంకొకసారి పత్తిగుంటకతో బాగా లోతుగా దున్నవచ్చును.

తిరునల్వేలిజిల్లాలో విత్తులు నాటిన ఒక నెలకు కలుపు తీయుదురు. మరి రెండువారములకుతరువాత తొల్లికతో తవ్వుదురు. డిశంబరు మధ్యలోను, జాన్యువరి మాసాంతమునను ఇంకా రెండు సార్లు త్రవ్వుగోలతో తవ్వెదరు. కంబోడియాపత్తి వేసిన నేలను ఎప్పుడు పైన గుల్లగా నట్టిపెట్టవలయును. రెండు మూడువారములకొకసారి తొల్లికతో త్రవ్వవలెను. దీనికై కోయంబత్తూరుజిల్లాలో చాలమందిరైతులు జూనియర్ హో అను ఇనుపపనిముట్టునుపయోగింతురు. ఇది చాలా ఉపయోగకరమైనది.

దత్తమండలములలోని గండురేగడినేలలో నున్న ప్రత్తిమొక్కలతలలు (మొకపూయకపూర్వము) తుంచివేయుదురు. ఇది చేయుటవలన మొక్కలు తొందరగా పూయును.

ప్రత్తిమొక్కలు కాయలుకాచినతరువాత, సముద్రపుగాలిగాని, పైరుగాలి గాని మొక్కలమీద వీచిన యెడల ప్రత్తి పెళుసైపోక చక్కగా నుండును.

తోటపంటయగు కంబోడియాపత్తికి వాననీరు చాలదు గనుక నీళ్లు పెట్టుదురు. ౪, ౫ సార్లు నీళ్లు పెట్టవలెను. కాని చాలాసేపు నీరు మొక్కమొదళ్లలో నిలవుండరాదు.

## పత్తితీయుట

కడప, కర్నూలుజిల్లాలలో ప్రొద్దున ౮ గం. మొదలు సాయంత్రము 3, ౪ గంటలవరకు ప్రత్తిని పోగుచేసెదరు. ఇటులచేయుటవలన చిన్నచిన్ని ఆకుముక్కలు, కాయముక్కలు విరిగి పత్తినంటుకొనును. ఎండ ఎక్కువగానుండుటవలన అవి అన్నియు పెళుసుగా నుండును.

డిశంబరు మాసాంతమునుండి జాన్యుయరివరకు పువ్వులు పూయును. కాయలు ఫిబ్రవరి మార్చిమాసములలో పగిలి పత్తి నిచ్చును. ఈకాయలు పగిలినతరువాత పైనిచెప్పినజిల్లాలలో ౪, ౫ సార్లు మాత్రమే ప్రత్తిని పోగుచేయుదురు. ఒకసారి తీయుటకు, ఇంకొకసారి తీయుటకు మధ్య విచ్చిన కాయలపత్తి మట్టిలో పడియో, లేక దుమ్ము దానిమీదపడియో పాడయిపోవుచున్నది. దొంగలుకూడ ఎత్తుకొనిపోవుచున్నారు.

తిరునల్వేలి జిల్లాలో సూర్యోదయము పైకెక్కకపూర్వమే ప్రత్తితీయుట అయిపోవును. ప్రతిదినముగాని, రోజువిడిచి రోజుగాని ప్రత్తి ప్రోవుచేయుదురు. దత్తమండలములలోవలెనే ఇచ్చటకూడ ప్రోగుచేసిన ప్రత్తిలో కొంతభాగము కూలీలకిచ్చెదరు. కనుక రోజువిడిచి

రోజు పోసుచేయుటవలన తిరునల్వేలిరైతుకు నష్టము లేదు. ఈపద్ధతియే అన్నిచోట్ల ఆచరణయోగ్యము.

కంబోడియా పత్తిని టిన్నివెల్లిపత్తిని పోసు చేయునట్లే పోసుచేయవలెను. ప్రత్తితీసి సంచిలోవేయుటకు పూర్వమే అంటుకున్న ఆకుమొక్కలు మున్నగునవి తీసివేయవలెను.

ఈపత్తిని రెండుమూడుదినము లెండబెట్టవలెను. తరువాత మట్టి దులిపి గింజలను తీయవలెను. ఇది ఫ్యాక్టరీలలోగాని, ఇంటివద్దగాని చేయుదురు. కోయగానే వచ్చిన పత్తి, (గింజలు, దూది) గింజలు విడదీసినతరువాత చాల తగ్గిపోవును.

ఉదా:—ఉప్పరిపత్తి కోయగానే ౧౦౦ పవునులు వచ్చినయెడల గింజలు విడదీసినతరువాత ౨౫,౨౬ పౌనులే యుండును. దీనినే జిన్నింగ్ పర్సెంటేజ్ Ginning percentage) అందురు. ఇది కంబోడియాకు ౩౩ దాకను, 'పులిచై' అను పత్తికి ౪౦ దాకను ఉండును.

ప్రత్తియొక్కధర స్టేపిల్ మీదను, ప్రత్తిపోగుల సన్నదనము, బరువుమీదను ఆధారపడియుండును. మన దేశపు పత్తులలో ౭/౮ అంగుళములకు మించిన స్టేపిల్ గలపత్తియే లేదు. కంబోడియాకు ౧ అంగుళ ముండును. పొడుగుస్టేపిల్ ఉండిన ఎక్కువ నెంబరు నూలు వడకవచ్చును. (ఒకపవునుప్రత్తితో ౨౪౦ గజముల నూలు వడికిన ఒకనంబ రగును.)

## ఈపైరుకు హానికరములగు పురుగులు

ఇవి ముఖ్యముగా మూడు రకములు. కాయలో రెండురకము లుండును. రెండును గొంగళి పురుగు జాతులే. ఇంకొకటి మొక్కమొదలులో నుండును. అచట పెద్దపెద్ద బొడిపెలు బయలుదేరును. మొక్క కొన్నాళ్లకు కింపబడి, ఎండి చనిపోవును. ఈపురుగు లున్న కాయలను, మొక్కలను ఏరి, తగలపెట్టవలెను. ఈపురుగులు ఒకసంవత్సరమునుండి ఇంకొకసంవత్సరమునకు రాకుండా మూడునెలలు, ప్రత్తి భూమిమీద నుండకూడదని సర్కారుశాసన మున్నది. దీని ననుసరించి ఆగస్టు మొదటితేదికి ప్రత్తిమొక్కలన్ని పెరికివేయవలెను. మంచిరకముల విత్తనములను ప్రభుత్వపువారి నడిగి తెప్పించి నాటవలెను.

ఈమొక్కకు భగవదనుగ్రహమువలన భయంకరములైన జబ్బు లేవియులేవు.

ఈపంటకగు ఖర్చు (సుమారు)
(మెట్టపత్తి ౧ యకరమునకు)

| | |
|---|---|
| విత్తనమునాటుటకు భూమిని తయారుచేయుట | రూ. ౪-౦-౦ |
| పత్తిగింజలు చల్లుటకు | ౧-౦-౦ |
| తరువాతి సాగుబడి | ౩-౨-౦ |
| పత్తితీయుట | ౪-౪-౦ |
| | ౧౨-౬-౦ |

పంటకు ౩౦౦ పవునుల దూది సాధారణముగా వచ్చును.

కంబోడియా (౧ యకరం)

| | |
|---|---|
| భూమిదున్నుట, గట్లు చాళ్లు చేయుట రూ. | ౧౦-౦-౦ |
| ఎరువు | ౨౦-౦-౦ |
| విత్తులు నాటుట | ౨-౦-౦ |
| నీరుపెట్టుట | ౨౦-౦-౦ |
| తరువాతి సాగుబడి | ౧౦-౦-౦ |
| పత్తితీయుట | ౧౧-౮-౦ |
| పత్తిమొక్కలను లాగివేయుట | ౪-౦-౦ |
| | ౮౦-౦-౦ |

ఆదాయము సగటున ౧౦౦౦ పవునుల దూది. ఈఖర్చుకు భూమిశిస్తు ౧-౪-౦ మొదలు ౨-౪-౦ వరకు కలుపుకొనవలెను. మెట్టపత్తి ౨౫౦ పౌనులు ౨౨ రూపాయలచొప్పునను, కంబోడియా ౨౬ రూపాయలచొప్పునను చూచుకొనినయెడల మెట్టపత్తికి సుమారు ౫ మొదలు ౭ రూపాయిలును, కంబోడియాకు సుమారు ౨౫ రూపాయిలును యకరమునకు లాభము నిచ్చును.

వరిపంట నొక్కదానినే ఆధారముచేసికొని నష్టపడుచున్న డెల్టారయితులు కొంత భూమిలో ఈపంటను వేసిచూచినచో బాగుగా నుండుననుకొందును. జాగ్రత్తగా సేద్యము చేసికొనినచో ప్రత్తిపంట లాభకారి యగును.

# పౌరుషయాత్ర

కుందుర్తి నరసింహారావు

దారిలో నడ్డపడిన భూతప్రభుండు
మిన్నుమన్నావరింపగ మేను పెంచి
ఆర్చి నన్ను మ్రింగ సిద్ధమైనపుడు చూచి
పెంచితిని నాశరీర మావేశగరిమ.

ఎగసి యెగసి భూమండల మ్మాసడించి
త్రిభువనప్రాభవమ్ము నతిక్రమించి
పెంచుచుంటిని తనువు రక్షించుకొనగ
భూతపతివిగ్రహము మించిపోవ దలచి

పోయి, పోయి, నేనే మహాభూత మైతి!
అంతరంగమునుండి నీయరపు వింటి
'దేహభాండమ్ము భూతాహుతిగ నొసంగి
మానవుడవే యగుచు నిల్వ మంచి'దనుచు.

* * * *

చూడవోయి నేసృష్టించు సుమవితానము!
అఖిలకౌమారహృదయమ్ము లపహరించి
ఆడుచున్న వసంతవిహాయసమున:
ఇట్టిపూ లేవి చూపు నీసృష్టిలోన?

ఎందుకో దుఃఖపడిన నాహృదయమధుప
మొక్క స్నేహసుధాబిందు వొందలేదు:
నీలతాంతకాంతాజాతి కేల యింత
నరుల కుపయోగపడని సౌందర్యరేఖ?

నీప్రకృతిలోనిపూలతో రేపుమాపు
ఎంతపూజించినా అంతులేదు నీవు:
ఇపుడు నాయీప్రసూనమ్ము లిచ్చుచుండ
కొలదికొలదిగ నీశక్తి గోచరించు.

* * *

నేడు నాకెంతరక్తమ్ము నీపదద్వ
యమ్ము నభిషేకమొనరింప చిమ్మివేయు
చుంటి, గైకొమ్ము గీతికాశ్రుతి యడంగ,
దానితో కాలమును బుచ్చబోను లెమ్ము;

ఊరకుందు విదేల? నానోరువిప్పి
కదనభేరి మ్రోగించితి, కంధరమ్ము
లెన్ని యో వీరులవి నీకయిచ్చునట్లు
చేసితిగదా నిరంతరావేశ సృష్టి—

ఏది నాధర్మ మిందులో? ఇట్టులే అ
నంతగీతారవమ్మున అఖిలలోక
మల్లకల్లోల మొనరించి అగ్నికుండ
మందు దూకించుటా, నేనె ముందు దూకుటా?

* * *

ఇంతలో నింత చేరువ కేగుదెంచి
యేలపోయెద వింతలో నెటకొ యెటకొ?
మున్నొసంగిన సంకల్పములు హరించి
యెన్న డనుకోని గతులు కల్పింతువేల?

న్నాతరముగాదు నీఖేలన మ్మికేల
యెన్నినాళ్లు వేధించునో యెరుగనైన,
దానికే యింత యత్నింతు నేను—జగము
ఈమహాయత్నమందే నశించునేమి?

* * * *

నిత్యమధ్యాహ్న మోహినీనృత్య మరసి
రగులుచున్న కాంతొరుధిరమున నేనె
అగ్నిపర్వత మనుధైర్య మావహింప
జీవితపథాన త్రిప్పుచున్నావు నన్ను.

తిరుగుచున్నది ప్రాణమ్ము కరడుగట్టి
శైలమై, పంచభూతాల చలనశక్తి
నమ్ముకొన్న తనుస్యందనమ్ము నెక్కి
చేతనాచేతనావస్థ సహించి.

ఇమ్మహీధరగతి నిరోధింప లేక
కాంతికిరణ మ్మొకటి అంధకార మొకటి
తరుముకొనివచ్చి తనువులో కరగిపోయి
దానికరినతకే దోహద మ్మొనర్చు

* * * *

అగ్నిశిఖ లుద్భవించిన వార్చుచున్న
వదె, అదె, పెటీల్ పెటీల్ మటం చాకసమ్ము
నంటుచున్న వాశాంతధూమాంధకముగ
రమ్మురమ్ము వినోదమ్ము రా, సఖుండ?

ఉండరా, దూరముగ నిల్చి ఒక్కసారి
చూచిపోదమ? దీనిలో జొచ్చి, యార్ప
నలవి యౌనేమొ యత్నింతమా? అదేమొ
శౌర్యముగ దీనిలో బడి చచ్చిపోదమా?

చెప్పవే మెన్నిసార్లు ప్రశ్నించినా తె
మల్చి? నా కిందులో నేది మంచిదో ర
వంతయును తేలదాయె—అయ్యయ్యో, అదిగొ
మండిపోయె సమస్తమ్ము మాటలందు!

* * * *

ఈపిపాస కంతములే దనే విచార
మొక్కటే నాహృదయ మేచుచున్న దిపుడు.
ఎన్నియమృతతటాకమ్ము లిగురత్రావి
నా, తరుగ, దేటి కింతదాహమ్ము నాకు?

ఇది తృణప్రాయముగ దాటు నింతలో అ
పక్వజీవితరంగమ్ము, భయము లేదు:
కాని, యేరీతి దైవముఖమ్ము చూతు
ఈ చిరంతనమలినమ్ము నిల్లు తాల్చి?

అతనిసందర్శనము లేక అవని నొక్క
పుట్టువే యెల్లరకు వ్రాసిపెట్టియున్న
నే నిది భరింపలేను భరింపలేను
ఈవిషమచిహ్నతోడ జన్మింప మరల.

* * *

బాలకు డెవ్వడో యెగుర
వైచినగాలిపటమ్ము నే డహో
నీలపయోదరంగమున
నృత్య మొనర్చు, విషాదభారలాం
గూలగతిౕ వడంకు నను
కొందురు భూజనులెల్ల, దానితో
గాలికి దూలిపోవు విహగమ్ము
లెరుంగు తదీయగానముల్.

* * *

---

# స్త్రీధనము—ధర్మశాస్త్రములు

చీమలకొండ వెంకటదీక్షితులు

## ౧. జీవితకాలపుహక్కు - కాత్యాయనుడు

ప్రస్తుతము స్త్రీల యభివృద్ధికై యనేక ప్రయత్నములు జరుగుచున్నవి. స్త్రీ పురుషునితో సమానురాలనియును, సరియగు నవకాశము లొసంగినట్లయిన నామె యాతని కేవిధముగను తీసిపోక ప్రతివిషయమునను నాతనికంటె మిన్నయనిపించుకొన గలదనియును నొకయభిప్రాయము ప్రబలినది. ఆమె కట్టివీలు కలిగించుటకుగాను సంఘమునందేమి, రాజకీయములయందేమి యామెకు పురుషునితో సమానమగు స్వాతంత్ర్యమును, హక్కులును గలుగజేయుటకు పలువురు యత్నించుచున్నారు. కాని మనసంఘము వ్యక్తిస్వామ్యము (Individual ownership)పై నాధారపడియుండునంతకాలము స్త్రీలకు ఆస్తివిషయమున పురుషునితో సమానమగు హక్కులు కలిగిననే కాని, యితర విషయములయందామె యాతనితో సమానమగు గౌరవమును బడయజాలదు. ఎన్ని చెప్పినను, ఏరష్యాలో మాత్రమో తప్ప మిగిలిన ప్రపంచమునందంతటను మానవ సంఘము వ్యక్తిగతస్వత్వము (Individual property) పైననే నడచుచున్నది. ప్రతిమనుజుని యొక్క సౌఖ్యమును, గౌరవమును ఆతని యాస్తిని బట్టియే కలుగుచున్నవి. కావున స్వత్వసంబంధమగు స్త్రీలహక్కులను సవరించుట ఆవశ్యకము.

ఈవిషయమున నితరదేశములందలి పద్ధతులను గాని, ఇతరమతస్థుల పోకడలనుగాని ఊతగాగొని నే నేమియును చెప్పదలచుకొనలేదు. ఏమన శారదాచట్టము మొదలు పౌత్రికి దాయాధికార మొసగబూను విషయమువరకును మనవారు శాస్త్రాధారములనే కైకొని వానినెల్ల ప్రతిఘటింపబూనినారు. కావున ధర్మశాస్త్రములయందు మనస్త్రీలస్థితి యెట్టిదో చూసి శాస్త్రవిరుద్ధముగగాక తదనుసారముగనే స్త్రీల యభివృద్ధి కెట్లు తోడ్పడనగునో చెప్పెదను.

ఈకాలమున బ్రిటిషుకోర్టుల తీర్పుల ప్రకార మేర్పడిన స్త్రీల హక్కులకును, సంస్కృత ధర్మశాస్త్రములందలి స్త్రీలహక్కులకును చాల భేదము గలదు. ఆరెంటికిని ఉత్తర దక్షిణ ధ్రువములకు మధ్యనున్నంత ఎడమున్నది. ప్రస్తుతపు హక్కులు సంకుచితములు. పూర్వముండునవి విశాలములు. ఇప్పుడు న్యాయశాస్త్ర విషయమున మనకేదైనను సంశయము గలిగిన నొక ప్లీడరు నొద్దకు బోవుటయు, నాతడు కొన్ని యాంగ్ల గ్రంథములను, తీర్పులను దిరుగవేసి మనకు సలహానిచ్చుటయును జరుగుచున్నవి. కాని ప్ర ప్రథమమున దీని కంతకును మూలము సంస్కృతమే. అయినను ఆమూల మిప్పుడు మూలబడి తీర్పులును, ఆంగ్లగ్రంథములును ప్రధానస్థాన మాక్రమించినవి. భాషతోబాటు న్యాయసూత్రములు గూడ మారిపోయి మూలమునకు సంబంధములేకుండ పోయినది.

పైన జెప్పిన విషయము ముఖ్యముగ "మితాక్షర"ననుసరించు దేశవిభాగములయందలి స్త్రీలస్వత్వమువిషయమున స్పష్టముగా జూపనగును. "మితాక్షర" యననేమో మనలో గొందరకు దెలియక పోవచ్చును గాన దానిని గూర్చి కొంచెము చెప్పటవసరము. హిందూదేశము నందంతటను హిందువుల విషయమున నిప్పుడొక్కటే న్యాయశాస్త్రము వర్తించుటలేదు. వంగదేశమునందు జీమూతవాహనుని దాయభాగమను గ్రంథము ననుసరించి న్యాయనిర్ణయము చేయబడుచున్నది. మిగిలిన దేశమునందంతటను యాజ్ఞవల్క్య స్మృతిపై విజ్ఞానేశ్వరుడు రచించిన మితాక్షరయను వ్యాఖ్యననుసరించి నిర్ణయము లొసగబడుచున్నవి. ఒక్క వంగదేశమునదప్ప మిగిలిన యెల్లయెడల మితాక్షరయే ప్రథమప్రమాణము. కాని దీని ననుసరించు భాగమునందు మరల నాయాప్రదేశములయందు ఉపయోగింపబడు నితరప్రమాణ గ్రంథముల ననుసరించి యికకొన్ని యంతర్విభాగము లేర్పడినవి. దక్షిణ దేశమున మాధవీయమును, స్మృతిచంద్రికయును ప్రమా

ణములు. ఇట్లే బొంబాయిప్రాంతములందు నీలకంఠుని వ్యవహారమయూఖమును, కాశీప్రాంతములయందు మిత్ర మిశ్రుని వీరమిత్రోదయమును, ఉత్కళమున ప్రతాప రుద్రుని సరస్వతీవిలాసమును నాధారములుగా గైకొన బడినవి. నే నీవ్యాసమున వ్రాయువిషయములు మితా క్షర నవలంబించుప్రజలకును, అందునను దక్షిణమున, ననగా నీప్రాంతములయందు మాధవీయమును, స్మృతి చంద్రికను ననుసరించుచున్న మనకు వర్తించును.

ఇప్పుడు స్త్రీకి గల ఆస్తి రెండువిధములుగా విభజింపబడినది: ౧. స్త్రీధనము, ౨. యావజ్జీవస్వా మ్యము - దీనినే మనము సాధారణముగ జీవితకాలపు హక్కు అని చెప్పుచుందుము. స్త్రీధనమనగా వాడుక యందు స్త్రీకి సంపూర్ణానుభవము, అనగా దానాధమన విక్రయాధికారములుగల ఆస్తియని యర్థము. ఒకఆస్తి స్త్రీధనమనిన, దాని నామె యనుభవించుటకును, ఆమె కిచ్చవచ్చినప్పుడు దానముచేయుటకును, అమ్ముకొనుట కును, తాకట్టుపెట్టుటకునుగూడ హక్కుగలదనియును, ఆమెయనంతర మాయాస్తి ఆమెస్త్రీసంతానమునకు బోవుననియును సామాన్యముగ మనకు దట్టును. అట్లే 'యావజ్జీవము స్త్రీలనుభవించు ఆస్తి' లేక 'జీవితకాలపు హక్కుగల ఆస్తి'యనిన ఆఆస్తిపై వచ్చు ఆదాయము మాత్రమే ఆమె బ్రతికియున్నంతకాలము ననుభవించు టకు నధికారముగల దనియును, నంతకుమించి ఆయాస్తి నామె యమ్ముకొనుటకుగాని, దానముచేయుటకుగాని, మఱేవిధముగనైనను అన్యాక్రాంతముచేయుటకుగాని అధికారము లేదనియును మన మర్థముచేసికొందుము. అంతేకాదు ; ఆమె యంతజాగ్రత్తగ పొదుపుచేసిన ఆయాస్తి ఆమెయనంతరము, ఆమెసంతానమునకుగాక ఆమెభర్తవారసులకో, మఱియొకపురుషుని వారసు లకో చెందుచుండును.

కాని విజ్ఞానేశ్వరుడు స్త్రీలయాస్తి నిట్లు రెండు విధములుగ విభజించియుండలేదు. మితాక్షర ననుస రించి స్త్రీస్వత్వమున కిట్టి ద్వైవిధీభావము కానరాదు. స్త్రీధనమునుగూర్చి మాట్లాడుచు విజ్ఞానేశ్వరు డిట్లు చెప్పి యున్నాడు:

“స్త్రీధనశబ్దో యౌగికః, న పారిభాషికః. యోగ సంభవే పరిభాషాయా అయుక్తత్వాత్.”

“స్త్రీధనశబ్దము యౌగికము, పారిభాషికము గాదు. యౌగికార్థము సరిపడుచుండగా పారిభాషికార్థ మునకై పోవుట తగనిపని” పై మాటల అర్థ మిది. స్త్రీ ధనశబ్దము 'స్త్రీ', 'ధన' శబ్దముల కూడికచే గలిగినది. ('స్త్రియాః ధనం స్త్రీధనం' అని సమాసము) దాని యర్థము స్త్రీకి గల యాస్తియని గాని స్త్రీధనమనగా కేవల మాపేరున వ్యవహరింపబడు కొన్ని ఆస్తులు మాత్రమే యని కాదు. స్త్రీ కేయే యాస్తులయందు హక్కుగలదో ఆవన్నియును స్త్రీధనమే యనిపించు కొనును. స్త్రీధన మనినను, ఆడదాని సొత్తనినను ఒక్కటియే. రెండు పదముల కూడికచే వచ్చిన యర్థ మొకచో వర్తించునప్పుడు దానిని వదలి ఆపదమున కొక వ్యావహారికార్థమును దెచ్చిపెట్టుట పాడిగాదు. కాబట్టి, ఒక స్త్రీ కేవిధముగనైనను కొంత ఆస్తి వచ్చినయెడల ఆ ఆస్తి యామె కెట్లు సంక్రమించినదా యను ప్రశ్న యవసరములేకుండ అదియంతయును స్త్రీధనమే, అనగా - ఆమెకు సంపూర్ణాధికారములు గల ఆస్తియే యగును.

విజ్ఞానేశ్వరుని యభిప్రాయమును పూర్తిగ వ్యక్త పరుపవలెననిన యౌగికపారిభాషికార్థములకు గల భేద మును ముందు చెప్పవలెను. పరమాన్నమను పదమును దీసికొనుడు. పరమాన్నమనగా క్షీరాన్నమని కుఱ్ఱ వానికిగూడ నర్థమగును. కాని అది వాడుకలో నున్న యర్థము. దీనినే పారిభాషికార్థమందురు. యౌగికార్థము వేరు. పరమాన్నమునందున్న పదముల కర్థము 'శ్రేష్ఠమగు అన్నము' అని యగును. కాని శ్రేష్ఠమైన యన్నమనిన మనకు స్పష్టముగ నేదియు స్ఫురింపదు. కావుననే వాడుకలో నిది క్షీరాన్నమైనది. అట్లే పులియోగిరము (పులిహోర) కూడ. పులియోగిరము ఏ పుల్లని యన్న మైనను కానేరదు. అది “పులిహోర”, ఒకపద్ధతిని తయారు చేయబడి ఆపేరుచే నలుగురకును తెలిసిన వస్తువు. పుల్లనియన్నము యౌగికార్థము. పులిహోర పారిభాషి కము, లేక వ్యావహారికము. అట్లే చక్రవర్తిపదము

కూడ. చక్రవర్తి యనిన యేబండిచక్రమువిూదనో యుండువాడుగాక రాజాధిరాజను పారిభాషికార్థమే మనము తీసికొనుచున్నాము. ఈమూడుపదములకును మనము యౌగికార్థమునే తీసికొనినచో నవి యర్థరహితము లగును. కావుననే యిచ్చట వానికి వాడుకలో నొకప్రత్యేకార్థ మేర్పడినది. యౌగికార్థమున కిచ్చట తావులేకపోవుటచే పారిభాషికార్థ మవసరమయినది. ఇక స్త్రీధనశబ్దమువిషయమున నట్లుగాదు. స్త్రీధనమనినే ఆడుదానిసొత్తని స్పష్టార్థము. ఆడుదాని సొత్తనిన పుల్లనియన్నమువలె ఇదమిత్థమని నిర్ణయించి చెప్ప వీలు లేనిది కాదు. స్త్రీ సంపాదించుకొనిన యాస్తి యది. ఆ ఆస్తి యామె కెట్లువచ్చినదను ప్రశ్న యనవసరము. కావున ఒకవిధముగా వచ్చిన యాస్తి స్త్రీధనమనియును, వేరొకరీతిగా సంక్రమించిన యాస్తి స్త్రీధనము కాదని యును చెప్పుట తప్పు. దీని ఫలితార్థ మిది. విజ్ఞానేశ్వరుని యభిప్రాయముప్రకారము స్త్రీకి గల యాస్తిని నేడు మనము విభజించుచున్నట్లు స్త్రీధనమనియు, యావజ్జీవస్వామ్య మనియు విభజించి, ఒకదానిపై నామెకు సంపూర్ణాధికారముల నిచ్చి, రెండవదానిపై ఆదాయమునుమాత్రమే యామె యనుభవింపవలెనని యును, ఒకటి యామె స్త్రీసంతానమునకును, రెండవది వేరొకపురుషుని వారసులకును బోవుననియును చెప్పవీలులేదు. స్త్రీకి గల యాస్తియంతయును స్త్రీధనము. అది యామె పురుషునివలెనే యనుభవింపవచ్చును. ఆమెయనంతర మది యామెస్త్రీసంతానమునకే చెందును.

అట్లయిన ప్రస్తుతము మన న్యాయస్థానముల యందు గుర్తింపబడుచున్న యీజీవితకాలపుహక్కు ఎచ్చటనుండి వచ్చినది? విజ్ఞానేశ్వరుడు స్త్రీకి గల ఆస్తియంతయు స్త్రీధనమే యని యంతవిస్పష్టముగ నొక్కిచెప్పినప్పుడు మనకోర్టులును, ప్లీడరులును స్త్రీలకు పురుషాగతమగు (ఉదాహరణకు భర్తనుండి వచ్చిన ఆస్తి తీసికొనవచ్చును) ఆస్తియందు జీవితాంతమువరకు నొక్క యనుభవాధికారముమాత్రమే కలదని యేల చెప్పుచున్నారు? అనుప్రశ్నలు సహజముగ తోచును.

వీనికి ఒక్కమాటలో సమాధానమిచ్చుటకు వలనుపడదు. ఏలయన, యీయావజ్జీవస్వత్వము మన మనునిమేషమును పీల్చు గాలివలె మనల నావరించి మనరక్తముతో మిళితమైపోయినది. స్త్రీధనమునకు వ్యతిరిక్తముగ మన మీ యావజ్జీవపు హక్కును తెచ్చిపెట్టుకొనియున్నాము. 'వితంతువుయొక్క ఆస్తి', 'దానవిక్రయాధికారములు లేకుండుట', 'అనంతరవారసులు' అనునీభావములు మన కెల్లప్పుడును కళ్లకుగట్టిన ట్లుండును. ఇట్టివన్నియును సరియగు నాధారములులేక శాస్త్రవిరుద్ధములని చెప్పుట చాలసాహసముగ పరిగణింపబడవచ్చును. కాని నిజమేమన మితాక్షరయం దెక్కడను ఇట్టిసూత్రములకు దావులేదు. ఒక్కమితాక్షరయందే యననేల, జీమూతవాహనుని దాయభాగమునను, దాని ననుసరించు మఱికొన్ని వంగదేశగ్రంథములయందును ఎక్కడ మఱి యేయితరస్మృతులందుగాని, వ్యాఖ్యానములయందుగాని యిట్టిసూత్రముల కాధారములేదు. యావజ్జీవస్వత్వమనునది మనకు విజ్ఞానేశ్వరునినుండిగాక బ్రిటిషుప్రభుత్వముతో వచ్చినది. అది వంగదేశమునబుట్టి మొట్టమొదటి బ్రిటిషున్యాయాధికారుల సంస్కృతవాసనారాహిత్యముచేతను, ఆకాలమున ఇంగ్లాండునందలి స్త్రీల హక్కుల సంకుచితస్వభావముచేతను క్రమముగ హిందూదేశమంతటను ప్రాకిపోయి తుదకొక పెనుభూతమై ఆధునికస్త్రీల నావరించినది. జీమూతవాహనుడు సమష్టికుటుంబమున స్త్రీలకు గల హక్కుల నభివృద్ధిపరచుటకు యత్నించెను. సమష్టికుటుంబమున నొకపురుషు డవిభక్తుడై మరణించిన, ఆతని భార్య కాతనిభాగము లభించునను వంగదేశమునందలి పద్ధతి నాత డేర్పరచెను. ఒకమూల నాతడు స్త్రీల కిట్టిహక్కుల నిచ్చుచు నింకొకమూల నామెకు యావజ్జీవస్వత్వముమాత్రమే కలదనియును, నామెయనంతర మాయాస్తి భర్తవారసులకే పోవుననియును చెప్పినాడు. వంగదేశము మొట్టమొదట బ్రిటిషుపరిపాలనలోనికి వచ్చుటచే తెల్లజడ్జీలు ముందచ్చట తమపనిని ప్రారంభించిరి. తరువాత క్రమముగ మనదేశమంతయును బ్రిటిషుప్రభుత్వమునకు లోనైనది. ఆ బ్రిటిషుప్రభుత్వముతో బాటు ఒక్క వంగదేశమునకే

వర్తించవలసిన యీయావజ్జీవస్వత్వసూత్రము తెల్లదొరల దయవలన హిందూదేశమంతటను బ్రాకిపోయినది. కాని యిది కేవల మన్యాయమును, ఆధారరహితమును.

ఇంకొకవిషయమును గమనింతము. ఈయావజ్జీవస్వామ్యమునకు మూలాధారము కాత్యాయనుని శ్లోకమొకటి. కాత్యాయనుడు స్మృతికర్తగాను, వ్యాఖ్యానకర్తల యభిప్రాయములకంటె ఆతనిమాటకే ఎక్కువ విలువ నీయదగునని కొందర నవచ్చును. కాని కాత్యాయనుని శ్లోకమునుబట్టి యావజ్జీవస్వామ్యమును సాధించుట సులభమైన పని గాదు. కాత్యాయనస్మృతి యిప్పుడు శిథిలమైపోయినది. ఈమధ్య 'కానె'గారు దాని నుద్ధరించినారుగాని ఆయన యాస్మృతియందలి కొన్ని శ్లోకములయొక్క యర్థమును సరిగా గ్రహించి వానికి తగిన స్థానము నిచ్చినట్లు గన్పట్టదు. కాత్యాయనుడు ఋషులలో కడపటివాడు. ఆతని పిమ్మట స్మృతికర్తలు లేనేలేరని చెప్పవలెను. కాత్యాయనస్మృతి కనంతరము వ్యాఖ్యానకారులే యుద్భవించిరి. అటుపైన స్మరణమునకు తావులేదు. కావున కాత్యాయనుడు వ్యాఖ్యానకర్తలకు చాలదగ్గరవాడు. కాని యాతడైనను జీవితకాలపుహక్కు నంగీకరించెనని చెప్పుటకు వీలులేదు. ఆతని శ్లోకము నొకదానిని తీసికొని విజ్ఞానేశ్వరునకు చాలతరువాతివాడగు జీమూతవాహనుడే సూత్రమునకు రూపొసంగినాడు. ఆశ్లోక మిది :

"అపుత్రా శయనం భర్తుః పాలయంతీ వ్రతే స్థితా,
భుంజీ తామరణాత్ క్షాంతా, దాయాదా ఊర్ధ్వ
[మాప్నుయుః"

అపుత్రయగుస్త్రీ పతిశయనమును పాలించునదై వ్రతనియమము గలిగి, మరణించువరకును మితముగ ననుభవించవలెను. అనంతరము దాయాదులు పొందుదురు.

ఈశ్లోకము చాల అస్పష్టముగా నున్నది. దీని యర్థ మిది యని నిర్ణయించుట క్లిష్టసమస్య. ప్రతిచోటను సందేహమునకు తావే. ఈమె అనుభవించునదేమి? అది ఎవరి ఆస్తి? ఆమెదా, ఆమెభర్తదా? మితముగ ననుభవించుట యననేమి? ఈదాయాదు లెవ్వరు? వారామెవారసులా? లేక ఆమె భర్తవారసులా? ఈ శ్లోకమున జెప్పబడిన యనుభవము ఆ స్త్రీయొక్క యనుభవమా? లేక ఆదాయముయొక్క యనుభవమా? అను ప్రశ్న లనేకము లొకదానివెంట నొకటిగ మనకు దట్టును.

ఈశ్లోకమున నితంతువు మితముగ ననుభవించవలెనని చెప్పియుండుటచే నామె కాదాయముపైన మాత్రమే అధికారము గలదని చెప్పుటకు వీలులేదు. మన ధర్మశాస్త్రము లన్నియును ఆస్తి మితముగనే యనుభవింపబడవలెననియును, అనవసరవ్యయము చేయగూడదనియును ఘోషించుచున్నవి. స్త్రీయేకాదు, పురుషుడు కూడ తన స్వార్జితద్రవ్యమైనను నిచ్చవచ్చినట్లు వెచ్చింపగూడదని శాస్త్రపద్ధతి. ఈక్రింది శ్లోకమును గమనింపుడు :

"యేజాతా యేఽ ప్యజాతాశ్చ, యేచ గర్భే వ్యవస్థితాః,
వృత్తిం తే త్వభికాంక్షంతి, నదానం, నచ విక్రయః."

(పుట్టినవారికిని, పుట్టబోవువారికిని, గర్భస్థులకును జీవనోపాధి యవసరము. కావున ఆస్తిని దానముగాని, విక్రయముగాని చేయరాదు)

ఇట్లే మరియొక శ్లోకమును జూడుడు :

"స్థావరం ద్విపదంచైవ యద్యపి స్వయ మర్జితమ్,
అసంభూయ సుతాన్ సర్వాన్ నదానం నచవి
క్రయః."

భూమియును, బానిసలును ఒకనిచే స్వయముగా నార్జింపబడినను పుత్రులనందఱను సముకూర్చనిదే వానిని దానముగాని, విక్రయముగాని చేయరాదు.

దీనివలన కుటుంబాస్తియే కాక స్వార్జితము కూడ నన్యాక్రాంతము చేయగూడదనియే స్మృతికర్తల యభిప్రాయమని తేలుచున్నది. కాని అంతమాత్రమున నొకపురుషునకు తన స్వార్జితపుటాస్తియందు సంపూర్ణాధికారము లేదనిగాని, ఆతని అనంతర మది యతని సంతానమునకు జెందదని గాని మనము చెప్పజాలము. అందువలన నాతని కాయాస్తియందు జీవితకాలపు

హక్కు మాత్రమే కలుగుటలేదనుట స్పష్టము. ఆ స్తి కుటుంబపోషణార్థము కావున దాని ననవసరముగ వ్యయము చేయగూడదు. వితంతువువిషయమున జెప్పినది కూడ నంతేయగును.

కాత్యాయనుని శ్లోకార్థమును చర్చించు సమయమున పై విషయమును జ్ఞాపకముంచుకొనవలెను. ఆ శ్లోకమున సాధారణముగ 'క్షాంతా' యను పదమును 'భుంజీత' యను క్రియతోగలిపి 'క్షాంతా ఆమరణాత్ భుంజీత' యని యన్వయించుచున్నారు. అనగా యావజ్జీవమును నామె మితముగ భుజింపవలెనని. కాని 'క్షాంతా' యను పదము 'అపుత్రా'యను పదమునకు విశేషణముగావచ్చును. అప్పుడు విధవ యోరిమి గలదై పునీతయైయుండి ద్రవ్యము ననుభవింపవలెనని యర్థము చెప్పవలసివచ్చును. అప్పుడు మితానుభవమును సూచించుట కవకాశమేయుండదు.

ఇక 'భుంజీత' యను పదము కేవలము ఆదాయానుభవమునే సూచించుననియును, అందువలన వితంతువునకు దానవిక్రయాద్యధికారములు గల సంపూర్ణ స్వామ్యము లేదనియును చెప్పుటకు వీలులేదు. భోగము ఆదాయానుభవముచేనైనను గావచ్చును, లేక విక్రయాద్యధికారములను వినియోగించుకొనుటచేనైనను గావచ్చును. భోగశబ్దమునం దీరెండును నిమిడియున్నవి.

దాయాదుల విషయమెత్తుకొనిన ఆ దాయాదులామెదాయాదులు కారని చెప్పుట కేమియును వీలగపడదు. భర్తదాయాదు లనుట కాధారము లసలేలేవు. ఆమెదాయాదులే యట సూచింపబడినా రనుటకు మాత్ర మొకింత బాహ్యప్రమాణము గలదు.

ఒక్క జీమూతవాహనుడును, ఆతని యనుచరులును దక్క మిగిలిన నిబంధకారు లెవ్వరును ఈ శ్లోకమునుబట్టి వితంతువునకు యావజ్జీవాధికారము మాత్రమే కలదని చెప్పియుండలేదు. పైన వివరింపబడిన సందేహములను బోద్రోలి కాత్యాయనుని యభిప్రాయ మిది యని నిర్ణయించుటకు దగిన యాధారము లీశ్లోకమునందు లేకపోయినను, ఇతరధర్మశాస్త్ర గ్రంథములయం దీవిషయమున మనకు గొంతసహాయము దొరకగలదు.

దేవన్నభట్టు తన స్మృతిచంద్రికయం దీశ్లోకమునుగూర్చి యిట్లు చెప్పియున్నాడు :

"యత్తూక్తం కాత్యాయనేన 'అపుత్రా శయనం భర్తుః......' త దవిభక్తదశాయాం రక్షణభరణాసమర్థేషు కార్యాంతరనిమగ్నేషు వా శ్వశురాదిషు, పత్న్యాః స్వయమేవ జీవనార్థ ముపాత్త అవిభక్తద్రవ్యవిషయం. విభక్తద్రవ్యవిషయత్వే వృద్ధమన్వాదివచనవిరోధాపత్తేః."

దాని యర్థ మిది: "కాత్యాయనుడు చెప్పినది భర్త అవిభక్తుడై చనిపోగా మామగారు మొదలగువారు వితంతువును రక్షించుటకును, పోషించుటకును అసమర్థులైనప్పుడుగాని, లేక వారితరకార్యములందు మునిగియున్నప్పుడుగాని, ఆవితంతువునకు స్వయంజీవనార్థము వారిచే నొసగబడిన అవిభక్త కుటుంబాస్తివిషయమున వర్తించును. భర్త విభక్తుడై చనిపోయినప్పుడు భార్యకు దాయరీత్యా సంక్రమించిన యాస్తివిషయమున నది వర్తింపజాలదు. అట్లుకాకున్న వృద్ధమనువు మొదలగు వారి వచనములతో విరోధము సంభవించును." దేవన్నభట్టుని అభిప్రాయముప్రకారము స్త్రీకి వారసత్వము వలన సంక్రమించిన యాస్తి కీశ్లోకమునందలి సూత్రము వర్తింపదు. భరణమునకై యొసగబడిన యాస్తి నామె పొదుపుగా వాడుకొనవలయును. పోషణార్థమే అది యామె కీయబడినదిగాన ఆమెయనంతర మేమైనను మిగిలియున్న ఆశేషము మఱల కుటుంబాస్తిలో జేరిన జేరవచ్చునేమో. అంతేగాని యిచ్చట యావజ్జీవస్వామ్యప్రశంసగాని, దాయప్రశంసగాని యేమియును లేదు.

వ్యాఖ్యానకర్తలలో దేవన్నభట్టు అర్వాచీనుడు. ఆతనికాలము మనకు చాలసమీపమే. కాని యనేక శతాబ్దములకు బూర్వపువాడగు కౌటిల్యు డీవిషయమున నేమిచెప్పెనో చూతము. అర్థశాస్త్రమునందు కాత్యాయనుని శ్లోకమును జాలవరకు బోలియున్న సూత్ర మొకటి గలదు. దానిని క్రింద నుదాహరించుచున్నాను :

"అపుత్రా పతిశయనం పాలయంతీ, గురు సమీపే స్థితా, స్త్రీధనం ఆఆయుఃక్షయా ద్భుంజీత. ఆపదర్థంహి స్త్రీధనం. ఊర్ధ్వం దాయాదం గచ్ఛేత."

(కొడుకులులేని విధవ పతిశయనమును పవిత్రముగ నుంచుచు, పెద్దలయొద్ద నుండి, స్త్రీధనమును జీవితాంతమువరకును అనుభవింపవలయును. స్త్రీధనము ఆపత్కాలమున నుపయోగింపబడుటకై యేర్పడినది. పిదప నది దాయాదుని దగును.)

కాత్యాయనుని శ్లోకమున మనకు గలిగిన కొన్ని సందేహము లిచ్చట తీరుచున్నవి. ఈ సూత్రము స్త్రీధనమునకు వర్తించునుగాని భర్త ద్వారా సంక్రమించిన యాస్తికి వర్తింపదు. ఈ స్త్రీధనమైనను ఆమె తన జీవితాంతమువరకును అనుభవింపవలెనని యున్నది. కాని అంతమాత్రమున నామె సంపూర్ణస్వత్వమునకు భంగము కలుగుటలేదు. ఏమన, స్త్రీధనము ఆపత్కాలమున నుపయోగించుకొనుటకై యొసగబడినది. కావున నామె వితంతువగుటచే నెట్టియాపద యెప్పుడు వచ్చునోయని జీవితాంతమువరకును దానిని మితముగ ననుభవించుచు ముందుముందు హైన్యము రాకుండునట్లు జాగ్రత్తపడవలెనని యభిప్రాయము. కాత్యాయనుని శ్లోకమునందు వలెనే యిచ్చటను 'భుంజీత' యనుపద మగపడుచున్నది. కాని స్త్రీధనశబ్దమునకు కౌటిల్యు డొసగిన యర్థమును బట్టి యీపదమున కాదాయమునుమాత్రమే యనుభవింపవలెనని యర్థము చెప్పుటకు వీలులేదు. కౌటిల్యుడు 'వృత్తి రాబంధ్యంవా స్త్రీధన'మని చెప్పియున్నాడు. అనగా భరణమును, నగలును స్త్రీధనమని యభిప్రాయము. వీనిపై వచ్చు నాదాయమునుమాత్రమే యామె అనుభవింపవలెనని చెప్పుట అర్థరహితమగు మాటగదా.

ఇక దాయాదు లెవ్వరనువిషయమునగూడ నిచ్చట ననుమానమునకు దావులేదు. వనితయొక్క స్త్రీధనము భర్తవారసులకు బోవుననుట నిస్సందేహము. అది యామె వారసులకే చెందును. కావున కౌటిల్యునను సరించి యీ సూత్రమును, తదనుసారముగ కాత్యాయనుని శ్లోకమును జీవితకాలపు హక్కునుగాని, అనంతరవారసత్వమును గాని సూచించుటలేదు.

కాని ఇంతకంటెను ప్రధానమగు విషయ మొకటి యున్నది. కాత్యాయనుడుసహితము ఈశ్లోకమువలన వితంతువునకు యావజ్జీవస్వత్వమును, దాయాదులకు అనంతరవారసత్వమును ప్రతిపాదింపనూహింపలేదని చెప్పుట కాధారము లున్నవి. స్త్రీధనమునుగూర్చి యీతడు చాల విశాలములగు భావములను వెలిబుచ్చియున్నాడు.

"ప్రాప్తం శిల్పైస్తు యద్విత్తం
ప్రీత్యాచైవ యదన్యతః,
భర్తుః స్వామ్యం సదా తత్ర,
శేషంతు స్త్రీధనం స్మృతమ్"

(శిల్పముచేగాని, ఇతరులవలన ప్రీతిపూర్వకముగ బహుమానముగాగాని స్త్రీకి లభించిన ఆస్తియందు భర్తకెల్లప్పుడును అధికారము (స్వామ్యము) కలదు. మిగిలిన దంతయును స్త్రీధనము.)

ఈశ్లోకముతుదనున్న "శేషంతు స్త్రీధనం స్మృతం" అనుమాటలు చాలముఖ్యమైనవి. కాత్యాయనుడు నిస్సందేహముగ, ఘంటాపథముగ మిగిలినదంతయును స్త్రీధనమని వ్రాయుచ్చియున్నాడు. ఒక్క శిల్పప్రాప్తమును, ఇతరులవలన, అనగా బంధువులుకాని వారియొద్దనుండి పొందిన బహుమతులునుదప్ప స్త్రీకేయే ఆస్తులుండినను అవన్నియును అనుమానము లేకుండ నామెసొత్తే యగును. స్త్రీహస్తమునందు రెండు విధములగు ఆస్తు లుండవచ్చుననియు, సందొకదానియందు మాత్రమే ఆమెకు సంపూర్ణమగు నధికారము గలదనియును కాత్యాయను డభిప్రాయపడినట్లయిన, 'శేషంతు స్త్రీధనం స్మృతం' ఇవితక్క మిగిలిన దంతయు స్త్రీధనమే అనిచెప్పియుండడు. ఇచ్చట నింకొకవిశేషము కలదు. ఈశ్లోకమునందు కాత్యాయను డొక నూతన సూత్రమును జెప్పుటలేదు. అత డొకస్మృతిని, అనగా సాంప్రదాయికమగు సమాచారమును, మనకు చెప్పుచున్నాడు. ఈరెండువిధములగు ఆస్తులునుదక్క మిగిలిన వన్నియును స్త్రీధనముగా పూర్వమునుండియు బరిగణింపబడుచున్నవని స్మృత మనుపదమున కర్థము.

ఇచట ఒకచిన్న విషయమును గూర్చి చెప్పవలసి యున్నది. శిల్పప్రాప్తమును, బాంధవేతరుని బహుమతి

యును స్త్రీధనమునుండి తొలగింపబడుట కాత్యాయనుని ఇచ్ఛావిహారము గాదు. శిల్ప మనిన లౌకికవిద్య యని వ్యాఖ్యానకర్తల యభిప్రాయము. లౌకికవిద్య యనిన అవైదిక విద్య; వేదవిద్యకానిది. యాజనాధ్యాపన ప్రతిగ్రహములచే స్త్రీలు ధనము సంపాదించుట కవకాశము లేదు. ఏమన, స్మృతికాలమున వేదమభ్యసించుటకు స్త్రీలనర్హలు. కాబట్టి వారికి మిగిలినది శిల్పము-అవైదికవిద్య-మాత్రమే; అనగా, సంగీతము, నృత్యము, చిత్రలేఖనము మొదలగునవి. కాని వీనివలన గూడ స్త్రీ ధనార్జనముచేయ రాదని శాసించుట కొకముఖ్యకారణ మున్నది. పాణిగ్రహణసమయము మొదలు భర్తజీవించియుండునంత కాలమును, స్త్రీ తన యావచ్ఛక్తులను భర్తసౌఖ్యమును పెంపొందించుటకును, గృహకృత్యములను చక్కగ నవరించుటకును వినియోగింపవలెనని ధర్మశాస్త్రకర్తల యభిప్రాయము. స్త్రీకి భర్తృసేవయే పరమావధి; గృహకృత్యమే నిత్యకృత్యము. 'జాయేదస్తమ'ని వేదమును, "గృహిణీగృహముచ్యతే"యని మనుస్మృతియును జెప్పియున్నవి కదా. కావున స్త్రీ గృహకృత్యములను, భర్తసేవయును గట్టిపెట్టి తనకాలమును లౌకిక విద్యలచే ధనార్జనమున కుపయోగింప వీలులేదు. ఒక బంధువు కానివానిచే నొసగబడినబహుమాన మన్నో అచ్చట గూడ నిట్టిదే లోక సంగ్రహకరమగు నొక ప్రయోజన మున్నది. హైందవయువతికి ఇలువెడలి నూతన పురుషులతో స్నేహముచేయుటకును, వారినుండి బహుమతుల బడయుటకును అవకాశముగాని, అవసరముగాని లేదు. కుటుంబమున భార్యాభర్తల కంతఃకలహములును, పరస్పరప్రేమ కంతరాయములును, గార్హస్థ్యమున నసౌఖ్యమును లేకుండజేసి అన్యోన్యానురాగమును, విశ్వాసమును పెంపొందించి సాంసారికానందవాహినిని నిర్మలముగను, శాంతముగను ప్రవహింపజేయుటకై యేర్పరుపబడిన సూత్ర మిది. స్మృతికర్తలు స్త్రీ లీవిధముగ ధనము నార్జింపరాదని శాసించలేదు. వారంతకంటె బలవత్తరమును, నిరోధసమర్థమును నగు మార్గమును గనిపెట్టిరి. స్త్రీ లీకట్టుబాటునకు లోనుగాక ధనార్జనకు దొరకొందురేని వారికి దానివలన గలుగు ప్రతిఫలము శూన్యము. వారు తెచ్చిన సొత్తెల్ల భర్తదే యగును. తమకు మిగులునది శ్రమయు, నసౌఖ్యమును మాత్రమే. కావున కాత్యాయనుడు స్త్రీధనమునుండి ఈ రెండు విధములగు ఆస్తులను తొలగించినంతమాత్రమున స్త్రీధనశబ్దముయొక్క యౌగికార్థమునకు భంగము రాలేదు. ఆ తొలగింపు పారిభాషికార్థము స్ఫురింపజేయుటకంటె యౌగికార్థమునే ధ్రువపరచుచున్నది. ఏమన నా రెండువిధములగు నాస్తులును స్త్రీధనము కానేరవనుటకంటె ఆ రెండు విధములుగ స్త్రీ ధనార్జనచేయవీలుగాదని చెప్పుట సమంజసము.

ఇంకొక చిన్న విషయమును జెప్పి ఈ జీవిత కాలపు హక్కునుగూర్చిన ప్రశంస ముగించెదను. కాత్యాయనుని శ్లోకమున వితంతువు మితముగా ననుభవించవలెననియే యున్నదిగాని ఆమెకు విక్రయాద్యధికారములు లేవని చెప్పబడియుండలేదు. ఒక హక్కు గలదని సూచించు సూత్రమునుండి తత్సంబంధమగు మఱికొన్ని యితర హక్కులు లేవని చెప్పజూచుట న్యాయవిరుద్ధము. నీ వీయింటిలోనికి పోవచ్చుననిన ఎదుటింటిలోనికి గాని, ప్రక్కయింటిలోనికి గాని పోగూడదని చెప్పదగునా? వితంతువునకు విక్రయాద్యధికారములు లేవనియే కాత్యాయనునియొక్కయు, నితర స్మృతికర్తలయొక్కయు నభిప్రాయమైయుండిన, వారావిషయమునం దనుమానమునకు తావులేకుండ విస్పష్టముగా చెప్పియుండెడివారు. హక్కుబాధ్యతలవిషయమున 'ఔన'నుదానినుండి 'కాదని'యు, 'కలద'నుదానినుండి 'లేదని'యు సమర్థించుట సరికాదు. న్యాయశాస్త్రమే హక్కును, బాధ్యతయు గలవని చెప్పునో అవి యున్నవి; ఏవి లేవని చెప్పునో అవిమాత్రమే లేవు. స్వామ్యమును అనేకవిధములుగ వినియోగించుకొనవచ్చును. అం దనుభవము మితముగా నుండవలెనని హెచ్చరించినంతమాత్రమున మిగిలిన హక్కులన్నియు నశించిపోవు.

కాబట్టి వితంతువునకు భర్తయాస్తియందు జీవిత కాలపు హక్కుమాత్రమే కలదని చెప్పుటకు వీలులేదు. వితంతుస్వామ్యము సర్వసాధారణమగుటచే నే నింతవర

కును ఆమెనుగూర్చి చర్చించితినేగాని, ఇదంతయును ఒక్క వితంతువునకేగాక పురుషునిద్వారా దాయము సంక్రమించిన ప్రతిస్త్రీవిషయమునను చెల్లును. కూతునకు తండ్రిద్వారా వచ్చిన ఆస్తియందును, తల్లికి పుత్రుని మరణానంతరమువచ్చిన ఆస్తియందును, అట్లే పితామహికి పౌత్రునిద్వారా వచ్చిన ఆస్తియందును సంపూర్ణమగు స్వామ్య మున్నది. పైచర్చయందు వితంతుపదము కేవల ముపలక్షణము.

దీనివలన తేలునదేమన, స్త్రీ ధనశబ్దము యౌగికమను విజ్ఞానేశ్వరుని యభిప్రాయము స్మృతివిరుద్ధముగాక తదనుసారముగనే యున్నది. స్త్రీ యేవిధముగ నాస్తి నార్జించినను అదంతయు నామెదే యగును. దానియం దామెకు సంపూర్ణమగు స్వత్వము కలదు. ఆయాస్తి ననుభవించుటకేకాక, ఆమెయిష్టమునసుసరించి వినియోగించుకొనుటకును ఆమె కధికార మున్నది. అనుభవేతర వినియోగమువిషయమున స్త్రీలఆస్తియందు కొన్ని విభేదము లుండవచ్చును. కొన్నిటివిషయమున భర్త జీవించియున్నపుడు వాటి నామె యన్యాక్రాంతము చేయవలెననిన భర్తఅనుమతి అవసరమైనను గావచ్చును. అంతమాత్రమున ఆమెకు కేవలము ఫలానుభవమే కలదని చెప్ప వీలులేదు. స్త్రీస్వామ్యమునందున్న యాస్తికి స్త్రీయే సంపూర్ణస్వామిని. ఆమెయనంతర మాఆస్తి యంతయు ధర్మశాస్త్రమున స్త్రీధనప్రకరణమున చెప్పబడినరీతిని ఆమెస్త్రీసంతానమునకే చెందును.

---




## రేడియో విమానము

మనిషి లేకుండ కేవలం రేడియో యంత్రమువలన నిర్ణీతమార్గమున ఎగిరి దిగగల విమానమును బ్రిటిషు వైమానిక శాఖవారు కొన్ని సంవత్సరములు కృషిచేసి కనిపెట్టిరి. ఇది ప్రయాణము చేయుటయేగాక గుండ్రముగదిరుగుట, పల్టీలుకొట్టుట కూడ యొనర్చి సురక్షితముగ నేలదిగును. నడపుయంత్రములందు "కాకుపిట్టు" మూతవేయబడియున్నది.




అఖిల యూరోపు దేశ సౌందర్యస్పర్థకు పోటీచేసిన వివిధప్రాంతముల అందకత్తెలు




మైలాపూరుశారదావిద్యాలయము - హిందీతరగతి ప్రారంభసభ

# యుద్ధమా — శాంతియా?

చా. వెం. హనుమంతరావు

[ఈ వ్యాసము ౧౬-౧౧-౩౮ నాడు భారతి కార్యాలయమునకు చేరినది—సంపాదకుడు]

## ౧

### ప్రస్తుత యూరపుఖండపరిస్థితుల సింహావలోకనము

ఇరువది సంవత్సరములకు ముందువలెనే ఇప్పుడు కూడ యూరపుఖండమం దంతటను యుద్ధసంరంభము వినుపించుచున్నది; ప్రతి దేశమందును యుద్ధసన్నాహములు జరుగుచున్నవి. ఏమి మాట్లాడిన ఏమి నష్టము వాటిల్లునో, ఏవిధమగు ప్రతిఫలము కలుగునో యనుభయము ప్రతిదేశమందలి ముఖ్యమగువారిమనస్సుల నావేశించియున్నది. యుద్ధపరికరముల సమకూర్చుటలో ప్రతిప్రభుత్వము ముందంజ వైచుచున్నది. జర్మనీలో హిట్లరుమహాశయుని ప్రాబల్యమును ప్రతివారును భయ సంభ్రమములతో కనిపెట్టుచున్నారు. ఆస్ట్రియా దేశము ఆచుట్టుపట్ల ప్రదేశములును ఎప్పటివలెనే తీవ్రసంఘర్షణల కాలవాలములై యున్నవి. ఈ సందర్భములలో, ఏచిన్నకారణమువలన నైనను, ఎవరి తెలివితక్కువవలన నైనను, యుద్ధము బయలుదేరుటకును, యూరపుఖండ మునంతను యుద్ధవాతావరణ మావరించుకొనుటకును అవకాశము లెన్నేని కలవు.

కాని ఈవిధముగ యూరపుఖండమం దంతయు యుద్ధప్రయత్నములు జరుగుచున్న సమయమందు శాంతిస్థాపనార్థము పనిచేయువిధానములు, సంస్థలుకూడ లేక పోలేదు. ౧౯౧౪ నుంచి ౧౯౧౮ సంవత్సరము వరకు జరిగిన ఐరోపామహాయుద్ధములో అనుభవించిన బాధలు నష్టములు, జ్ఞాపకముంచుకొనినవా రెవరుకాని మరల యుద్ధము రావలెనని తలంచువా రుండరు. ఆ యుద్ధము వలన ఓడిపోయినవారును, గెలుపొందినవారును కూడ సమానముగ తీవ్రనష్టములకు పాల్పడిరని తెలిసికొనినవా రెవరుకాని యుద్ధము మంచిదని చెప్పవా రుందు రని తలంపవీలులేదు. యుద్ధము నడుపుటకు కావలసినడబ్బు, ఇతర పరికరములు సేకరించుటకు, యూరపుఖండమం దేదేశమువారికికాని ప్రస్తుతము తగుసావకాశము చాలదు. యూరపునందు యుద్ధమున కనుకూలమగు పరిస్థితులు ప్రబలుచున్నవనుమాట నిజమే; కాని వాటివలనవెంటనే యుద్ధము బయలుదేరునని చెప్పుట సాహసమే. వీలైనంతవరకు అట్టి సంఘర్షణ బయలుదేరుటకే సర్వప్రయత్నములు చేయబడుననికూడ తలంపవచ్చును.

## ౨

యూరపుఖండమం దేయే విషయముల వలన యుద్ధమునకు ప్రోత్సాహము కలుగుచున్నది? ఏయేవిషయములు దానికి ప్రతికూలముగ నున్నవి? ఈప్రశ్నలను మానసిక, రాజకీయ, ఆర్థిక, రాష్ట్రీయ సందర్భములను బట్టి ఆలోచించుట అవసరము.

మానసిక విషయములలో ముఖ్యముగ జ్ఞాపకముంచుకోవలసినది యూరపునం దంతటను ప్రస్తుత కాలములో ప్రబలముగా నున్న జాతీయ భావములు. ౧౯౧౪ వ సంవత్సరమునకు ముందు ఆఖండమంతయు పెద్దరాజ్యభాగములుగ విభజింపబడి యుండుటచే, వాటియందలిప్రజలకు ప్రత్యేకత లేక జాతీయభావములు సంకుచితముగ నుండెడివి. ఇటలీ, జర్మనీరాజ్యములలో జాతీయస్ఫురణ కల్గిన కొన్ని ప్రజాసమూహము లుండినప్పటికిని, వాటికి స్వకీయ జాతీయభావములు చాల తక్కువగ నుండెను. అట్టి పరిస్థితులలో నాలుగుసంవత్సరముల తీవ్రయుద్ధము ఈ ప్రజాసమూహములన్నిటియందును స్వజాతీయాభిమానమును పెంపొందించెను. ప్రతివానికిని తనజాతియనిన మక్కువ, దానికి ఫలితముగ ఇతరజాతులనిన ఒకవిధమగు నిరసనభావము బయలుదేరెను. యుద్ధమందు గెలుపొందినదేశములవారు తా మేర్పాటుచేసినసంధి షరతులను బలపరచుకొనుటకును, ఓడిపోయినవారు ఆసంధి షరతులను నిరసించుటకును, దానికి మూలముగ ప్రజ

లలో జాతీయత పురికొల్పుటకును ప్రచారము సాగించుచు వచ్చిరి. ఫాసిస్టు విధానము ఏర్పడినదేశములలో జాతీయతాసూత్రము అసహనభావములను పురికొల్పెను. ప్రజాసమూహముల మానసికప్రవృత్తియందు మార్పు కల్గుటకు వివిధదేశములందు ప్రబలిన నిరుద్యోగసమస్య తోడ్పడెను. లక్షలకొలది ప్రజలకు పనిపాటులు లేక జీవనాధారము లేకయున్న సమయములో, వారికి మనశ్శాంతి, సంతృప్తియుండుట అసంభవము. అట్టిపరిస్థితులలో యుద్ధప్రవృత్తి వారిమనస్సులలో ప్రబలుటకు ఎట్టి ఆటంకము నుండదు. ఆర్థికదుస్థితి ఎక్కువగానున్న కాలములో యుద్ధాశయములు ప్రజలమనస్సులను ఆవహించుచునునది సహజమే.

రాజకీయపరిస్థితులను గురించి ఇంక ఆలోచింతము. ఈసందర్భములో ముఖ్యముగ జ్ఞాపకముంచుకోవలసినది జర్మనీదేశపుస్థితిగతులు. ౧౯౧౯ సం. లో వార్సెల్సుసంధివలన మహాయుద్ధము ముగిసినవెంటనే, జర్మనులాసంధిషరతులు తమకు చాల నష్టదాయకములనియు, వాటిని మార్చవలెననియు ప్రచారముచేయుట మొదలుపెట్టిరి. నష్టపరిహారములు తొలగింపవలెనని, 'యుద్ధమునకు జర్మనీయే కారకురాలు' అను సిద్ధాంతము మార్చవలెనని, యుద్ధానంతరము తమవద్దనుండి లాగుకోబడిన వలసరాజ్యములు ఇచ్చివేయబడవలెనని, వారి ఆందోళనలో ప్రధానాంశములు. హిట్లరు జర్మనీ పరిపాలనకు మూలకారకుడైనప్పటినుండియు ఈ ఆందోళనకు మరింతబలము చేకూరెను. పైకోరికలు సిద్ధించునట్లు చేసికొనుటకు జర్మనీకి ప్రస్తుతము బలము చాలకపోవచ్చును. కాని ఆదేశపు రాజనీతిమువలన ముందు యూరపుఖండశాంతికి భంగకరమను సంగతి విదితము. యుద్ధపరికరములను కూర్చుకొనుటలో జర్మనీ ముందంజ వేయుచున్నది. వార్సెల్సుసంధిషరతులప్రకారము ఆదేశపుసైన్యము ౧౦౦,౦౦౦ కంటె ఎక్కువయుండకూడదని నియమింపబడినప్పటికిని, ప్రస్తుతము ౨౦౦,౦౦౦ సైన్య మాదేశమందు తయారైయున్నది. సంధిషరతులప్రకారము, వైమానికదళముకాని, ఇతర పరికరములుగాని వారు తయారుచేయ వీలులేదు. కాని అవన్నియు వారెప్పటివలెనే తయారుచేయుచునేయున్నారు. దేశమందు తీవ్రమగు ఆర్థికదుస్థితి ప్రబలుచుండినప్పటికిని, మిలిటరీ ఖర్చునకై బడ్జెటునందు ౩౫౭,౦౦౦,౦౦౦ డాలర్లు ప్రత్యేకింపబడినది. యూరపుఖండమందు జర్మనీకి ముఖ్యవిరోధులు ఫ్రెంచివారు. కాన పైవిధముగ జర్మనీ తనసైన్యమును బలపర్చుకొనుచున్న సమయములో వారూరకొనలేదు. జర్మనీ, ఫ్రాంసు దేశములకు మధ్యగలసరిహద్దులలో బలమైనకోటలను వరుసగ కట్టి తమదేశమును రక్షించుకొనుటకు ఏర్పాట్లుచేసిరి. ఇంకను ఆకోటలసంఖ్యను ఎక్కువచేసి, వాటిని బలపర్చుటకు ఫ్రాంసు ప్రభుత్వము ప్రయత్నించుచున్నది. జర్మనీలో యుద్ధపరికరములకై ఖర్చు హెచ్చుచున్నకొలది, ఫ్రాంసునందు కూడ దానికై ఖర్చు హెచ్చుచున్నది.

యూరపుఖండమందలి దేశములలో పెద్దవనిచెప్పదగు ఫ్రాంసు జర్మనీ లిట్లు యుద్ధసన్నాహములందు నిమగ్నమై యుండగా, ఇతరదేశములు చేతులు ముడుచుకొని కూర్చొనియుండలేదు. బ్రిటనునందుకూడ ప్రభుత్వమువారు ఇట్టివిధానమునే ఆచరణయందుంచుటకు కృషిసల్పుచున్నారు. ఈమధ్యనే ఆప్రభుత్వమువారు వైమానికదళమునకు ౨౬౦ క్రొత్తరకపు విమానములను చేర్చుటకు నిశ్చయించి దానికగుఖర్చునకయి పార్లమెంటు అనుమతిని పొందిరి. రష్యా, పోలండు, ఇటలీ దేశములలో కూడ ఈవిధముగనే సైన్యదళములను, నౌకాదళములను, వైమానిక దళములను వీలైనంతవరకు హెచ్చించుటకు తీవ్రప్రయత్నములు జరుగుచున్నవి. ఈమధ్యను ఫ్రాంసుదేశములో చంపబడిన యుగోస్లావియాదేశపురాజగు అలెగ్జాండరు, ౨౦ లక్షల సైన్యమును తయారుచేయించి, శిక్షణ నేర్పించియుంచెను. ఇవికాక చిన్నదేశములలో బల్గేరియా, టర్కీ, హంగరీ ఇవన్నియు సైన్యమును హెచ్చుచేయుటలో ఒకదానికొకటి తీసిపోవుటలేదు. 'యూరపు ఖండమందు అపాయస్థానమ'ని పేరుపొందిన ఆస్ట్రియా తనసైన్యమును హెచ్చుచేసుకొనుటకు నానాజాతిసమితివారి అనుమతి పొందెను. ప్రపంచమందంతటను ఆర్థికదుస్థితి

ప్రబలముగా నుండినప్పటికిని, పోయినసంవత్సరమునందు యూరపుమొత్తముమీద చూచిన ప్రభుత్వ - ఆదాయములలో నూటికి ౧౮ వంతు అనగా 300 కోట్ల డాలర్లు, సైన్యములను, ఇతరయుద్ధపరికరములను సేకరించుటలో వెచ్చింపబడెనని తేలుచున్నది. పోయిన ౨౦ సంవత్సరముల చరిత్రను స్థూలదృష్టితో చూచిన, ఎప్పుడు ఏప్రదేశములలో సైన్యములు హెచ్చుగా నుండునో, ఆప్రదేశములందు మాత్రమే యుద్ధము బయలుదేరుట కవకాశములు హెచ్చు గలవని జ్ఞాపకముంచుకొనిన, ప్రస్తుత పరిస్థితులు యుద్ధమున కెంతేని అనుకూలముగ నున్నవని స్పష్టమగును.

## 3

ఆర్థికస్థితిగతుల నాలోచింతము. ఇదివర కెప్పుడుగాని లేనంతవరకు యూరపుఖండమందు ఆర్థిక విరోధములు ప్రబలుచున్నవి. ఆర్థికజయమునకు ముఖ్యాంశము వివిధదేశములకు మధ్య ఆర్థికస్నేహము పెంపొందుట యైయుండగా, మనకు ప్రపంచమందంతటను కన్పించుట నది ఇదివరకుండిన ఆర్థిక కట్టుబాట్లు కూడ సడలుట యైయున్నది. ఆర్థికవిషయములలో ప్రధాన అవసరము అంతర్జాతీయసహకారమై యుండగా, ఆ అంతర్జాతీయసూత్రమునకే తీరని అంతరాయములు కలుగుచున్నవి. చిన్నదేశములుకూడ ఆర్థిక స్వసహాయమునకు ప్రయత్నించుచుండుట ఈపరిస్థితులలో ప్రధానముగ శోచనీయమగు విషయము. దీనికికారణము, ఎప్పుడైనను యుద్ధము బయలుదేరిన స్వశక్తిపై నాధారపడియుండుట లాభదాయక మనియు, అవసర మనియు ఎల్లరును గ్రహించుటయే.

ఆర్థికసమస్య జర్మనీ, ఫ్రాంసుదేశముల మధ్యగల విరోధమును మరింత రగుల్కొల్పుచున్నది. యుద్ధమునకుపూర్వము లోరేన్ ప్రాంతము ఉక్కు, ఇనుము పరిశ్రమలకు ఆలవాలమై యుండెడిది. ఆ పరిశ్రమలకు అవసరమగుకొయిలా, బొగ్గు సార్, రూర్ ప్రాంతములందలి బొగ్గుగనులలో దొరకుచుండెను. ౧౮౭౧ కు పూర్వ మీప్రదేశములన్నియు జర్మన్ సామ్రాజ్యములో చేరియుండెను; కాని ౧౯౧౯ లో లోరేన్ ఫ్రాంసువశీయబడెను; సార్ అంతర్జాతీయ సమితివారిచే పరిపాలింపబడుచున్నది; రూర్ జర్మనీలో నున్నది. అనగా జర్మనీదేశపు ఉక్కుపరిశ్రమ భగ్నము చేయబడి, ఆ దేశము తన ఉక్కుపరిశ్రమకు కావలసిన ఇనుమునకు, బొగ్గునకు ఫ్రాంసు మంచితనముపై ఆధారపడియుండవలసివచ్చినదన్నమాట. ఇదివరకే ఎక్కువగా నున్న ఫ్రాంసు, జర్మనీలవిరోధము ఈకారణమువలన మరింత ఎక్కువగుటయేకాక, ముందుముందు యుద్ధముపొసగుటకొక ముఖ్యకారణముగ పరిణమించుట కవకాశములు కలవు. వీటితరువాత డాన్యూబ్‌నది ప్రాంతము లందలి దేశములు (అనగా మధ్య యూరపుదేశములు) కలవు. వాటిలో వాటికి ఆర్థికసహకారములేనిదే, ఈదేశములు తమతమ ఆర్థికరాజకీయ స్వాతంత్ర్యములను నిలువబెట్టుకొనలేవు. వాటి ఆర్థికదుస్థితే అప్పుడప్పు డాప్రాంతమునందుగల ఆస్ట్రియా, బల్గేరియా మొదలగు దేశములలోని అశాంతి ప్రజ్వరిల్లుటకు కారణముగా నున్నది.

తరువాత రాష్ట్రీయవిషయముల సంగతి. యూరపుఖండమంతయు ప్రస్తుతము అపాయకరములగు స్థానములతో నిండియున్నది. ఈ అపాయస్థానములలో ప్రధానముగ ఎన్నుకోవలసినది రైనునది ప్రదేశము, అనగా జర్మనీ, ఫ్రాంసులసరిహద్దు. వార్సైల్సుసంధి షరతులప్రకారము ఈప్రాంతము ఏరాజ్యమందును చేర్చబడియుండలేదు. కాన ఆదేశములోనికి ఎప్పుడైనను జర్మనులసైన్యముకాని, ఫ్రెంచిసైన్యముకాని పొరబాటువల్లగాని, పెట్టవలెననికాని కాలుబెట్టిన ఇదివరకే రగుల్కొనుచుండిన అగ్ని వెంటనే భగ్గుమనును. రైనులాండు ప్రక్కనే సార్‌ప్రాంతము కలదు. ఈ ప్రదేశములోని ప్రజలు ౧౯౧౯ సంవత్సరములనుండి అంతర్జాతీయసమితివారి అధికారముక్రింద పరిపాలింపబడుచున్నారు. ౧౯౩౫ సం. జనేవరులో, జర్మనీ అధికారముక్రిందనుండుటకో, లేక ప్రస్తుతమున్నస్థితియందే అనగా అంతర్జాతీయ సభవారి అధికారము క్రిందుండుటకో ఫ్రాంసు అధికారము క్రింద నుండుటకో, లేక ప్రస్తుతమున్న స్థితియందే అనగా నంతర్జాతీయ సభవారి అధికారముక్రింద నుండుటకో ఆ ప్రాంతప్ర

ప్రజలు నిశ్చయించుకోవలసి యున్నది. జర్మనీ వారును, ఫ్రెంచివారును కూడ సార్ దేశ ప్రజలను తమతమరాజ్యములలో చేరునట్లు, ప్రోత్సహింపుచు తీవ్ర-ఆందోళన చేయుచున్నారు. ఆస్ట్రియా దేశముతో పాటు సార్ ప్రాంతముకూడ యూరపుఖండ-అపాయకరమగుస్థానమని పేరు గాంచినది.

ఆస్ట్రియా దేశసమస్య ప్రస్తుతపుటా దేశపుస్థితిని బట్టి అంతర్జాతీయసమస్యగా మారినది. జర్మనునాజీలు ఆస్ట్రియా దేశమునకును జర్మనీకిని అవినాభావసంబంధము కలదనియు, అందువలన ఆరెండుదేశములును ఒకే ప్రభుత్వముక్రింద నుండవలెననియు చెప్పుచున్నారు. హిట్లరుప్రాభవము జర్మనీలో హెచ్చుకానంతవరకు ఆస్ట్రియావాస్తవ్యుల అభిప్రాయముకూడ చాలవరకీకలయిక కనుకూలముగనే యుండెను. కాని హిట్లరు తననాజీపక్షబలము నుపయోగించి జర్మనీలో మత స్వేచ్ఛను అరికట్టి, కాతలిక్ మతమును అణగద్రొక్కుటకు మొదలు పెట్టినప్పటినుండి ఈ అనుకూలాభిప్రాయము ప్రతికూలముగ మారెను. జర్మనీతో స్నేహముగానుండవలె ననుపక్షమునకు, అపద్ధతికి వ్యతిరేకముగా నున్నపక్షమునకును ఇంకను బలాబలములపోటీ జరుగుచున్నది. చివర పర్యవసాన మెట్లుండునో గ్రహించుట కష్టము.

## ౪

ఇక దక్షిణయూరపులోని దేశములలో మనము గమనింపవలసినవి ఇటలీ, యుగోస్లావియాలు. ఈరెండు దేశములును ఒకటినొకటి తీక్ష్ణమగు దృష్టులతో కని పెట్టుచున్నవి; యుగోస్లావియా ఆస్ట్రియా రాజకీయములందు పలుకుబడి సంపాదించుటకు ముస్సోలినీప్రభుత్వము వారు చేయుచున్నప్రయత్నముల నెంతమాత్రముసహించుట కిష్టపడుటలేదు. ఇటలీకూడ యుగోస్లావియావిదేశ రాజనీతిని జాగ్రత్తగ గమనింపుచు, ఎప్పటి కేవిధముగ పరిస్థితులు మారునో కనిపెట్టి చూచుచున్నది. ఇట్లే యుగోస్లావియా, బల్గేరియాలకు మధ్య, రష్యా రుమేనియాలకు మధ్య, పోలండు-జర్మనీలకు మధ్య తగాయిదాకు కారకములగు పరిస్థితు లిదివరకే యేర్పడియున్నవి. తాత్కాలికముగా ఆయాదేశములు స్నేహముగా నుండుట కేర్పాట్లు చేసుకొనినప్పటికిని, ఎప్పటికైనను దీర్ఘకాలపువిరోధములు బయల్పడి యుద్ధములు బయలు దేరుట కవకాశములు కలవు.

ఈవిధముగ యూరపుఖండమందలి వివిధప్రాంతములలో ఆర్థిక, రాజకీయవైషమ్యములు పెచ్చు పెరిగి సమయము వచ్చునపుడు బయల్పడుటకు సంసిద్ధములై యున్నవి. కాని ఎంతకాల మీపరిస్థితు లిట్లుండ గలవు? ఎంతకాలము ప్రస్తుతపు శాంతివాతావరణము శాంతియుతముగ నుండును? అనునవి ముఖ్యమగు ప్రశ్నలు. యుద్ధభయమే యుద్ధమునకు ప్రధానకారణము; తుపాకులు దగ్గర యుంచుకొనినప్పుడు కొన్నిసమయములందు వాటియంతట యవియే ప్రేలుట కవకాశము లున్నవి. ఇవి ప్రస్తుత యూరపుఖండమందు యుద్ధమున కనుకూలమగు స్థితిగతులు.

## ౫

## యుద్ధమునకు ప్రతికూల పరిస్థితులు

యుద్ధమువచ్చుటకు యూరపుఖండమం దనుకూలముగా నున్నపరిస్థితులనుసరించి తెల్పియుంటిమి. వాటికి వ్యతిరేకముగ, శాంతికొరకై ప్రయత్నించు సంస్థలుకూడ లేవని చెప్ప వీలులేదు. వీటియందు ప్రధానమగువాటిని ఈక్రింద పొందుపర్చుచున్నాము. యుద్ధమునకు అనుకూలముగ నున్నవాటిలో ముఖ్యమగునవి మానసిక పరిస్థితులని చెప్పియుంటిని. అట్లే శాంతికికూడ అనుకూలమగునవి మానసిక పరిస్థితులే వేరువేరు దేశములలో ప్రజల అభిప్రాయములు, ఆశలు, ఉద్దేశ్యములు పూర్తిగ తెలిసికొనుటకు అవకాశములు లేకపోయి నప్పటికిని, యూరపుఖండమందలి సాధారణప్రజలలో అధికసంఖ్యాకులు యుద్ధమునకు వ్యతిరేకులుగా నున్నారని చెప్పవచ్చును. వారిలో చాలమంది ౧౯౧౪-౧౯౧౮ సంవత్సరముల యుద్ధములోనికష్టములను చూచినవారో లేక వినినవారో యగుటచే ఇకముం దట్టిసంఘర్షణ రాకూడదని చెప్పుటకు వెనుదీయరు. పురుషులలో చాల

మంది ఈ అభిప్రాయము కల్గియుండగా స్త్రీలలోకూడ అట్టి అభిప్రాయమే ప్రబలుచున్నదనుటకు నిదర్శనములుకలవు. మొదట ఫ్రాంసు దేశము విషయము చూచిన ఆదేశములో అత్యావశ్యకమయినకాని, యుద్ధముండెప్పుడును ప్రకటింపబడకూడదను అభిప్రాయము వ్యాపించియున్నది. జర్మనీ, ఫ్రాంసు దేశములమధ్య వైషమ్యములు చిరకాలమునుండి ఎక్కువగనున్నను, యుద్ధము ప్రకటించుటయా, మానుటయా, యనుప్రశ్న వచ్చినప్పుడు పైనసూచించిన అభిప్రాయము బలవంతముగ నుండుననుటకు సందేహము లేదు. అట్లే జర్మనీయందు, హిట్లరునియంత పరిపాలనలో అన్నివిధములగు సైనిక బలమును, ముఖ్యముగ వైమానికబలమును, వృద్ధిచేయుటకు ప్రయత్నములు జరుగుచుండినప్పటికిని, ఆదేశపురాజకీయవేత్తలందరును, తమ ఉద్దేశ్యము శాంతిని కాపాడుట యేయని అనేకసార్లు వక్కాణించియున్నారు. ఈవిధముగ మాటలకును చేతలకును వైరుధ్యమెందులకు కల్గుచున్నదను ప్రశ్నకు జవాబు, నియంతలు తమ తమ పదవులను నిలువబెట్టుకొనవలసిన అవసరము కలదుకనుక వా రట్లుచేయవలసివచ్చుచున్నదని. ప్రజాభిప్రాయమునకు వ్యతిరేకముగ వారు తెగించి యుద్ధములోనికి దిగలేరు. కాని దానికి అవసరమగు సామగ్రిని సమకూర్చుకొనుచుండినగాని ఎప్పటికి ఏమిముప్పు వచ్చునోయనుభయము. భవిష్యత్ కాలమందు జరుగుయుద్ధములలో యుద్ధభటులేకాక సామాన్యప్రజలు కూడ అనుభవించవలసియుండు దుర్భరకష్టములను తెలిసికొనిన వారెవరుకూడ యుద్ధపు ప్రచారమునకు ప్రోత్సాహము చూపరు. ఆ యుద్ధములలో మందుగుండు సామాను ఉపయోగము తక్కువగాను, విషవాయు ప్రయోగము ఎక్కువగానుండును. విషవాయుప్రయోగము చేయబడినప్పుడు దానివలన ప్రాణములు కోల్పోవువారు యుద్ధభటులే కాక ఇతరులు కూడ వేలకొలదియుందురని వేరుగ చెప్పనక్కరలేదు. జర్మనీసైన్యాధికారులు రహస్యముగ విషవాయువులను తయారుచేసి, లండన్, పారిస్ మొదలగు పట్టణములపై వాటిని ప్రయోగించుట ఎట్లో వాటిఫలితము లెట్లుండునో యని ప్రయత్నములు చేసినట్లు కొన్ని మాసముల క్రిందట బ్రిటిష్, ఫ్రెంచిపత్రికలలో ప్రకటింపబడినది.

౬

రాజకీయపరిస్థితులు గమనించిన మేలునదేమన యుద్ధముచేయుటకు రెండుపార్టీలు అవసరము. ప్రస్తుత స్థితిగతులనుబట్టి విచారించిన ఏ యుద్ధము నందైనను ఫ్రాంసు, జర్మనీలు ప్రధానవిరోధులుగా నుండవలయునని స్పష్టమగును. కాని జర్మనీకి ప్రస్తుతము స్నేహితులని పేర్కొనదగిన దేశము లేవియు లేవు. ఆ దేశము చుట్టును దానికి వ్యతిరేకులగు దేశముల వారుకాని, లేక ఫ్రాంసునకు ముఖ్యస్నేహితులగువారు కాని నివసించుచున్నారు. కొన్ని చిన్నదేశములు జర్మనీకి స్నేహముగానున్నప్పటికిని, వాటిపై ఆధారపడి పూర్తిగ ఆయుధ సామగ్రిని సమకూర్చుకొనియున్న దేశములపై దాడివెడలుట కాదేశస్థులు ప్రయత్నింపరు. జర్మనీలో ప్రస్తుతము అధికార పదవియందున్న నాజీలు సహితము ముఖ్యవిషయములలో పెద్ద రాజ్యములకు వ్యతిరేకముగ ప్రవర్తించుటకు వెనుదీయుచున్నారు. జర్మనీ నానాజాతి సమితినుండి విడిపోయెనను సంగతి నిజమే; ఆయుధవిసర్జన సమావేశమునందు కూడ ఆదేశప్రభుత్వమువారు పాల్గొనుటలేదను విషయముకూడ నిజమే కాని నానాజాతి సమితికూడ ప్రస్తుతము అంతబలము కలసంస్థయని చెప్పుటకు వీలులేదు. ఇక ఆయుధవిసర్జన సమావేశవిషయమో, ముఖ్యదేశముకాని దానినుండి సరియగు ఫలితములు వచ్చునను ఆశ కల్గియున్నట్లు ఇంతవరకు కాన్పింపదు. కాన జర్మనీ ఈ రెండు సంస్థలనుండియు విడిపోవుటలో ఎక్కువధైర్యము చూపినదని తలంప వీలులేదు. వీటికి వ్యతిరేకముగ పోలండు జర్మనీలమధ్య సరిహద్దువిషయములోను, ఆస్ట్రియాయందు జరిగిన నాజీతిరుగుబాటు సందర్భములోను, జర్మనీ ఇతరదేశముల అభిప్రాయముల నంగీకరించి, తనతప్పును అంగీకరించుటయో, లేక వెనుకకు తగ్గుటయో చేసినది. జర్మనీ ఇట్లు బలహీనముగ నుండినప్పటికిని, ఫ్రాంసు తనంతట తానే యుద్ధము ప్రకటింపకూడదా యనుప్రశ్న యుండవచ్చును. కాని ఫ్రాంసు

ప్రభుత్వమున కట్టి యుద్దేశ్యము కలదని చెప్పుటకు నిదర్శనములు చాల తక్కువగనున్నవి.

అదియుకాక నానాజాతిసమితికి పట్టుకొమ్మలలో ఒకటియు, శాంతికై కట్టుబాట్లు ఏర్పాటుచేయుటకు ముందంజ వేయునదియు నగు ఫ్రాంసుదేశము, యుద్ధమునకు ముందు బయలుదేరునని తలంచుటకు అవకాశములేదు. జర్మనీపై ఆమె అకారణముగ యుద్ధము ప్రకటించినచో, లోకర్నో సంధిషరతుల ప్రకారము ఇటలీ ఇంగ్లండు మొదలగు దేశములన్నియు వెంటనే జర్మనీకి సహాయముచేయుట అవసరమగును. అదియుకాక ప్రస్తుతము జర్మని బలహీనముగ నుండినప్పటికిని, ఒకప్పుడది చాల గొప్పదేశమనియు, ఇప్పుడుకూడ ఆదేశమును జయించుట తేలికయగు విషయముకాదనియు ఫ్రాంసునకు పూర్తిగవిశదమే. కాన కొంతకాలమువరకు ఫ్రాంసు యుద్ధము విషయమై తలపెట్టునని తలంప వీలులేదు. ఈలోపుగ ఆమె తనబలము నభివృద్ధి చేసుకొని, మంచి అవకాశముకొరకు వేచియుండుననునది మాత్రము నిశ్చయము.

౭

రాజకీయవిషయములలో శాంతి స్థాపనకు అనుకూలముగ పేర్కొనదగినవి అంతర్జాతీయ స్నేహపు కట్టుబాట్లు. వాటిలో చాలవరకు పేరునకు మాత్రము సంఘులని పిలువదగినవే అయినప్పటికిని, కొన్ని నిజముగ శాంతిస్థాపనకు అనుకూలమగునవని చెప్పక తప్పదు. వీటిలో ముఖ్యమైనది లోకర్నోసంధి; దీని వలన జర్మనీ, ఫ్రాంసు, బెల్జియము దేశముల సరిహద్దులను కాపాడుట, ఇటలీ, ఇంగ్లండుదేశముల ప్రధాన కర్తవ్యమని వ్యక్తీకరింపబడినది. ఈ దేశములన్నియు అనేకసార్లు ఆసంధి షరతుల ప్రకారము ప్రవర్తించుటకు తమ నిశ్చయమును చాటియున్నవి. ఇప్పుడు ఆలోకర్నోసంధిషరతులు పశ్చిమయూరపుఖండపుపరిస్థితుల కెట్లుఅనువర్తించునో అట్లే తూర్పు-యూరపుఖండపరిస్థితుల కనువర్తించునట్లు వేరొకలోకర్నోసంధిని ఏర్పాటుచేయుటకు ఫ్రాంసు, రష్యాదేశములు ప్రయత్నించుచున్నవి. ఈ ఏర్పాటుప్రకారము రెండురకముల సంధులు ఏర్పాటు కాబడును. మొదటిది రష్యా, ఫ్రాంసు జర్మనీలమధ్యను, రెండవది, జర్మనీ, రష్యా జెకోస్లావేకియా, పోలండు, ఇస్తోనియా, లటేవియా, లిథు ఏనియా దేశముల మధ్యను ఏర్పాటు చేయబడును. నాటి ప్రధానసూత్రములు, వీటిలో ఏదేశమైనను ఇతరదేశములపై అకారణముగా యుద్ధప్రకటనచేసిన, తక్కినదేశములన్నియు, అట్టియుద్ధప్రకటనచేసిన దేశమునకు బుద్ధి చెప్పుటకు అంగీకరింపవలయునని ఇంగ్లండుదేశముకూడ ఈవిధమగుసంధికి తన అనుమతిని తెల్పినప్పటికిని, తాను మాత్రము వాటియందు పాల్గొననని ప్రకటించెను. ఇటలీదేశముకూడ ఇట్టి ప్రకటననే చేసెను. కాని తూర్పు లోకర్నోసంధికి జర్మనీ, పోలండుదేశములలో ఎక్కువ ప్రోత్సాహము ఇంతవరకును కలుగలేదు. అయినప్పటికిని ఫ్రాంసుదేశపు మంత్రులు ముఖ్యముగ ఈమధ్యను చంపబడిన బార్తోమంత్రి రష్యాప్రతినిధులతోకలసి ఇట్టిఏర్పాటుకొరకు విశ్వ ప్రయత్నములను చేయుచున్నారు.

లోకర్నోసంధికాక వేరుగకూడ కొన్నిసంధినియమములు ఆచరణయందున్నవి. నానాజాతిసమితికి ప్రస్తుతము బలములేకపోయినప్పటికిని, ముందుముందు దానికి తగుబలము కలుగుననుటకు సందేహములేదు. ఆ సంస్థ అధికారముక్రింద ఏర్పాటు కాబడిన 'నాల్గు దేశముల సంధి' ప్రకారము ఇంగ్లండు, ఫ్రాంసు, ఇటలీ, పోలండు దేశములు యూరపుఖండమందుశాంతికి భంగకరమగు పరిస్థితులేర్పాటైనప్పుడు కలసి పనిచేసి, యుద్ధము నివారించుటకు ప్రయత్నింపవలెనని అంగీకరించిరి. మరియు, బాల్కను దేశములు వాటి వాటి మధ్యను కొన్నిసంఘులను చేసికొనినవి. వాటి యన్నిటి యుద్దేశ్యముకూడ ఒకరికొకరు సహాయము చేసుకొనుటయే యైయున్నది.

నియంతపరిపాలనలో సాధారణముగ యుద్ధమున హెచ్చుప్రోత్సాహ ముండినప్పటికిని, రష్యాదేశము మాత్రము మొదటినుండియు శాంతికొరకే తన శక్తి నంతను వినియోగించు చున్నది. మరియు హిట్లరు ముస్సోలినీలు తమ ఉపన్యాసములలో యుద్ధమును

పొగడుట కలవాటుపడినప్పటికిని, వారిచేతలు మాత్రము వారి నిజోద్దేశ్య మదికాదని చూపుచున్నవి. ముస్సోలినీ ఈమధ్యను చేసిన వుపన్యాసములందు చాలవరకు యుద్ధమును గురించియే చెప్పబడినవి. కాని 'నాలుగు రాజ్యములసంధి' ఆతనికి ప్రీతికరమగువిషయములలో ఒకటియైయున్నది. జర్మనీ, ఇటలీ,ఇంగ్లండు, ఫ్రాంసు దేశములు కలసిమెలసి ప్రవర్తించిన యూరపుఖండ శాంతికి అపాయకరమగు స్థితిగతు లేర్పడుట కెప్పటికిని అవకాశము లేదని ఆతని అభిప్రాయము. నియంత లిట్లు మాటలు ఒకవిధముగ చెప్పి, క్రియలను వేరువిధముగ చేయుటలో అభిప్రాయ మేమి? ఈ ప్రశ్నకు జవాబు ఏమనిన: వారు యుద్ధమును గురించి మాట్లాడినప్పటికిని వారిప్రజలు వారికి వ్యతిరేకముగ బయటి కేమియు చెప్పలేకపోయినప్పటికిని, వారి ప్రధాన శిష్యులలో కొంతమంది యుద్ధమువచ్చిన వారి నియంతృత్వమునకు భంగము కలుగునని వారికి తెల్పుచుండుటచే, వారు యుద్ధమును ప్రకటించుటకు వెనుదీయుచున్నారని.

౫

దీని తరువాత ఆర్థికస్థితిగతులను విచారించి చూతము. ఈసందర్భములో మొదటిప్రశ్న యుద్ధమువచ్చిన దానికి కావలసిన ఆర్థికబలము ఎవ్వరివద్దనుండి చేకూర్చబడును. యుద్ధములో ఓడిపోయినవారును, గెలుపొందిన వారునుకూడ ఒకేవిధమగు ఆర్థికదుస్థితికి లోనుగావలసి వచ్చుననుసంగతి పోయిన ఐరోపా మహాసంగ్రామము యొక్క ఫలితములవలన తేటతెల్లమైనది. ఆ యుద్ధమునందు ఖర్చు అన్నిదేశములకు కలసి సుమారు ౨౫౦ వేల కోట్లడాలర్లు అయినట్లు ఒకజర్మనీఆర్థికవేత్త లెక్కవేసియున్నాడు. ముందుయుద్ధమం దెంతఖర్చుకావలెనో దీనినిబట్టి గ్రహింపవచ్చును. యుద్ధము అంతమగుసరికి, విదేశప్రభుత్వములు అమెరికాకు ౯౦౫ వందలకోట్ల డాలర్లు అప్పుగా ఈయవలసియుండెను. దీనిలో చాల భాగము తిరిగి ఈయబడునను ఆశప్రస్తుతము లేదు. ఆసందర్భములలో అమెరికాసంయుక్తరాష్ట్రములు మరియొక యుద్ధమునకు యూరపియనుదేశములకు అప్పిచ్చుననునది కల్ల.

ప్రస్తుతపు ఆర్థికమాంద్య సమయమందు ఏవిధముగ యూరపియనుదేశములు యుద్ధముకొరకై కావలసినడబ్బును సేకరించగలవు? ఏదేశమందుకాని ప్రభుత్వ ఆదాయవ్యయములు సరిపోవుట లేదు. అట్లు సరిపెట్టబడినదేశములలో ప్రజలు భరించరానిపన్నులు చెల్లించవలసిన అవసరము కల్గుచున్నది. ముస్సోలినీమహాశయుడింతవరకు ఇటలీదేశపు ఆదాయవ్యయపట్టిక సరిపెట్టుటలో తనదేశము ముందంజవైచెనని చెప్పుచుండెడివాడు. కాని ఇప్పు డాతడు కూడ ఆవిషయమై సందేహముతో మాట్లాడుచున్నాడు. జర్మనీదేశపు ఆర్థికదుస్థితినిగురించి ఎక్కువగ చెప్పనక్కరలేదు. ఆదేశపు 'ఆర్థికనియంత'గా ఏర్పాటుచేయబడిన డాక్టరు సాచెట్‌గారు దాని విషయమై చాలనిరాశతో మాట్లాడిరి.

చివర విషయము జ్ఞాపక ముంచుకోవలసినది, యూరపుఖండమందలి రాజ్యవిభజనలో చాలలోపము లుండినప్పటికిని, ౧౯౧౪ సంవత్సరములో యుద్ధమునకు ముందున్నట్టి పరిస్థితులకును, ఈకాలపు పరిస్థితులకును భేదముకలదు. వార్సెల్సుసంధివలన కొంత అన్యాయము జరిగినప్పటికిని, కొన్ని అన్యాయములు దానివలన కూడ తీర్చబడినవి. మొదటిది, చిరకాలమునుండి జాతీయభావములు లేక, బలహీనముగనుండిన పోలండుదేశము స్వతంత్రదేశముగా ఏర్పాటు చేయబడినది. పూర్వరాజ్యము బొహిమియా మరల జెకోస్లావేకియా యను పేరుతో తన స్వాతంత్ర్యమును, పూర్వపుఔన్నత్యమును కూడ సంపాదించుకొనినది. ఇతరచిన్నదేశములు, ఫిన్లండు, లటేవియా మొదలగునవికూడ తమస్వాతంత్ర్యమును ఏర్పాటుచేసుకొనినవి.

౬

పైన వ్రాసినదానినిబట్టి యుద్ధమున కనుకూలము పరిస్థితులును, యుద్ధమునకు ప్రతికూలముగానున్న పరిస్థితులునుకూడ స్పష్టమైనవి. వీటిలో ఏవి బలవంతముగా నున్నవి? చివరకు వేటికి జయముకల్గును? అను ప్రశ్న నిల్చియున్నది. యుద్ధానంతరము ప్రబలుచున్న జాతీయాభిప్రాయములా లేక అంతర్జాతీయసౌభ్రాత్రమా? దేనికి జయము కల్గును?

ప్రశ్నలకు వెంటనే జవాబిచ్చుట చాలకష్టము. వీలయినంతవరకు ఏదేశముకూడ ముఖ్యముగ ఇంగ్లండు యుద్ధముకొరకై తనంతట తానై ప్రయత్నించు నని ఎంతమాత్రము తలంప వీలులేదు. కాని ప్రతి దేశముకూడ తన స్వసంరక్షణార్థమున కది మార్గమను ఉద్దేశ్యముతో నైననేమి, లేక ఇతరదేశము లన్నియు చేయుచున్నప్పుడు తానెందుకు చేయకూడదను మిషపైన నేమి, తన సైనిక, వైమానిక, నౌకా బలములను బలపర్చుకొను చున్నదను విషయముమాత్రము నిశ్చయము. ౧౯౧౪ వ సంవత్సరములోనుండిన పరిస్థితులకును ఇప్పటి పరిస్థితులకును ఈవిషయములో చాల పోలికగలదు. కాని అప్పటికిని ఇప్పటికిని భేద మేమనిన అప్పుడు ప్రపంచ ప్రజాభిప్రాయ మిప్పటివలె వ్యక్తీకరింపబడుటకు అవకాశములు లేవు. నానాజాతిసమితి నిజముగ అవసరమగుచో దానియందలి సభ్యులు యుద్ధము చేయకుండ ఆపుచేయుటకు తగినబలము లేదనుమాట సత్యమే కాని ప్రపంచప్రజాభిప్రాయమును కేంద్రీకరించుట కట్టిసంస్థయొకటి కలదను విషయమువలననే ఎవ్వరును కూడ యుద్ధమనిన ముందంజ వేయుటకు జంకుచున్నారను నదియు నిజమే. అదియుకాక లాయిడ్ జార్జి, జనరల్ స్మట్సు మొదలగువా రందరును యుద్ధమున కనువగు స్థితిగతులు లేవని వక్కాణించుచున్నారు. ౧౯౧౪ లో ఐరోపా మహాసంగ్రామము బయలుదేరుటకు ముందు కూడ ఇట్టిమాటలు చెప్పినవారు లేకపోలేదు. కాని ఆ పరిస్థితులయందలి భేదమునుబట్టి అప్పటి మాటలకును ఇప్పటిమాటలకును భేదము ఏర్పడినదని జ్ఞాపకముంచుకొవలయును. ఏదిఎట్లున్నను భవిష్యత్ కాలమందు ప్రపంచ శాంతి ప్రజాభిప్రాయబలముపై ఆధారపడియున్నదని మాత్రము ముఖ్యవిషయము. ప్రజాభిప్రాయము యుద్ధమునకు వ్యతిరేకముగ స్పష్టముగ వ్యక్తీకరింపబడుచున్నంతకాలము ఏప్రభుత్వముకాని యుద్ధముకొరకెంత ఆశించినను లాభ ముండదు. దీనికి ప్రధాన సాధనము ప్రస్తుతము బలహీనముగ నున్న నానాజాతిసమితికి కావలసినంత బలమును, అంతశ్శక్తిని కలిగించుటయే.



# మానవధర్మము

ఓరుగంటి వేంకటేశ్వరశర్మ

ఆధునికయుగమున మానవునికి తెలియని ప్రకృతి రహస్యము లేదనియే నుడువవచ్చును. ఆకాశమున నేమి, గంభీర సాగర గర్భమున నేమి అతనికి పోరానిస్థలము లేదు. అణువునకంటె అణువు అతనికి జ్ఞానగమ్యమైనది. ఇంతకుమించి ఇకబుద్ధిప్రకర్షను పొందుట అసంభవ మనుదినములును వచ్చినవి. కాని మానవుడు తన్ను తానెరుంగలేకపోయెను. మానవుడన్న నెవరు? అతని ధర్మమేది యను విషయములు మానవుని బుద్ధి నింకను కలసంచుచేయుచున్నవి. ఒక గ్రామమున పండితు డొకడుండెను. అత డెచ్చటికో పయనముకాగా గ్రామస్థులు 'స్వామీ' దారిలో వ్యాఘ్ర మొకటి కలదు. కాన నామార్గమున పోరాదని మనవిచేసిరి. అందుకు పండితుడు వ్యాఘ్రమనునది వి. ఆ. ఘ్రా అను వానివలన నిష్పన్నమైనది. విశేషముగ అంతటను వాసనచూచినది వ్యాఘ్రము. దానివలన నాకేమిభయ మని తలపోసి గ్రామస్థులమాటను పెడచెవిన పెట్టెను. అడవి నడుమకేగుసరికి పెద్దపులి కాండ్రించుచు నతనిపైబడెను. చచ్చితినిరా బాబూ అని కేకలు వైచుచు పండితుడు గ్రామాభిముఖుడై పరుగెడసాగెను. పాపము. తన పాండిత్య ప్రభావమున పండితునికి వ్యాఘ్రమనిన పెద్దపులియని తలంపునకు రాలేదు. పండితుడును దివిటీవాడును లోకమునకు ప్రకాశము నొసంగెదరు కాని తామేమో చీకటిలో మునిగి యుందురట. అట్లే మానవుడు జిజ్ఞాసచే ప్రేరితుడై వైషయిక ప్రపంచము నంతటిని గాలించివైచెను కాని తనధర్మమే యతని కనుబ్రామచున్నది.

ధర్మమేమో ఎరుకపడిన మానవునిధర్మము గోచరించును. 'ధర్మ' శబ్దమున కెన్నియేని నిర్వచనములు కలవు. కాని వానిచే స్పష్టముగ 'ధర్మ' మెరుకపడుట లేదు. రాధను కృష్ణు డొకనాడు 'నన్ను నీ వెట్లు ప్రేమించెదవ' ని అడిగెను. అందులకు రాధ.

"పాఖికపాక, మీనకపానీ
జీవకజీవన, హమ తుంహి జానీ" అనెను.

పిట్టకు రెక్కలవలె, చేపకు నీరువలె, ప్రాణికి ప్రాణములవలె నీవును నాకు. రెక్కలులేనిది పిట్ట పిట్ట కాదు. నీరులేనిది చేప బ్రతుకనేరదు. అసువులులేనిచో శరీరమెందుకు? అగ్నిధర్మమేది? కాల్చుట. నీటిధర్మమేది? అడ్డులేనిచో పల్లమునకు ప్రవహించుట. కాల్చనిది అగ్నికాదు. పారనిది నీరుకాదు. కాన ఏది లేనిచో ఏదియుండదో అది దాని ధర్మ మనవచ్చును.

ఏది లేకపోయిన మానవుడు మానవుడు కానేరడో అదియే మానవధర్మము కానోపును. ప్రపంచమున ఏ నిర్వచనమును సంపూర్ణము కాదు. 'సర్వం స్వలక్షణమ్, స్వలక్షణమ్,' అని బుద్ధభగవానుని నుడి. కాని వ్యవహారమున నొకదాని లక్షణమును మరియొక దానితో పోల్చియే తెలుసుకొను చున్నాము. అట్లే మానవుని మానవేతరములతో పోల్చిచూచిన అతని ధర్మమేమో గోచరించును.

మానవేతరములు పశ్వాదికములు. పశువును నిర్వచింపబూని యొకశాస్త్రజ్ఞుడు చేతగాక 'An animal is a moving plant and a plant is an anchored animal' 'కదలుచుండుచెట్టు పశువు, లంగరువేసినజంతువేచెట్టు,' అనిచెప్పి యూరకుండెను. కాన తత్వతః పశువన నేమియోచర్చింపబూనక వ్యవహారమును బట్టి పశువును గ్రహించియే మానవునితో పోల్తుము.

గొప్పవీరుని మనము పురుషసింహము, పురుషవ్యాఘ్ర మందుము. శ్రేష్ఠుని పుంగవుడు, పురుషవృషభుడందుము. అధముని దున్నపోతా! గాడిదా! అందుము. 'చక్కనిపాటనువిని కోకిల కాకలి, పికస్వనము' అందుము. వేయేల స్వరములలో ప్రసిద్ధములగు షడ్జపంచ

ములు పక్షిభేదముల ననుసరించియేకదా; ఇట్లు శ్రేష్ఠాతిశ్రేష్ఠవాచకములకును న్యూనాతిన్యూనములకును మానవేతరములనుండియే మన ముపమానముల గ్రహించుచున్నాము. మానవునికి సంఘటనశక్తి (Power of organization) యున్నదందురేమో. పశువుల కది లేదా మరి! అడవులయందు గాడిదలు, దున్నలు మొదలునవి చూలితో యున్న పెంట్లను లేగలనునడుమ నుంచుకొని నిద్రించును. చీమలలో నొకభేదము పదిపంద్రెండడుగులయెత్తు యిండ్లుకట్టును. వంతెనలు, మార్గములు, దాదులు, పహరావారు, అందరును ఆచీమలలో కలరు. ఆంటుప్లెసు అను జీవి నొకదానిని దొడ్డిలో బంధించి దానివలన తమ బిడ్డలకు పాలవంటిద్రవ మొకదాని నవి రాబట్టును. వాని యందును సేన, సేనానాయకులు, రాజులు రాణులు కలరు. తేంట్లు తుట్టెలను పక్షములు తీర్చి యెంతచక్కగ కట్టునో చూడుడు. వానినుండియే మానవులు శిల్పమును నేర్చిరేమో!

జంతువులకు దయ లేదందురేమో. జంతుశాస్త్రజ్ఞులలో పేర్వడసిన డార్విను మహాశయుడు చెప్పియున్నాడు. తనకుక్కకతడు ప్రతిదినమును రొట్టెనిచ్చెడివాడు. అది దానినికవ్వకొని ఎటకోవెంటనే పోయెడిది. మర్మమును కనిపట్టనెంచి డార్విను ఆకుక్కవెనువెంటనే పోయెను. అది తన యాహారమును జబ్బుపడిన పిల్లకొక దాని కొసంగుచుండెను. దయ లేనిచో కుక్క యట్లొనర్చెడిదా. చికాగో నగరమున జంతుశాల యుండెడిది. ఒకపరి దానికి చిచ్చంటుకొనగా పరస్పర విరోధము కలదని పేర్వడసిన జంతువు లొండొంటికి సాయము చేసుకొనినవట.

జంతువులును మానవులవలె తమసంతసము ప్రకటించును. అవి తమ యజమానుల మెప్పు వడయుటకు ప్రయత్నించును. యుద్ధరంగమున తమ యజమానుల కాపాడిన అశ్వరత్నము లెన్నిలేవు. అసువుల విడనాడియు యజమానుని సంపదను రక్షించిన శునకరాజముల నెరుగమా? పశుజాతులందును భాషగలదనుట హిందువులయందు ప్రసిద్ధమే డార్విన్, వాలసు అనుశాస్త్రజ్ఞు లిర్వురు కోతులవిషయమున పరిశీలనము లొనర్చి కొన్ని వస్తువులను చూచిన అవన్నియు ఒకేవిధముగ కొన్ని ధ్వనుల నుచ్చరించిన వనియు వానియందును కొన్ని పదార్థములకు కొన్ని శబ్దములు కలవనియు, ఆశబ్దమును వినిన ప్రతికోతియు ఒకేవిధముగ నడుచుకొనుననియు కనిపట్టిరి. వానిభాష మనకు తెలియకపోయినంత మాత్రమున వానికి భాష లేదనుట సాహసము. వానికి లిపి లేనిచో లేకపోవునుగాక! లిపిలేని భాషలు ప్రపంచమున యెన్నియేని యున్నవి. జంతువులకును మానవునికివలెనే భయము కామము క్రోధము కలవు. అందు ననే కవియొకడు నుడివెను.

"తిండి నిద్ర భయము తియ్యవిల్తునికేళి
సమము నరులకును బసరములకును;
అందుఁ బాడి నరుల కధికమ్ము గావునఁ
బాడిలేనినరుఁడు పశుసముండు" అని.

ఇట్లు కామమును, తజ్జన్యములగు క్రోధమదమోహమాత్సర్య లోభములును పశువులకును, మనుష్యులకును సమమని నిరూపితమైనవి.

కొందరు మానవునకును, పశువులకును భేదము కలదనియు, మానవులకు మనస్సు కలదనియు, పశువులకది లేదనియు నుడివెదరు. కాని యిది పాడికాదు. ఏల యన, మనస్సు ఉత్పత్తియే పైవాదమును తొలగద్రోయును. బాహ్యప్రపంచమునం దనేకవస్తువులనడుమ, అనేక వేదనలకు మధ్య ప్రాణి బ్రతుకవలసి వచ్చినపుడే సంకల్పవికల్పాత్మకమగు మనస్సు కల్గినది. కాన నది పశువులకు లేదనుట లెస్సగాదు. డార్విను మహాశయుడు తనగ్రంథమునం దొకవిషయమును వర్ణించియున్నాడు. ఒకడు కుండయందు పామునుంచి మూత బిగించి కోతియెదుట నుంచెను. కోతి జాగ్రత్తగ దానివద్దకుపోయి మూత తెరచెను. పాము బుస్సనుచు లేచి కోతిమెడకు చుట్టుకొనెను. కోతి కదలక మెదలక చేష్టదక్కి యూరకుండెను. పామేమియు చేయక యేమరియున్నతరి తటాలున దానిపడగను కొరికి దానిని కోతి చంపివేసెను. ఈవిధముగ వర్తించిన కోతికి మనస్సు లేదు, మానవునికే మనస్సుకలదనుటకు తార్కాణ యేమి?

ఇంతయేల? మనోవిజృంభితమంతయు, కామములన్నియు, అవి ప్రతికూలములైననేమి, అనుకూలములైననేమి, ప్రాణిసుఖము కొరకే. బ్రహ్మాది స్తంబపర్యంతము జంతువులు సుఖమునే వెదకుచుందురు. సుఖమననేమియో యెరింగిన మానవధర్మము బోధపడునేమో పరిశీలించెదముగాక. గురుగోవిందుని శిష్యుడొకడు సుఖ మననేమి? యని ప్రశ్నించెను. అందులకు పరమగురువు కత్తిపదనుమీద తేనెబొట్టనిరి యెను. చవిమూచిన తియ్యగనుండిన నుండుగాక, నాలుక రెండుగ చీలి పోవును గదా. బంగాళీభాషయందు,

సుఖదుఃఖమటి భాయిరా
సుఖేర్ లాగియజేకర ప్రీతి
దుఃఖజాయి తార్ ఠాయిరా,

అని యొకడుక్తి కలదు. సుఖముదుఃఖము అన్నదమ్ములు, కావటికుండలు. ఒకటివలసిన రెండవది తనకుతానే రాకతప్పదు.

'సుఖమేవహి దుఃఖాంతం కదాచిద్దుఃఖతః సుఖమ్' సుఖమే దుఃఖము నంతముగ గలది. దుఃఖము వలనను సుఖము కల్గుట కలదు. సుఖము సైజముచే నిట్టిదయైనను, దానికై ప్రాణులు యత్నించుచునే యుందురు. మరణ మవశ్యము వచ్చునని తెలిసియు జీవించుటకై యత్నింపనివా రెవ్వరు?

ఇట్టిప్రయత్నమే శాశ్వతసుఖ మొండు కలదనియు, అందు మరణభీతి లేదనియు తెలియజేయుచున్నది. తాత్కాలికముగనైనను ఇట్టి దానిని చవిమూపుటచేతనే కాబోలు లౌకికసుఖ మభిలషింపఁ బడుట. సుఖమును మూడుగ విభజింపవచ్చును. సుఖము, సుఖమనొసంగు వస్తువు, సుఖము ననుభవించు నతడు. అనగా ద్వంద్వము, దాని సంబంధము. అది జంతువులకును మానవునకును సమానము. ఇరువురును అట్టి సుఖమును పొందుటకే యత్నింతురు.

ఉపనిషత్తులయం దొకచోట 'యోవై భూమా తత్సుఖమ్' అనియున్నది. ఏది గొప్పదియో అది సుఖమని ఈ గొప్పతెంపునే మరి యొకచోట వివరించిరి ఋషులు.

'సోఽకామయత బహుస్యాం ప్రజాయేయేతి' (అతడు తాను పెక్కుగుదునుగాక యని కోరెను). ఇట్లు పెక్కులేక గొప్పయగుట మూడు విధములుగ కానోపును. మాత్రలో పరిణామములో సంఖ్యయందు, మేల్మియందు.

మాత్రలో నెట్లనిన నా కెక్కువధనము కల్గునుగాక. నేను భూమిని పడయుదును గాక. ఇదంతయు పదార్థవిషయికము పెంపు. నాకు సంతానము కల్గునుగాక, నావంటివారినే పుట్టించెదనుగాక అనుట సంఖ్యావిషయికము. తన్నందరు మెచ్చెదరుగాక, నే నెల్లరకు ప్రియుడనై అందరిమనస్సులయందు తావర మేర్పరచుకొందునుగాక యనునది మేల్మియే శ్రేష్ఠ్యమే విషయముగలది.

ఈ పైమూడింటినే ఏషణలందురు. విత్తైషణ, దారసుతైషణ, లోకైషణ యని. ఇవి సార్వజనీనములు. అందుకు ప్రతిదేశములోని ప్రయోగములే ప్రమాణములు: జర్ జమీన్ జోరూ (బంగరు, భూమి, భార్య); Wine, women, wealth (కల్లుకామిని కాంచనము.) కాని, యివన్నియు జంతుమాత్రమునకు సామాన్యములగుటచే బాహ్యవిషయము లన్నింటిని వదలి అంతరంగమును చొచ్చిననేకాని మానవ ధర్మరహస్య మనీమ్లితమగునట్లు కాన్పింపదు. ఎవనికొరకీ సుఖ మంతయు? ఉపనిషత్కారులు చెప్పిరి:

'ఆత్మనః కామాయ సర్వం ప్రియం భవతి.' (ఆత్మసుఖము కొరకే, తనసుఖముకొరకేసర్వము ప్రియమగుట అని.) కాన మానవధర్మమును గుర్తెరుంగుటకాత్మనే వెదకవలయును. దీనినే 'నేను' అందురు. 'నేను' అనగా 'నేన' నుచైతన్యమే. 'నేను' నకును 'నేను' కానిది అనగా బాహ్యప్రపంచమునకును సంబంధముకలదు. ప్రాణులన్నియు సుఖము కొరకు తమమనస్సు నుపయోగించుచు బాహ్యప్రపంచమునే వెదకుచున్నవి. అదియే పశుప్రవృత్తి. ద్వంద్వమును చూచునది. ఎందులకు? ఆత్మసుఖముకొరకు. ద్వంద్వము లేనిచో జంతువున కానందము లేదు. ద్వంద్వమున

కాత్మ భృత్యువు. తెలియక పశ్వాదికము ద్వంద్వమును కోరును. తెలియకయే, తాను బాహ్య ప్రపంచముపై నాధారపడుచునె, ఒకింత పరికించిన మానవుడు తన బాహ్యప్రవృత్తిని తెలియ గల్గుచున్నాడు. జంతువులు వాసనలచే ప్రేరితములై విషయములవైపు, గడ్డి పెంటి మొదలగు వానికై ప్రవృత్తము కావలసినదే. మానవుడు తన యీ ప్రేరణల నరికట్టి యిచ్చవచ్చినట్లు వాని నుపయోగించుకొన గల్గుచున్నాడు. ఇదియే మానవునకును పశువునకును గల తొలిభేదము. జంతువు తనకంటె భిన్నముగనుండు దాని నెరుంగగలదు. దానికి జ్ఞానమున్నది. కాని మానవుడు తన్ను తానెరుంగగలడు. తానెరుంగుదుననియు నెరుంగును. కాని యింతమాత్రమున మానవుడు మానవుడగుట లేదు. అతడు తెలివిగలపశువు మాత్రము కానోపును. ఏలయన విషయములే కదా అతనికి ప్రాప్యములు. కాన మానవధర్మమును గుర్తెరుంగుటకు తన యీయపూర్వశక్తిని మానవు డెట్లుపయోగించుకొనవలయు ననునది తెలియవలసి యున్నది. విషయమునే నెమకుట పాశ్వికమైనయెడల, ఆహారనిద్రాభయమైథునములు పశువునకును, మానవునకును సమములైన, ఇవికానిదే మానవధర్మముకదా. దీనినే ఉపనిషత్కారుడుపన్యసింపుచు,

'పరాంచి ఖాని వ్యతృణ త్స్వయంభూః
తస్మాత్పరాక్ పశ్యతి నాంతరాత్మన్,
కశ్చిద్ధీరః ప్రత్యగాత్మాన మైచ్ఛత్
ఆవృత్త చక్షు రమృతత్వ మిచ్ఛన్'

అని నుడివినాడు.(బాహ్యముఖములుగ నింద్రియములను స్వయంభువు నిర్మించెను. కాననే బహిర్ముఖముగనే యుండును అందరిచూపు. ఎవడో ధీరుడు అమృతత్వమును కోరి చూపుమరల్చి లోనియాత్మను కోరును.) ఇంతవఱకు మనకు తేలిన విషయము మానవ ధర్మమునకు మొదటిమెట్టు విషయములనుండి చూపును మరల్చి అంతరంగము వైపునకు తిరుగుట యనియు, అదియు మరల బాహ్యవిషయికములగు సుఖమును మాత్రము కోరుట కాదనియు మాత్రమే.

ఇట్లావృత్తచక్షువై మానవుడు తన్ను తానెరుగంగవలయుననుటయందే మానవధర్మసార మిమిడియున్నది. 'నేను' కేంద్రముగగల్గిన చక్రములను ప్రతియతడు స్వభావముచేతనే నిర్మించుకొని యున్నాడు. మొదటిచక్రము తాను తన కుటుంబము. రెండవది తాను తన కులము. మూడవది తాను తనగ్రామము. నాలవది తాను తనదేశము. ఇట్లే యెన్నిగానో చక్రములను తన యజ్ఞానముచే మానవనామధారి నిర్మించుకొని తనవారి సుఖమునే తన సుఖమునుగ యెంచి పుట్టుచు గిట్టుచు నున్నాడు. జన్మమరణచక్రమును గెలువవలెనన్న చూపుమరల్చి తనచక్రములకు కేంద్రమునందున్న 'తన్ను, నేను'ను గుర్తెరుంగవలయు.

ఇందులకు రెండు తెరంగులు కలవు. మొదటిది తనవారికి తనకును భేదము లేదని యెంచి అంతటిలో చేష్టనిక్కి యూరకుండక తనవారి చక్రమును పెంపొందించుచు 'వసుధైవ కుటుంబకమ్' అను స్థితిని పొందుట. అట్టిస్థితియందు 'యస్మిన్సర్వాణి భూతాని ఆత్మైవాభూ ద్విజానతః' ఏవిద్వాంసునికి అన్నిభూతములు తానే అయినవో అట్టి యతని 'తాను' అను అహంతయు లుప్తమైపోవును. చక్రమును పెంపొందించుచు పోయిన కడ కానంత్యమున కేంద్రముగుండ పోవు సమరేఖ యగునను గణితశాస్త్రసిద్ధాంతమును దీనికి బలమొసంగునది.

అట్లు కాదేని కాన్పించునదంతయు 'నేను' కాదు. నేను ఇది కాదు 'అహంఏతత్ న' అనుచు నిరాకరణ మార్గము నవలంబించినను, తుదకు తనకంటె వేరుపదార్థముల యస్తిత్వమే పరమార్థదృష్టియందు నిరాకృతము కాగా సాధకుడు 'తన్నే' కేంద్రమునే కదా చేరును. చక్రమును తగ్గించుచు పోయిన కడకు కేంద్రభూతమగు అహంత యే నిల్చును. తద్భిన్న మేమియు లేనందున సాపేక్షికమగు నహంతయు లుప్తమగును. వేరొకటి రెండవది యనుదానిమీదనే కద నేననుజ్ఞానమును ఆధారపడియున్నది. 'అహం' కానిది లేకయే పోయిన 'నేన'ను వేరుజ్ఞానము కల్గుటకు తావేది.

సారాంశమేమియన, భూమిపై బడినవాడు భూమినే యాధారముగ గొని లేచునట్లు, మూఢు ఏవ ఙలంబో మునిగిన తెలియని నరుడు మననముతోడ ప్రవృత్తికొరకై, ఇతర వస్తువులకై సహానుభూతి తత్వతః వానికొరకుకాదు,తనకొరకే, నేనే అవియంతయుననుచు, ఆమాటల నవగతము చేసుకొనుచు, మనువు చెప్పిన ప్రకారము:

'త్యజే దేకంకులస్యార్థే గ్రామస్యార్థే కులం త్యజేత్;
గ్రామం జనపదస్యార్థే ఆత్మార్థే పృథివీం త్యజేత్.

కులముకొరకొకనిని వదలుము, గ్రామమునకై కులమును, దేశమునకై గ్రామమును, అనుచు తెలియుచు నడచినను, లేక, 'నేతినేతి' నేను దేహమును గాను మనస్సునుగాను బుద్ధినిగాననుచు తెలియుచు నడచినను ప్రాప్యమనునది ఒకటియే దశ. అదియే సుఖదుఃఖముల కతీతమైనది. ఆ సుఖము నిర్దుఃఖమైనది. శాశ్వత సుఖమున కాలవాలము. అదియే పరమ పురుషార్థము. ధర్మార్థకామములు దానికొరకే; అదియే మోక్షము. అందే నిర్వాణము. దుఃఖజ్వాలలన్నియు నడుగంటుట. అహీనచంద్రికవలె ప్రసన్నత నొందుట. దానినొందుటయే మానవధర్మము.

'ఏషా బ్రాహ్మీస్థితిః పార్థ నైనాం ప్రాప్య విముహ్యతి;
స్థిత్వా స్యామంతకాలేపి బ్రహ్మనిర్వాణ మృచ్ఛతి.
'ఏవంతత్వాభ్యాసాత్ నాస్మి న మే నాహ మిత్యపరిశేషమ్;
అవిపర్యయా ద్విశుద్ధం కేవల ముత్పద్యతే జ్ఞానమ్."

---

# తుదకు!

పిలకా గణపతిశాస్త్రి

వీతవిరహాది బహుమహాభీతికమ్ము
అపహతాంధతమమ్ము తేజఃప్రశాంత
మొక మహానందసీమ సాక్షాత్కరించె
ఓమహారాజ్ఞి, నీకటాక్షమున తుదకు!

* * *

నిర్మల గభీరనయన నీలాంబరమున
నీలిపాపల మృదుమందచాలనముల
జూచునపుడెల్ల నాలోన దోచు దేవి,
తారక లమేయ భయదాంధకారములును,
నిత్యచైతన్యము లనంత నృత్యము లని!

* * *

ఎన్నడో నామహాధ్వావసానమందు
ఆశమాత్రము నీపదస్పర్శ; కాని
ఇందు నర్తింతునే మహానందభరత
భువన మిది పాదరేణువిభూషిత మని!

# ద్రుత సంశ్లేషము

వఝ్ఝల చినసీతారామస్వామి శాస్త్రి

'సమ్' పూర్వకశ్లిష్ధాతువుయొక్క ఘఞ్ ప్రత్యయాంతరూపము సంశ్లేషశబ్దమగుచున్నది. "సంశ్లేషః. పుం. ఉపగూహనే. సంశ్లేషణమ్. శ్లిష ఆలింగనే ఘఞ్" (శబ్దార్థచింతామణికోశము.)

"సంశ్లేష. పు. సమ్ + శ్లిష + ఘఞ్., ఆలింగనే, సంబంధమాత్రేచ" (సర్వశబ్దసంబోధినీకోశము.)

పయివ్యుత్పత్తులనుబట్టి వ్యాకరణవిషయమున సంశ్లేషశబ్దమునకు "సంయోగము=కలయిక" అని యర్థము చేయఁదగునని విశదమగుచున్నది. బాలవ్యాకరణమున "సంశ్లేషంబనఁగా మీఁదిహల్లుతోఁ గూడికొనుట" అని సంశ్లేషస్వరూపము నిరూపింపఁబడినది. "పూచెను + కలువలు=పూచెన్గలువలు" అని యుదాహరణము సైత మీయఁబడినది. అహోబలపండితుఁడు చింతామణి కారికలలోని సంశ్లేషశబ్దమునకుఁ జేసిన యీ క్రింది ప్రామాదిక వ్యాఖ్యానమును బట్టియె యాధునిక వైయాకరణు లెల్లన్నిట్లు పరహల్లుతోఁ బూర్వపదాంత ద్రుతము సంయోగించుటయె సంశ్లేషమని వివరించుట సంభవించె నని చెప్పవచ్చును.

"లుగ్వా ద్రుతప్రకృతికా త్పరత స్సరళే స్థిరేచ నస్య స్యాత్, అలుకిచ సంశ్లేషః స్యాద్ బిందుం ప్రవదంతి తం క్వచి త్కేచిత్."

(ఆంధ్ర. చింతా. సంధి)

"లుగభావే నస్య పరవర్ణేనసాకం సంశ్లేషశ్చ భవేత్. చకారేణ స్వరూపేణావస్థితిః" (అహో.)

పయివ్యాఖ్యలోని పరవర్ణశబ్దముచేఁ బరస్థహల్వర్ణమే యహోబలపతిచేత నుద్దేశింపఁబడె ననకతీరదు. అట్లే కానిచో "లుక్సంశ్లేషౌ" విత్యాదిసూత్రమునకు "లుక్సంశ్లేషౌ నస్య నస్తోఽచి. కొలుతు నచ్యుతున్, తలతు నవనిజ న్నిత్యాదిక ముదాహరణమ్" (అహో.) అనెడివ్యాఖ్య పొసఁగనేరదు గదా. 'పరవర్ణేనసాక'మ్మనుదానిచే పరస్థస్వరముసైత ముద్దేశింపఁ బడియె యున్నచో 'కొలుతున్ + అచ్యుతున్' మున్నగు నుదాహృతులలో నకారము స్వరముతోఁ గలసి 'న' మున్నగు నిర్బాధలక్ష్యములు సిద్ధించుచుండుటచే నచటి సంశ్లేషనిషేధవ్యాఖ్య విరుద్ధమె యగునుగదా.

పరిశీలింపఁగా నీయహోబలపతివ్యాఖ్య సరిగా నున్నట్లగపడదు. 'కొలుతు నచ్యుతున్' మున్నగుచోట్ల ద్రుతము పరస్వరముతో సంశ్లేషించుచుండఁగా, ననఁగా సమ్మేళితమగుచుండఁగా నది సంశ్లేషనిషేధలక్ష్యమని చెప్పుటయు, నట్టియెడల సంశ్లేషమును నిషేధించుటయుఁ గేవలము నసంగతములనుటకు సందేహము లేదుగదా. మఱియు "అలుకిచ సంశ్లేషః స్యాత్" అనుచోట సైతము లోపాభావమున సంశ్లేషము సహజముగ లభించుచుండఁగా, నద్దాని ప్రత్యేకవిధానము పునరుక్తమనక తీరదు గదా. ఇంతియకాక సరళస్థిరపరక ద్రుతమునకిట్లు సంశ్లేషమును బ్రత్యేకముగా విధించి యాదేశసగళపరక ద్రుతమున కిట్లు విధింపకుండుటలో యుక్తి యేమియు లేదుగదా.

"వైజయంతీనవాంశుకవ్యాజమునను" ఇత్యాదిషు జైమినీభారతాద్యుక్తేషు సమాప్తౌ (పద్యావసానే) స్వత్వ మసంగతమేవ. ద్వితీయాదిచరణాదివర్ణేషు పరేషుతు స్వత్వం నిర్బాధమేవ." (అహో. బిందుం ప్రవదంతీత్యాదిసూత్రవ్యాఖ్య. ౨౧౪ పుట.) అని యిట్లు ద్రుతము (చింతామణి విరుద్ధముగ) 'ను' స్వరూపముగ నంగీకరించెడి యీయహోబలపతికి సంశ్లేషపక్షమున ద్రుతస్వరలోప మెట్లు లభించునో తెలియరాకున్నది.

పయి సందర్భమును బట్టి ద్రుత సంశ్లేషమునకహోబలపండితుఁడు చేసిన వ్యాఖ్య సరికాదనియు, నకారవ్యంజనరూప ద్రుతము స్వపూర్వస్వరము నత్తుకొనియుండుటయే ద్రుతసంశ్లేషమనుట చింతామణి కర్తృభిప్రేతమనియు గ్రహింపవలసియున్నది.

ఈపక్షమున "లుక్ సంశ్లేషౌ నాఽచి" అను సూత్రము చొప్పున స్వరపరకత్వమున ద్రుతమునకు సంశ్లేషనిషేధ మెంతయు సుసంగతమగుచున్నది. "కొలుతున్ + అచ్యుతున్" అనుచో 'కొలుతు నచ్యుతున్' అనెడి పరస్వరసమ్మిళితరూపమె సమ్మతమగునుగాని "కొలుతున్ అచ్యుతున్" అనెడి ద్రుతసంశ్లేషరూపము సమ్మతము కానేరదుగదా. స్వరద్వయమధ్యగతవ్యంజన మెన్నఁడును బూర్వస్వరాంగము కానేరదనియు, నది పరస్వరమునకే యంగమగుననియు శబ్దతత్త్వశాస్త్రవిత్తములగు ప్రాతిశాఖ్యకారులు చెప్పుచున్నారుగదా.

"స్వరాంతరే వ్యంజనా న్యుత్తరస్య" (ఋగ్వేద ప్రాతిశాఖ్యము. ౧ పటలము) దీని పార్షదవ్యాఖ్య:— "యాని స్వరయో ర్మధ్యగతాని తాని (వ్యంజనాని) ఉత్తరస్యై వాంగం భవంతి; న పూర్వస్య."

కాఁగా లుక్వేతిసూత్రముచొప్పున సరళస్థిరపరక ద్రుతమునకు లోపమురానిపక్షమున నకారవ్యంజనరూపము ద్రుతము స్వరూపముతో నుండిపోవుటయేకాక, అనఁగాస్వత్వము నందుటయే కాక సంశ్లేషమునుసైతము పొందవచ్చునని "అలుకిచ సంశ్లేషఃస్యాత్" అను సూత్రముచే జింతామణికర్త సుసంగతముగ విధించుచున్నాఁడని యెన్ననగును. అనఁగా "పలికెన్ + వాఁడు" అనుచో "పలికెన్ వాఁడు" అనియు, "పలికెన్వాఁడు" అనియు రెండువిధములుగాను నుండ వచ్చుననియు, నందు"పలికెన్వాఁడు" అనురూపము ద్రుతస్వత్వరూపమనియు, "పలికెన్ వాఁడు" అనునది ద్రుతసంశ్లేషరూపమనియుఁ బ్రాతిశాఖ్యమర్మజ్ఞుఁడగు నన్నయభట్టారకుఁ డుపదేశించెనని గ్రహింపవలెను. చింతామణి మతమున నకారవ్యంజనరూపమె ద్రుతస్వరూపమగుటంజేసి (చూడుఁడు: "నా రచించిన చింతామణివిమయ పరిశోధనము") 'పలికెన్వాఁడు' అనునది ద్రుతస్వత్వరూపమనుటలో విరోధ మేమియు లేదు. కాఁగా ద్రుతము పూర్వస్వరాంగమయ్యెనా సంశ్లేషమనియుఁ, బరస్వరాంగమయ్యెనా స్వత్వమనియుఁ బ్రాచీనవైయాకరణులు వ్యవహరింతురని యెన్నవలయును.

సంయుక్తములగు హల్లులలో మొదటి హల్లు పూర్వాచ్చున కంగమైనను గావచ్చుననియుఁ, బరాచ్చున కంగమైనను గావచ్చుననియుఁ బ్రాతిశాఖ్యకర్తలు చెప్పుచున్నారు.

"సంయోగాదిర్వా" (ఋగ్వేదప్రాతిశాఖ్యము. ౧ పటలము) దీని పార్షదవ్యాఖ్య:— "సంయోగాదిభూతో వర్ణః స్వరాంతరే వర్తమానః పూర్వస్యవా స్వర స్యాంగంభవతి, పరస్యవా......"

ద్రుతము నకారవ్యంజనరూపమనెడి చింతామణిపక్షమునందు సయితము స్వత్వసంశ్లేషము లిట్లు సునిర్వాహము లగుచుండుటంజేసి చింతామణి వివరణమగు వికృతివివేకములోని "ద్రుతస్య హలి బిందుస్స్యాత్ శ్లిష్టత్వంచ క్వచిత్ స్వతా, లోపశ్చ" అనెడి సంధిగత ద్రుతాకారవర్ణనము నిర్బాధమని చెప్పవచ్చును. కాన "పద్యావసానే సర్వేషాం స్వత్వం నాప్నోతి సాధుతామ్" అనువికృతివివేకకారికకుసైత మహోబలపతి చేసిన 'ను' స్వరూపవ్యాఖ్య గ్రంథకృదభిప్రేతము కాదనియుఁ,బద్యావసానగతద్రుతమునకుఁ బూర్వస్వరాంగత్వమె, యనఁగా సంశ్లేషరూపమే సాధువనియుఁ దద్భిన్న స్వత్వమనఁగాఁ బరస్వరాంగత్వ, మనఁగాఁ బరపదాద్యక్షరాంగత్వము సాధువు కాదనియు గ్రహింపవలయును.

పయిరీతిని ద్రుత సంశ్లేషమునకు వివరణము చేయునపుడే చింతామణికర్త సరళస్థిరపరక ద్రుతమునకు సంశ్లేషమును విధించియు, నాదేశసరళపరక ద్రుతమునకు సంశ్లేషమును విధింపకుండుట సోపపత్తికము కాఁగలదు. నాదభూతద్రుతముతో సంయుక్తములగునపుడె శ్వాసములగు కచటతపలు నాదరూపము నందుట, యనఁగా గజడదబలగుట సంభవించును. సంయుక్తవర్ణములలో నొకటి నాదమగునపుడు దాని మేళనమునన్న శ్వాసమును నాదరూపమునందుట సహజము గదా. అట్టియెడలఁ బరుషపరకద్రుతము పరాక్షరాంగమై పరస్థపరుషముతో సంయోగించునపుడే యాపరుషము నాదరూపసరళత నందును. అట్లుగాక యాద్రుతము పూర్వస్వరాంగమై పూర్వస్వరమునె యత్తిపలుకఁ

బడినపుడు నాదవర్ణపు తాఁకుడు లేనందునఁ బరస్థశ్వాస భూతపరుషము సరళము కానేరదు. అట్టి పరుష పరక ద్రుతము సమ్మతముకామింజేసి పరుషపరక ద్రుతమునకు సంశ్లేషమనఁగాఁ బూర్వస్వరాంగత్వము సరికాదని శబ్ద తత్త్వశాస్త్రవిత్తముఁడగు నన్నయభట్టారకుఁడు తలంచి యాదేశసరళపరక ద్రుతసంశ్లేషమును విధింపక యా ద్రుతమునకు బిందు రూపము గాని, స్వరూపావస్థాన, మనఁగా స్వత్వ, మనఁగాఁ బరాక్షరాంగతారూపపరస్థ హల్ సంయోగితగాని సంభవించునని యీ క్రింది రీతి నుపదేశించెను.

"పరుషా ద్రుత ప్రకృతికాత్ సరళాఃస్యు స్తద్భి
తంచ బిందుస్స్యాత్, అవికారగతే తస్మిన్నపి సర
ళావిహ సంతి తే పరతః" (ఆంధ్ర. చింతా. సంధి.)

ఇం 'దవికారగతే తస్మి' న్నిత్యాదిచేత ద్రుతము నకు బిందుతావస్థ కలుగనపుడును సరళాదేశము వచ్చునని మాత్రమే చెప్పఁబడెనుగాని యపుడు సరళస్థిరపరకత్వమునందు "అలుకిచ సంశ్లేషః స్యాత్" అని చెప్పి నట్లు సంశ్లేషము సైతము సాధువే యని చెప్పఁబడలేదు గదా. సంశ్లేషరూపవిశేషవిధానము లేనపు డనఁగా ద్రుతము పూర్వాక్షరాంగముకానపు డింక స్వరూపావస్థితియె, యనఁగాఁ బరాక్షరాంగత్వరూపపరస్థ హల్ సంయోగమే గదా లభించును. సంయోగిహల్లునకుఁ బూర్వాక్షరాంగత్వము, పరాక్షరాంగత్వము నను రెండిటిలో నేదోయొకటి పయినుదాహరించిన ప్రాతిశాఖ్య సూత్రముల చొప్పున సంభవింపక తీరదు గదా. అట్టి యెడల సరళస్థిరపరకత్వమున విశేషించి విధించినట్లుగ నీయాదేశసరళపరకత్వమున సంశ్లేషము విధింపఁ బడమింజేసి పరిశిష్టమగు స్వరూపావస్థానము లభించునను టలో విప్రతిపత్తి లేదుగదా.



మహానందిమంటపము, తంజాపూరు

# శ్రీరంగ దేవాలయ దృశ్యము



రంగనాథాలయ ప్రధానద్వారము
(దక్షిణము) K. P. S.



గుఱ్ఱపు రౌతులు
( శ్రీరంగదేవాలయమునందలి స్తంభశిల్పము. స్తంభములు ౨౦ అ. పొడవుగల రాతియందు మలచబడినవి.) K.P.S.

# భూతములు - భౌతికశాస్త్రములు

గరిమెళ్ల సత్యనారాయణ

భూతములంటే యీ శరీరములను విడచిపెట్టిన జీవుళ్ల సూక్ష్మశరీరాలు. ఈసూక్ష్మశరీరాలు, వీటిచర్యలు ఇంచుమించుగా బ్రతికివున్నప్పుడెటువంటి మానవ శరీరముల చర్యలుగా వుండేవో అటువలెనే వుంటవి. ఈ కాయశరీర మున్నన్నాళ్లు దానిలో నివసించి మనలాగే అవి జీవించి తిరుగుతూవుంటే వాటిని మానవులంటాము; వాటిని తగలపెట్టిన, లేక పాతిపెట్టిన తరువాత గాలిలో తిరుగుతూ చేతులకు దొరకకుండా వుంటే భూతము లంటాము. ఇవి అందరికీ కనిపించితే కనిపించుతాయి లేకుంటే కొందరికే కనిపించుతాయి. కొందరికి కనిపించడమేకాకుండా వారిలో ప్రవేశించి, తమ సహజచర్యలను ధోరణులను తప్పించి బ్రతికున్ననాటి ఆ జీవుళ్ల చర్యలు ధోరణులతో విజృంభింపచేస్తూవుంటాయి. దీనికే దయ్యంపట్టింది, భూతం ఆవేశించింది అని అంటాము. కాయిక మానసి కారోగ్యంకల వారికి కంటె లేనివారికి అందులో లోపంకలవారికే యీఅవస్థ తరుచుగా తటస్థిస్తూ వుంటుంది. మానవుడు పంచభూతాత్మిక మిశ్రితమైన ఒక బొమ్మయై, మరణముతో సహా అతని శరీరమును పూడ్చివేయగానే అతని నాటకము సరిఅయేలాగుంటే ఈ భూతములకు అవసరమే లేకుండును. కాని మానవుడు మన్ను నీరు వేడి గాలి ఆకాశమను అయిదింటి ముద్దమాత్రమేకాక వీటి అన్నింటిలో వర్తించు అగోచర మానసిక జీవము, లేక సూక్ష్మజీవము యొక్క మిశ్రమమై వుండడంవల్ల అతని నాటకం మరణంతో ఆగక అటుతరువాతకూడా మనకు తెలియని కొన్నిరీతుల వ్యవహరిస్తూ వుండడం అప్పుడప్పుడు మనకు గోచర మౌతూవుంటుంది.

ఈ జీవుళ్లు లేక యీ భూతాలు తిరిగీ యెన్నో యుగాలు దాటినతరువాత యీ శరీరాలలోకే వస్తాయి అనిన్నీ, అవి వచ్చేటప్పటికి యీ పాతబొంది లేకపోతే బేజారైపోతాయనీ తలచి ఈజిప్టు దేశమువారు యీకళేబరాలను సుగంధద్రవ్యాలలోను, ద్రావకములలోను దాచిపెట్టివుంచినారు. వాటిని మమ్మీలంటారు. ఆ సుగంధ ద్రవ్యాల మహిమ యెట్టిదోకాని ఆకళేబరాలు రెండుమూడువేల సంవత్సరములుదాటినా నేటివరకు కూడా కంపుపట్టక, చివికిపోక, నిన్ననసిద్ధముచేసినట్లు జీవకళ లొడుతూవున్నవి. మనభారతీయులు శవములను తగులపెట్టినప్పటికీ, ఆ జీవుళ్లు యింకా వేరేలోకాలలో మననుండి అపేక్షపెట్టుకొనే వుంటాయని తలచి తద్దినాలు, మంత్రాలు, పిండాలు, తర్పణాలు, తీర్థవిధులు మొదలైన యెన్నో ఆత్మశాంతి వుపాయాలు నిర్మించి నేటివరకు పాలిస్తునేవున్నారు. నవనాగరికుల కిది శుద్ధమూఢత్వంలాగ కనిపించినా మహావిద్వాంసుల కొందరింకా అక్షరాలా సత్యమే అని, దివ్యానుభవములు కలవారు తెలుసుకొని వ్రాసిన మంత్రము లవ్వి అనీ నేటికినీ విశ్వసించు తున్నారు. చాలామంది అవునని నమ్మలేక కాదని కొట్టిలేక దాగట్లో పడ్డ వెలంకాయలలాగ కొట్టుకుంటున్నారు.

పాశ్చాత్య శాస్త్రీయ దృష్టికల వారందరికీ ప్రత్యక్షంగా కనిపించని దానినంతటినీ మూఢవిశ్వాసమని కొట్టేడమలవాటయింది. ప్రత్యక్షేతరమును నమ్మని శాస్త్రీయ దృష్టి గల వారి నందరినీ సంశయాత్ములనీ 'అగ్నాస్టిక్కు'లనీ ఆక్షేపించడం అపరోక్షానుభూతిలో విశ్వాసం గలవారందరికీ ఆచారమై పోయింది. థియోసఫిస్టులుకూడా యీరెండోతరగతికి చెందినవారే. ఎటూ యే విశ్వాసమూ లేకుండా 'ఏమిటి తిందాము, ఎక్కడ పండుకుందాము, ఎట్లా ఆర్జింతాము, ఎల్లా బ్రతుకుదాము' అని ఆలోచించుకుంటూ చచ్చిపోయే గతానుగతికలోకానికి చెందినవారు నూటికి తొంభైమంది. సాధారణంగా వీరిజీవితం శాంతంగాను, నిశ్చింతగాను, శాస్త్రీయంగాను గడచి పోతుందికాని ప్రకృతికి విరుద్ధములైన చర్యలేవో కొన్ని అప్పుడప్పుడు కనిపించగానే పరోక్షమైన వేరే ప్రపంచమునందు వీరికి విశ్వాసములూ, సందేహములు కలిగి సమాధానం కుదిరే

దాకా తర్జనభర్జనలు పడుతూవుంటారు. వీనినికూడా 'ప్రకృతి వికారాలు' (breaks of Nature) క్రింద కొందరు కొట్టిపారేస్తారు. కొందరు ఈప్రపంచకంతో యీసృష్టి సరికాదు, మరణముతరువాతకూడా జీవులకొక యాత్ర, కర్మఫలానుభవము వున్నదని అనుమానిస్తూ దోలాంశోళమానసు లవుతారు. అయినా యీప్రకృతి చక్షువుతోటి ప్రకృతిజన్యజ్ఞానముతోటి దాని నిమిత్తమని నిర్ణయించలేము కనుక ఇదియొక మానసిక జాడ్యముకాని నిజముకాక పోవచ్చునని ధైర్యము తెచ్చుకుంటారు. కొందరు లేపనలిప్తులు అనబడేవారు మోహాయించి ఇట్టిభావనతో జీవయాత్ర సాగించగలరు. దుర్బలచిత్తులనండి, సబలచిత్తులనండి, మరికొందరు యీమోటుతనము నచ్చక పాపము, పుణ్యము, ప్రార్థన, తపము, శాంతి, ఉపశాంతి అనే కొన్ని ఆధ్యాత్మిక విషయాలలోకి మనసు జొప్పించుకొని తమ జీవనమును, అందుకు సంబంధించిన ధర్మశాస్త్రములు కర్మశాస్త్రములు మోక్షశాస్త్రములలో విధించబడిన సూత్రముల ప్రకారము దిద్దుకొనుటకు ప్రయత్నించుతారు. ఈ విధంగా బుద్ధివిశ్వాసములకు పోరాటము నిన్నా నేటినుంచీ కాక బుద్ధుని కాలంనుంచీ సాగుతూనేవుంది.

అతివిద్వాంసులు శుద్ధ బుద్ధిహీనులు విశ్వాసపక్షములో వుండి పోరాడుతున్నారు. ప్రకృతి శాస్త్రజ్ఞాన సూత్ర సంతుష్టులగు విద్యాధికులందరూ బుద్ధిపక్షమున నుండి దాని నెదిరిస్తూ, వారి విజ్ఞానమును ఆధునిక విద్యావిధానముల ద్వారా వ్యాపింప జేస్తూ చట్టములు విరాళములద్వారా సాధించి అమలుపరుస్తూ వున్నారు. ఆధునిక ప్రాకృతిక పరిణామ విధానముల ధాటి కాగ. లేక ప్రాచీనసిద్ధాంతము లన్నియూ, మంచివి చెడ్డవి కూడ, మూఢవిశ్వాసముల క్రింద తృణీకరింపబడి సిగ్గు పడి నశించుచున్నవి. పాశ్చాత్య ధనికవిజ్ఞాననాగరికత వానిలో కొన్నింటికి ప్రద్దంటి వ్రేపై భిన్నాభిన్నము లొనర్చుచున్నది. అయినను మూఢత్వములో విశ్వాసములో తలయెత్తుటకు సాధనములైన కొన్ని విపరీత చర్య లప్పుడప్పుడు భూమిపై సంభవించి బుద్ధివాదకుల చిత్తవిశ్వాసముల నుఱ్ఱూతలూచుచున్నవి. ఇట్టిచర్యలు భారతదేశములోను, ఆటవిక ప్రాంతములలోను, గ్రామ పరిసరములలోను తటస్థించినయెడల నెవ్వరును లక్ష్యము చేయరు సరేగదా నమ్మనైన నమ్మరు. భారతీయుల నగా మూఢులు, మూఢవిశ్వాస పారీణులు అని ఒక ప్రతీతి కొందరు ప్రాచ్యపాశ్చాత్యవిద్వాంసుల ధర్మమంటూ లోకంలో వ్యాపించియుంది గనుక వీనిని కొట్టిపారేయడం సులభమవుతున్నది. కాని సత్యవాక్య సత్యవ్రత నిరతులని పేరుపడ్డ పాశ్చాత్యదేశములలోనే ఇట్టి చర్యలు పొడమి వారి పత్రికలలోనే యిట్టివి ప్రకటింపబడుచునెడల నమ్మకపోవుటకుగాని, లక్ష్యము చేయకుండుటకుగాని యెవ్వరికిని గుండెలుచాలవు. శాస్త్రకారులు వైద్యులు రాజనీతిపండితులు మతపీఠాధిపతులు మొదలైనవారందరూ 'సర్మాసనం బుండి ప్రధ్వంసాభావము ప్రాగభావ మనుచున్' అశ్రాంతము దర్శించకమానరు.

మొత్తముపైని ప్రకృతి అంతా మనమనుకునే ప్రకృతిశాస్త్రసూత్ర బద్ధముకాదనీ, దానికదే ఒక సూత్రమనీ, దానియొక్క ఒకప్రక్కను అర్థము చేసుకొనుటకు ప్రకృతిశాస్త్రములు సహాయకరములై పూజనీయములైనప్పటికీ, రెండవప్రక్కను అర్థము చేసుకోవాలనే ఆసక్తి మనకుండేటాగుంటే ఈ శాస్త్రములు చాలవనీ మనము తెలుసుగుంటే కొంతలాభ ముండక పోదు. ఈ రెండవప్రక్కను తెలుసుకోవడమే నిజమైన విజ్ఞానమనిన్నీ ఆ ఆసక్తియే తపస్సనిన్నీ, అది యమనియమాద్యుత్తమ వ్రతమాత్రసాధ్యమనిన్నీ, వర్ణాశ్రమ ధర్మములు ఆవిజ్ఞానానుభవముల నలవరచు ఒకొక్క మెట్టు లేక అధికారతారతమ్యమనిన్నీ చాటేదే భారతీయ వైదికవిజ్ఞానము. అది ప్రకృతిశాస్త్రములనుగాని, దాని ఫలితములనుగాని తృణీకరించక అవి అసంపూర్ణములనిన్నీ, సంపూర్ణమైన లేక సత్యమైన జ్ఞానము కలుగవలెనంటే యీకాయికచక్షువులు పెట్టి భౌతిక పరిశోధనలు చేసినంతమాత్రమున చాలవనిన్నీ, అంతశ్చక్షువులను పెట్టుకొని ఆత్మీయవిభూతుల తిలకించవలెననిన్నీ అందుకు కిండరుగార్టెనులు, స్కూళ్లు, సినిమాలు, రేడియోలుకంటె సత్సంగత్వము 'గురు' శుశ్రూషయొక్కవసహాయభూతమనిన్నీ భారతవిజ్ఞానముయొక్క రహస్యము. ప్రకృతిశాస్త్రము సంపూర్ణము కాదని

(Emperical Science) అని వారే ఒప్పుకొంటున్నారు. ఈశాస్త్రానికి ఒక ఆదర్శ మున్నదా అంటే అదీ లేదని సి. వి. రామన్‌గారు యీమధ్యనే చెప్పినారు. నవీనకాలంలో సైన్సు నాలుగుకాళ్లమీదా పరుగెత్తుచున్నది. పరిశోధనమీద పరిశోధన జరుగుచున్నది. ఏదో క్రొత్తవింత కనిపెట్టబడుచున్నది. ఏది కనుగొనవలెనో, ఏది కనుగొనబడునో ఎవ్వరికిని తెలియదు. ఏది కనుగొనబడితే దానినే మహావరప్రసాదమని చాటుచు దానికి కళ్లెముకట్టి లాగుచు మానవసేవకొరకో ధనవంతుల వినియోగము కొరకో, రెండింటికిని కాకున్న సైన్సుయొక్క కీర్తికొరకో పరిగెత్తించుచున్నాము.

ఆదర్శము, లక్ష్యములేని యీ పరిశోధనలవలన ప్రపంచమునకు మేలు కలగనీ, కీడుగలగనీ పరిశోధనము సాగవలసినదే అను ఈపరుగులవలన యేమిప్రయోజనమని కొందరికి సందేహము కలుగవచ్చును. ఏమిటి దొరకవాలో ఏమిటి దొరుకుతుందో ఊహించుకోవడానికైనా సాధ్యంకానటువంటిన్ని ఊహించు కోసం డానే సాగించుచున్నటువంటిన్ని యీవిజ్ఞానపరిశోధనల (Explorations)లోను, అనుకోనటువంటిన్ని అజ్ఞాతమైనటువంటిన్ని వింతలను బయలుపెట్టి యంత్రాలలోకి తర్జుమాచేసి ప్రపంచకంమీద పరుగెత్తించిడంలోనే పరమానంద మున్నదని సి. వి. రామనుగారు విశదీకరించినారు. శాస్త్రకారుని కింతకంటె సంతోషదాయకమయినటువంటిన్ని సంతుష్టికారక మైనటువంటిన్ని భావము వేరొక్క టేలయనియే రామన్‌గారి ఆశయమైయుండవచ్చునని తోచును. ప్రకృతి శాస్త్రములకు లేక భౌతికశాస్త్రముల కింతకంటె మహదాశయ ముండకుండుటలో ఆశ్చర్యములేదు. కాని ప్రకృతియే అవిద్యయైనప్పుడు దానికిసంబంధించిన జ్ఞానము పాశ్చాత్య దృష్ట్యా జ్ఞానమైనను భారతీయ ఆధ్యాత్మిక దృష్ట్యా అజ్ఞానమనుటకు సందేహము లేదు. అజ్ఞాన మగు ప్రకృతిలో మనము కొట్టుకొంటున్నాళ్లు ఈ అజ్ఞానమును కూడ అవిద్యనుకూడ జ్ఞానముగానేయెంచుకొని మనము ప్రపంచముకోసము తాపత్రయము పడుచుండవలెను. ఒరులకు దుఃఖహేతువులము కాకుండ మనవలెను, స్వార్థసిద్ధాంతములను, అన్యజనద్వేషంబులను విసర్జించవలెను, అజ్ఞానమయమైన ప్రకృతిని కూడ అందులో కొట్టుకొనుచుండువా రందరికిని ఆనందమయ మగునట్లు చేయవలెను. ప్రకృతిశాస్త్రమును, పరిశోధనలు, వాని నియమములు యీసంకల్పములచే బద్ధముకావలెను.

కాని ఈఅజ్ఞానమంతటిని లేక నిజమైన జ్ఞానము యొక్క యీ ఆభాసనంతటిని మన పరమావధిగ జేసుకొని నిజమైన ఆత్మజ్ఞానానుభవ ప్రయత్నములను విసర్జించుట మానవజన్మమునకు చరితార్థము కాదు. జ్ఞానమువలె భ్రమలుగొల్పు యీ అజ్ఞానమునకై నిజమైన ఆత్మజ్ఞానమును విసర్జించుట 'మసగొని రేసుబండ్లకును మాణిక్యము ల్వెలబోసిన' ట్లగును. ఆత్మజ్ఞానము యొక్క మహత్వము నెఱుగని పాశ్చాత్యులు దీనిని గూర్చి ఆలోచింపనొల్లక యీ అజ్ఞానజలధిలోనే ఆసాయంత్రము ఆసూర్యోదయము ప్రొద్దుబుచ్చ సాహసింతురుగాక! సనకసనందనాదుల దివ్యానాసనలు వంటపట్టి జీర్ణించిన భారతజాతి యిందులో తలమున్కలై కొట్టుకొనుచుండుటకు బూనుకొననొల్లదు. ఆట్లొనర్చినచో మానవున కొసగబడిన ఊర్ధ్వదృష్టి, ఉత్తమతత్వము వ్యర్థపుచ్చుట యగును. ప్రాకృతజీవనమును కూడ యీధన్యసూత్రమున కనుబంధముగమాత్ర ముంచుకొని దిద్దుకొనుట సక్రమము. ఈదివ్యసందేశమును ప్రస్తుత ప్రపంచమంతటితోపాటు మనమును పెడచెవినిబెట్టి ప్రవర్తించుచున్నకతముననే మన జీవన మాధ్యాత్మిక తత్వశూన్యమై, ప్రకృతిలోకూడ జాతికిజాతికి, వ్యక్తికి వ్యక్తికి, దేశమునకు దేశమునకు, మతమునకు మతమునకు పరస్పర వైరకారణమై వినాశకరమైన దుష్ఫలముగు ద్రొక్కుచున్నది. ప్రపంచములో జ్ఞాను లనుకొనబడువారి దృష్టి యిటులైపునకు మళ్లినదే ప్రపంచములో యేజాతికికాని శాంతికాని, సౌఖ్యము కాని, సఖ్యముకాని చేకూరదు. ప్రకృతియెల్లయు పరమాత్మ యొక్క ఆభాసమాత్రమే యను భావము మనకు పొడమి, మనము ప్రకృత్యారాధనను పరమేశ్వరారాధనమునకు సాధనముగను రూపాంతరముగను భావించకున్నచో, దీనిమొదలనే మనకు శాశ్వతత్వభావము, మమకారభావము, పొడమి పరస్పరవైరములు పెంచి,

గుణత్రయపీడితులను జేసి పారమార్థికమునకును ప్రకృతి సంపదలకును శాంతికినిగూడ దౌదవ్వులొనరించును.

ప్రకృతికి ప్రకృతిశాస్త్రములకు అతీతమైన ఒక తత్త్వము ఒకలోకము ఒక విభూతి కల దను భావము ముందు పొడమనిదే వీనియందలి యీ వ్యామోహము మనకు తొలగదు. అజ్ఞాన ముదయించుటయే యీ అజ్ఞానము విచ్ఛిన్నమై, యీవ్యామోహము విచ్ఛిన్నమై నిజమైనజ్ఞానము కలుగుట కక్షురాభ్యాస మగును. కాని ప్రస్తుత భౌతికశాస్త్రవిజృంభణముయొక్క ఉన్మత్తత అట్టిభావ ముదయించుటకే తొలియడ్డయి, దానిని హేళనచేసే గర్వములో నున్నది. ఈయజ్ఞానము ఆసత్య జ్ఞానవాసనలను పరిహాసముచేయుట గ్రుడ్డువచ్చి పిల్లను వెక్కిరించిన ట్లుండును. మన వారసత్వపు కాణాచి యైన ఈ సుజ్ఞానమును హేళనచేసి దూషించుటలో మనము పాశ్చాత్యులను తలదన్నుచుండుట మన ప్రారబ్ధ కర్మ మనుకొని మనము వగవవలెను. మన ఆధ్యాత్మిక జ్ఞానాసక్తి, ఆత్మవిజ్ఞానము, మన ఋషీంద్రుల తపస్సు, మన భక్తాగ్రగణ్యుల సంకీర్తనలు ఇవే మన దాస్యమునకు దారిద్ర్యమునకు కారణములని పాశ్చాత్యులెవ్వరో పాడెడిపాటకు మనము తాళమువేయుట మానవలెను. ఆత్మజ్ఞానము భౌతికదారిద్ర్య దాస్య విముక్తికే కారణమగునుకాని దారిద్ర్యదాస్యముల కొకనాటికిని కారణము కాజాలదు. మనకు ఆత్మజ్ఞానముయెడల గలఆసక్తి తగ్గిననాటనుండియు, లేదా అది కేవల కుహనాసక్తిగా మారిననాటినుండియే మన ఆధ్యాత్మికదారిద్ర్య దాస్యములును వానితోబాటే మన భౌతికదారిద్ర్యదాస్యములును ప్రారంభమైనవని మనము నమ్మవలెను. మనకు నేడు తిరిగీ వీనినుండి విముక్తిరావలెనన్నను, వానియెడల మనకు నిజమైన ఆసక్తి పొడముట యొక్కటే సత్యమైన మార్గమని విశ్వసింపవలెను. ఈదృష్టితో ప్రారంభము కాని యే ప్రయత్నమును ఏదేశములోను నెగ్గలేదు, నెగ్గినను శుభాంతము కాలేదు. మనదేశములో కూడ నెగ్గదు, శుభాంతముకాదు. మన భారతజాతీ యాంతఃకరణవిపంచిలో మనోహరతమమగు తీగ యిది యొక్కటియే. దీనిని కదలించిననే వీణ అంతయు సుస్వరముల నీనుచు భూతల స్వర్గతలములను రెండింటిని కదలించగలము. లేనియెడల మన ప్రయత్నము లెల్లయు బూటకములుగా మారకమానవు. ప్రజలుకూడ బూటకము లని త్రోసివేయకమానరు. నేటిభారతీయు లెన్నియోభౌతిక నాటకబూటకముల చూచి విసుగు నెత్తుచున్నారు. మనము వీటికి సాయము మరోనాటకము నాడబోయి వేషధారులమై వారియెదుట ప్రత్యక్షమైనచో వారు క్షణమాత్ర మేదో నవ్వి ఆనందించి తలదిరిగి తృణీకరించక మానరు.

అయితే యీరీతిగా పని ప్రారంభించడమనేది అంతసులభమైన కార్యము గాదు. మొట్టమొదటిలో ప్రారంభకులకైనా అందులో విశ్వాస ముదయించవలెను. ఈవిశ్వాస మొకసారి ఉదయించినచో మరి వదలదు. వామనావతారమువలె క్షణకాలములో అది సర్వజగద్వ్యాప్తమై తీరును. ఏజాతిలోనైన ఈయుగములో అది ఉదయించుట సాధ్యమగునెడల అది భారతజాతిలోనే. ప్రపంచములో బుద్ధుడు, క్రీస్తువు, మహమ్మదు, శంకరుడు మొదలగు అవతారపురుషులు పుట్టిన పూర్వయుగము లెప్పటికంటెకూడ యీయుగ మరాచకమై, సంకరమై, స్వార్థమై అజ్ఞానమైయున్నది. ఈమహాపీడనుండి తప్పుకొనుట కట్టి విజ్ఞానోదయమే తారకమంత్రముకాని వేఱొండు కాదు. లోకార్నో సభలు, ఆయుధవిసర్జన, నిర్ణయసభలు తచ్ఛాంతి నిచ్చునట్లు కనిపించుచు మరింత అనుమానములను విరోధములను పెంచును. ఇవి యెవ్వియు చిత్తసంస్కారము తేజాలవు. అది రానిదే ప్రపంచశాంతి కుదరదు. ఆధ్యాత్మికవిశ్వాసము జనించనిదే అనుమానములు పోయి చిత్తశాంతి కుదరదు. గాంధిమహాత్ము డట్టివిశ్వాసము ప్రపంచములో తిరిగీ పొడమజేయుటకు అపారమైన త్యాగమును తానుచేసియు భారతీయులచేత చేయించియుకూడ సఫలమనోరథుడు కాలేడు. అయినను అతనికికాని, ఆధ్యాత్మిక జ్ఞానమునకుగాని పరాభవమన్నది లేదు. అది యెన్నిమాఱు లోడినట్లు కనిపించిన అంతలోతుగా పొదుకొనుచుండకమానదు. అజ్ఞానులు తప్ప యితరులు, యిట్టి పూజ్యసంకల్పమునకు పరా

జయము నాపాదించలేరు. భారతీయు లీవిశ్వాసము నెంతబాగా పునర్నిర్మించుకొన్న, అంత చక్కగా తమ్ముతాము ను ప్రపంచమునుకూడ దిద్దగలరు.

ఇట్టివిశ్వాసము కలుగనీయకుండా అడ్డుతగిలే ప్రథమశత్రువు సంశయాత్మ. సంశయాత్మ అవిశ్వాసముకంటె కాస్త నయమైనను నిజమైన విశ్వాసమునకు వేగముగా విధేయము కాలేదు. అయినను ఈవిశ్వాసము కేవలము మూఢవిశ్వాసము కాకూడదు. మఱియును ఆధ్యాత్మిక ధర్మశాస్త్రములయందలి విశ్వాసములనన్నిటిని మూఢవిశ్వాసములక్రింద కొట్టివేయరాదు. శుద్ధమూఢత్వముతో వానినినమ్మిన మూర్ఖవిశ్వాసముపాలసుదుము. భౌతికప్రాకృతికదృష్టితో వానిని చేసినచో విశ్వాసము. సవరదు. అవి మనకంటె పూజ్యులు అనుభవజ్ఞులు అగు తపశ్శాలురచే మనశ్రేయస్సుకొరకు వ్రాయబడినవని మనము చాలవరకు విశ్వాసముంచుకొనక తీరదు. వానిని భావదాస్యముక్రింద కొట్టివేయుట అవివేకము. మనవేదములు, ధర్మశాస్త్రములు, పురాణములు, ఉపనిషత్తులు, పంచదశి, భగవద్గీత మొదలగువానిలో గల మహాసత్యములను భావదాస్యమనియు, అపక్వములును అసంపూర్ణములును, అసమేతసంకల్పములును నగు ప్రకృతిశాస్త్రములును తత్పండితవర్గములను చెప్పువాక్యములను నమ్ముట సంపూర్ణభావస్వాతంత్ర్యమును అనుకొనుట చాలాతప్పు. మూర్ఖవిశ్వాసము కంటెను గూడ అపాయకరమైనది విశ్వసింపవలసినదానిని విశ్వసింపని అవిశ్వాసము. మూర్ఖవిశ్వాసి వాని విశ్వాసము ద్వారా యెటో కొట్టుకొని పోవునుకాని అవిశ్వాసి చాలా అనర్థముల పాలగును. మూర్ఖవిశ్వాస, అవిశ్వాసములలో మూర్ఖవిశ్వాసమైనను కొంత మంచిదే యనవలెను. మూర్ఖవిశ్వాసములో యెక్కడ పడిపోదుమో అను బెంగతో అసలు విశ్వాసమువైపే తొంగిచూడనొల్లక భౌతికము మీదను ప్రత్యక్షముమీదను మాత్రమిండ్లుకట్టుకొని కాపురముండ గోరుచో అవి నిలువవు సరేకదా అనేక అనర్థములకు హేతుభూతము లగును. మానవుని,అందునముఖ్యముగా నేటి మానవుని,యీశాస్త్రీయ యుగములో యెదుర్కొనుచున్న దీర్ఘఘోరతరమైన సమస్యయై యున్నది. మానవుడు మూర్ఖుడును కాక, అవిశ్వాసియు కాక దివ్యమూర్తియై దీని దంష్ట్రలనుండి బైటికిపడి స్వర్గమునకు భూమికికూడ అలంకారప్రాయుడు కావలెను. అందుకే అతను పుడమిపై పుట్టినది. కాని జపము విడచి లొట్టలు వేయునట్లు అతడు నేడు ఆసందేశమునే మఱచి లోకాటనముతోనే తన జీవయాత్రను పుచ్చి గంట వాయించుకొనుచున్నాడు. ఈక్రొత్త సందేశమును ప్రపంచమునకంతకును నచ్చి పరవశ మొనర్చునట్లు పాడగల కవి గాయకుడు, యోగి లేక అవతారమూర్తి పుట్టలేదు. పుట్టువరకు ఇట్లు భౌతికపు పెత్తులను సాగించుటకే మహామహులుకూడ పుట్టుటయు, గిట్టుటయు తటస్థించుచుండును.



# నక్షత్రమండలము

గొబ్బూరు వేంకటానంద రాఘవరావు

(యువసంవత్సర శ్రావణ-భాద్రపద మాసములు)

ఉత్తరము




దక్షిణము

ఈపటమును ఆయాదిక్కులు సరిగాచూపునట్లు తలమీదుగాపెట్టి చూడవలెను. ఇందున్నట్లు నక్షత్రాదులు

| | | |
|---|---|---|
| ఆగస్టు 8 తేదీని రాత్రి 8-55 గంటలకును, | ఆగస్టు 15 తేదీని రాత్రి 8-27 గంటలకును | కనబడును. |
| ,, 22 ,, ,, 7-59 ,, | ,, 29 ,, ,, 7-31 ,, | |
| సెప్టెంబరు 5 ,, ,, 7-3 ,, | | |

[సూర్యాస్తమానము కాగానే పూర్వఫల్గుని కనబడువఱకు శుక్రుడు కనబడును. తరువాత అస్తమించును. కుజుడు స్వాతి విశాఖానక్షత్రములలో సంచారము. కుజగ్రహము ఆగస్టు 16-20 వఱకు కనబడున ట్లీపటములో చూపబడినది.] త్రి

......Now glowed the firmament
With living sapphires; Hesperus that led
The Starry host, rode brightest.
Oh Hesperus! thou bringest all good things;
Home to the weary; to the hungry, cheer;
To the young bird, the parent's brooding wings;
The welcome stall to the overlaboured steer.

(ఆకాశరంగ మిపుడు జీవకళలుగల వివిధకాంతులతో తేజరిల్లు నక్షత్రరాసులతో మిక్కిలి ప్రకాశించుచున్నది. ఈ చుక్కలన్నిటికి దారితీయుచున్న పడమటి చుక్క - శుక్రుడు-అసమాన కాంతికలిగి అన్నిటికంటె అద్భుత తేజముతో మెఱసిపోవుచున్నాడు. పశ్చిమమున నిట్లువెలుగుచున్న శుక్ర గ్రహమా, నీ దర్శనముచే సమస్త ప్రాణులకు శుభోదయమగుచున్నది. ఎట్లనగా: పగలెల్లనడిచి అలసినవారలు విరతిచెందుటకు నివాస మగపడుచున్నది. క్షుధార్తులకు అన్నము లభించి ఆనందము కలుగుచున్నది. దినమెల్ల గూటిలో పడియుండిన పక్షిపిల్లలను, తల్లి సప్రేమముగా చేరదీసికొని రెక్కలనిపక్షములుకప్పి సుఖపారవశ్యము నొందించుచున్నది. బహుదూరము స్వారిచేసి బడలిన గుఱ్ఱము సాలచేరుకొని హాయిగా విశ్రమించుచున్నది.)

ఈ మాసమునందు రాత్రితొలిజామున నగపడు గ్రహనక్షత్రాదులను పరిశీలింతము:

## పాలవెల్లి (The Milky way)

ఈ మాసమునందు పాలవెల్లి ధనువువలె వంగిన ఆకారముతో కానరాదు. ఖగోళమునకు అడ్డుగా- ఉత్తరసమీప ఈశాన్య దిశనుండి దక్షిణసమీపపు నైరృతి దిశకు అడ్డుగా - వ్యాపించి, ఆకాశరంగమును రెండు భాగములుగా విభజించుచున్నట్లు కనబడును. అందు పడమటి భాగము పెద్దదిగాను, తూర్పు భాగము చిన్నదిగాను కనబడును. దక్షిణమున నీపాలవెల్లికి గల వెడల్పుకంటె ఈశాన్యమున వెడల్పు రెండురెట్లధికముగా నుండును. ధవళధవళమైన యీ దృశ్యముమధ్య వేదికామండలమునుండి ఉత్తరమున రాజ హంసవఱకు నల్లగా ఛాయాపథము వ్యాపించియున్నది. రాజహంస మండలములో రెండు నల్లని మచ్చ లగపడుచున్నవి. (coal sacks) ఆశ్యామసీమలను పటములో 'శ్యా. సీ' అను నక్షరములచే చూపియున్నాను.

## మిక్కిలి తేజోవంతములైన నక్షత్రములు

ఇరువదింటిలో ఇపుడు ఆరుమాత్రము కనబడుచున్నవి. 1. చిత్ర (Spica), 2. స్వాతి (Arcturus), (3.) జ్యేష్ఠ (Antares), (4.) బ్రహ్మ (Vega Lyra), (5.) శ్రవణము (Altair.), (6.) ఇంద్రద్యుమ్నుడు (Fomalhaut - ఫోమాలో.) ఇట్టిచుక్కలారే యైనను గ్రహతేజోవిభాసితమై ఖగోళము రమ్యముగానే చూపట్టుచున్నది. పడమటదిశను శుక్రుడు సింహరాశిలో వక్రగతుడగుటచేత సూర్యాస్తమానము కాగానే కొంతతడవుమాత్రముండి అస్తమించును. సెప్టెంబరు మాస మారంభమునుండి శుక్రుడు పడమట కనబడడు. కావున, ఆగష్టునెలాఖరు వఱకును చుక్కలకు దారి తీయుచున్నట్లు పడమట వెలుగుచు శుక్రు డస్తమించుచుండును. కుజుడు ఈ మాసములో స్వాతీ విశాఖా నక్షత్రములలో సంచారము. కాబట్టి కుజుడు, ముత్యమువలె తళతళ మెఱయు చిత్రకు తూర్పుగా పగడమువంటి స్వాతి కెదురుగా, ఎఱ్ఱగా మెఱయుచు దినదినము తూర్పునకు జరుగుచున్నట్లు కనబడును. గురుడు ఈమాసమున విశాఖలోనే కనబడును. కుజుడు గురునితో ఆగష్టు 24 వ తేదీని విశాఖ 2-3 పాదముల మధ్య సమాగమము జరుపును. ఈ గ్రహములకు ఆగ్నేయ భాగమున ఎఱ్ఱగా జ్యేష్ఠానక్షత్రమును, పడమట శ్రవణ నక్షత్రమును, శ్రవణమునకు తూర్పున కుంభగతుడగు శనియు, చక్కగా మెఱయుచు మిక్కిలి తేజోవంతమైన చుక్క-(First Magnitude stars,) లంతగా కానరాని లోప మగపడకుండ చేయుచున్నవి.

## ఉత్తరమున

లఘుఋక్షపుతోకచివర ధ్రువుడు మెఱయుచున్నాడు. తోకలో కశ్యప మహేంద్రులును, తోకమూల అగ్నియును, అగ్నికెదురుగా మిత్రతారయును, ఈరెంటికెదురుగా ధాతవిధాతలును ప్రకాశించుచున్నారు. ఈశాన్యమున నప్సరస లిపుడే ఉదయించినారు. ఈయప్సరసల కెగువ, ధ్రువుని సమీపమునుండి తూర్పునకు, పార్శ్వ వ్యాప్తిలో ఉర్వశీపురూరవసులు కనబడుచున్నారు. పైనక్షత్రములకు ఈశాన్య భాగమున ఇంద్రమద ఇపుడిపుడే ఉదయించుచున్నది. వాయవ్యమున విఘ్నేశ్వరుడు మూషకసహితముగా అస్తమించినాడు. సప్త ఋషులు ఇక నస్తమింపనై యున్నారు. ఋక్షద్వయమధ్యమున మెలికలు తిరుగుచు నరకాసురు డగపడుచున్నాడు.

## పడమట

సూర్యాస్తమానము కాగానే కొంతతడవు వెలిగె, శుక్రు డస్తమించినాడు. సెప్టెంబరు 1 వ తేదీనుండి శుక్రుడు పడమట నగపడడు. ఉత్తర ఫల్గునియు, వేణీమండలమును, వాటికీవల హస్త నక్షత్రములును, కన్యారాశిలోని ఆప, నళ, ఆప్యవను నక్షత్రములును, నైరృతి దిగ్భాగమున చిత్రయు పడమటకు వాలి, త్వరలో నస్తమింపనై యున్నవి. నహుష సర్పములోని చుక్కలు నైరృతిదిశను రెండుమాత్రము కానవచ్చుచున్నవి.

## దక్షిణమున

అశ్వతరమండలములో కొంతభాగము మాత్రమే కనబడుచున్నది. దానికీవల వృకమున్నది. వృకమునకు ప్రక్కగా బలిచక్రవర్తియు, అతనిసమీపముననె ఆతని యజ్ఞవేదికయు కలవు. వీటి ప్రక్కనే దక్షిణమయూరము కలదు. ఆవల బాణాసురు డున్నాడు. ఆగ్నేయ దిగ్భాగమున ఇంద్రద్యుమ్ను డిప్పుడిపుడే ఉదయించినాడు. అగస్త్య శాపమున నీతడు సింహప్రతిస్పర్ధియైన యేనుగైనాడు. అనగా సింహరాశి అస్తమించినపిమ్మటనే ఇంద్రద్యుమ్నుని ఉదయము అని గమనింతము.

## తూర్పున

పేద్దఘూశ్వము ( Pegasus ) చతురస్రము బాగుగా ఉదయించినది. మీనరాశిలోగల రెండుచేపలలో (మత్స్యద్వయంచేతి) ఒకచేపమాత్రము కొంచెము కనబడుచున్నది. మీనమున కీవల కుంభరాశియు, కుంభమునకీవల మకరమును కలవు. మకరరాశియను పేరు ఇటీవల వచ్చినది. ఋగ్వేదకాలమునాడు అది అజమనియే వ్యవహరింపబడుచుండెను. పాశ్చాత్యశాస్త్రజ్ఞు లీరాశిని (Capriccrn) సముద్రపు మేక (The seagoat.) అని వ్యవహరించుచునే యున్నారు. ఇప్పటి లెక్కప్రకారము నక్షత్రములలో ఆఖరుది రేవతి. దాని కధిదేవత పూషుడు. పూషునిరథము ఈడ్చునది అజము. తూర్పుఆకాశమున ముందుగా అజము ఉదయించి వెనుక రేవతి ఉదయించుటచేత రేవతి కధిపతియైన పూషుని రథము అజము లాగుచున్నట్లు ఋగ్వేదమంత్రద్రష్టలైన పూర్వ ఋషులు భావించుకొని పూషుడజాశ్వుడని పెక్కుచోట్ల వర్ణించినారు. అట్లే వరుణుడు కుంభమును ద్రిమ్మరించి జలప్రదానము చేయుచున్నాడనిరి. ఆకాశమున కుంభరాశిదృశ్యము ఎట్లుండు ననగా ఒకపురుషుడు కడవ బోర్లించి నీరు క్రిందకు వదులుచున్న ట్లుండును. 'కుంభవృష్టి'యని, 'కడవలు కుమ్మరించినట్లు వర్షము కురిసె'నని మనవారు చెప్పుటకు కారణము ఈఖగోళ దృశ్యమే.

## మధ్యను

కన్యయొక్క వేణి ముడివేయుచున్నట్లు స్వాతి వేణికీవల పశ్చిమమునకు వ్రాలియున్నది. ఆపైని భూతేశ (Bootes) మండల మున్నది. వాయుదైవత్యమైన స్వాతి ఒకప్రక్కను, గరుడ దైవత్యమైన శ్రవణ మొకప్రక్కను సేవించుచుండ క్షీరసముద్రమున శేషశాయియై శ్రీ మహావిష్ణువు పవ్వళించియున్నాడు. ఆషాఢశుద్ధ ఏకాదశినాడు విష్ణువు గగనమధ్యరేఖ దాటి, పశ్చిమమునకు వ్రాలి శయనమున నున్నాడు. భాద్రపదశుద్ధ ఏకాదశినాడు పరివర్తన—ఒత్తిగిలుట, పడమట అస్తమించి పిమ్మట తూర్పున తేలి లేచుయత్న

మునసుండుట—ఆరంభమగును. ఆ సందర్భము రాబోవు మాసమున చూడగలము. విష్ణుని దిగువ శేషుడు చాల చుట్టలు చుట్టుకొని పొన్నుగా ఏర్పడినాడు. ఆదిగువను ఇంద్రాగ్ని దైవత్యమైన విశాఖ కుమ్మరిసారెవలె కనబడుచున్నది. ఆప్రక్కను వృశ్చికరాశియు, వృశ్చికమునకు తూర్పుగా ధనుస్సును కలవు. వృశ్చికధనూరాసులయొక్క పటము ఈ దిగువచూపబడినది. వృశ్చికరాశియొక్క స్వరూప మిందు చక్కగా చూడనగును. ఛత్రాకారముగల అనూరాధ చుక్కలుమూడును, దిగువనుకూడ అట్టి యాకారమేగల జ్యేష్ఠయు చూడనగును. ఆదిగువను తేలుకొండెలో మూలనక్షత్రము నందలి పదునొకండు చుక్కలును చక్కగా మెఱయుచున్నవి. అనూరాధలో ఉత్తరపుకొననున్న చుక్క, (బీటా Scorpio) గౌతమనక్షత్రమనియు, జ్యేష్ఠప్రక్కనున్నది(సిగ్మా Scorpio)జైమినినక్షత్రమనియు కేత్కారుపండితులు జ్యోతిర్గణితమునందలి నక్షత్రపటములో తెల్పినారు.

వృశ్చిక ధనూ రాసులు

[ధనూ రాశిలోని డెల్టా-ఎప్సిలాన్ చుక్కలు పూర్వాషాఢ; సిగ్మా-జీటా-చుక్కలు ఉత్తరాషాఢ.

కేత్కారు పండితులు ఈ ధనూ రాశిలో పై=శాకలుడు; మ్యూ=శివ; లాంబ్డా=మృకండు నక్షత్రములని జ్యోతిర్గణితనక్షత్ర పటములో తెలిపినారు.

జూన్ 7. ఉ.-ఇచటనుండి జూన్ నెల 7 తేదీని ఉల్కాపాత మగపడును.

కేత్కారు పండితులు వృశ్చికరాశిలో సిగ్మా-జైమిని, బీటా-గౌతమ. నక్షత్రములని తెల్పినారు.]

ఎఱ్ఱగా నుండుటచేత జ్యేష్ఠకు వేదకాలమున రోహిణియనియే పేరుండెను. ఈరోహిణి ఇంద్రదైవత్యము. ఇంద్రుడు దేవతలరాజు. పరిమాణముచేతను, తేజస్సుచేతను కూడ ఈ జ్యేష్ఠనక్షత్రము దేవతలకు రాజుగానగియున్నది. వృత్రాది రాక్షసుల పై కయ్యమునకు కాలుద్రవ్వు దేవతల నక్షత్రము లీ జ్యేష్ఠప్రాంతములనుండి వెడలుచున్నవి. విశేషించి జ్యేష్ఠ బ్రహ్మాండమైన పరిమాణముగల మహాగోళము. ఎనిమిదిలక్షల మైళ్ల వ్యాసముగల మన సూర్యగోళముకంటె జ్యేష్ఠనక్షత్రపు వ్యాసము ఇరువది రెండువేల రెట్లు పెద్దది.

## ధనుస్సు

ఈరాశిలోగల వివిధనక్షత్రములు లీప్రక్క పుటలోని పటములో వివరముగా చూడనగును. ఇందు డెల్టా-ఎప్సి లాన్ గుర్తులుగల నక్షత్రములు పూర్వాషాఢ; జీటా-సిగ్మా గుర్తులుగలవి ఉత్తరాషాఢ. ఇవి రెండును ఒకదానికొకటి ఎదురుగా ("ద్వేద్వే ఖట్వాం". మంచపుకోళ్ల వలె నుండును. ఇందు లాంబ్డా, డెల్టా, ఎప్సిలాన్ చుక్కలు వంగినవిల్లుగాను, డెల్టా గామానక్షత్రములు అలుగుగాను భావించుకొనినపక్షమున ధనుస్సుయొక్క స్వరూపము స్పష్టముకాగలదు. తేలుకొండెకు ప్రక్కనుండుటచేతనే కాబోలు, మన్మథబాణముచే ప్రహరింపబడిన కాముకీ, కాముక జనమునకు మిక్కిలి చులుకుపుట్టి, వారలు ప్రబంధములలో వర్ణింపబడునట్లు తహతహలాడుచుందురు. మన్మథవాహనమైన చిలుక ఆదిసవను చూపబడిన స్వరూపముతో కాననగుచున్నది.

ఆషాఢమాసమున ధనుస్సు సూర్యాస్తమానము కాగానే, తూర్పుదిక్కున నుదయించుటయు, ఆషాఢప్రథమదివసమున పర్వతశిఖరములు మేఘాశ్లిష్టము లగుటయు, స్త్రీపురుషు లన్యోన్యసమావేశము లభిలషించుటయు, ధన్వి, విరాట్పురుషుని "ఊరు యుగ"మని వేదవాఙ్మయము ఘోషించుటయు చూడగా ఆకాశనాటకము ననుసరించి భూమిమీద నాటకము జరుగుచున్నదనుట (That the drama cf the Earth runs parallel to the drama of the Sky.) నిజమని తోచగలదు. ఇందు లాంబ్డానక్షత్రము మృకండుడనియు, 'పై' నక్షత్రము శాకలుడనియు, 'మ్యూ' నక్షత్రము శివమనియు కేత్కారుపండితులు తెలిపియున్నారు.

విష్ణువు నాభికమలమునుండి వెడలిన బ్రహ్మ రాజహంసపై నెక్కినాడు. ముఖమున వీణాపాణియైన సరస్వతిని పెట్టుకొనినాడు. బ్రహ్మ నక్షత్రముయొక్క వెలుగు మనకు చేరుసరికి 40 సంవత్సరములు పట్టును. ఇంద్రనక్షత్రపువెలుగు మనకు చేరుసరికి 153 సంవత్సరములు పట్టును.

శ్రవణ నక్షత్రమునందలి మూడు చుక్కలును రమ్యముగా మెఱయుచున్నవి. అందు మధ్యచుక్క తన్నుకొనిపోవు గ్రద్ద (Swooping Eagle) అనియు, పైనున్న 3 గుర్తుగల చుక్క బందేటుదొంగ (త్రజేడ్-Trazed) అనియు, క్రిందనున్న 2 గుర్తుగలచుక్క తెల్లగ్రద్ద (White Folcon) అనియు అరబ్బులు చెప్పుదురు. ఇంద్రుని అమృతమును గరుత్మంతుడు కొట్టితెచ్చెననియు, అతడు శ్రీమహావిష్ణువువాహనమనియు మనగాథలు.

## ఉల్కలు (Meteors)

Our lights dart here and there,
Whirl to and fro;
We flash and Vanish, we die down and glow
All doing Hîs Will who bids us do it so.

"సర్వ జగన్నియామకుని యాజ్ఞల ననుసరించి మే మిద్దే మెఱసెదము. క్షణములో మాయమయ్యెదము. చచ్చెదము; చచ్చుచు గప్పుమని వెలిగెదము. సుడివడుచు నఖండత్వరతో ముందునకు పోయెదము. వెనుకకు మరలెదము. అద్భుతశరవేగముతో మా తేజ మందందు ప్రసరించును" అని ఉల్కలు తమపూర్వోత్తరములు తామే చెప్పుకొన్నట్లు ఒక కవి వర్ణించినాడు. ఈమాసములో ఆగష్టు 11 తేదీ మొదలు 13 తేదీవఱకు రాత్రి 11 గంటలైనతరువాత భృగుపరసు మండలమునుండి ఉల్కలు రాలును. ఇట్లు సంవత్సరమున కొకతూరి జరుగుచుండును. ఈ ఉల్కలు ఉజ్జ్వలములై అఖండత్వరతో అసంఖ్యాకములు రాలి పోవుచుండును 1862 సంవత్సరములో కనబడిన ఒకతోకచుక్క శకలము లివియని గుర్తింపబడినవి. ఆగష్టు 15 మొదలు 25 వఱకు నరకమండలములో అంతరిక్షుడను రిక్కనుండియు, 21 తేదీ మొదలు సెప్టెంబరు 2 తేదీ వఱకు నరకునిలో పంచజనరిక్కనుండియు చిన్న ఉల్కలు రాలును.

కోటమర్తి చినరఘుపతిరావు

## ఆయుర్దాయభావము ౨

మానవునకాయుర్దాయము ముఖ్యము. ఆ ఆయుర్దాయసంపత్తిలేనివానికఖిం డైశ్వర్యములున్నను నేమి ప్రయోజనము? అట్టివాని కున్న విద్యావలని ఫలమేమి? చక్రవర్తిత్వమున్నను నుపయోగమేమి? ఆయుర్దాయమే లోపించిన నిక సిరియైశ్వర్యములనుభవింపగలడా మానవుడు? అందువలన మానవునకు ముఖ్యమైన విషయము ఆయుర్దాయము. ఆభావము పూర్తిగ బట్టిననే యాతడు నిక్కముగా నదృష్టవంతుడని చెప్పవచ్చును. కొంతమంది ఆయుర్దాయభావము పూర్ణముగనున్నను జాత్యంధులై వికలాంగులై, దీర్ఘవ్యాధిపీడితులై, నూరుసంవత్సరములు బ్రతికినను ప్రయోజనము గలదా? ఇంచుమించుగ నట్టివానిని జీవన్మృతుడని చెప్పవచ్చునుగదా! కావున మానవుని జాతకమునుగాని, సాముద్రికమునుగాని చూచునప్పు డాయుర్దాయభావముతోబాటు నాతనికి గలుగబోవు ఘనవిపత్తులగూర్చి కూడ తెలిసికొనుట ముఖ్యము. ఈదిగువ నట్టియాపద లేలక్షణములబట్టి కలుగునో వ్రాసి నెల్ల నిరూపించుచున్నాను.

1 వ పటములో అరచేతిలోనుండు గ్రహముల స్థానములు నిరూపించుచున్నాను.

1. గురుడు, లేక బృహస్పతి
2. శని
3. రవి
4. బుధుడు
5. క కుజుడు. 5 ఖ కుజుడు. 5 గ కుజుడు. (ఈమూడింటి భేదముల క్రమముగా దెల్పుదును).
6. చంద్రుడు
7. శుక్రుడు




పటము ౧

పైన నిరూపించిన గ్రహస్థానముల గూర్చి క్రమక్రమముగా దెల్పుదును. ఈస్థానములు ఆయా గ్రహములకు సంబంధించిన ఆకస్మిక ప్రమాదముల లక్షణముల తెల్పుటకై ముందుగ నిరూపింపబడినది.

ప్రమాదములు సాధారణముగా నక్షత్రములపై నాధారపడును. ఆనక్షత్ర మేగ్రహస్థానములో నుండునో ఆగ్రహమునకు సంబంధించిన ప్రమాదములు తటస్థించును. మరియు చిన్నచిన్న అడ్డగీతలుకూడ ఆకస్మిక ప్రమాదముల నిరూపించును. కాని ఆచిన్నగీతలు ప్రమాదము తటస్థించిన పిదప మాసిపోవచ్చును. ఇంతియకాక ప్రమాదము చేతి

లోనున్న గీతల నెట్టిపఱచి ఆ స్థానమును నిరూపించు రేఖపై తెంపులు కలుగజేయును.



పటము ౨

అగ్నిప్రమాదము:— అగ్ని ప్రమాదమును నిరూపించుటకు రెండు చిహ్నములు గలవు. అందొకటి బొటనవ్రేలిప్రక్క గురు స్థానములో బుట్టి చూపుడువ్రేలి రెండవ కణుపువఱకు నొక రేఖపోయినచో నది అగ్ని ప్రమాదమును నిరూపించును. అన్నింటిలోను ఇదియే యెక్కుడు ప్రమాదకరమైన విషయ మగునో నప్పు డీ రేఖ కానవగును. ఈ రేఖ గలవారికి అగ్నిప్రమాదమువలన మృత్యువు వచ్చుననిగూడ ఒకొ్కక్కప్పుడు చెప్ప వచ్చును.

(2) గురుస్థానము చెంత బొటనవ్రేలి వైపున నక్షత్రచిహ్న మున్న నది తాత్కాలిక చిహ్నమై అగ్ని ప్రమాదమును నిరూపించును. ఆనక్షత్రమును నొక చతుష్కోణ చిహ్నము చుట్టియున్న ఆ అగ్నిప్రమాదము వలన విశేషభయ ముండదు. ఒకొ్కకవేళ అగ్నిప్రమాదములోనుండి సంరక్షింపబడిన వారికిగూడ యీలక్షణము కానవగును. ఈ చిహ్నము పూర్తిగ శరీరమునకే గాక కొన్ని వేళలయందు గృహమునకు, ఇతర ఆస్తికి గూడ వర్తింప వచ్చును. గురుస్థానములో నట్టి ప్రమాద చిహ్నము లుండిన నవి అగ్ని ప్రమాదములను, ప్రేలుడు వలన గలుగు విపత్తులను సూచించును. ఆగుర్తునకు సరియైనస్థలము అక్కడ నక్షత్ర చిహ్నము అగ్నిప్రమాదమునే గాక ఆచిహ్నమున్నవాని అశాస్త్రీయజననమును గూడ ఒకొ్కక్కప్పుడు నిరూపించును.



పటము ౩ క ౩ గ

శనిస్థానమునకు సరిగ క్రిందిభాగమున అరచేతిలో మధ్య నొకనక్షత్ర ముండిన అది యెత్తైనస్థలమునుండి పడుటను నిరూపించును.



పటము ౪

ఎవరైన కొట్టుట సంభవించిన శిరోరేఖలో శనిస్థానమునకు క్రిందిభాగమున వడ్లగింజ

యాకారము వచ్చును. ఒక్కొక్కప్పుడు విన్నచిన్నగీతలు తాత్కాలికముగ నుద్భచించి, వెంటనే నరములకు జవసత్వములు చేరగానే ఆచిన్నగీతలు తగ్గిపోవును.

బొటమనవ్రేలిక్రింద కుజస్థానమునకును శుక్రస్థానమునకును మధ్య నక్షత్రముండిన ఆనక్షత్రము, మెట్లమీదనుండిగాని, చీడీల మీదనుండిగాని, యెత్తైన పెద్ద నిచ్చెనల మీదనుండిగాని పడుట సూచించును.



పటము ౫

సరిగ శనిస్థానములో మధ్యగా యేరేఖకును సంబంధింపకుండ ప్రత్యేకముగా నొక (ఋంటు) రెండడ్డగీతలు (కత్తెర చిహ్నము) గానున్న అది తఱచు ప్రమాదములు సంభవించు జాతకుడని నిరూపించును.

సరిగ శనిస్థానములో మధ్యగా యేరేఖకును సంబంధింపకుండ ప్రత్యేకముగా నొక నక్షత్రచిహ్నముండిన అది కుదురని పక్షవాతరోగము వచ్చునని నిరూపించును. ఆ చిహ్నము రెండుచేతులలోనుకూడ నుండిన ఉరికంబములపై చావు నిరూపించును. నక్షత్రము లోతైన రేఖలతో లేకయున్న అంత్యసమయములో జబ్బును, కష్టములను, నిరూపించును.

ఆచిహ్నమునుబట్టి ఆపక్షవాతమెప్పుడు వచ్చునో నిశ్చయించి చెప్ప వీలులేదు. ఒకనా డొకమిత్రుడు నాకడకువచ్చి యీనక్షత్ర చిహ్న మేమిఫల మిచ్చునని నన్ను ప్రశ్నించెను. నేను కష్టముపై పైలక్షణమును దెల్పితిని. ఆతని కప్పటికే నలువదియైదు సంవత్సరములు దాటినవి. ఆత డింకను మంచి యారోగ్యస్థితిలో నున్నాడు.



పటము ౬

వేరొకచోట పక్షవాతముచే బాధపడుచున్న ఒకమిత్రుని చేయిచూచితిని. వారు తమకు పక్షవాతము వచ్చిననాడే శని మహాదశ ప్రారంభించినదనియు; ఆమహాదశ మహారాజయోగముగా జరిగిపోవు నని కొందరు జ్యోతిష్కులు తెల్పినారనియు, కాని వా రా మహారాజయోగమునకు బదులుగా దారుణమైన పక్షవాతమువచ్చి బ్రదుకుటయేదుర్ఘటమైనదనియును, వారి స్వీయచరిత్రను నాకు దెల్పిరి. వారి చేతిలో శుభ్రమైన నక్షత్ర చిహ్నము కలదు. వా రాపక్షవాత కారణ మేమని యడుగ నే నాచిహ్నమును జూపితిని. ఈపక్షవాతము వారికివచ్చి పదిసంవత్సరము రో ముయ్యులైనను ఆనేన్నారు. రోగగాగ్య లక్షణములుమాత్రము పోలేదు.



పటము ౭

హృదయరేఖకు పైన గురుస్థానములో నుండి రవిస్థానములోనికి బోవు శుక్రాంతర రేఖలు మూడుండి ఆ రేఖలమధ్య సరిగ శనిస్థానము క్రింద నక్షత్రచిహ్న ముండినచో అట్టివాడు క్రూర సుఖరోగపీడితుడై మరణించును.

శనిస్థానములో నక్షత్రముండి ధనరేఖ, మధ్యవేలి మూడవకణుపు నఱకు చొరుచు కొనిపోయినయెడల అట్టివాడు నరికివేయబడును.



పటము ౮

చేతిలో పెక్కు చెడులక్షణము లుండి మంచి చేయికాకపోయినయెడల ఆచిహ్నము కలవాడు హంతకవృత్తి కలవాడైయుండును.

హృదయ రేఖకు శిరోరేఖకు మధ్య చేతికి చివరభాగములోని కుజస్థానములో నక్షత్రము, అతికోపముచేతగాని, యీర్ష్య చేతగాని నరహత్యచేయువాని లక్షణము.



పటము ౯

ఆకుజస్థానము కూడ బాగుగ యెత్తుగ కూడ నుండిన హత్యచేయుట నిశ్చయము.

ఆస్థానము ఎత్తులేక సామాన్యముగ నుండిన ఆనక్షత్రము హత్యచేయబడువాని చిహ్నము.



పటము ౧౦

హృదయ రేఖకు శిరోరేఖకు మధ్య చేతికి చివర భాగములోని కుజస్థానములో చిన్న చిన్న నిలువు అడ్డగీతల సముదాయము దారుణహత్యాచిహ్నము.

ఆస్థానము యెత్తుగకూడ నుండిన హత్యచేయవలెనను కుతూహలము.



పటము ౧౧



పటము ౧౨

చిటికెనవ్రేలికి సరిగ దిగువ శిరోరేఖ చివర నుండు చంద్రస్థానములో కోణాకారము గాని గుండ్రమైన సున్నయాకారము గాని యున్నచో ఆరెండునుగూడ నీటిగండముల నిరూపించును. ఆగండములో మరణము గూడ రావచ్చును.

చంద్రుడు నీటికి సంబంధించిన గ్రహము. అందుచే ఆగ్రహస్థానములో నట్టిలక్షణము లున్న నవి నీటి గండములు కల్గించునని శాస్త్రము. కాని తీర్థమునకై మేమొక దూరగ్రామము నావలో వెళలుచుండగా మాతో వచ్చుచున్న యొకడు పడికట్టుపై నుండి జారి గోదావరిలో పడిపోయినాడు. ఆతని విశ్వప్రయత్నముమీద పైకి తీసినారు. నేనాపడవలోనే ప్రయాణముచేయుట తటస్థించినది. అప్పుడే ఆతనిచేతిని చూచితిని ఈనీటిగండలక్షణము సరిగాచంద్రస్థానము లో లేదు. ఆలక్షణమే జీవితరేఖచెంత చంద్ర స్థానము వైపుననున్నది. అందుచేనీటి గండములకయి సరిగా చంద్రస్థానములోనే వెదకిన కనబడకపోవచ్చును. మరియు జీవితరేఖ ప్రక్కనున్న ధనరేఖతో ఆరోగ్యరేఖ కలిసికొనినచోట చిన్నసున్నవలెనొక చిహ్నము ఒక్కయెడమచేతిలోనుమాత్రమే నా స్నేహితుని కొక్కనికి కలదు. వారి అసలు చేతి ముద్ర నిచ్చుటకు నా కనుమతిలేదు. అందుచే దానికి నకలు నిచ్చుచున్నాను. ఇతనికి గొప్ప నీటిగండము దాటినది సుమారు పదహారు సంవత్సరముల ప్రాయములో. కాని చిహ్నము మాత్రము స్ఫుటముగా కానుపించుచున్నది.

ఇచ్చటగూడ నీటిగండలక్షణముచంద్ర స్థానములో లేదు. దానికి ప్రక్కగానే యున్నది.

ఈజలగండ చిహ్నమునుగూర్చి భేదాభిప్రాయము లున్నవి. జీవితరేఖ చెంతనున్న జలగండచిహ్నములు ప్రమాద సూచకములే గాని నిక్కముగ నవి ప్రాణాపాయములను తీసికొనిరా వని కొందరి యభిప్రాయము. చంద్రస్థానముమీద నుండుగుర్తులు ప్రాణోపద్రవలక్షణము లని చెప్పుదురు.

నేనొక స్త్రీచేతిలో ఆ లక్షణమును చూచితిని. ఆమెకు జలగండ మున్నదని నా మిత్రులతో దెల్పితిని. ఇట్టి గండములకు వయస్సు నిర్ధారణచేసి చెప్పుటకు సావకాశ

ములు తక్కువ. కావున ఆమె కా గండ మెప్పుడు వచ్చునది మాత్రము చెప్పలేదు. నేతెల్పిన మరిరెండు నెలలలోనే యామె కా జలగండము సంప్రాప్తించినది. ఆమెకువిశేషమైన ప్రమాదము రాకుండ బయటకు తీయబడినది. ఆమెకు జలగండ చిహ్నము చంద్రస్థానముమీదనే యున్నది. కాని ప్రాణాపాయము మాత్రము రాలేదు.




పటము ౧౩

1. అగ్నిప్రమాదము
2. పిడుగువలన ప్రమాదము
3. హత్య
4. భూసంబంధమైన ప్రమాదములు
5. బండ్లప్రమాదములు
6. గాలి, వాయువిమాన సంబంధములైన ప్రమాదములు
7. నీటిప్రమాదములు
8. చెరసాల
9. ఎత్తైనస్థలములనుండి పతనము
10. ప్రేలుడు ప్రమాదములు
11. దెబ్బలు
12. పతనములు

ఈప్రమాదములన్నియు నక్షత్రముల మూలమునగాని, చిన్నచిన్నగీతలవలన గాని కాననగును.




పటము ౧౪

1. హృదయకోశమునకు సంబంధించిన జాడ్యములు
2. నేత్రసంబంధము లయినవి
3. ఊపిరితిత్తుల సంబంధము లయినవి
4. వెన్నెముక సంబంధములయినవి
5. చెవులకు సంబంధించినవి
6. శిరస్సునకు సంబంధించినవి
7. కాళ్లకు సంబంధించినవి
8. పాదములకు సంబంధించినవి
9. కంఠమునకు సంబంధించినవి
10. పిత్తాశయమునకు సంబంధించినవి
11. పొత్తికడుపులోని ప్రేగులకు సంబంధించినవి

పై రెండుపటములును బహు జాగ్రత్తగ పరిశీలింపవలెను.

(సశేషము)

# వలసరాజ్యములందు భారతీయ శిల్పకళ



తలిశెట్టి రామారావు

## జావాయందలి నిర్మాణములు

౨

పశ్చిమ జావా, మధ్యజావా, తూర్పు జావాయని జావాద్వీపము మూడు భాగములుగ విభజింపబడినది. రాజకీయ, శిల్పకళా చరిత్రములను బోధపరచు కొనుటకు కూడ నిట్టి విభజనము మిక్కిలి యనుకూలముగ నున్నది.

పశ్చిమ జావా యందు హిందూరాజ్యము క్రీ. శ. మొదటి శతాబ్దముననే స్థాపితమైనది. ఇచ్చట లభించిన శాసనములవలన పూర్ణ వర్మయనురాజు 'తారుమ' యను రాజ్యమును క్రీ. శ. 4 లేక 5 వ శతాబ్దములందు పాలించు చుండెనని తెలియుచున్నది. 'పాజాజర' మను నగర మిచ్చటి రాజ్యమునకు రాజధానిగ నుండెననుటకు కొన్ని సూచనలు కలవు. ఆరవ శతాబ్దాంతమున నిచ్చటి హిందూరాజ్యము లంతమొందిన పిమ్మట నీభాగము విదేశీయులకు లోబడక స్వతంత్రరాజ్యముగ నుండినది.

పైనపేర్కొనిన శిలాశాసనములు తప్ప నిచ్చట ప్రాచీన శిల్పకళయొక్క చిహ్నము లెవ్వియు కానరాలేదు. మొదటి నిర్మాణములన్నియు కర్రతో గట్టుటవలన గాబోలు, కొలదికాలముననే యవి కాలగర్భమున లీనమై పోయినవి. శిల్పకళయందు జావా సుప్రసిద్ధమైయుండ, నీప్రాంతములం దొకవిగ్రహమైనను నిర్మింపబడలేదని నమ్ముట కష్టము. జావా మహమ్మదీయమతమును స్వీకరించినకాలమున పశ్చిమజావా యానూతన మతప్రచారమునకు సులువుగ లొంగలేదట. పూర్వాచారపరాయణులగు నాప్రాంతపుప్రజ లిటులనే హిందూజ్ఞానమునుకూడ స్వీకరించుట కా కాలమున నిరాకరించిరా?

జావాయందలి తక్కిన భాగములు మిగుల నభివృద్ధిని పొందిన కాలమున నుంచి ప్రయాణ సౌకర్యములు ద్వీపమందంతట నేర్పడినవి. తూర్పుజావానుండి కాబోలును, కొందరు శిల్పు లిచ్చటికి వచ్చి 'బోరొబుదురు'ను బోలు కొన్ని చిన్న నిర్మాణములను గట్టసాహసించిరి. కాని యివి యంతగా పేర్కొనదగినవి కావు.

పశ్చిమజావా యింతటి శిల్పకళారహితమై యుండిన లోపమును మధ్యజావాయందలి కళారాధకులు పూర్తిగ దీర్చిరి. మొదటినుండియు మధ్యజావాకు హిందువులు పోవుచుండినటుల కానవచ్చును. వీరితో సుప్రసిద్ధులైన శిల్పులును బోయి హిందూదేశమునుండి కొనిపోబడిన లింగములకొరకును, విగ్రహముల కొరకును చక్కని దేవాలయములను నిర్మించుట ప్రారంభించిరి. హిందువుల పలుకుబడి యచ్చట పెరిగిన కొలది దేవాలయ నిర్మాణముయొక్క యావశ్యకము పెరుగుటచే శిల్పులు ననేకులు పోవుట యవసరమయ్యెను. ఇటుల కొన్ని శతాబ్దములు గడచిన పిమ్మటనే యా దేశములందు నివాస మేర్పరచుకొనినవారు శిల్పకళయందు ప్రవేశము కలుగజేసుకొని హిందూశిల్ప కళాసంప్రదాయము లందు మార్పులను బ్రవేశపెట్టిరి. కాని సుమారు పదమూడవ శతాబ్దమువరకు నచ్చట నిర్మింపబడిన వన్నియు పూర్తిగ హిందూనిర్మాణములనియె చెప్పవచ్చును. ఈకాలమున హిందూదేశమునందలి శిల్పరచనకును, జావాయందలి శిల్పరచన

నను కొంత భేదము కానవచ్చుచున్నది. నూతనములైన పరిస్థితులందు కలిగిన యుత్సాహమువలన నీమార్పులు ప్రవేశించినవని చెప్పవలసి యున్నది. ఆదిమవాసు లిట్టి భిన్నరుచుల నుత్తమకళయందు కలుగజేయు నంతటి వారు కారు

ఇచ్చటి హిందువులలో నధికాంశము శైవులుగ నుండిరి. వైష్ణవులును పలుకుబడి కలిగియుండిరని రామాయణ శిల్ప చిత్రములవలన దెలియుచున్నది. తక్కిన దేశములందువలె హీనయానబౌద్ధమత మిచ్చట ప్రచారమునకు రానటుల నున్నది. మహాయాన బౌద్ధమతము మాత్రము శైలేంద్రుల పాలనమున నామోదమును బడసినది కాని యిప్పుడు నేపాలము, కాంభోజము, బలి మొదలగు ప్రాంతములందు కానవచ్చు తాంత్రిక బౌద్ధ మతరూపమును రానురాను దాల్చినది. జావా చిన్న ద్వీప మగుటవలన నన్నిమతములవారును శతాబ్దముల కాలది నైకమత్యముతో గలసిమెలసి యుండవలసి వచ్చుటచే యన్నిమతములు నేకమైనవి. రాజులు దైవ సంభూతులను నమ్మకమువలన కలిగిన "దేవరాజా" చారము ననుసరించి తూర్పుజావారాజగు కేర్తనగరుడు (1268 - 1292) 'శివబుద్ధ'డను పేర నారాధింపబడు చుండెను. "శివ - బుద్ధ" నామమువలన హిందూబౌద్ధ మతము లాద్వీపమున నెటుల నేకీభవించి యొక్కమత ముక్రిందికి మారినవియు తెలియుచున్నది.

'డిహ్యాంగు' పీఠభూమి మధ్యజావాయం దొకభాగము. ప్రాహు, ప్రోయె, బీస్మా, నోగొసారి, జిమత్తు అనునైదు పర్వతముల మధ్య సముద్ర మట్టమునకు సుమారు 6,500 అడుగుల యెత్తుననున్న యీ సమ భూమి తొలుత నగ్ని పర్వతములవలన నేర్పడినదని భూతత్త్వజ్ఞులు నిర్ణయించిరి. జను లిచ్చట నగరమును కట్టుకొని కాపురము చేయలేదు కాని యనేకములగు దేవాలయములను నిర్మించి పుణ్యభూమిగ జేసిరి. ఆదేవాలయముల పూజారులు, అర్చకులు, సేవకులు, దేవదర్శనము కొరకు వచ్చుచుండిన యాత్రికులు నివసించుటకు మాత్రము గృహములు నిర్మింపబడినవి. ఆ దేశపుప్రభువు సంవత్సరమున కొకమారు వచ్చినప్పు డుండుటకు నివేశనము లుండినవి. జావాశిల్పు లలంకారార్థము సున్నము నుపయోగించిరికాని రాళ్లనతుకుట కుపయోగపరచనందు వలనను, ఈ ప్రాంత మగ్నిపర్వత ప్రదేశమగుటవలనను ఏనాడో కలిగిన భూకంప మనేకములగు చక్కని నిర్మాణములను నాశనము చేసినది. ఇప్పు డెచ్చట జూచినను శిథిలములై పాడువడిన దేవాలయములు కానవచ్చుచున్నవి. పూర్వ మీపీఠభూమి సుప్రసిద్ధమైన యాత్రా స్థలముగ నుండినది.

సరయూనది యిచ్చటనే పుట్టినదనియు, భీముడు భూమిని త్రవ్వి నీటిని బుట్టింపగా అర్జునుడు జలమునకు మార్గమును జూపి తద్వారా "జ్ఞాస్తినో" యను ప్రదేశమును సంపాదించెననియు, 'పాహూరాన్ చెమెటె' యను భీమకుండమువద్ద స్నానము చేసినవా రమరులగుదురనియు నిచ్చటిప్రజలు చెప్పుదురు. విశాఖపట్టణము, గంజాము మండలములందుగల నాగావళి నది బలరాముని నాగలిజాడవలన బుట్టినదను కథను సరయూ జన్మకథ జ్ఞప్తికి దెచ్చుచున్నది. పాడువడియున్న స్థలములం దింకను నిలచి యున్న స్తంభములకు అర్జునుడు ఏనుగులను గట్టుచుండెనని జావాయందు ప్రతీతి. సుమారు పండ్రెండు శతాబ్దములకు పూర్వము త్రవ్వబడిన 'గువో అశ్వోటామొ' (అశ్వత్థామ) అనబరగు కాలువ యొకటి కలదు. పాండవులను నాశనము చేయుటకు ద్రోణుని కుమారుడగు అశ్వత్థామ భూమిని త్రవ్వుచు అర్జునుని నివాసమువద్దకు వచ్చి, ఎంతదూరము వచ్చితినోయని తలయెత్తిచూచెననియు, తద్వారా యీకాలువ యేర్పడినదనియు నొక కథ గలదు.

పాడువడినవి కాక యింకను ఇచ్చట నిలిచియున్న దేవాలయము లెనిమిది కలవు. ఇవి యన్నియు మహాబలిపురమునందున "రథము" లనబడు దేవాలయములను బోలి, గుప్త, పల్లవుల, మొదటి చాళుక్యుల శిల్పనిర్మాణములను జ్ఞప్తికి దెచ్చుచు, ఉత్తర హిందూ దేశము నుండి హిందువులు వచ్చి జావా నాక్రమించిరని చెప్పువారి వాదము నిస్సారమని చాటుచున్నవి. అలంకారములందు కొంచెము భేదముగ నున్నను, అలంకారముల

యుపయోగము, ఉద్దేశము మాత్రము హిందూ శిల్పుల సంప్రదాయముల ననుసరించి యున్నవి.

శివు డనేక రూపముల, ముఖ్యముగ "భటారగురువు" గ నీ దేవాలయము లన్నిటియందు నారాధింపబడినటుల కానవచ్చుచున్నది. హిందూమతము క్షీణించిన పిమ్మట ప్రజ లీదేవాలయములకు పూజకొరకు బోవుట మానిరి. రానురాను ప్రజ లీదేవాలయములు శైవాలయములని మరచిరి. చండి అర్జున, చండి శ్రీకండి, చండి పుంతదేవ (ధర్మరాజు), చండిసెంభద్ర, చండి ఘటోత్కచ, చండి భీమ, చండి సేమారు అనునవి వీటిలో ఏడు దేవాలయములు. చండి యనగా దేవాలయమని యర్థము; మహాబలిపురమునందలి "రథము" నుపేరునకు సరిపోవును. హిందూమతావలంబకు లిచ్చట నెవరును లేనప్పటికిని, భారత కథను 'వయాంగు' అను నాట్యరూపమున ప్రదర్శించుటకలదుకాన యీ భారతవీరులపేరను, నాట్యమున వారి యనుచరుడగు సేమారు అను హాస్యగాని పేరను యీ యాలయము లిప్పుడిటుల బిలువబడుచున్నవి.

ఇవి యన్నియు ౭ లేక ౮ వ శతాబ్దమునాటివై యుండును. జావాశిల్పులు నిర్మాణమునం దిచ్చటనే తొలుత రాళ్లనుపయోగపరచినటుల కానవచ్చుచున్నది.

ఈ యెనిమిది దేవాలయములు నొక చోటనే యున్నవి. ఒక్కొక్క యాలయమునందును గర్భగుడి, లోనికి పోవుటకు ద్వారము, ద్వారము ననుసరించి యొకచిన్న నిర్మాణమువంటిది కలవు. తక్కిన మూడు వైపుల గోడలమీద స్తంభములును, వాటి మధ్యను గూళ్లును శిల్పితములై యున్నవి. ఆంధ్రదేశమునందలి దేవాలయములవలె నిచ్చటి దేవాలయ శిఖరము లంతస్థులవలె గట్టబడినవి. దేవాలయ ద్వారము మీదను, గూళ్లమీదను కీర్తిముఖములు (కాలమకరము) శిల్పితమైయున్నవి. మకరముయొక్క తోక లంతగ నీద్వీపమునమారినది. అర్జున, శ్రీఖండి, పుంతదేవ, సేంభద్ర, ఘటోత్కచ దేవాలయము లిట్టివియె.



౧. చండిపుంతదేవ

భిన్నశైలిని నిర్మింపబడిన సేమారు దేవాలయము బహుశః పూర్వము ధనాగారముగ నుండెనని కొందరు పండితు లభిప్రాయపడుచున్నారు.

భీమాలయమునకును ఆంధ్రదేశపు దేవాలయములకును ఎట్టిభేదమును కానరాదు. పూర్వము దీనిశిఖరాగ్రమున అమలకాకారమో, లేక కలశాకారమో యుండెను.

'డిహాయ్యాంగు' పీఠభూమికి దక్షిణమునను, తూర్పునను కొన్ని చిన్నదేవాలయములు కలవు. 'శైవచండి ప్రింగపురు' (క్రీ. శ. ౮౫౦), 'చండి సెంగ్రియ' మొదలగునవి చాలా సుందరముగ నలంకృతములై యున్నవి. "ఉంగ"రను పర్వతమువద్ద 'గెడాంగుసంగ' యనుతొమ్మిది దేవాలయ కూటములు పర్వతాగ్రములపై నున్నవి.

ఆ కాలమున శిల్పాలంకారములు చాలాతక్కువయైనను దేవాలయములన్నియు వివిధభాగముల పరిమాణములందును, పొందికయందును చాలా సుందరముగ నున్నవి.

ఇటుల జావాయందు ప్రారంభమైన శిల్పకళ శైలేంద్రనృపుల కాలమున నెంతయేనియు నభివృద్ధి పొంది, ప్రపంచమునంతను మోహింప జాలినటుల విజృంభించినది.

శైలేంద్రులు తొలుత సుమిత్ర ద్వీపపు ప్రభువులుగ నుండిరనియు, వీరు బౌద్ధులనియు నీ ప్రాంతముల కేడవ శతాబ్దమున వచ్చిన ఇత్సింగు వ్రాసెను. ఆనాటికే వీరిరాజ్యము సంస్కృత విజ్ఞానమున కాలవాలమై, బౌద్ధమత దీక్షయందు సుప్రసిద్ధమై యుండినది.



౨. చండిభీమాలయము

10 వ శతాబ్దమునాటికి సువర్ణభూమి బౌద్ధమత విజ్ఞాన ప్రచారమునందు నాయకత్వము వహించి యుండుటచే దీపంకరుడు ( అతీశుడు ) అను బౌద్ధ సన్యాసి యిచ్చటకు వచ్చి, ఆనాటి బౌద్ధసన్యాసులలో నగ్రగణ్యుడైన ధర్మకీర్తిని దర్శించి, ౧౨ సంవత్సరము లచ్చటనే యుండిపోయెనట!

ఇట్టి మతదీక్షాపరాయణులు, దేశపాలకులు నగు శైలేంద్రులు మధ్యజావాను జయించి, పరిపాలించుకాలమున జావాయం దత్యంతాద్భుతములైన బౌద్ధనిర్మాణములు సృజింపబడినవి.

శైలేంద్ర రాజు యొక్క గురుని యాజ్ఞ కలన మధ్యజావాయందు సామంతరాజుగ నుండిన "కారియన పానంకరణుడు" "చండి కలాసను"ను క్రీ.శ. ౭౭౮లో గట్టించి, యందు బౌద్ధదేవియగు తారను ప్రతిష్ఠింపజేసెను. ఇది రూపమునందు డిహ్యాంగు దేవాలయములను పోలియున్నది; చాల మనోహరముగ శిల్పచిత్రములతో నలంకరింపబడినది. ద్వారము వద్ద రెండుచిన్నగదు లున్నవి. కీర్తిముఖములు, మకరతోరణములు పూర్తిగ లతారూపములుగ మారినవి. స్తంభములవంటి కుడ్యాలంకారముల మధ్య నున్న స్థలము లతిసున్నితములైన లతాచిత్రములతో నిండియున్నవి.

ఈ దేవాలయమున కుత్తరమున సమీపముననే పెద్ద నిర్మాణ మొకటి కలదు. దీనిని 'చండి సారి' యని పిలుచుచున్నారు కాని సన్యాసులనివాసమునకుగదులు, ఆరాధనకు గదులు ఇందుండుటచే యంతస్థుల విహారమువలె కన్పట్టుచున్నది బహుశః 'చండికలాసను'కు జెందిన విహారమై యుండును.

దీనికి తూర్పున కొంత దూరమున తొమ్మిదవ శతాబ్దమునాటి 'చండిసెవు' కలదు. ఇది నిర్మాణమున కలాసనుదేవాలయమువలె గలదు కాని యిరువైపుల గదు లుండుటచే పెద్దదిగ నున్నది. గర్భగుడియందు బుద్ధుని విగ్రహమును, గూళ్లయందు తదితర విగ్రహములును, ఉండినవని చెప్పుట కాధారములు కలవు. దేవాలయ

మంతయు రమ్యముగ నలంకరింపబడినది. దీనికి సమీపముననే యొక యావరణమునందు ౨౪౦ చిన్నగదులు నిర్మింపబడినవి. వీటియుద్దేశ మేమియో తెలియదుకాని యివియన్నియు గలసి దూరమున కతిసుందరముగ కానవచ్చుచున్నవి.

మొదట జావా శిల్పకళపై కళారాధకుల దృష్టి నాకర్షించిన నిర్మాణము బొరోబుదరు. బొరోబుదర నగా బౌద్ధమతమునకు జెందిన పెద్దనిర్మాణము, లేక పెద్ద బుద్ధుడు అని పండితు లర్థము జెప్పిరి. బడాబహద్దరు అను తురక పదమున కిది వికృతరూపమని కొందరి యూహ.

'కేదు' సమభూమియందు దొక యెత్తైనచోట నీమహా నిర్మాణము కలదు. చుట్టునుగల వరిమళ్ళు,పచ్చని బీడును మనోహరముగ కానవచ్చును. దూరమున నగ్ని పర్వతముల వలన బుట్టిన పర్వతము లీప్రదేశము నావరించియున్నవి. మానవుని జీవితమునందు బ్రవేశించిన కష్టసుఖములను బాపు ఆధ్యాత్మిక జ్యోతి వలె యిట్టిపరిసరములమధ్య బొరోబుదరు తెల్లగ కానవచ్చుచుండును.



౩. బొరోబుదరు స్తూపము

ఇది దేవాలయముకాదు. లోపల గర్భగుడికాని,పూజించుటకు విగ్రహములు కాని, నిరాకారుని నివాసమునుసూచించుటకు మరియేశూన్య గృహములుకాని లేవు. క్రైస్తవుల చర్చి, మహమ్మదీయుల మసీదు, హిందువుల దేవునిగుడి—— వీటిలో దేనితోనైన దీనిని సరిపోల్చుటకు వీలులేదు.

'చండిమెండూతు,' 'చండిపావను' అను దేవాలయములును సుప్రసిద్ధములు.చండిమెండూతు ౭౦ అడుగుల చదరముపై గలదు. దేవాలయ మట్టము ౪౧అడుగుల చదరము. లోపలి గర్భగుడి ౨౦ అడుగుల చదరము. ఇందుగల విగ్రహములు సౌందర్యమునందును, పరిమితియందును లోకప్రసిద్ధములైనవి. తక్కిన చిన్న దేవాలయములవలె నిదియు కలదుకాని లోపలి కుడ్యములు హారతి, పాంచిక మొదలైన ప్రతిమలతో రమ్యముగ నలంకరింపబడియున్నవి. గర్భగుడిలోపల ద్వారమున్నవైపు కాక తక్కిన మూడువైపుల బోధిసత్వుల తార విగ్రహములు మలచబడి యున్నవి.

ఇది బౌద్ధుల స్తూపమును కాదు. స్తూపమున కొక్క శిఖరమే యుండుట యాచారము. ఇందు మధ్యనున్న శిఖరము ననుసరించి చుట్టును డెబ్బదిరెండు చిన్న శిఖరములున్నవి. స్తూపముపైకి ప్రదక్షిణము చేయుచు పోవుటకు వీలులేదు కాని పైకిపోవుటకు మార్గములు, మెట్లు కలవు. సాధారణ బౌద్ధస్తూపమునే యీచిన్న స్తూపాకారములతో నలంకరించిరని చెప్పుటకు సాహసింపలేము. స్తూపముయొక్క యాకార మర్ధగోళమువలె సామాన్యముగ నుండును. కాని బొరోబుదరు యొక్క యాకారము గోళములో నొక చిన్నభాగము వలె నున్నది. స్తూపమున కిట్టిరూపము హిందూదేశ

మునగాని, వలసరాజ్యములందుగాని యెచ్చటను లేదు. నిర్మాణము ప్రారంభించినపిమ్మట పునాదిబలము చాల దని కనుగొని చుట్టు నొకబలమైన పిట్టగోడ కట్టవలసి వచ్చినదనియు, స్తూపము పూర్తిగ నిర్మించినయెడల నంతయు పాడగునని యిటుల పొట్టిగ జేసియుందురనియు కొందరు పండితులు వ్రాసియున్నారు. ప్రదక్షిణమార్గములును, అనేక శిఖరములును ఉండుటవలన గలిగిన నిర్మాణసమస్యాసందేహము నీకారణము నివర్తి చేయజాలదు.



౮. బోరోబుదరు ఆకాశరేఖ

దిగువభాగ మంతస్తువలె నున్న స్తూపము లితర దేశములందు లేకపోలేదు. వేదికలమీద నున్న దేవాలయములు జావా, కాంభోజము, బ్రహ్మదేశములందు గలవు. పరిహాసపురమువద్ద లలితాదిత్యుని యమాత్యుడగు శంకుణుడు ఎనిమిదవశతాబ్ద ప్రారంభమున గట్టించిన హిందూదేవాలయము రెండువేదికలవరుసపై గలదు. చుట్టును రెండు ప్రదక్షిణమార్గములుకూడ గలవు. తక్షశిలయందలి భల్లారు, కైబరు కనుమయందలి స్ఫోల, సింధునందలి ఖాసు, గాంధారదేశములందు వేదికలపై స్తూపములు కలవు. అనేకములగు అంతస్తులపై దేవాలయములు నిర్మితములగుటకును, హిందూ ఆచారము ననుసరించి మహాయాన బౌద్ధమతనిర్మాణములందు ప్రదక్షిణమార్గము లుండుటకును పైన బేర్కొనిన కట్టడములు మార్గదర్శకము లైనవని చెప్పుట కవకాశము కలదు. బోరోబుదరు మొదట తొమ్మిదంతస్తుల నిర్మాణముగ నుద్దేశింపబడినదనియు, బరువు లావై యంతయు కూలిపోవునను భయముచే నిట్టిమార్పు చేయబడిన దనియు హూయినిగుగారియూహ. ఊహ లెటులున్నను హిందూ దేవాలయమును, బౌద్ధస్తూపమును, ప్రధానశిల్పియొక్క స్వతంత్రజ్ఞానమును, బుద్ధియు గలిసి యీ యద్భుత నిర్మాణముగ బుట్టి మనకొరకు నిలచి యున్నది.

మొదట బుద్ధభగవానుని యస్థులను దాచుట కుద్దేశింపబడిన స్తూపాకారము రాను రాను వ్యక్తీకరణబద్ధమైన నిర్మాణముగ, తలక్రిందులుగ నుండు పద్మాకారముగ మారిపోయినది. మీది వలయాకార మాకాశముగ భావింపబడినది. శిఖరముపై గొడుగులవలె నుండునవి యుత్తమలోకములైనవి. బుద్ధుడు శివునివలె కైలాసాగ్రములందు నివాస మేర్పరచుకొని ధ్యాననిమగ్నుడై యుండునటుల మహాయాన బౌద్ధమతమున నూహింపబడిన నాటి నుండియు స్తూపము దేవాలయ మైనది. బుద్ధుడుండు చోటు కనుక స్తూపము కైలాసపర్వత మేల కారాదు? ప్రదక్షిణ మార్గము హిమాలయములందు వంకరలుగనుండు కైలాసమునకు బోవు మార్గమేల కారాదు? కైలాసమును సమీపించుకొలది బుద్ధుని సమీపించుటయగును కాన నాయున్నత ప్రదేశములన్నియు పవిత్రములు. భక్తుని యాధ్యాత్మికపరివర్తన మీ ప్రయాణము సూచించును. హిమాలయమునగల చిన్నశిఖరములన్నియు బోరోబుదరునందు చిన్నస్తూపముల బోలు శిఖరముల మధ్యనున్న పెద్దస్తూపాకారము కైలాసము. ఇచ్చటగల ప్రదక్షిణమార్గములు కైలాస శిఖరమునగల బుద్ధదేవుని సన్నిధికి బోవును. బుద్ధుడు తన మతమును ప్రపంచమునకు బ్రసాదించునప్పుడు బుద్ధులనేకులనేకములగు లోకము (చిన్న స్తూపాకారము)ల నుండి యా మహాఘట్టమును జూడవచ్చిరి.

ఆకారమునుబట్టియే బోరోబుదరున కీయర్థము నంతను జెప్పవచ్చును. సూక్ష్మముగ బరిశీలించినయెడల నీయుపమాన మత్యద్భుతముగ నుండును.

కాని శిఖరములన్నియు దగ్గరగ నుండుటవలన అంకోరువాటువలె దూరమున కిది మనోహరముగ గానబడదు. ఇట్టి లోపమున్నను ఈ సుప్రసిద్ధనిర్మాణమితర విషయములం దమూల్యముగ నున్నది.

బొరొబుదరుయొక్క తత్త్వార్థమును * చూచిన యెడల నిది విహారమా, దేవాలయమా? దూరమునుండి యెటుల కానవచ్చుచున్నది యను ప్రశ్నలకు తావు

నిర్మాణము మన కర్పింపబడినది. ఆ పరిసరముఁ జు బోయినవెంటనే మానవుని యజ్ఞానాంధకారమును బాపుటకు వెలుగుచున్న జ్యోతివలె తెల్లగ కానవచ్చును.



౫. ప్లాను చిత్రము

లేకపోవును. బుద్ధదేవునిపైగల భక్తిని వెల్లడించుటకును, జీవోద్ధారకమైన బౌద్ధమతమును శాశ్వతముగ నిలిపి యది చేయుమేలు నందరికిని చేకూర్చుటకును ఈ విశాల

అందిమిడియున్న యర్థము, శిల్పరాజములు నేర్పు నీతి, తద్ద్వారా కలుగుచున్న జ్ఞానము, శిల్పకళవలన ప్రేక్షకులయందు బుట్టుచున్న పవిత్రమైన యుత్తేజము మొద

* Rev. A. J. Hamerster The Symbolism cf the Bcrubcdur (The Theosophist, January 1931)

లను విషయములవలన బోరోబుదరు నేటికిని సజీవమై యున్నది. బౌద్ధమత మాదేశమున మాయమగుటచే దీని వైభవము తగ్గెననియు, మనము బౌద్ధులము కామనియు చింతింప నక్కఱలేదు. అన్ని మతములవారిని సర్వకాలములందును పవిత్రులుగజేయు శక్తి దీనియందు గలదు.

'బోరోబుదరున' తొలుత రెండంతస్తులు కలవు' వాటిపై నద్భుతశిల్పాలంకారములతో నెలయుచున్న నాలుగంతస్తులు కలవు. ఇవియన్నియు చదరములుగ నున్నవి. వీటన్నిటిపై కెక్కుటకు నలువైపుల మెట్ల వరుసలు కలవు. సుందరముగ నుండుట కీచదరము లన్నిటి మూలలందు కొంతమార్పు చేయబడినది. ఈ చదరములైన యంతస్తులపై మూడు వలయాకారములైన యంతస్తులు కలవు. వీటికిని మెట్లు నలువైపుల గలవు. శిల్పాలంకారములు కల పిట్టగోడలకు బదులు చుట్టును స్తూపాలంకారములు వరుసలుగ గలవు. వీటన్నిటిపైని మధ్యను పెద్దస్తూపాకారము శిఖరముగ గలదు. ఈవివరములు చిత్రమును పరిశీలించిన యెడల సుబోధములు కాగలవు.

బౌద్ధసన్యాసికి కావలసినవి ఉత్తరీయమును, భిక్షాపాత్రయు. ఉత్తరీయమును మడచి, దానిపైని భిక్షాపాత్రను బోర్లనుంచుట యాచారము. బౌద్ధమతమునుగూర్చి యెప్పుడైనను భవనములను నిర్మింపవలసి వచ్చినపు డీయాకారమున నిర్మింపవలెనని బుద్ధదేవు డాజ్ఞాపించెనట. బోరోబుదరున చదరముగ నున్న క్రింది యారంతస్తులు ఉత్తరీయమును, వలయముగ నున్న మీది మూడంతస్తులు భిక్షాపాత్రమును సూచించును. కనుక నిది బౌద్ధసన్యాసుల జీవనమును సూచించుచున్న దని యర్థమును చెప్పవచ్చును.

అడుగునగల చదరనిర్మాణముయొక్క ప్రక్క పొడవు ౪౯౬ అడుగులు. శిఖరమునగల స్తూపాకారము యొక్క మధ్యముకొలత ౫౨ అడుగులు.

ప్రవేశద్వారమునుండి మెట్లపై కెక్కి, మొదటి యంతస్తును, రెండవయంతస్తును, ఆ పిమ్మట మూడవ యంతస్తును ప్రదక్షిణరీతిని చుట్టి, శిల్పాలంకారములతో నెలయుచున్న నాలుగంతస్తులద్వారా పోయి, తరువాత వలయాకారములుగ నున్న యంతస్తులపైని ప్రదక్షిణము చేసి, మధ్యనున్న స్తూపాకారమును చేరుట యాచారము. ఇటుల మీదికి వెళ్లుటయే బోరోబుదరు నిర్మాణకర్తల యుద్దేశము.

శిల్పములచే యలంకృతములైన యంతస్తుల యిదు గోడలపై గల సుందరమైన గూళ్లలో బుద్ధుని విగ్రహములు నిలుపబడియున్నవి. ఈ విగ్రహములు మహాయానమునకు జెందిన స్వర్గవాసులగు బుద్ధులవని పండితులు నిర్ణయించిరి. తూర్పున అక్షోభ్యుడు భూమిస్పర్శముద్ర యందు గూర్చొనియున్నటుల తొంబది రెండు విగ్రహములును, దక్షిణమున వందన ముద్రగల హస్తములతో రత్నసంభవుని తొంబదిరెండు విగ్రహములును పశ్చిమమున అమితాభ్యుడు ధ్యానమున గూర్చొనినటుల తొంబదిరెండును, ఉత్తరమున అభయ ముద్రగల హస్తములతో అమోఘసిద్ధుని విగ్రహములు తొంబదిరెండును గలవు. వీటన్నిటిపైని మీది యంతస్తున అరువదినాలుగు బుద్ధుని విగ్రహములు కలవు.

ప్రతిస్తూపాకారములోపల నొక బుద్ధ (వైరోచనుని) విగ్రహ మిమిడియున్నది. జల్లెడవలె నున్న కన్నములద్వారా చూచినయెడల నిది కానవచ్చును. స్తూపాకారములు డెబ్బదిరెండు కనుక నీ విగ్రహములు డెబ్బదిరెండు. మధ్యనుగల పెద్ద స్తూపమున నొక విగ్రహము కలదు.

కనుక శిల్పచిత్రములందు కానవచ్చునవి కాక ప్రత్యేకముగనున్న బుద్ధ విగ్రహములు బోరోబుదరు నిర్మాణమునందే ౫౦౫ కలవు.

మీది నాలుగంతస్తులపై గల శిల్పచిత్రములు లలితవిస్తరము విద్యానిదానము జాతకమాల గండావ్యూహము మొదలగు గ్రంథముల ననుసరించియున్నవి. గోడలమీది శిల్పచిత్రముల వరుస సుమారైదునేల యడుగుల పొడవుండును. గోడ కిరువైపులను కొన్నిచోట్ల రెండు వరుసలుగను ఉన్నవి కనుక నన్నియు గలసి సుమారు మూడుమైళ్లు పొడవున నుండును. క్రింద

భూమిమట్టము దగ్గర కొన్ని చక్కని శిల్పచిత్రములు మలచబడియున్నవి. వీటిని మరుగుపరచియుండిన గోడలను ఆర్ష శాఖవారు పెళ్లగించి చిత్రముల ఛాయాచిత్రములను దీసి మరల గోడ నెప్పటివలె కట్టించివేసిరి.

వలయాకారముగనున్న మీది యంతస్తులపైనను, స్తూపాకారములపైనను శిల్పచిత్రము లెవ్వియు లేవు.

బోరొబుదరుయొక్క నిర్మాణము, శిల్పములు మానవునియొక్క యాధ్యాత్మిక పరివర్తనమును బౌద్ధమతావలంబకుడు నిర్వాణార్హుడగుటకు పొందు మానసిక పరివర్తనమును సూచించుచున్నవి. జీవయాత్రను ప్రారంభించి కామమును త్యజించుచు నుత్తమ జీవన సోపానములపై కెక్కుచు సంసారమును పూర్తిగ మరచి అరూపలోకమును ప్రవేశించి, బుద్ధత్వమున కర్హుడగుట ప్రతి బౌద్ధ సన్యాసియొక్క యాదర్శము. ఇచ్చటికి బోయి ప్రదక్షిణముచేసిన ప్రతి మనుజుడు నిర్మాణ శిల్పములయొక్క యీ యంతరార్థమును బాగుగ గ్రహించి యిండ్లకుబోయిన తరువాత నిటుల గలిగిన నూతన జ్ఞానమును జీవమున బ్రవేశపెట్టుటకు ప్రయత్నించునని యీ నిర్మాణ కర్తల యాశయము. ప్రదక్షిణము చేయుటలో ప్రతివానికిని దృష్టిద్వారా బౌద్ధమతమునుగూర్చి పూర్తిగ తెలియవలెనని గుణధర్ముడను నృపుని యాదేశమని ప్రతీతి.

చదరముగనున్న క్రింది యంతస్తులు బౌద్ధ సన్యాసియొక్క యుత్తరీయమునే కాక ప్రకృతిని కూడ సూచించుచున్నవి. ఈ భాగములు చిత్రితములై యుండుటవలన ప్రకృతితో సంబంధమైన కామరూపలోపములను వ్యక్తముచేయును. వలయముగనున్న మీది యంతస్తులు భిక్షాపాత్రను అరూపలోకములను వ్యక్తీకరించుచున్నవి కనుకనే యిచ్చట నెట్టి చిత్రములును లేవు. పురుష ప్రకృతులకును భూమ్యాకాశములకును జీవజంతువుల ద్వారా సంబంధమేర్పడియున్నది. ఆకాశము అరూపలోకము ఉత్తమమైనది. భూమిపై నుండు మానవుడు దేహమును పోషించుచు మనస్సును పరిపక్వము చేసుకొనవలెను. మరణాంతమున దేహము భూతములలో లీనమైనపిమ్మట నిట్టి ప్రయత్నమునకు వీలులేదు. కనుక మనముక్తి ప్రకృతిపై నాధారపడియున్నది. అరూపలోకములను తెలియజేయు వలయాకారములైన యంతస్తులును, మధ్యస్తూపమును రూపలోకములను తెలియజేయు చదరములైన యంతస్తులమీద నుండుట యీ వ్యక్తీకరణమును తెలియజేయుచున్నవి.

సాధారణముగ బేసిసంఖ్య లాధ్యాత్మిక విషయములకు సంబంధించిన సంఖ్యలుగ గణింపబడుచున్నవి. బోరొబుదరునందు మధ్యస్తూప మొక్కటియే ఉత్తమలోకములను సూచించు వలయాకారపు అంతస్తులు మూడు. చిత్రితములైన యంతస్తులు నాలుగు. క్రింది యంతస్తులు రెండు. ఇటుల (1+2+3+4=10) అన్నియు గలసి పది. పదియనుసంఖ్య సృష్టిసూచకము. వ్యక్తీకరణము పూర్తిగ నిటుల వ్రాయవచ్చును.

భూమి మట్టముదగ్గరనున్న శిల్పచిత్రములు నరకమునుగూర్చి. ఈప్రపంచమున బ్రతికియున్నప్పుడు చేసిన పాపమునకుఫలముగ మరణానంతర మనుభవించుబాధలు ఇచ్చట స్ఫుటముగ మలచబడినవి. పునాదులు బలహీనమైనవని కనుగొనినప్పు డీశిల్పరాజములను మరుగుపరచు గోడను కట్టిరని కొందరి యూహ. ఇటుల మరుగుపరచుటయందును అర్థముకలదని మరికొందరివాదము. బౌద్ధమతమును స్వీకరించి, నిర్వాణమును పొందుట కాధ్యాత్మికపరిపక్వమునకు బ్రయత్నము చేయువాడు ఇంద్రియములకు లొంగి పాపమును జేసి నరకబాధల ననుభవించు విషయములను తలంపక యున్నతాదర్శములనే దృక్పథమున నుంచుకొనవలెనని చెప్పుట కీచిత్రములిటుల మరుగుపరచియుండుట సంభవము.

ప్రపంచముననను, స్వర్గముననను సౌఖ్యముల ననుభవించవలెనను కోరిక కామమని బౌద్ధులనెదరు. కనుక నిజమైన మోక్షమును పొందుటకు మానవుడు సౌఖ్యమును చేకూర్చు స్వర్గమున కతీతుడు కావలెను. సౌఖ్యమును త్యజించుటయందు ప్రపంచ మర్పించు సౌఖ్యములను సన్యాసి మరువవలెను. మీది నాలుగు చదరములైనస యంతస్తులందు ప్రదక్షిణము చేయునప్పుడు చుట్టునున్న ప్రపంచము కనబడకుండునటుల పిట్టగోడలు కలవు.

వీటిపై బౌద్ధమతమును, ఆధ్యాత్మిక పరివర్తనమును తెలియజేయు చిత్రములు చాలా సుందరమైనవి కలవు. బుద్ధదేవుని జీవిత చరిత్రమును కండ్లయెదుట జూచుటవలన యాత్రికులు నట్టిసంస్కారమును పొందవలెననెడియిచ్ఛ జనించును. కనుక నాయెత్తయిన ప్రదేశమునుండి కానబడు ప్రకృతి సౌందర్యమును మరుగుపరుచుటకే పిట్టగోడలు నిర్మింప బడినవి.

'సోతాపన్న'డనగా "ప్రవాహమును ప్రవేశించినవా"డని యర్థము. క్లేశములకు కారణమైన యీ ప్రపంచమును, ఆనందమును చేకూర్చు ఉత్తమలోకమును విడదీయునట్టి ప్రవాహ మిది. కనుక చిత్రితమైన మొదటి యంతస్తులు బౌద్ధుని యీయాధ్యాత్మిక సోపానమును సూచించుటయు, పిట్టగోడ యిచ్చటినుండి ప్రారంభమగుటయు బోరోబుదరునం దిమిడియున్న యర్థమునకు సరిపోవుచున్నది.

మొదటి మూడు సంయోజనములనుండి విడివడిన బౌద్ధభక్తుడు సకదాగామి యగును. తరువాత అనాగామి, అర్హతుడు కాగా ఉత్తమమైన అరూపలోకము నాధ్యాత్మికముగ ప్రవేశించును. ఈ యుత్తమ సోపానమును చేరిన తరువాత ప్రపంచమునం దిచ్ఛ జనింపదు. కనుక గోడ లక్కరలేకపోయినవి. అచ్చట ప్రతిస్తూపాకారమునందు నొకబుద్ధవిగ్రహము మరుగుపడియున్నది. ఎచ్చట జూచినను దేవుని రూపము కలదు. ఈ రూపమును దర్శించుటకు ప్రయత్నముచేసి యర్హతమాత్ర మార్జింప వలెను.

ప్రధాన శిఖరస్తూపాకారమునను ఒక బౌద్ధ విగ్రహమును నిలిపిరి. దీనియందు వివరములను బాగుగ మలచక యాకారమును మాత్రము తేల్చి యాశిల్పబ్రహ్మలు విడచిరి. జ్ఞానికి దేవుడునిరాకారుడుకనుక నిట్టియవ్యక్త విగ్రహము మన కర్పింపబడినది. కాని డచ్చిప్రభుత్వోద్యోగులు దీని యర్థమును గ్రహింపజాలక విగ్రహమును తీసి దగ్గరనే యొకచోట నందరకు కనబడునట్టుల నిలపిరి.

భారతీయ చిత్రశిల్పకళలు వ్యక్తీకరణ బద్ధములని యీ నిర్మాణము బాగుగ చాటుచున్నది. ఏవో కొన్ని ప్రతిమలను చూచి గ్రీకులు పూర్వము మలచిన విగ్రహము లంత సుందరముగ లేవనియు, ఉత్తమకళా సంప్రదాయములు భారతీయ చిత్రకళయందు కానరావనియు చెప్పువా రీవిషయమును బాగుగ గుర్తించెదరు గాక!

శైలేంద్రుల కాలపు నిర్మాణములలో బోరోబుదరత్యంత ముత్తమమైనది. వారి స్వదేశమగు సుమిత్రయందట్టి నిర్మాణములు లేకపోవుటకు కారణము కానరాదు. ఆనాడు శైలేంద్రులు జావాద్వీపమునే తమవాసస్థానముగ జేసుకొనిరేమో! జావా యందును మరియొక స్తూపము లేకపోవుటయు వింతగ నున్నది.

బోరోబుదరునందు శాసనము లెవ్వియు కానరాలేదు కాని శిల్పు లచ్చటచ్చట మచ్చుటకు కాబోలును కొన్ని యక్షరములను చెక్కిరి. సుమారు ఎనిమిదవ శతాబ్దమున దీనిని నిర్మించిరని లిపి యాధారమున డాక్టరు క్రోముగారు నిర్ణయించిరి. శిల్పశైలిని బట్టియు నీ కాల నిర్ణయమును సమర్థింపవచ్చును. క్రీ. శ. ౭౬౦ – ౮౭౮ సంవత్సరముల మధ్య నిర్మింపబడుట నిశ్చయము.

శైలేంద్రుల నాటి 'చండి బేనాను' అనుశైవాలయము ప్రసిద్ధిజెందినది. ఇచ్చట లభించిన బ్రహ్మ విష్ణు, అగస్త్యుల విగ్రహము లిప్పుడు బటేవియా ప్రదర్శనశాలయందు గలవు

'చండి శేవు' ( శివ? ) అను దేవాలయకూటమి "వేయిదేవాలయముల"ని పేరుపడినది. ఇవియన్నియు పూర్తియైయుండినయెడల బోరోబుదరున కేమాత్రము తీసి పోయెడివి కావు. ఒక్కొకచోట మధ్యనొక యాలయము, దాని చుట్టు చిన్న యాలయములు కలవు. ఇట్టి దేవాలయ సమూహము లిచ్చట ననేకములు కానవచ్చుచున్నవి. వీటన్నిటి మధ్యనుగల పెద్ద దేవాలయముయొక్క గర్భగుడి ౮౫ × ౮౫ చదరపు టడుగుల వైశాల్యము కలది. కుడ్యములపై నలువైపుల ద్వారాకారములు కలవు. దేవాలయము సుందరముగ శిల్పములతో నలంకరింపబడియున్నను మానవుల దేవతల

చిత్రములు మాత్రము లేవు. దీని ననుసరించి చుట్టును ౨౩౮ చిన్న దేవాలయములు కలవు. ఇట్టి యాలయకూటము లొకచోట యిరువదితొమ్మిదియు, మరియొకచోట నలుబదియైదును గలవు. బోరొంబుదరును చిన్న భాగములుగ విడదీసికట్టిన చండిశేవువలె నుండుననియు, యిచ్చటి దేవాలయముల నన్నిటిని ప్రదక్షిణముచేసి మధ్యనున్న పెద్దదేవాలయమును చేరుకొనినయెడల బోరొబుదరు ప్రదక్షిణమువలన కలుగు ఫలమే కలుగగలదనియు కొందరి యభిప్రాయము. బోరొంబుదరు బౌద్ధ నిర్మాణము; చండిశేవుహిందూనిర్మాణము. ఐనను హైందవ, బౌద్ధ, జైనవిగ్రహము లిచ్చట నుండినవట! శైలీయం దివి కలాసాను దేవాలయమును పోలియున్నవి.

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| బోరొంబుదరు | మీదిభాగము | శిఖరము | స్తూపము | 1 | బుద్ధుడు | నిర్వాణము |
| | | కుండ్రని యంతస్తులు | మూడవ యంతస్తు<br>రెండవ యంతస్తు<br>మొదటి యంతస్తు | 3 | భోధిసత్వుడు<br>భోహముడు<br>అశైఖుడు | అరూప లోకము |
| | | చదరపు అంతస్తులు | నాల్గవ యంతస్తు<br>మూడవ యంతస్తు<br>రెండవ యంతస్తు<br>మొదటి యంతస్తు | 4 | అర్హతుడు<br>అనాగామి<br>సకి<br>శకదాగామి<br>స్రోతపన్నుడు | రూపలోకము |
| | క్రింది భాగము | క్రింది అంతస్తులు | రెండవ యంతస్తు<br>మొదటి యంతస్తు | 2 | మతస్వీకరణము<br>శిష్యత్వము | కామలోకము |
| | | | | 10 | | |

జావాలో శైలేంద్రుల పరిపాలనము క్రీ. శ. ౮౬౦ లో అంతమొందినది. తూర్పుజావానుండి మరల జావారాజులు వచ్చి ప్రాంబణము(బ్రహ్మవనము) న నివాస మేర్పరచుకొనినపిమ్మట పునరపి శైవమత మా ద్వీపమున నామోదమునకు వచ్చినది. అతి చక్కని హిందూదేవాలయములు నిర్మింపబడినవి. రామాయణ శిల్పచిత్రములు చాలాసుందరమైనవి మలచబడినవి.

ఈ నూతన శకము (క్రీ. శ. ౮౬౦–౯౧౫)నకు చెందిన దేవాలయములలో ముఖ్యమైన కొన్నిటిని పేర్కొనిన చాలును.

## 'చందిఆసు' హిందూ దేవాలయము

'చండి ప్రయొసాలు' బౌద్ధాలయము. ఒక పెద్ద దేవాలయమును, అనేకములగు చిన్న యాలయములును, విహారమొకటియు నిచ్చటగలవు. చక్కని శిల్పమునందును, సన్నని స్తంభాకారములందును ప్రధానాలయము 'చండి మెండూతును'పోలియున్నది. బుద్ధుల, బోధిసత్వుల చిత్రములనేకములు శిల్పితములై యున్నవి. తార, పద్మపాణుల ప్రతిమ లున్నతకళాశైలిని వ్యక్తపరచుచున్నవి.

బోరొంబుదరు నిర్మాణము పూర్తియైన తరువాత జావాశిల్పము కొంతమార్పు చెందినది. ప్రాంబణము నందలి శిల్పమునం దెక్కువజీవము కలదు. ఈ మార్పు 'లొరొజొంగ్రాంగు' అను దేవాలయకూటమియందు బాగుగ కనబడుచున్నది. ఇది బొరొంబుదరు, చండిశేవులతో సరితూగగల నిర్మాణము. "లొరొ" అనగా "ఉత్తమసంజాత" యని యర్థము. లొరొజొంగ్రాంగు అనుయువతి జావాలో ప్రచారమునందున్న కథలలో సుప్రసిద్ధము. ఈమెను మోదమును కలుగజేసి, వరింపవలెనను యుద్దేశముతో నొక వీరుడు పందెమువేసి చండిశేవు నొకరాత్రిలోగా నిర్మింపదలచి విఫలమనోరథుడయ్యెనని యొకకథ కలదు. 'చండిలొరొజొంగ్రాంగు'ను దక్షుడను రాజకుమారుడు నిర్మింపజేసెనని

ప్రతీతి. చదరములను వేదికలపై యేనిమిది దేవాలయము లిచ్చట గలవు. వీటన్నిటిలో పెద్దది శివాలయము. దీని కిరువైపుల బ్రహ్మ, విష్ణువుల యాలయములు కలవు. వీటినావరించియున్న రెండుప్రాకారముల కంటె నూట యేబదియారు చిన్నయాలయములు కలవు. మధ్యనున్న యాలయముతప్ప తక్కినవన్నియు శిథిలము లగుచున్నవి. శివాలయము నలువైపుల మెట్లుగల యెత్తైన డాబావంటి నిర్మాణము కలదు. శ్యామదేశమునందలి కట్టడముల నిది పోలియుండుటచే బోరొబుదరును కొంతపోలియున్నదనుట సత్యదూరము కాదు. ఈ డాబాయందుననున్న గోడపై చక్కని రామాయణ చిత్రములు శిల్పితములై యున్నవి. బ్రహ్మయొక్క యాలయము నావరించియున్న యిట్టిగోడపై మరికొన్నియుండినవనియు, అన్నియు గలసి రామాయణకథయంతయు పూర్తిగ నిచ్చట యాత్రికులను రంజింపజేయుచుండెననియు చరిత్రకారులయభిప్రాయము. విష్ణువుయొక్క యాలయకుడ్యముపై కృష్ణుని చరిత్ర మలచబడియున్నది.

ఈ యాలయములు పూర్తియైనవెంటనే భూకంపము వచ్చియో, లేకయంటురోగము ప్రబలియో మధ్య జావాయందు శిల్పకళ క్షీణించినది. కాని యీ నాటికి తూర్పు జావాయం దీకళ పాడుకొనినదనుటకు గునుంగు సంగరితి (క్రీ.శ. ౯౭౭), బెలాహను ద్వారములు, చండి సంబెరునానాను నిదర్శనములు. అప్పటికే హిందూ కావ్యములు, పురాణములు కొన్నిమార్పులతో జావాభాషలోకి పరివర్తితము లైనవి. బౌద్ధ, హిందూమతములు వింతగ కలసిపోవుటవలనను, జావాయందలి పరిస్థితులను బట్టియు హిందూ శిల్పకళయం దనేకములగు మార్పులు ప్రవేశించినవి.

చండిలాటుండెను స్నానకుండిని, బెలాహను వద్దనున్న స్నానకుండిని ఉదయానుడు కట్టించెను. సుప్రసిద్ధుడగు ఈతని కుమారుడు ఎల్లాంగుడు కవిభాషయందు అర్జునవివాహము మొదలగు గ్రంథములను వ్రాయించెను. కాని యేకారణము చేతనో దేవాలయములను కట్టించలేదు.

ఈ నాటికి నావికాబలమునందు జావా సుమిత్రను మించినది. అరేబియా, చైనావర్తకు లిచ్చటకు వచ్చి కాపురమేర్పరచుకొనిరి. జావా నావికులు దూర దేశములను జయించి, తూర్పు ఆఫ్రికాతోను, చైనాతోను వర్తకమును విరివిగ చేయ ప్రారంభించిరి. ఇటుల కలిగిన జాతీయోత్సాహఫలితముగ 'సింగసారి'(౧౨౮౦-౧౨౯౨) యందును, నూతన వంశము రాజ్యాధిపత్యము వహించినపిమ్మట (౧౨౯౮-౧౫౭౮) మజపహితునందు ఆలయములు నిర్మింపబడినవి. ఈ నూతన శైలియందు నిర్మాణమునకు శిల్పమునకును ఐక్యము లేక పోయినను, కట్టడము లన్నియు చక్కగ నున్నది.

సింగసారియందు 'చండికిడలు' అను శైవాలయమొకటి కలదు. ఎత్తైన శిఖరముపై నద్దుపట్టీలు, ద్వారముపైగల పెద్దకాలమకరచిత్రము తూర్పు జావా శైలిని వ్యక్తము చేయుచున్నవి.

జావాయం దిప్పటికిని కానవచ్చునట్టి నటకులవేషములబోలు శిల్పచిత్రములతో కృష్ణుని చరిత్రము చండిజాగో గోడలమీద కలదు. దేవాలయములోపల క్రింద శివుని విగ్రహమును, దాని పైని బుద్ధుని విగ్రహమును కలవు. వీరిరువురు నొకేకాలమున పూజింపబడుట యానాటి శివ బుద్ధమతములకు తార్కాణము. ఇచ్చట చక్కని ప్రతిమ లనేకములు లభించినవి.

'చండిజాబుంగు' చక్కని వింత నిర్మాణము. ఎత్తైన చదరపు వేదికపై దేవాలయము కలదు. క్రింది చదర భాగము క్రమేపి మీదను వలయాకారముగ మారుటవలన సొగసుగ కనబడుచున్నది. శిల్పాలంకారములు కొంచెమైనను నిర్మాణమునకు వింతయైన సొంపును గూర్చుచున్నవి. సౌందర్యములో తూర్పు జావాయందు దీనికిమించిన నిర్మాణము లేదని చెప్పవచ్చును.

'చండిపాహా' చదరముగను, పొట్టిగను ఉన్నది. దీనిని 'చండిజాబుంగుతో' పోల్చి చూచినయెడల నచ్చటి శిల్పుల నిర్మాణస్వేచ్ఛ బోధపడగలదు.

పదునాల్గవ శతాబ్దమున 'మజపహిత్తు' రాజులు బార్నియో, సుమిత్ర, మలయదేశములపై యధికార

మును కలిగియుండిరి. వాణిజ్య మెక్కువ యభివృద్ధి పొందినది. ప్రపంచకుడనుకవి 'నాగరకేర్తాగము' మను గ్రంథమున 'జపమహిత్తు' నగరమును పూర్తిగ వర్ణించెను.

ఈనాటి నిర్మాణములలో 'పానాతరను' వద్ద గల శిథిలమైన శివాలయము సుప్రసిద్ధము. ఎత్తైన శిఖ



౬. చండిజబంగు

రము కల యీ యాలయము రామాయణ కృష్ణాయన శిల్పచిత్రములతో నలంకరింపబడిన వేదికపై గలదు. దేవాలయ కుడ్యములపై బ్రహ్మవిష్ణు మహేశ్వరుల చిత్రములు కలవు. శిల్పచిత్రములందు కానవచ్చు అలంకారములు నేటిజావా వాయాంగ నటకుల యలంకారములఁ బోలియున్నవి. ఆలయము ననుసరించియున్న నిర్మాణము లన్నియు దూరదూరమున నుండుటచే నైక్యత చెడియున్నవి. కట్టడములన్నియు శిల్పాలంకారములతో క్రిక్కిరిసి యున్న వని చెప్పవచ్చును.

పదునైదవ శతాబ్దమునాటి దేవాలయములు పర్వతములమీద గట్టబడినవి. శివునియొక్కయు, అచ్చటియాదిమవాసుల వన్యదేవతల యొక్కయు ఆరాధనము కలసిపోయి ప్రజల యాధ్యాత్మిక దృక్పథమునందు కలిగిన మార్పుల కనుకూలముగ నీకట్టడము లున్నవి. పేనాంపికను సుకు, 'లెవు' మొదలైన స్థలములందుగల యాలయము లీత్వరగతికి జెందినవి. సుకుయందు గల యాలయములు క్రీ. శ. ౧౪౩౫ లేక ౧౪౪౦ నాటివి. రచనయందు మోటుగను, భావమునం దశ్లీలముగను ఉన్నవి. ఆనాటి వైజ్ఞానిక, నైతిక పతనము నీకట్టడములుసూచించుచున్నవి.

౧౫-వ శతాబ్దాంతమున 'మజపహిత్తు' రాజ్య మంతమొందినది. ప్రజలు మహమ్మదీయ మతమును స్వీకరించిరి. హిందూ విజ్ఞానముయొక్క ప్రాబల్యము మాయమైనది. మహమ్మదీయులు హిందువుల యాచారములయెడల ప్రతికూలురు కాకుండుటచే పూర్వపు నిర్మాణములను పాడుచేయక యుండిరి. గుజరాతు నందువలె నిచ్చటను చండివంటిదానినే మసీదుగ గట్టుకొనిరి. హిందూనిర్మాణములు పదునారవ శతాబ్దమున నిర్మింపబడకపోవుటకు జావావాసుల భావపరివర్తనము కారణముకాని మహమ్మదీయుల ప్రతికూలత కాదు.

హిందువు లచ్చట గట్టిన దేవాలయములు, స్తూపములు హిందూశిల్ప విజ్ఞానమునకే కాక, మానవుని ప్రతిభకే గౌరవమును చేకూర్చునవిగ నున్నవి. మానవు లింతటి ఘనకార్యములను చేయగలుగుదురని యందరును వీటిని చూచి గర్వపడవచ్చును.

# నేనేమో మొద్దునుగాను

మామిడిపూడి వెంకమ్మ

౧-వ రంగము

సూరమ్మ—చిట్టమ్మగారూ, సాయంత్రం నాలుగ్గంటలకి వస్తారా, ఆడవాళ్ల మీటింగట.

చిట్టమ్మ—నేనా? నాకు ఒంట్లో బాగు లేదండి.

సూ—యేమిటండి, యెప్పుడూ ఆలాగే అంటారు. ఒకమాటు సరదాగా వెళ్లివస్తే బాగుంటుందండి. అస్తమానం యింట్లోనే వుంటే చెడ్డచీకాకుగ ఉంటుంది. వస్తూ, ఒకమాటు ఆలా వెళ్లివద్దాం.

చి—అబ్బా, రాలేనండి. చీకాకుగ ఉందండి. ఇంతేకాక మాఆయనకి యెక్కడికైనా వెళ్లడంఅంటే యిష్టంలేదు.

సూ—ఇష్టంలేకేమండి? ఆయనమాత్రం రోజూ యెక్కడికో ఒకక్కడికి వెళ్తున్నారుగదండి. మనం రోజూ వెళ్లాలా యేమయినానా. అడ్డుచెప్పకుండాను, ఆయన మీద పెట్టకుండాను.

చి—నన్ను బలవంతపెట్టకండి. మా ఆయనమాత్రం నేనెక్కడికయినా ఆలాంటి చోటుకు వెళ్తానంటే దెబ్బలాడుతారు. ఎందుకొచ్చిన బాధ, హాయిగ యింతోఅంతో తిని మెదలకుండ కూర్చోక.

సూ—మీకే యిష్టం లేదందురూ. నాలుగ్గంటల కెళ్లి ఒకగంటలో వచ్చేందుకి. అయితే ఆరోజు యెక్కడికో వెళ్లానంటే 'యెప్పుడూ నన్ను తీసుకెళ్ల'రని నిష్ఠూరం ఆడారుగా.

చి—ఏదో అన్నానుగాని క్షమించండి. మీరు ఒకరోజు యెప్పుడయినా అడగండి ఆయన్ని; మీకే బోధపడుతుంది.

సూ—ఆయనమాత్రం యెందుకు వద్దంటారండి. అక్కడికి యెంతేసి గొప్పవాళ్లు వస్తారో యెరుగుదురా. ఈపాటి ఆపాటి అనుకున్నారా యేమిటి. అందరూ బాగా కాలేజీలల్లో చదువుకొన్న గొప్ప గొప్ప వుద్యోగస్థుల భార్యలూ, డాక్టరులభార్యలూ, స్కూలు టీచర్లు. వాళ్లను చూస్తేనే చాలు. అంత సరదాగా వుంటుంది. తప్పకుండ రాండేం. వెళ్లేటప్పుడు నేనయినా వస్తా, కబురయినా పంపిస్తా.

చి—చూస్తాము లెండి. రాగానే ఆయన్ని అడుగుతా. (సూరమ్మ వెళ్లిపోవును.)

౨-వ రంగము

చి—(తనలో) ఆహా, సూరమ్మ యెంత అదృష్టవంతురాలు. ఎక్కడికి వెళ్లాలన్నా ఆవిడకి నిర్బంధంలేదు కదా. మొన్న తాను హాలుమీటింగుకి బద్ధకంచేత వెళ్లనంటే ఆవిడ ఆయన యెంతో బలవంతంచేసి తీసి

కెళ్ళాడు. ఇంకా వెళ్ళటానికి ఆవిడే విసుక్కుం టుంది తిరగలేక. నాకర్మం యీలాగా. మొన్న షైరు వెళ్ళాం రమ్మని యెంతో బతిమాలినా వచ్చారు కారు. అదృష్టాలు అందరికీ ఒక్కలా వుంటుండీ.

సూ—(చిట్టమ్మతల్లి) చిట్టి తల్లీ, రామారావు వచ్చేట్టే. పలకవేమే? ఏం చేస్తున్నావే?

చి—ఎందుకూ? ఇంకా రాలే.

సూ—వంటయి జామయింది. శీతాకాలంపొద్దు కూడాను. అంతా చల్లారి పోతోంది. ఎక్కడికెళ్లాడే?

చి— ఎక్కడికో వెళ్లారు. వచ్చేవేళయింది లేవే.

సూ—భోంచేసి వెళ్ల మ న లే క పొయ్యావా. తీరా వంటయిందాక వుండి యిప్పుడెక్కడి కెళ్లాడే. అడిగావు కావు.

చి—బాగుంది. వెళ్తోంటే యెక్కడికి వెళ్తారంటే జవాబు చెప్తారే. చీవాట్లు తినడం కానీ.

సూ—భోంచేసి వెళ్లమంటే తప్పటే. ఏమి చిత్రమే! మాకాలంలో మేమంతా అడిగేవారం కామటే. నాకుమాత్రం ఆపాటి తెలియదటే. అడిగితే చీవాట్లు పెట్టేవారా!

చి— ఏడ్చినట్టే వుంది. మీ కాలానికి మాకాలానికి పోలుస్తావటే. అయ్యకి విద్దా లేదు, అమ్మకి గర్వంలేదని వుండేవారు మీరు, మీకూమాకూ సాటే.

సూ— మాకంటె మీ రెక్కువంటావా.

చి—ఎక్కువని కాదు. ఇద్దరూ సమంగా వుండేవా రన్నమాట. మేం అల్లా కాదు. ఆయన బాగా ఇంగ్లీషు గట్రా చదివి వుద్యోగం చేస్తున్నారు. నేనా పల్లెటూరు దాన్ని, పుట్టి మొద్దునీ. ఇక మేం యెల్లా వుండాలో చెప్పు. మాకేలా పొందుతుందే మీల్లాగా.

సూ—నీకేమిటే లోటూ! బంగారు బొమ్మలావున్నారు. వెయ్యిన్నినూటపదహార్లు కట్నమిచ్చి వెండి చెంబులూ, పట్టుపంచలూ అల్లుడికిచ్చి, నీకు కట్టుకాసుల పేరు, వడ్డాణం బనారసు చీర పెట్టి పెండ్లిచేశాము. యింతకంటె మంచిసంబంధం చేస్తారే యెవరయినా?

చి—నీ వెరిగిం దింతే. నీ కంతకంటె తెలిస్తేగా. ఈకాలంలో సుబ్బరంగా కాలేజీల కెళ్లి, చదివి పాసులివ్వాలి. తెలిసిందా?

సు—పాసులయి ఆమీద యేమిటి చెయ్యాలి? సంసారం చేయడానికీ, యింటి పనులు చేసుకోడానికీ పాసులివ్వాలీ? మేమంతా పూటకి యేబయిమందొచ్చినా నిర్లక్ష్యంగా వంటా పెట్టూ చేస్తున్నాముకామూ. మేమంతా మాణిక్యాల్లాంటి పిల్లలను కనుక్కోలే. పాసులయినవాళ్లేనా కంటున్నారు? మాకంటె వాళ్లకి యెనిమిది కాళ్లతోటీ, నాలుగు తలలతోటీ పుడ్తున్నారాయేమిటి పిల్లలు? మామూలుగా అందర్లాంటి పిల్లలే కదటే? యింకా పిల్లైతే యింటిపట్టున వుండి

చెప్పినట్టు వింటూనైనా వుంటారు. చదివే సరికి వాళ్లకే మగాళ్లు చాకిరీ చేయలేక చచ్చిపోతారు, తెలిసిందా.

చి—ఇప్పుడు నీవన్నదంతా ఆయనతో చెప్పు. నాకు చదువురాదని నాతో మాట్లాడ్డమే మానేశారు సరికదా, నేవెళ్తానన్నా వారికి సిగ్గట. వెళ్లవద్దంటారు. ఈ వాళ సూరమ్మ నన్ను యెక్కడో మీటింగట రమ్మని బతిమాలి, రానంటే ఆఖరుకి నిష్ఠూరమాడికూడాపోయింది. నాకుమాత్రం సరదాలేదూ? ఉంటే మాత్రం యేమిటి చేయడం?

సు—అంతసరదా వుంటే వెళ్లరాదూ ఒకమాటు? అంటేఅంటాడు.అంతగా అయితే నే చెబతాలే.

చి—ఆయన వొప్పొద్దటే. 'నీ తెలివికి మీటింగులుకూడానా.చాల్లే యేడిచావు' అంటారు.చీవాట్లుకూడాను. అదుగోవస్తున్నారు. ఆయనతోకానీ అనకేం, కొంపదీసి. నీకు పుణ్యముంటుంది.

(రామారావు ప్రవేశించును)

సుబ్బమ్మ—యీవాళ శలవు, యింట్లోనే వుంటారని పెందరాడే వండేసి కూర్చున్నా. దగ్గరదగ్గర 12 గంటలయిండి. వంటంతా చల్లారిపోయింది-హాయిగా వేళపట్టున భోంచేసి వెళ్లకూడదూ?

రా—ఇవ్వాళ శలవని యిక్కడే దగ్గర మాస్నేహితుడింటికి వెళ్లాను. అక్కడ మా స్నేహితుడూ, అతనిభార్యా, మరొకడూ నేనూ కలిసి పేకాట ఆడుకుంటూ కూచున్నాం. వేగిరం బయలుదేరినట్టే బయలుదేరాను. తీరా యింటికొచ్చి గంట చూచే సరికి 12 గంటలయింది. పొద్దే తెలిసింది కాదు.

సూ—ఏం బాబూ ఆయాట మన యింట్లో అమ్మాయితో ఆడుకోకూడదు? చదువంటే రాదు కానీ ఆటకేం?

రా—దీనితోనా? ఏడ్చినట్టే వుంది. ఎవరయినా చూస్తే నవ్వగలరు. సిగ్గు సిగ్గు!

సూ—అక్కడయినా వాడు వాడిపెళ్లాం మీరు కలిసి ఆడుకొన్నారుగా! ఇంట్లో తప్పొచ్చిందీ? ముచ్చటకయినా ఒక గడియ యింట్లో వుండవు గదా.

రా—ఆటా ముఖ్యం. ఏదో కాలక్షేపానికి గాని. వాడిభార్య బియ్యే పాసయింది. కులాసాగా కబుర్లు చెప్పుకుంటూ, సరదాగా ఆడుకున్నాం కాని. దీనితో యేమిటుంది చెప్పదుకూ.

చి—అస్తమానం ఇంట్లోనే కూర్చుంటే యేమిటుంటుంది కబుర్లు. నన్నెక్కడికైనా వెళ్లనిస్తేనా?

రా—చాల్లే వూరుకో. నీ తెలివీ, నీ వూను. ఎక్కడికెళ్లినా చాలు, నా పరువు పోతుంది.

చి—యెందుచేత? నేనేం అంత అధ్వాన్నంగా వున్నానా? మీపరువు యెందుకు



జార్జి అర్లిస్
(సినీమా నటకుడు.)



తూర్పు గోపురము
(రంగనాయకుల కోవెల, శ్రీరంగము) K. P. S.



జంబుకేశ్వరాలయ గోపురము
(శ్రీరంగము చేరువను) K. P. S.

పోతుందో చెప్పవుదురు? అయితే నే నేలా వుండాలి?

రా— ఇందాకే చెప్పాను కానటే. కోప్పడితే యేలాగా? వాడిభార్య మీరా బాయి సుబ్బరంగా బి. యే పాసయిందని. ఒకమాటు వెళ్లినా, కూర్చున్నా అల్లావుంటే సరదాగా వుంటుంది కాని యిదేమిటీ. నే యింట్లోనే వుంటాననుకో, నీతో యేమి టుంది కబుర్లు యెల్లా పొద్దుపోతుంది చెప్పవుదూ?

చి—మీరుండనూ వద్దు, మీతో నే రావడమూ లేదు. కానియీవ్వాళ యెక్కడో మీటింగట, నాలుగ్గంటలకి. సూరమ్మగారు యెంతో బతిమాలారు. నిష్ఠూరంకూడా ఆడారు. ఆవిడతో వెళ్తాను. ఏమంటారు?

రా—నీవా? ఏం వద్దులే. సుబ్బరంగా యింట్లోనే వుండు హాయిగానూ. ఎందు కొచ్చిన బాధ నీకు.

చి—బాధేమిటి? ఎంతెంతో గొప్ప వాళ్లు వస్తారట. సరదాగా చూచి వేగిరమే వస్తాలెండి.

రా—వాళ్లంతా బాగా చదువుకొన్న వాళ్లు, గొప్పవాళ్లూను. తెలిసిందా. నీవుగాని వెళ్లితే ఫలానాఅంటే నాపరువు పోతుంది. మేమంతా క్లబ్బులో కలుసుకుంటాం తెలిసిందా. ఇదివర్కే, మీ లేడీని ఒక్కరోజైనా తీసుకొనిరావేం అని అడుగుచున్నారు పూర్లో లేరని చెప్పాను. నాలేడీ యెంత గొప్పదో అని అనుకొంటున్నారు. నేచెప్పింది విని ముందు నలుగురిలో వుండడం నేర్చుకో.

చి—ఒకర్తెను నలుగురిలో యేలా వుండడం నేర్చుకుంటాను. మనయింటికి ఒకర్ని రానీయరు. నన్ను అసలే వెళ్లనీయరూ.

రా—తీరా చెప్పనిస్తేనా. నీచీరా, నీ రవికా, నీకట్టుకాసులు బాజీబందులు. మొఖమంత బొమికాటుక, వడ్డాణం యీవేషం చూడ్డంతోనే పగటివేషం వచ్చిందని నవ్వగలరు. అక్కడికెళ్లితే కూచోడమయినా చేత కాదు. వాళ్లందరూ నవ్వినా యెంతబాగుంటుందో యెరుగుదువా. నీవా కొంచెం సంతోషంవచ్చేసరికి వికారంగా విరగబడిపోతావు కదా. అన్నిట్లోనూ పట్నవాసంవాళ్లకీ పల్లెటూరువాళ్లకీ యెంతవారుందో చూశావా. నేచెప్పింది విను. మంచిమాస్టర్ని పెడుతాను. కొంచెం చదువు నేర్చుకో. ఆమీద వెళ్దూగానీ. అదుగో సూరమ్మగారు వస్తున్నారు కానీ, అల్లా వెళ్లిపో.

(సూరమ్మ ప్రవేశించును.)

రా— రండి సూరమ్మగారు. ఎక్కడికో వెళ్తున్నట్టున్నారు. ఏమిటి కబుర్లు? కూర్చోండి.

సూరమ్మ—కొంచెం పని మీద వచ్చాను, కూర్చోను. ఈవాళ మీటింగుకి మీ ఆవిడను తీసుకెళ్దాం అని వచ్చాను.

పొద్దున్నే వచ్చి బ్రతిమాలాను. ఎన్నో ఆటంకాలు చెప్పి ఆఖరుకి మీమీద పెట్టే శారు. ఎక్కడకయినా వెళ్లానంటె మీరు వెళ్లినప్పుడు నన్నొకమాటు తీసుకెళ్లరూ అని అనేవారు. తీరా పిలిచేసరికి యిల్లా వంక పెడ్తున్నారు. యిల్లా యిప్పటికి ముమ్మారయింది. ఏమిటండీ, యీలాగా.

రా—అదిరావడానికి నన్నడగడమెందుకండి. నేవద్దంటానా యేమిటి.చూశారా,



చెప్పాను కానూ. మా ఆవిడ మీ యింటికి వస్తుంది, యిద్దరూ కలిసి వెళ్లమని. ఆజామయి చెప్పచున్నాను

ఆలాయెక్కడికయినా వెళ్లమని. నామాట అబద్ధమయితే మీామెదటే అడుగుతా.వినండీ. యేమేవ్ చిట్టీ యిల్లారా ఒకమాటు. బూచుల్లేవు లే, రా. మన సూరమ్మ

మీరు రావడంతోటే పరుగెట్టింది లోపలికి. ఎవరయినా వచ్చారంటే ఒకటే భయం. పిల్లిలా అయిపోతుంది. నేను నెలకిందే

"చూశారా ; కూర్చుందుకె ఎంత బ్రహ్మాండం చేస్తుందో"

గారే. రావే యెన్ని మాట్లు పిలిచినా రావేమే. రా.

(చిట్టమ్మ వచ్చి నిలబడును.)

రా—వీ రేమంటున్నారో తెలిసిందా. ఎన్నిమాట్లు చెప్పినా వినిపించుకోవు.

సూ—రాండి, యిల్లా కూర్చోండి. (దగ్గరవున్న కుర్చీ చూపును.)

చి—పరవాలేదు లెండి. నిలబడతా లెండి.

రా—చూశారా, కూర్చుందుకే ఎంత బ్రహ్మాండం చేస్తుందో. ఈలాంటి మనిషి అక్కడికంతా యేలా వెళ్తుందండీ.

సూ—పోనిస్తురూ వుట్టినే ఆలా అనకండీ. ఏమండీ వస్తారా వెళ్దాం. వేగిరమే వెళ్లిపోయి వద్దాం.

చి—నేనిందాకనే అడిగానండి. ముందు నలుగురిలో యేలా వుండాలో నేర్చుకోమ్మన్నారండీ.

సూ— ఏమిటండీ. అస్తమానం ఆవిడని వెటకారంచేస్తారు. నేర్చుకోడం యేమిటండీ, బ్రహ్మాండం. అక్కడ యేమిటుంది, నేర్చుకోడానికి.

రా—అదంటేను అంటున్నా. చూశారా యేలా కూచుందో రెండు చేతులు గడ్డం కింద వుంచుకోని. ముక్కుమీద ఆవేలూ యేమిటో విడాలంటె సరిపోతుంది. తీరా అక్కడి కెళ్లి యిల్లా కూర్చుంటే నవ్వరూ.

సూ—వారి కేమిటండి. వుట్టినే హాస్యాలాడుతారుకానీ? మీరు చెప్పినట్టు వుండమండి. మాయిష్టం వచ్చినట్టు కూర్చుంటాము కాని. మాకు నిర్బంధం లేదుసుమండీ.

రా— యానివర్సరీ గట్రా యీలాంటప్పుడు టీపార్టీ చేస్తే మా ఆవిడకి స్పూన్లతోటి తినేందుకి రావాలా; ఒకటేమాటు నోట్లో పడేసుకొంటే. ఇవన్నీ రావద్దండీ. మొదట యివన్నీ నేర్పండి. ఆమీద తీసుకెళ్లుదురుగాని.

సూ—పోనీ, యీమాటు వదిలేశాను కానీండి. ఇక మీదట తప్పక రావాలి సుమండీ. మళ్లీ ఒకరోజు వస్తాను.

చి—నానుంచి వేళయిపోతుంది. మీరు వెళ్లుదురు. ఈమాటు చూదాం లేండి.

(సూరమ్మ వెళ్లిపోవును.)

చి—మాస్టర్ని పెట్టా నన్నారుగా మాట్లాడారా.

రా—సోమయాజులు నీకు తెలుసును కాదు. ఈమధ్యే బియ్యే కూడ పాసయ్యాడు. వా డొస్తానన్నాడు.

చి—మొదట యేమిటి చెప్పుకో మన్నారు.

రా—తెనుగు వచ్చును కాదూ.

చి— ఏదో చిన్నప్పుడు వీధిబళ్లో నేర్చుకున్నాను కాని యిప్పుడు అక్షరాలు గుండ్రంగ రాయలేననుకుంటా. మావూళ్లో

అయితే మంటినేలమీాద అక్షరాలు కుదర డానికి రాసేవారం. ఇక్కడ యిల్లంతా గచ్చే. మచ్చుకయినా మంటినేల లేదు. అదీ గాక అన్నక్షరాలు నేలమీాదయితే ధారా ళంగా రాయొచ్చు.

రా — నేలమీాదెందుకు. నీ బుఱ్ఱమీాదే రా యి. ఈపాటికి యెక్కడి కెక్కడికో వెళ్తానన్నావు.

చి — అస్తమానం యీలాంటిమాటలే. కఱ్ఱపలకలమీాద రాతి బలపంతో రాసే వారం. ఎంత బాగుండే వనుకొన్నారు అక్ష రాలు. ఆటవిడుపు పద్యాలు రాసి బల్ల చుట్టు పూజలు పెట్టి క్రింద సరస్వతి బొమ్మ వేసేవారం. తెలిసిందా. ఎంత సరదాగావుండే దనుకొన్నారు.

రా — అదంతా పూర్వకాలం చేతలు. తెలిసిందా. ఇప్పుడు అన్నీ కాగితాల మీాదే. ఇదిగో కాపీ బుక్కు. ఇది సుబ్బ రంగా అక్షరాలు చూచుకుంటూ రాయి. ఇంగ్లీషు వాడొచ్చి చెబతాడు.

3-వ రంగము

(పద్మ అను స్నేహితురాలు ప్రవేశించును.)

పద్మ — చిట్టెమ్మగారూ, యేమండి. యెక్కడా కనిపించలేదూ. వూళ్లోవున్నట్టే లేదే. అంతా బాగున్నారా. ఏమిటి కబుర్లు?

చిట్టి — కబుర్లకేమిటి? ఈ మధ్య మాస్టరుని పెట్టి చదువుచెప్పిస్తున్నారు. లేచిందిమొదలు పడుకోబొయ్యేవరకు కాంపొజిషన్లు రాస్తూ, పాఠాలు వల్లిస్తూ యింట్లో పీట్లతోనే సరిపోతుంది. ఎక్కడా తీరుబాటే లేదు.

ప — ఎంత చదివినా ఒక మాటయిన తీరుబాటు లేదా. నిన్న చొక్కాయ కుట్ట మని మాయింటికివచ్చాడు. మీా అమ్మగారు యేం చేస్తున్నారంటే చదువు కుంటున్నారు. అని మీాగుంట డన్నాడు. మా అమ్మాయీ కూడ పరీక్షలకు చదువుచున్నాది తీరుబాటులే దనిచెప్పి పంపాము. ఏమిటిచదువుచున్నారు.

చి — ఇంగ్లీషు. 2 పుస్తకాలు అయ్యాయి, యీ రెండు నెల్లకీను. మూడో పుస్తకం మొదలెట్టాను.

ప — అప్పుడే! మాకు ఒకపుస్తకం చద వ్వాలంటె ఒక్కయేడా దయ్యేది. అయితే కొంతమట్టుకి భాష వెళ్లిపోయివచ్చిం దన్న మాట.

చి — రాదండి. కొట్టుకొన్నా, కొంచె మయినా రాదండి. మాఆయన ముందు లెక్కలు బాగా రావాలన్నారు.

ప — మనకు లెక్క లెందుకండీ. వూసు పోక. యేదోకొంత భాషవస్తే యెవరయినా మనభాషరానివాళ్లు ఇచ్చిన చిన్నచిన్న లెక్చర్లు విన్న గ్రహించుకొంటే చాలదండి. ఏదయిన డైలాగ్ బుక్కు చదివితే, మాట్లా డుతూవుంటే అదేవస్తుందికాని మనకెందుకండీ జామిట్రి, ఆల్జీబ్రా యివంతానూ.

చి—వచ్చేసంవత్సరం పరీక్షకు వెళ్లాలట.

ప—ఏంపరీక్ష?

చి—స్కూలుఫైనల్కు.

ప—ఈపిల్లలతోటి యింట్లో పనుల తోటి పరీక్షలంటె సామాన్యమనుకున్నారా. స్కూల్కు వెళ్లినవాళ్లుకూడ రెండేసి మూడేసేళ్లు అందులోనే కూర్చుంటున్నారు. అయినా మన కెందుకండి?

చి—అందరికి మీలా స్కూల్కువెళ్లడం యెల్లా కుదురుతుందండి. మావూళ్లో వెళ్దాం అన్నా బడేలేదు. మరి యెప్పుడూ ప్రయత్నమే చేయకూడదేమిటి! నారాయణ రావుగారి పిల్లలు ఇంట్లోనే చదివి పరీక్షకెళ్లారు. ఏజంటుగారి అమ్మాయి ఇంట్లోనే చదివి పరీక్షకెళ్లింది. వాళ్లంతా పాసయ్యారు కాదండి.

ప— వాళ్లంతా స్కూళ్లకి వెళ్లకపోయినా పిల్లలు పుట్టింట్లోనే యున్నారు. పెండ్లిండ్లయినా లేదు. ప్రత్యేకం యిద్దరు మాస్టర్లని పెట్టి చిన్నప్పటినుంచి నేర్పుకుంటున్నారు. మన కెక్కడ అవుతుందండి. కానీ వృట్టినే మాటచాలుకు అన్నానుసుమండి. మరి తప్పట్టుకోకండేం.

చి—ఇంట్లో మామేనత్త వున్నాదిలెండి. ఇంటిపూచీ పిల్లలపూచీ నాకు లేదండి. అంచేత మొదలెట్టాను. ఇంక యేడాదికి కడ్తాను. అప్పుడే మూడుపుస్తకా లయ్యాయి.

ప—ఆలాగయితే రా కేంచేస్తుందండీ మీరేమంటారో అని మాటవరుసకి అన్నాను గానీ కష్టపడితే యెందుకు రాదండీ. తప్పట్టుకోకండేం. యేదో స్నేహితులంగనక అన్నాను. (వెళ్లిపోవును.)

౪-వ రంగము

(ప్రైవేటు మాస్టరు ప్రవేశించును.)

చి— మాస్టరుగారండీ, యెప్పుడూ చదివిందే చదవ్వాలంటే విసుగ్గావుందండీ.

మాస్టరు—చదివిందే పదిమార్లు చదివితే ప్రశ్నలు వేస్తే సులభంగా జవాబు చెప్పచ్చును. లేకపోతే లాభంలేదండి ఎన్ని పుస్తకాలు చదివినా.

చి — అక్కర్లేదండి. మీ రడగండి జవాబు చెప్తానో లేదో.

మా—What lessons have you had lately?

చి—నిన్ననా. నీళ్లయొక్క ఉపయోగము గురించి. మంచూ, మంచుగడ్డా ఆ పాఠం కాదండి చదివాము.

మా—జవాబు ఇంగ్లీషులో చెప్పండి.

చి—నా కొచ్చుకాని యిప్పుడు చెప్పడానికి భయంగా వుందండి.

మా—పోనీండి, చిన్నప్రశ్న. What do you do with the milk.

చి—ఈపాఠం యింకా మీరు చెప్పలేదండి.

మా — రోజూ వాడుకుంటున్నాము కామండి. పాఠం కావాలండి. Do you drink Milk?

చి—Yes.

మా—ఇదైనా వాక్యం పూర్తిగా చెప్పండి.

What is she doing!

చి—ఆమా, పుట్టినే sitting అండీ.

మా — అదేమిటండీ, చిన్నపిల్లలు కూడ చెప్పగలరు.

చి—వాళ్లకి తప్పులొస్తాయన్న భయం లేదండీ.

మా—ప్రయత్నం చేయండి మరి. She is sitting down.

చి—ఆ.

మా—అనండీ మరి. She is sitting down.

చి — She is sitting down.

మా—to rest by the side of the road.

చి—to rest by the side of the road.

మా—Do you understand?

చి—అంత పెద్దమాటే.

మా—అందుకే పదిమాట్లు చదవమన్నాను. పోనీ, యిది చెప్పండి.

What do the people in your village do?



"మీ రేమయినా చెప్పండి......పుస్తకాలు చెప్పాలండి ......యేంలాభం లేదండీ!"

చి —మాస్టరుగారండీ, వున్నట్టుండి యీవాళ అడిగితే యేలా వస్తుందండి. ఇవ్వాళ కొత్తపుస్తకం మొదలెట్టమన్నా నని యీలా చేశారు కాని. మీరేమయినా చెప్పండి, యెలాగో ఒకల్లా కష్టపడి వచ్చే యేటికి స్కూల్ ఫైనల్ పరీక్షకి వెళ్లేలాగ గబగబ పుస్తకాలు చెప్పాలండీ. అంతేకానీ నాచేత రాదనిపిస్తే యేంలాభం లేదండీ. ఆ మీద మీయిష్టం.

మా —అమ్మా, మీ జీతానికీ మీకూ ఒక దండం. నా వల్లకాదు. ఇంతకంటె యెవ రయినా చెప్పేలావుంటె, అలాగే చేయండి. మంచినీళ్లు కావండి గ్లాసులో పోసి తాగిం చేందుకి, కష్టపడితేనే కాని రాదు. నోరు మెదల్పకుండ, పాఠాలు వల్లించకుండ పుస్తకాలు గబగబ యెల్లా అవుతుందో నాకు తెలియదండి. ఇదో శలవు. (వెళ్లిపోవును.)

చి —అల్లా చేతకాదని వెళ్లిపొండి. అంతేకానీ నేనేమొ మొద్దునుగాను.

---

## శాంతి

కపిస్థలం శ్రీరంగాచారి

ఈమూగేటి తమములో
కూర్చుండు,
గూబలా
తలపోతతో......
దేవులాడెద
మాయకొరకు:
అలభ్యము,
అలౌకికము,
అగు
మాయకొరకు—
దేవులాడెద
శాంతికొరకు.
శాంతి !

ఏడ ?—
శూన్యలోకాలలో,
శూన్యజీవాలలో,
ఏమో !
కాని,
ఈడ ?—
పులుగుల కలకల,
పశువుల అరపులు—
మాటుమణగిన మసకచీకటి.
గలగలని కాలువలు,
గర్జించు సెలయేళ్లు—
మూగవెన్నెలబయలునీళ్లు.

ఉఱుములు,
మెఱుములు,
తిరుగుసుడిగుండములు,
మ్రింగు పెనుచీకటులు—
కలత వెలియగ, వెలుగుపొడుగు
ఈడ,
దానినీడ
వచ్చును,
పోవును......
ఆమూగేటి నీడలో
నిద్రింతు,
పాపలా
చిరునవ్వుతో.

---




"ఓహో ! ఏమి బావా ! కాళ్ళవైపు తలపెట్టుకొని పడుకున్నావు ?"
"అదాసంగతి ? తలనొవ్వవలసినది కదా, కాళ్లెందుకు నొస్తున్నాయి చెప్మా అని అనుకుంటున్నాను."

# సు వ ర్ణ ము

'కుమారదేవ'

నీ వరకాంతి యెప్పుడును నీటును బాయని దంచు నింక నా
నావిషయంబులన్ మిగుల నల్వు గడించెద వీ వటంచు నెం
తో వెల నీకొసంగి రిఁక త్రోచెదు చాయను మించి లోకమున్
వాఁడిరి మోహపెట్టుచును పర్వవె యెంతును నోసువర్ణమా!

వన్నియ మించె నంచు గుణభంగి చెలంగె నటంచు నెందునన్
జెన్నుగ నెవ్వరేనియును నిన్నొగి మన్ననసేతు రంచు ని
ట్లన్నిరకాల సొంపులను నందినమేటి నటంచు భూస్థలిన్
మన్నను మిన్న గానక చనన్ గర మొప్పునొకో సువర్ణమా!

పెద్దది నాదు వర్ణ మని వెక్కసమా గరువంబు నూనియున్
బెద్దగొనంబు నున్నయయి పిన్నలపెద్దల తారతమ్యమున్
సుద్దిఘు లేక వర్ణ మది నూల్కొననట్టి రకాలఁ జేర నీ
ముద్దగు పెద్దవర్ణ మది మూలలల కేగదొకో సువర్ణమా!

పెద్దింటం బొడమంగనే సరియె యాపెద్దింటికిం దగ్గ యం
చద్దివ్యన్మహనీయతాగరిమ పూజ్యం బైన నీకెందునుం
గద్దా గౌరవ? మొక్కమాట వినుమా క్రాలంగ సౌస్థిర్య మే
కొద్దో గొప్పయొ లేక మేల్గొనము నీకున్ సున్న యోస్వర్ణమా!

పాపంబుల్ బెడఁబాపఁ జాలు దని దీప్యత్సౌఖ్యముం గూర్తు వం
చేపారందగు తేజు నెన్నటికి నింతేనిన్ విడంబోవ నం
చాపంజాలని పేర్మి నీపయిని జెన్నారంగ నౌవారు, నీ
చాపల్యంబు నహో సువర్ణమ! కనంజాలర్గదా కాంచియున్.

పెద్దది వర్ణ మంచు మది వెక్కసమా గరువంబు నీకు నీ
వెద్దెసఁ జూపుకొన్న నది యెడ్డతనం బగుఁగాని పైనివా
ర్పెద్దయటందు రేని యది పెద్దఱికం బగు నీవె చూపినన్
గ్రద్దఱికంబు గాదె యిది కాదనువా రెవ రోసువర్ణమా!

వన్నియ పెద్ద దంచుఁ బలుభంగుల నిక్కల నిక్కుచుందు, వో
యన్న! పదాఱుపాటులను బర్వియు నీ కది వహ్నిసంగతిన్
గ్రన్ననఁ గ్రగ్గె వన్నియరకంబుల నన్నిఁటి నిల్పవేని నీ
కున్న మహోవిలాసములు నొక్కఁడొకండె దిగున్ సువర్ణమా!

పుట్టిననాఁటనుండి, కడుఁ బున్నెపువన్నియఁ గల్గియుంటి నం
చెట్టు వచింతు? వీభువి రహించిన బల్మలలందు నీవునుఱ
జట్టుననేకదా మనుట? చాలఁగ వహ్నితపంబుచేసి నీ
కిట్టి పవిత్రరూపము ఘటింపఁగఁజేసె, నిఁకిప్డు డీవు బల్
మిట్టిపడంగనౌనె? కడిమిఱ దగతేజున వహ్నికంటె నా
గట్టితనంబు హెచ్చనినఁ గాదనరే నిను నోసువర్ణమా!

వగలఱ మానఁగదే సువర్ణము! పదార్థాటుల్ పయిన్మించ నీ
కగునే వన్నెయు వాసియుఱ బయిని వర్ణావాప్తికిఱ నీకు నే
[౧]పగడాలో [౨]జగడాలు గూర్చు నని సంభావింతువేకాని యా
పగడాలం [౩]జగడాలు పుట్టు నని సంభావింతె యోస్వర్ణమా!

భానుఁడు వేతెఱంగులను బర్వు రుచిం దగువానిపైఁ బృహ
ద్భానుఁడు మించు నయ్యతని భానుపటుత్వముకన్న నీదు తే
జే నయ మంచు రేఁగకుము తెంపఱివై యెలదీప్తి; దానిచే
నీనెఱి యెల్ల బూదియయి నీవు తినంబడు దో సువర్ణమా!

నీతొలిజీవితం బది, వనీగిరులందు శిలాప్రతానపుం
భాతి, మృగాళికన్నఁ గడు మడ్డిగ నుండెడి-దట్టి నిన్ను నే
దో తగువన్నె నీదుకడ నున్నదటంచు నెఱింగి వహ్ని యె
న్నో తఱు లెన్నొపాట్లు వడి యొప్పుగ మేల్పడునాఱువన్నె నీ
కా తెఱఁ గొప్పఁగూర్చె రహి యగ్గిదొ నీదొ యదో సువర్ణమా!

అగ్నికార్యమ్ము లేక వర్ణాధికతకు-జరగుబాటేదియేనియుఁ బరఁగునొక్కొ?
అట్టి యగ్గిచేరిక లేని దైనయెడల-నామరూపంబు లెవి సువర్ణంబ? నీకు!

కుండలమ్ములు మున్నగుమండనముల-తెఱఁగుగా నీకు నానావిధిఁ దగురూపు
లీయనలుచేతనే జనియించె నల్ల-గుణిని వహ్ని స్మఱితె పాతకుండ వగుచు!

ఉత్తముండవైయున్న నిన్నుత్తముండ-నందనరఁజేసె నయ్యగ్ని నల్వుగ నల
యుత్తమునెడఁ గృతఘ్నత నొంది మఱల-నుత్తమోండవె నీవుగాకుండె పైఁడి!

పగడాలం [౪]జగడాలు నీ కెసఁగు వహ్వాయంచు నెల్లప్డు డా
పగడాల్డాల్గన రాగిఁ జేరితివె? యేవారుఱ మది ప్రాగ మొ
ప్పఁగలా, ర్వారికి ద్వేష ముంట నిజ మీపా టొప్పు నీకుఱ మఱా
పగడాలుం జగడాలు గూర్చునను భావం బుండు, నోస్వర్ణమా!

౧. పగడములు. ౨. మంచివన్నె. ౩. కలహములు. ౪. మంచికాంతి.

పగడా ల్సేరెను చెంతఁగాని యవి నీభావైక్యముం జెంద వ
ట్లుగ యత్నించినఁ గీలి తోడుపడఁ దాటోటుం దదీయంబు న
ల్లగఁ దేలున్ గనుకన్ ఘటించె నొకడాల్ రాగిన్ నినున్ జేర్చి బ
ల్వాగలన్ గుల్కఁగ నేల నీకు తగుభావం బీఁగ నోస్వర్ణమా!

భావం బెల్ల మృదుత్వ ముండెఁ దొలి నాస్వారస్య మెందేగె? నా
నావైకల్యములన్ రసాదృతిఁ జనంగాఁ జేయు మేల్కృత్తి యెం
దే వీడ్కోలును జెందె? రాగివలె నీదీవ్యత్ప్రభ ల్గూడ నెం
తో వైవర్ణ్యముఁ జెందె నిద్దియును భావ్యంబౌనె యోస్వర్ణమా!

బాగౌరీతిగనన్ సువర్ణము పదార్వన్నం గడింపన్ మహా
రోగంబుల్ హరియించు నిర్మలిన తాపూజ్యౌషధత్వంబునుం
దాఁ గాంచఁదగు నింక రత్నచయసాంగత్యంబు నత్యంతస
ద్యోగం బొప్పఁగఁ గాంచి సుస్థిరతరప్రోల్లాస మొందందగున్.

నీదగు పూర్వరీతి గమనింతువె యిప్పుడు నీవు మ్రోఁగ పన్
వాదము రిక్తసేయుదువె వాసనలేమి యెఱుంగవొక్కొ? నిన్
గా దన నేల? ధాత్రి కుపకారము సేయుదు; మానవాళికిన్
భేదము ఖేదమున్ మరణవేదన పాపము గూర్తు స్వర్ణమా!

కర్కశములగు శిలలతోఁ గలసిమెలసి-ఊరుపేర్లే కధోగతి నుంటి మంటఁ
గలిసి; యట్టి నీపైఁ గొంత కనికర మిడి-ఉద్ధరించిరి నిన్నార్యు లున్నతమతి.

గానము కొంతమైనఁ గనఁబడ నవ్వాని-కిలఁ బ్రచార మియ్యఁదలఁచి ప్రాణ
హానినైనఁ దుదకు నాత్మలో నెంచక-పరుల కుపకరింత్రు గురుజనములు.

విమలత గూర్చెను నీకుఁ బుటములను నీ నెచ్చెలులు పటాపంచలు గాన్
సమవాయమైన సంబంధముఁ బోఁగొట్టంగఁ గష్టతరము తలఁపుమా.

ఉజ్జ్వలత నీకుఁ గూర్ప ననూనశ్రద్ధఁ-దనదు తేజంబునుండి పిశునత లేక
పంచుకొన్నట్లుతోఁ పంగఁ బాటువడియె-నాశ్రితులపట్ల సుహృదాళియట్లకారె?

మోటుమొఱకుల సావాసమును వదల్చి- అగ్నిశుద్ధియు వన్నెయు నమరఁ జేసి
నీకు నొకరూపు గల్పించి నిన్నుఁ గొనుచు-నగరమునఁ జేర్చినార లానందమతిని.

---

భక్తకుచేల



కుచేలుడు

(శ్రీ కే. యస్. రామచంద్రరావుగారు)



ర. తాలీసాహెబు దేవాలయము



3. అమరకుండము-అగాధమయిన తీర్థము

'క్యూబ్' నగర దేవాలయములు (G. S. A.)

('క్యాబ్' నగరము పంజాబునం దున్నది.)

# గణిత చిహ్నములు

కప్పా ప్రసన్నాంజనేయులు

బుద్ధిమంతు లనేకశాస్త్రములయందు సాము చేసి వినోదింతురు. మానవబుద్ధియొక్క కృషి ఫలితములగు శాస్త్రములన్నిటియందును గణితశాస్త్రము మిక్కిలి యథార్థమైనది. బుద్ధిసాధన మీశాస్త్రము నందు గలుగునంత మరి యే శాస్త్రమునను జరుగదు. గణితము నభ్యసించుటకు వివేచనాశక్తి యత్యవసరము. గణిత మనగా వివేచన యని యర్థము. స్థూలబుద్ధిచే సామాన్యముగ గ్రహింపబడు నొక సముదాయమున వివేచనగల సూక్ష్మబుద్ధి యనేక విశేషములను గ్రహించగలుగుచున్నది. ఇట్టి విశేషములయొక్క పరస్పరాపేక్షారూప మగు బుద్ధివ్యాపారమే సంఖ్య. పట్టెడు గోలీకాయలు, కట్టెడు పెనసలు తుంపులు అని స్థూలబుద్ధిచే గ్రహింపబడు సముదాయముల వివేచనాశక్తిగల సూక్ష్మబుద్ధి పదునైదు గోలీకాయలు, పండ్రెండు పెనసళ్లుగా గ్రహించుచున్నది.

పదార్థములయం దపేక్షాబుద్ధిచే గల్గు సంఖ్యా వ్యాపారములు సాధారణముగా నాలుగువిధములుగా నున్నవి. ఇవి సంకలన మనియు, వ్యవకలన మనియు, గుణకార మనియు, భాగహార మనియు జెప్పబడును. ఇందు సంకలనమనగా ననేకసముదాయముల యవయవ వ్యక్తుల నొకసముదాయముయొక్క యవయవములుగా వివక్షచేయుట. ఉదాహరణము:— నాలుగుపదార్థము లొక సముదాయముగా నున్నవనుకొందము. ఆ సముదాయమునందలి యవయవముల పృథగ్వివక్ష చేయబడి నప్పుడు దానియం దొకటి యనుసంఖ్య గలుగుచున్నది. అవయవముల పృథగ్వివక్ష చేయబడినచో నాలుగనెడు సంఖ్య గలుగుచున్నది. ఈసంఖ్యను మనము ౪ అను నంకముచే దెలుపుదుము. ఇట్లే ౫, ౬, మొదలగునంకము లైదు, ఆరు, అవయవములుగల సముదాయముయొక్క యవయవసాపేక్షను దెలుపుచున్నవి. ఈ మూడుసముదాయములను కలిపి యొకసముదాయముగా వివక్షచేసినచో నది సంకలన మనబడును. ౪, ౫, ౬, అవయవములుగల సముదాయము లొక్కసముదాయముగా నేర్పడినప్పుడు మొత్తము సముదాయమునందు ౧౫ అవయవము లుండునుగదా ! ఇట్టివివక్ష చేయుటయే సంకలనము, లేక కూడిక యనబడును. (వ్యు. సంభూయ కలనమ్ = కలిపి వివక్షచేయుట.)

సంకలనమును లిపిచే దెలుపుటకు పాశ్చాత్య సంప్రదాయమున + యను చిహ్నమును వినియోగింతురు. దీనిని ప్లస్ (**Plus**) అని పిలుతురు. పైన తెలుపబడిన సంకలనము ౪ + ౫ + ౬ అని లిఖింపబడును. దీనిని చదువుట నాలుగు ప్లస్ ఐదు ప్లస్ ఆరు అని ప్రస్తుతవ్యవహారమునందు ప్రామాణికముగ గ్రహింపబడుచున్నది.

ఈపాఠము పాశ్చాత్య వ్యవహారము యొక్క సాక్షాదనుకరణమే గాని మనదేశభాషలయం దెట్టియర్థమునుగాని స్ఫురింపజేయదు. భారతీయు లిట్టి యవ్యక్తానుకరణమును జేయుట కామధేనువు గద్దికై పరులను యాచించునట్లుండును. మన కన్నతల్లి యగు భారతీదేవియొక్క భాష యపారమైనది. అం దెవిధ మగు కొరతయు లేదు. సంస్కృత వాఙ్మయము యొక్క స్వరూపస్వభావములను పూర్తిగ నరయకుండుటచే మన సోదరులు కొందరు పాశ్చాత్యవ్యవహారములనే ఇప్పటికిని వాడుచున్నారు. దేశకాలముల ననుసరించి భిన్న భిన్న సభ్యతలకు సమావేశము జరుగునప్పుడు పరిభాషానుకరణము ననివార్యము లని కొందరు తలతురు. కాని ఇట్టి యనుకరణములు (రూఢిసంజ్ఞలయందు) కొంతవరకవసరమైనను యౌగికములగు సంజ్ఞలయం దుపయోగకరములు గావు. యౌగికసంజ్ఞల దేశభాషలయందే యేర్పరుచుకొనుటచే గొప్పలాఘవములుగూడ గలవు. అప్రస్తుతమైనను ప్రాముఖ్యమగుటచే నీ విషయమును కొంత చర్చింతము. ఒకపదముచే నొకయర్థము తెలుపబడుటకు

శాస్త్రకారులీ క్రిందినియమముల జెప్పియున్నారు. "శక్తిగ్రహం వ్యాకరణోపమానకోశాప్త వాక్యా ద్వ్యవహార తశ్చ, వాక్యస్య శేషా ద్వివృతే ర్వదన్తి సాన్నిధ్యతః సిద్ధపదస్య వృద్ధాః." రూఢసంజ్ఞల యర్థబోధయందు లోకవ్యవహారము, నిఘంటువులు, ఆప్త వాక్యములు మొదలగునవి నియామకములు. అందుచేత నివి స్వతః ప్రకాశకములు గావు. ఇవి తమయర్థములను మూగవాడు తనయభిప్రాయమును చేష్టామాత్రముచే దెలిపినట్లు తెలుపును. కోశకారులయొక్క బలాత్కారముచేత గాని, లోకవ్యవహారము యొక్క బందసత్తుచేత గాని యవి యర్థస్ఫూర్తిని గలుగజేయుచున్నవి. యౌగిక శబ్దము లిట్లస్వతంత్రము లయినవి గావు. అవి స్వతఃప్రకాశకములు. వీనికి తమయర్థములతో స్ఫుటమగు సంబంధము కలదు. వీని యర్థబోధయందు వ్యవహారమే గాక వ్యాకరణశాస్త్రము గూడ నియామకము. శాస్త్రముచే నియమింపబడి యీపదముల యవయవార్థములు విశిష్టార్థమున సమన్వయించుచుండును. అందుచే వీనిని వినినతోడనే వాని యర్థములయందలి విశేషములు తమంతటతామే స్ఫురించుచుండును.

ఇట్టి యౌగికసంజ్ఞాకరణము వ్యుత్పన్నములగు భాషలయందే సాధ్యమగుచున్నది; గాని యవ్యుత్పన్న భాషలయందు సాధ్యముగాదు. హిందూదేశమున విస్తారముగ వాడబడు చట్నీయను పదమున కొకవిధమగు భక్ష్యపదార్థ మర్థము. ఇట్టి భక్ష్యపదార్థ మాంగ్లదేశమున నప్రసిద్ధమగుటచే దానిని తెలుపగల రూఢపదమేదియు నాంగ్లభాషయందు లేదు. అందుచే నాంగ్లేయులు పచ్చడియను వస్తువును తెలుపవలసివచ్చినప్పుడు చట్నీయను పదమునే యనుకరించుచున్నారు. ఆంగ్లభాష వ్యుత్పన్నమైయుండినచో నాంగ్లేయులు మన భాషయందలి చట్నీయను పదముయొక్క వ్యుత్పత్తిని (చరభక్షణే యనుధాతువుకంటెైన ప్రత్యయము) గమనించి, దానియందలి ప్రకృతిప్రత్యయములకు తుల్యార్థకములగు స్వభాషా ప్రకృతిప్రత్యయముల సంపుటీకరణముచే తమకు సుబోధకమగు సంజ్ఞను కల్పించుకొని యుండెడివారు. ప్రపంచమున సువ్యుత్పన్నములగు భాషలు రెండుమాత్రమే గోచరించుచున్నవి. అవి సంస్కృతము, లాటిన్. ఈభాషలయందు ధాతువులనుండి శబ్దనిష్పత్తిచేయు సంప్రదాయము గలదు. అందును సంస్కృతమునందు శబ్దనిష్పత్తిక్రమము మిక్కిలియు వ్యక్తముగా నున్నది. ప్రతిప్రాతిపదికయందును - నొక ధాతువుతో కొన్ని ప్రత్యయములు చేరియున్నవి. ధాతువుల యర్థములును, ప్రత్యయముల యర్థములును, వాని సంయోజనాపద్ధతులును శాస్త్రముచే వివరింపబడినవి. ఇట్లర్థనిర్ణయముచేయబడిన ధాతువులు, ప్రత్యయములు వేలసంఖ్య గలిగియున్నవి. వీని సంయోజనముచే సాహిత్యమున ప్రస్తుతము వాడబడియున్న పదములుగాక క్రొత్తపదములను కల్పించుటకుగూడ సాధ్యమగుచున్నది. ప్రకృతమున పాశ్చాత్యశాస్త్రీయ సంకేతములు మన భాషలయం దప్రసిద్ధములైయున్నను, ఆంగ్లేయులు చట్నీ పదమునువలె మనము శబ్దానుకరణముచేయనవసరము లేదు. మనము తగిన యౌగికపదములను మనభాషయందే సృష్టించుకొనవచ్చును.

ఇక ప్లస్‌చిహ్నము పైపునకు మనదృష్టిని మరలింతము. దీనిని మనము సంకలన చిహ్నమనియు, ఆయచిహ్నమనియు వ్యవహరించగలము. సంకేతపదముయొక్క వ్యుత్పత్తి వెనుక చెప్పబడియున్నది. దీని యర్థము ఆయశబ్దముచేతను బాగుగ తెలుపబడును. ౪ + ౫ + ౬ యను లెక్కను మన మెట్లు చదువ వలయునో విచారింతము. ఈలెక్కయందు మూడు సంఖ్యలయొక్క సహవివక్ష తెలుపబడుచున్నది. భారత భాషలయందు సహవివక్ష తృతీయా విభక్తిప్రత్యయములచే దెలుపబడును. ('సహయోగే తృతీయా' యని కారకసూత్రము). కాబట్టి + అను ఆయచిహ్నమును చదువుటకు మనము తృతీయావిభక్తి ప్రత్యయములను వాడవచ్చును. ఎట్లనగా, నాంధ్రమున 'తో' యనియు హిందీయందు 'సే,' యనియు ప్రయోగము లుచ్చరించుటకు సరళముగా నుండును. పైగణితమును :— నాలుగుతో నైదుతో నారు అని చదువవచ్చును. లేక సముచ్చయద్యోతకములగు నవ్యయముల గొన్నిటిని ప్రయోగింప సాధ్యమగుచున్నది. ఎట్లన :—

నాలుగు మరియు నైదు మరియు నారు ;
నాలుగును నైదును నారు ;

సంస్కృత పరిభాష నుపయోగించి యీక్రింది విధములుగా బలుకవచ్చును :—

నాలుగు సహ ఐదు సహ ఆరు ;
నాలుగు సమ్ ఐదు సమ్ ఆరు ;
నాలుగు చ ఐదు చ ఆరు ;

ఈపాఠములయందలి లాఘవగౌరవముల పాఠక ప్రవరులు విచారింతురుగాక !

గణితవ్యాపారములయందు రెండవది వ్యవకలనము. వ్యవకలనమనగా గొన్ని యవయవములుగల సముదాయమునుండి యా యవయవములలోనుండి కొన్ని విడిపోయిన వని వివక్షచేయుట. దీనిని కారకవిచారమునందు 'అపాయ'మందురు. "ధ్రువ మపాయేఽపాదానమ్" అని సూత్రకారులు నిర్వచించియున్నారు. 'అపాదానే పంచమీ' యనుసూత్రమునుబట్టి యపాయమును తెల్పుటకు పంచమీ విభక్తి ప్రత్యయములు విధింపబడుచున్నవి. నాలుగవయవములుగల సముదాయముయొక్క యొక యవయవము విడిపోయిన దని వివక్షచేయబడినచో నీవ్యాపారము లిపిచే నిట్లు తెలుపబడుచున్నది :— ౪−౧. ఈ గణిత మాంగ్లానుకరణముచే నిట్లు చదువబడుచున్నది. నాలుగు మైనస్ ఒకటి. మైనస్ అనబడు—చిహ్నమును మన మపాయ చిహ్నమనగలము. (ఆయము × అపాయము). కారకసూత్రమునుబట్టి ౪ ధ్రువ మనబడును, ౧ అపేయము లేక హేయ మనబడును. ౪−౧ యనులెక్క నిట్లు చదువవచ్చును :— నాలుగునుండి యొకటి.

అపాయార్థకములగు నవ్యయములను వినియోగించి యిట్లు చదువవచ్చును:—

నాలుగు వినా ఒకటి;

నాలుగు అప ఒకటి;

నాలుగు నిర్ ఒకటి.

ఇక గుణకారమునుగురించి విచారింతము. గుణకార మనగా సమానసంఖ్యగల యనేకసముదాయముల యవయవముల నొక్క సముదాయము యొక్క యవయవములుగా వివక్షచేయుట. ఈనిర్వచనము సంకలనముయొక్క నిర్వచనమునకు ప్రతియైయున్నది. యథార్థమున గుణకారము సంకలనముయొక్క ప్రత్యాహారము. సంకలనముకంటె గుణకారమునందలి విశేష మేమన నిందలి సముదాయము లన్నియు సమానసంఖ్య గలిగియున్నవి. అందుచే సంకలనమునందువలె గుణకారమునందు ప్రత్యేకముగా ప్రతిసముదాయముయొక్క యవయవవ్యక్తుల వివేచన చేయబడుటలేదు. ఒకసముదాయముయొక్క యవయవ సంఖ్యయు, సముదాయముల సంఖ్యయు తెలియుటచే గుణకారము సాధ్యమగుచున్నది. ఇందు మొదటిసంఖ్య వ్యాయసంఖ్యయనియు, రెండవసంఖ్య పర్యాయసంఖ్య యనియు చెప్పబడును. ('వ్యష్టే రాయః వ్యాయః' అనగా సముదాయ వ్యష్టియొక్క సంఖ్య. పర్యాయశబ్ద మావృత్తియందు ప్రసిద్ధము. (నాలుగేసి యవయవములు గల సముదాయములు ఆరు వివక్షచేయబడి యొక్క సముదాయముగా నెంచబడినచో నీవ్యాపారము నిట్లు లిఖించవలెను: ౬ + ౬ + ౬ + ౬. ఇది సంకలనము. ఈవ్యాపారమునే మరియొక విధమున వివక్షజేయవచ్చును. ఎట్లన: ఆరవయవములుగల తుల్య సముదాయములు నాలుగు పర్యాయములు గ్రహింపబడినవి. ఇట్టివివక్ష గుణకార మనబడును. దీని నిట్లు లిఖింతురు: ౪ × ౬. ఇది నెమకటి సంకలనము యొక్క ప్రత్యాహారము. అనగా సంకలనమే లఘుమార్గమున సూచింపబడినది. సముదాయముల యావృత్తిచే వానియందు పర్యాయసంఖ్య యనెడిగుణ మేర్పడుటచే దీనిని గుణకార మనుచున్నారు. ప్రాతిపదికార్థముయొక్క యావృత్తిచే గలుగుసంఖ్య ప్రథమా బహువచనముచే తెలుపబడును. (ప్రాతిపదికార్థ ... ... వచనమాత్రే ప్రథమా. బహుషు బహువచనమ్. అని కారకసూత్రములు). కాబట్టి పైగణితము నీ క్రిందివిధమున చదువవలెను:

ఆరు నాలుగులు;

లేఖనక్రమము ననుసరించి యిట్లు చదువవచ్చును:
నాలుగులు ఆరు.

సర్వసాధారణముగ షష్ఠీవిభక్తి నుపయోగించి యిట్లు చదువవచ్చును:

నాలుగుయొక్క ఆరు; (ఆవృత్తులు అని అధ్యాహార్యము).

పర్యాయవాచకములగు నవ్యయములను, ఇతర పదములను వినియోగించి యీ క్రిందివిధములుగా చదువవచ్చును :—

నాలుగుసార్లు ఆరు; (సార్లు లేక తడవలు లేక పర్యాయము లనవచ్చును.)

నాలుగురెట్లు ఆరు;
నాలుగు పరి ఆరు.

ఆంగ్లానుకరణముచే నిట్లు చదువుచున్నారు:—
నాలుగు ఇంటు ఆరు.

'ఇంటు' అనుపదము గుణనవ్యాపారము నెంతగా తెలుపగలదో విమర్శింపబడవలసియున్నది.

నాల్గవగణితవ్యాపారము భాగహారము. భాగహారమనగా, గొన్నియవయవములు గల సముదాయమునుండు

కొన్ని సమానసముదాయములను వివక్షచేయుట. భాగహారము గుణకారమునకు సరిగా వ్యతిరేకమను వ్యాపారము. గుణకారమునం దొకసంఖ్యయొక్క పర్యాప్తి (పర్యాయగ్రహణము) వివక్షచేయబడెను. భాగహారమునం దొకసంఖ్యయొక్క యవాప్తి (అవాంతరవ్యాప్తి గ్రహణము) వివక్షితమగును. గుణకారమున నొకసంఖ్యయొక్క పర్యాప్తిచే నంతకంటె నుత్తమసంఖ్య యేర్పడెను. భాగహారమున నొకసంఖ్యయొక్క యవాప్తిచే నంతకంటె నీచసంఖ్య యేర్పడును. కాన నొక యుత్తమసంఖ్య సమానవ్యాయములుగా విభజింపబడి నీచసంఖ్యగా పరిణమించుట యవాప్తియనియు, నొక నీచసంఖ్య కొన్నిపర్యాయము లావృత్తమై యుత్తమ సంఖ్యగా పరిణమించుట పర్యాప్తి యనియు నిర్వచింపబడుచున్నది.

వెనుకటియుదాహరణమునందు పర్యాప్తసంఖ్య యగు ౨౪ లో, ఆరుభాగములు వివక్షచేయబడిన వనుకొనుము. ఒక్కొక్కభాగమున ౪ అవయవము లుండును. ఇందు ౬ అవాప్తిసంఖ్య యనియు, ౪ వ్యాయసంఖ్య యనియు, ౨౪ అధికరణసంఖ్య యనియు జెప్పబడును. ఈవ్యాపారము ౨౪ ÷ ౬, లేక ౨౪/౬, అని లిఖించబడుచున్నది. దీని నాంగ్లానుకరణముచే నిరువదినాలుగు డివైడెడ్ బై ఆరు, అని చదువుదురు. మన భాషలయం దెట్లు చదువవలయునో విచారింతము.

భాగహారమున నాధేయాధికరణ సంబంధము వివక్షచేయబడుచున్నది. ఈసంబంధము కారకవిచారమునందు సప్తమీవిభక్తిచే తెలుపబడుచున్నది. (సప్తమ్యధికరణేచ యని సూత్రము.) అందుచే పైగణితమును చదువుటకు మనము సప్తమీవిభక్తి ప్రత్యయముల నుపయోగించవలెను. ఎట్లన:—

ఇరువదినాలుగునందు ఆరు;
ఇరువదినాలుగులో ఆరు;
ఇరువదినాలుగు న ఆరు.

అవ్యయముల నుపయోగించి యిట్లు చదువవచ్చును:—

ఇరువదినాలుగు అంతః ఆరు
ఇరువదినాలుగు అవ ఆరు.

ఇంతవరకు ప్రతిపాదింపబడిన విషయము లీ క్రిందిప్రణాళికయందు సంగ్రహింపబడుచున్నవి:—

| వ్యాపారము | చిహ్నము | అంకలిపి | పాఠములు |
|---|---|---|---|
| ౧. సంకలనము | + యుక్తిచి. లేక ఆయచి. | ౪ + ౫ | నాలుగు ప్లస్ ఐదు (ఆంగ్లానుకరణము)<br>నాలుగు సమ్ ఐదు, నాలుగుసహ ఐదు, నాలుగు చ ఐదు. (సంస్కృత ప్రయోగములు)<br>నాలుగు మరియు నైదు, నాలుగు యును నైదు, నాలుగు ను నైదు, నాలుగుతో నైదు (తెలుగుపలుకుబడి) |
| ౨. వ్యవకలనము | — అపాయ చి. | ౪ — ౧ | నాలుగు మైనస్ ఒకటి. (ఆంగ్లానుకరణము)<br>నాలుగు వినా ఒకటి, నాలుగు అప ఒకటి, నాలుగు నిర్ ఒకటి. (సంస్కృతప్రయోగములు)<br>నాలుగు నుండి ఒకటి - తెలుగు పలుకు. |
| 3. గుణకారము | × పర్యాయ చి. లేక గుణ చి. | ౪ × ౬ | నాలుగు ఇంటు ఆరు(ఆంగ్లానుకరణము)<br>నాలుగు పరి ఆరు- (సంస్కృతప్రయోగము)<br>నాలుగు లు ఆరు, నాలుగు యొక్క ఆరు, నాలుగు సార్లు ఆరు, నాలుగు రెట్లు ఆరు. (తెలుగుపలుకుబడి) |
| ౪. భాగహారము | ÷ వ్యాయ చి. లేక హారచి. | ౨౪ ÷ ౬ | ఇరువదినాలుగు డివైడెడ్ బై ఆరు(ఆంగ్లానుకరణము)<br>ఇరువది నాలుగు అవ ఆరు(సంస్కృతప్రయోగము)<br>ఇరువదినాలుగు లో ఆరు, ఇరువదినాలుగు నందు ఆరు, ఇరువదినాలుగు న ఆరు. (తెలుగుపలుకుబడి) |

పై పాఠములయందు వ్యవహార లాఘవమును బట్టియు, బోధకసౌలభ్యమునుబట్టియు గల తారతమ్యములను బాఠకప్రవరులు విమర్శింతురుగాక. ఆంధ్రసోదరుల యాభిముఖ్యము ననుసరించి యితరగణితచిహ్నముల నుత్తరోత్తరవ్యాసములయందు విచారించగలము.

# ప్రాచీనుల సస్యభంగ నివారణోపాయములు

తేకుమళ్ల రామచంద్రరావు

## కృషీవలుని నిరాధారస్థితి

పురాతనకాలమునందేమి, ఆధునిక కాలమునందేమి వ్యవసాయముచేయుటలో కృషీవలుల కష్టనష్టము లనేకములు. వారి నిరంతర కృషివలన వారికి చాల మేలు గలుగుచున్నను, వారి చేతులలో లేనట్టియు, ఎట్టి ప్రయత్నమువలనను ఆపజాల నట్టియు విశేషము లనేకములు సంభవించుచున్నవి. వీనిలో చాల సంభవములు దైవికములనియు, రాజకీయములనియు నన బడుచున్నవి. రైతు తానెంతకష్టపడి పంట పండించినను అకస్మాత్తుగ నేదోయొక వరదవచ్చియో, దేశమువిూదికి యుద్ధమువచ్చియో, మరి యేకారణము వలననో రైతులకు కూడరాని నష్టము సంభవించు చుండును.

ఈ దైవిక రాజకీయము లనబడు సంభవములను మనము చాలభాగము ముందుగ కనిపెట్టలేము. కొన్ని కనిపెట్టి తగు ప్రయత్నముల వలన నరికట్టగలిగినను చాల వఱకు దైవిక రాజకీయములను మన మరికట్ట జాలము. ప్రపంచ రంగమున నాగరకత యభివృద్ధి యగుటవలనను, శాస్త్ర పరిశోధనల వలనను పైరులకు గలుగు కొన్ని జాడ్యములను మన ముపసంహరింప గలుగుచున్నాము; కుదుర్ప గలుగుచున్నాము. పంటలను పాడుచేయు పురుగులను, జంతువులను రాకుండ కొన్ని సదుపాయములను చేసికొన గలుగుచున్నాము. అన్ని విషయములందును పెద్దపెద్ద యంగలతో నాగరికత వడివడిగ నడచుచున్నను' శాస్త్రజ్ఞానాభివృద్ధి విస్తరించు చున్నను, ఈ విషయమున మాత్రము మనము ప్రకృతి నింకను జయించినారమని చెప్పదగిన స్థితిలో లేము. కావుననే యిప్పటికిని అన్ని దేశములందును వ్యవసాయదారులు చాలవఱకు భగవంతునిమీదనే భారమువైచి కృషి సలుపుచున్నారు.

నేటిస్థితియే—ఈ యిరువదవ శతాబ్దమునందలి స్థితియే—యిట్లుండ మానవుని వ్యవసాయ జీవితారంభ కాలమునను, అప్పటినుండి నేటివఱకును, దేవునిపైన రెంతభార ముంచెనో పాఠకులే యూహించుకొన గలరు. నేను వ్రాసిన 'ధాన్యదేవతారాధన' మను వ్యాసమునందీపత్రికాముఖమున పాఠక లోకమునకు దెలియ బరచిన ప్రకారము కృషీవలుని కృషిని మనము రెండు భాగములుగ భాగించవచ్చును. ఇందు మొదటిది: పంట పండించుట; రెండవది: పంటను ఎలుకలు, చుంచులు, పందికొక్కులు, ముంగిసలు, పిట్టలు, మిడుతలు, కంబళి పురుగులు, చీమలు, 'నూనూ' లు, పిచ్చుకలు, కొన్ని రకముల ఈగలు, కొన్నిరకముల చిమటలు వగైరాల బారినుండి తప్పించుట. ఇందు మొదటివిషయమును గూర్చి వ్రాయుచు ప్రాచీనుల వలంబించిన దేవతారాధనాదులను గూర్చి పైన పేర్కొనబడిన వ్యాసమున జర్చించి యుంటిని. రెండవ విషయమునుగూర్చి ప్రాచీను లెట్టిపద్ధతుల నవలంబించిరో, ఒక దశనుండి మఱియొక దశకు వారి యూహాపోహలు, వారి యాచార వ్యవహారములు, ఏయేరీతుల 'అభివృద్ధి' చెందినవో యీ వ్యాసమున చదువరులకు దెలుప బూనుకొంటిని.

## క్రౌర్యము—మార్దవము

తాను కష్టపడి, చెమటయోర్చి, కుటుంబ పోషణకు గావలసిన పైరులను పండించుకొనుచు కాలము జరుపుకొనుచుండిన ప్రాచీనకాలపు రైతు పైనపేర్కొనబడిన దుష్టకీటకాదుల కారణమున పంటను గోల్పోయి తానును తన యావత్తు కుటుంబమును మలమల మాడి పోవలసిన స్థితి యేర్పడినప్పు డేమిచేయును? ఆ కీటకములయెడ సహనభావమును, సోదర భావమును గౌరవ భావమును ప్రకటించునా? లేక కనపడిన ప్రతి కీటకమును, ప్రతిజంతువును వెదకి వెదకి చంపివేయునా? ఈ

ప్రశ్నకు జవాబు చెప్పుట కష్టముకాదు. డార్విన్—సిద్ధాంతము ప్రకారము క్రూరస్వభావముగల జంతువులు తల్లిదండ్రులుగ పుట్టినవారుగదా ప్రప్రథములగు మానవులు? మానవ శాస్త్రమును పరిశీలించుచో గూడ మానవుని చరిత్రయొక్క శైశవ దశా చరిత్రమున విస్ఫుటాక్షరములతో లిఖింపబడిన ముఖ్యవిషయము మానవుని క్రూరత్వము మానవుడభివృద్ధి యయినకొలది నాగరకత యలవడినకొలది కొంచెము కొంచెముగా క్రూరత్వము తొలగితొలగి మృదుత్వము, సహనము మానవుని హృదయమునం దేర్పడి, వికాసమునందుచుండును. ఇది మానవశాస్త్రకారు లెల్లరకును దెలిసినవిషయము. కావున పైన చెప్పబడిన పరిస్థితులలోని రైతు క్రూరత్వమునే ప్రదర్శించి యుండుననుట నిస్సందేహము.

కాని, యీ విషయమున పాఠకుల కొక్క సందేహము గలుగవచ్చును. మానవుడు మొట్టమొదట అరణ్యములం దేచెట్టుకొమ్మలమీదనో నివసించుచూ వన్యమృగాదులను వేటాడుచు కాలముగడిపెడువాడే యైనను, రానురాను కొలదిగ కొలదిగ నాగరకతాభివృద్ధి నందినవాడై వేటనుండి ఆవులు, మేకలు మొదలగు జంతువులను మేపుటయు, ఆస్థితినుండి నాగరకత మఱింతగ నభివృద్ధియైనవెనుక నొకచో సుదురుగ కూరుచుండి వ్యవసాయమును తలపెట్టినాడుగదా? కావున వ్యవసాయము తలపెట్టినప్పు డాతనికి మొట్టమొదటి క్రూరస్వభావము లేదు; ఇట్టి స్థితిలో క్రూరుడై జంతుహింస కొడిగట్టుకొనునా? దేవుడనియు దైవమనియు, దలచుచు సృష్టియందలి ప్రతి వస్తువునందును భగవంతునే చూచుచునుండిన ఆకాలపు మానవుడు బహుశః ఈ జంతువులు, ఈ కీటకములు, భగవంతుని పంపుననో పితృదేవతల పంపుననో వచ్చి తనపంటను ధ్వంసము చేయుచున్నవని తలంచునుగాని ఈ జంతువులను చంపునా? దేవతలకు మ్రొక్కుమనును, ఆరాధించును, ప్రార్థించును, కాని—చంపునా? ఈ ప్రశ్నలు మిక్కిలి సమంజసములైనవే. వీనికి జవాబేమనగా:—నాగరకతలో నప్పటికిని నేటికిని కోటాను కోటుల రెట్లు అభివృద్ధినందినామను కొనుచున్న మనలో—మనకాలపు ప్రజలలో—మానవుని సహజ క్రూరత్వము సమసి పోయినదా? సమసిపోవుస్థితిలో నున్నదా? లేదు. ఆ దుఃఖము, ఆ కోపము, ఆ యసహనము, అవన్నియు నాగరకతగల నేటిమానవునిలో మూర్తీభవించి యున్నవనుట సత్యము. కాబట్టి ప్రాచీనకాలపు మానవుడును గూడ తన పంటలకు వినాశకరములగు జీవరాసులను మట్టుపెట్టినవాడే యని నిశ్చయముగ మనము చెప్పవచ్చును.

## దైవచింత

ప్రాచీనకాలపు రైతు జీవరాసులను మట్టుపెట్టుటతో నాగిపోలేదు. ఆతనికి దైవచింత, దేవునియందు భక్తి విశ్వాసములు గలవు. అందువలన జీవరాసులను చంపుటతోపాటు కొన్ని ఆశ్చర్యకరములగు విధానముల నాత డవలంబించుచు వచ్చెను. ప్రకృతిని చూచియు, భగవత్సృష్టిని చూచియు నాతడు భయపడుచుండెను. కావున నిప్పుడు మనము పరిశీలించబోవు విశేషములం దన్నిటను గూడ ప్రాచీన కాలపు మానవుని మనస్సునందేయే యూహలు పొంగి పొరలుచుండెడివో యవన్నియు అద్దమునందలి ప్రతిబింబములవలె కనపడగలవు. ఒకప్రక్క పంటలకు శత్రువులగు కీటకాదులను నశింపచేయుట, వేఱొకప్రక్క వానిని బెదరగొట్టుట, మఱొకప్రక్క వానిని మంచిగనే సాగనంపుట ఇత్యాదులగు పనులను ప్రాచీనులు[1] చేయుచుండిరి. వీనినన్నిటిని మన మిప్పుడించుక పరిశీలింతము.

మొట్టమొదట పంటలకు కంటకములగు కీటకములను, జంతువులను గొప్పగచూచి, దానిని మర్యాదచే, మంచిచే బయటకు నడిపించజూచిన దేశజుల పద్ధతులను గూర్చి విచారింతము.

## సస్యశత్రు సంతృప్తి

ఐరోపాఖండమున ఎస్థోనియాయను నొక రాజ్యము గలదు. ఈ రాజ్యమునందలి రైతులు ఒక విషకీటకము

1. 'ప్రాచీనులు' 'ప్రాచీనకాలము' అనగా మన మెన్నివేల యేండ్లక్రిందటివో పోనక్కరలేదు ఇట్టి సంగతులు నాగరకతాభివృద్ధి గాంచితిమని నిక్కి నీల్గునట్టి ఐరోపాఖండాంతర్భాగములందు నిన్నమొన్నటివఱకే గాక నేడుగూడ ప్రబలియున్నవి.

తమ పంటలను ధ్వంసముచేయుటచే బాధపడుచుందురు. ఆ విషకీటకము వారిచేతికి చిక్కినచో దానిని చంపరు. దానికి కష్టము గలిగించినచో మఱల నది తమ కింతకన్న నధికముగ కష్టమును తెచ్చిపెట్టగలదని వారి యభిప్రాయము. అందువలన ఆ విషకీటకమును వారొకచిన్న గోతిలో బారవైచి మన్నుతో కప్పివేయుదురు. ఇట్లు చేసినచో ఆ విషకీటకములు తమకు హాని కలుగజేయవని వారి దృఢవిశ్వాసము.2

ఇట్లే కార్పేతియా పర్వత ప్రాంతనివాసులగు రైతులు ముంగిసలను చూచినచో వాని కాటువలన విషమెక్కునని నమ్ముదురు. కాని ఒక్క ముంగిసనైనను వారు చంపరు. చంపకుండుటయే గాక మీదుమిక్కిలి ముంగిసల పండుగనుగూడ వారుచేయుదురు. మన కనుముపండుగు నాడువలె ఆ పండుగనాడుగూడ పశువులను పనిచేయనీయరు, వారు పనిచేయరు. ఇందుకు తప్పినచో ముంగిసలు తమకు విశేషనష్టమును గలిగించునని వారి యభిప్రాయము.3

ఐరోపాఖండమునందే ట్రాన్సిల్వేనియా యను నొకభాగము కలదు. అచ్చట అనేకరకములగు పిచ్చుకలున్నవి. ఈపిచ్చుకలు ధాన్యము నిచ్చవచ్చినట్లు తిని పోవుచుండును. ఇందువలన రైతులకు నష్టము గలుగుచుండును. ఇట్టి నష్టము రాకుండ విత్తనములను జల్లు కాలమునందు రైతు మొట్టమొదట గుప్పెడు విత్తనములను తలమీదనుండి వెనుకగ జల్లును. ఈ గింజలు పిచ్చుకలకొఱకని రైతు పలుకును. ఆ పిమ్మట ఆకులను ధ్వంసముచేయు ఈగలవంటి చీడపురుగులకు గాను మూడు గుప్పెడుల ధాన్యమును ('ఓట్లు' అను ధాన్యమును) అన్నిదిశలను జల్లును. ఈ ట్రాన్సిల్వేనియాలోనే మఱొక పద్ధతికూడ కలదు. విత్తనములు జల్లుట ముగిసినపిదప ఉత్తచేతిలో విత్తనములు జల్లుటను రైతు అభినయించును. "జంతువులకొఱకివి జల్లుచున్నాను; గాలిలో నెగురు పిట్టలకొఱకు, చెట్లను ప్రాకు పురుగుల కొఱకు ఈవిత్తనములను జల్లుచున్నాను. నడచునదైనను సరే, నిలుచునదైనను సరే; పాడునదైనను సరే; గెంతునదైనను సరే దానికొఱకే వీనిని జల్లుచున్నాను. భగవంతుని నామము పవిత్రమగుగాక. యని యాతడనును.

జర్మనీలో అన్నిటికంటె వింతయైన పద్ధతి యొక్కటి అవలంబింపబడుచున్నది. జర్మనీలో పంటలకు కంబళిపురుగుల బాధ అపరిమితము. ఈబాధ తొలగుటకుపొలముఖామందు భార్యగాని, కుటుంబములో మఱియొక స్త్రీగాని చీపురుకట్ట తీసికొనవలెను. సూర్యాస్తమయమైన పిమ్మట కంబళి పురుగులున్న తోటలోనో పొలములోనో, వెనుకకు తిరిగి చూడకుండ, చీపురుకట్ట నీడ్చుకొనుచు పోవలెను. అంతసేపుకూడ ఈ కింది మాటలను వినపడియు వినపడనట్లు ఉచ్చరించవలెను. ఆ మాట లేవనగా:—"ఓకంబళిపురుగుతల్లీ, నీకు నమస్కారము.5 తెల్లవారగనే నీ భర్తతో చర్చి (దేవాలయము)కి దయచేయుము."6

## ఆరాధనము

జపానుదేశమున ఐనోఅను నొకతెగ వారు గలరు. వీరిపంటలకు ఎలుకలవలనను, చుంచులవలనను చాలప్రమాదము గలుగుచుండును. కావున వీరు ఎలుకలను పూజింతురు. వారి గాథలప్రకారము దేవుడు మొట్టమొదట ఎలుకలను, చుంచులను 'ఎరుంకొటక్'

(2) చూ. J. B. Holymayer: Verhandlungen dezgelehrten Estnischen gesellschaft zu dorpat, VII Heft 2 p. 105 note.

(3) చూ R. F. Keindl: Die Hugulen pp 79 etc.

(4) చూ. G. A Heinrich Agrarische Sitten and gebdche unter den sachsen Siebenburgens 15 pp and 16

(5) Good Evening, Mother Caterpiller, you shall come with your husband to Church.

(6) చూ. E. Kranse: zeitschrift fur Echnologie (1893) p.93.

(ఎలుకలకోట్టము) అనుచోట సృజించెను. అచ్చటి ప్రజలు ఆహారోదకముల నర్పించియు, అగరుపుల్లలు వత్తైరాలను వెలిగించియు నచ్చట మందలుమందలుగ నున్న ఎలుకలను, చుంచులను పూజింతురు. ఇట్లు పూజాపురస్కారములు గావించుచో ఎలుకలు సంతుష్టి చెంది చెట్లవ్రేళ్లను కొఱకియు, నితర విధముల పంటలను పాడుచేసియు నష్టము గలిగించవు. ఇవి చేయక, ఎలుకలనుగూర్చి చెడ్డపలుకులు పలుకుచో కోపముతో నవి పంటలను నాశనముచేసి పారవైచునని వారినమ్మకము.7

ఆధునిక కాలమును వదలి పురాతనకాలపు గ్రీకుల వంకకు మనదృష్టి నించుక సారించితిమేని గ్రీకులు తమ దేవతలలో కొందఱకు పంటలను ధ్వంసముచేయు జంతువుల పేర్లతో వ్యవహరించినట్లు స్పష్టపడును. వారిలో 'చుంచు—అపాలో' 'మిడుత—అపాలో' 'చీడ—అపాలో'8 'మిడుత-హెర్క్యులిస్,' 'పురుగుల—గొంగ—హెర్క్యులిస్' 'నక్క—డయోనీసస్' 'పురుగుల—గొంగ—జియస్' మొదలను దేవతల పేర్లును, ఆరాధనమును కలదు. క్రిందటి వ్యాసములో ధాన్యదేవతారాధనమును గూర్చి వ్రాయుచు ఏయేజంతువులు దేవుని పవిత్రజంతువు లని యెంచబడుచుండెనో ఆజంతువులే దేవత లనుభావము తోలుత నారాధకులకు గలిగెనని చెప్పితిని. ఈగ్రీకుభావముల పూర్వ చరిత్రముగూడ నట్టిదే యని ఫ్రేజరుమొదలగు విజ్ఞాన విశారదులు వ్రాయుచున్నారు. ఎలుకల బాధ పడజాలక 'ఎలుక—అపాలో' ను వారు పూజించ మొదలు పెట్టినట్లు కొన్ని గ్రంథములందు చెప్పబడినది. ఈ ఆలయమునందు ఎలుకయొక్క బొమ్మ యొకటి దేవుని విగ్రహమున్న పాదపీఠముదగ్గర నెలకొలుపబడెను. ఆ యాలయమునందు మచ్చిక చేయబడిన ఎలుకలు పెంచబడుచుండెను. దేవుని బలిపీఠముక్రింద తెల్లని ఎలుకలు తిరుగాడుచుండెడివి.

ఫిలిస్టయినులును, సారవాక్ దేశజులును గూడ దేవతారాధనమును, బలులను గావించినట్లు నిదర్శనములు గలవు. ఈవిషయమై యీవ్యాసమునందే ముందుముందు తెలిపెదను.

ఇండో చీనాలోకూడా ఎలుకలన్నచో రైతుల కతిభయము. ఇండో—చీనా, సయాము, బర్మాలలో ఎలుకలు పెద్ద మహాసైన్యములవలె మందలుమందలుగ పొలములపైబడి, కనపడినపంట నంతటిని సంపూర్ణముగ నాశనముగావించుచుండును. పంటలను పాడుచేసి, పాతరలను నాశనముచేసి ఎటుచూచినను కఱవుతప్ప మరేదియు గోచరముకానంత కష్ట పరిస్థితుల నేర్పరచును. అక్కడి రైతుల కష్టము వర్ణనాతీతము9 కావున ఇండో—చీనాలోని ప్రజలు 'యాంగ్—తిఖూ'10 స్తంభమనుపేర నొక పవిత్ర స్తంభమును నెలకొలిపినారు. 'యాంగ్ తిఖూ' స్తంభ మొక అనాగరక విగ్రహమును పోలియుండుటయు గలదు. ఎలుకలు మితిమీరి వచ్చినప్పుడు ఇండో—చీనావాసు లీ స్తంభమునకు పూజాపురస్కారములను గావించి బలుల నర్పణచేతురు.11

## ఎలుకలు-ఉండ్రాళ్లు

భారతదేశమునందు ఎలుకలను, పురుగులను దేవతలనుగ పరిగణించువాడుక మన కెక్కడను కనుపించదు కాని మూషిక వాహనుడగు వినాయకుని మన మతిభక్తితో కొలుచుచుందుము. రైతులు నాట్లు వేయునప్పుడు "ఓ వినాయకా, ఎట్టి విఘ్నములు రాకుండ

(7) చూ Batchelor, Rev.-The Ainu and their Folk lores.

8. రోమునగరమునగూడ 'చీడ' యొక దేవతగా నారాధించబడుచుండెను. See w. ward Fowler Roman Festivals of the Period of the Republic p 88

9. Max and Bertha Ferrars: Burma pp. 149 and 150 చూ Lt. Col. Tourniers book on Lacs (Hanoi 1900)

10 'యాంగ్— తిఖూ' అనగా 'మంచి ఎలుక' యని యర్థము.

11. చూ. Revere del Histoire des Religions (1891) పుట 236.

పంటలు పండునట్లు చేయవలసిన" దని మనస్సులలో ననుకొందురు. ప్రతియేటను భాద్రపద శుద్ధ చవితినాడు విఘ్నేశ్వరునకు ప్రీతిగ నా దేవు నుద్దేశించి పూజలు గావింతురు. ఉండ్రాళ్లను విరివిగ తయారుచేసి నైవేద్యము పెట్టుదురు. ఏ దేవునకైనను నైవేద్యముపెట్టిన వస్తువు కన్నుల కద్దుకొని తినుట హిందువులలో వాడుక. కాని యుండ్రాళ్లను-వినాయకునకు నైవేద్యముపెట్టిన వానిని-తినుట తప్పు; పాపము. ఉండ్రాళ్లను తినకుండ నేమిచేయుదురనగా-సాయాహ్నమున సూర్యు డస్తమించువఱకును వేచియుండి దేవునకు పునఃపూజగావించి ఉండ్రాళ్లను పొలములగట్లకడను, పొలములలోను, ఇండ్లకప్పులమీదను విసరివేయుదురు. ఎలుకలు వీని నారగించి తమ పంటల కెట్టిచెరుపును చేయవని మన వారి యభిప్రాయము. వినాయకునితోపాటు వినాయకుని వాహనముగూడ సంపూజితమగుటచే ఎలుక లన్నియు సంతసించును.

ఈపై మన భావమునకు గ్రీకు, జర్మను వగైరా దేశముల భావములకును చాలవ్యత్యాసము కనబడుచున్నది. అక్కడ ఎలుకలు వగైరాలను దేవతలుగ వారు భావించిరి. ఇక్కడ ఆ భావము లేదు. దేవునకు వాహనము. దైవాంశ సంభూతములనదగినవిగాని యెలుకలు మనకు దేవతలు గావు. ఎలుకలను మనము విడిగ పూజించము; భజించము; ఆరాధించము. కాని, ఎలుకల కుండ్రాళ్లను నమువబెట్టి వాని నిట్లు సంతృప్తిపరుప బ్రయత్నింతుము.

### వీడుకోలు

ఉత్తర భారతదేశమున నొక విచిత్రాచారము గలదు. అచ్చట మిడుతలవలన పంటలన్నియు నాశన మగుచుండును. కావున రైతులలో నొక డొకమిడుతను పట్టుకొనును. అతడు దానిని చంపడు. దాని ముఖమున కుంకుమతిలకమును దిద్ది దానికి నమస్కారముచేసి "నీ మిడుతలదండును తీసికొని నీవు వెడలిపో వలసిన"దని చెప్పుచు దానిని వదలిపెట్టును. ఇట్లు గౌరవము చేసినచో మిడుతలు పోవునని వా రనుకొందురు.[12]

ఆఫ్రికాఖండమున న్యూగినీ యను నొక దేశము గలదు. ఈ దేశమున కంబళిపురుగులవలనను, ఇతర పురుగులవలనను నష్టము సంభవించుచుండును. ఈ కీటకములందు తమ పూర్వుల ఆత్మలు మెలగుచున్నవని అచ్చటిప్రజల యుద్దేశము. కావున పంటలను ఈ కీటకములనుండి విముక్తి చేయుటకుగాను వారు వానిని దీనులై వేడుకొందురు. "ఓ మిడుతలారా, పురుగులారా, కంబళిపురుగులారా, మీరు మరణించినవారో, ఉరిబోసికొన్నవారో, దూలమో మ్రానో మీదపడగా ప్రాణములు బాసినవారో, సొరచేపచే మ్రింగబడిన వారో-మీరు గ్రామమును ప్రవేశించుడు" అని వేడుకొనుటవలన కీటకములు పంటలను వదలిపెట్టిపోవునని వారు నమ్ముచున్నారు.[13]

ఆఫ్రికాదేశమునందు 'మెటబెలి' యనుపేరుగల యొక జాతివారు గలరు. ఈ జాతివారు తమ పంటలను పాడుచేయు కంబళిపురుగుల నొక చిన్నపెట్టెవంటి దోనెలో పడవైచి, ఒక కంకినిగూడ నందుంచి కాలువలోనో, నదిలోనో దిగవిడుతురు. ఇట్లు చేయుటవలన కంబళిపురుగు లన్నియు తమయూరు విడిచి మఱియొక యూరికి పోవునని వారియూహ.[14]

ఇంతవఱకు పాఠకులు మొదట జంతు కీటకాదులయందు భయభక్తులను గూర్చియు, వాని యారాధనమును గూర్చియు వానిని తొలగించుటకు దేవతల పూజాదికములను గూర్చియు తెలిసికొన్నారు గదా. ఆ పిమ్మట ఆరాధనాదులు లేకుండనే వానిని పొలముల నుండి తొలగించుటకు చేయబడిన ప్రయత్నములను గూర్చి తెలిపితిని. ఈప్రయత్నము లనేకవిధములు. పైన

12. W. crooke: Popular Religion and Folklore of Northern India Vol II. p. 303 1896)
13. చూ Vetter Mitteilungen Sir Geographlschen Gesellschaft Zu Jena (1893), p. 95
14. L. Dale. Three years in Savage Africa, p. 160.

పేర్కొనబడిన గౌరవింపులు, వేడుకోలులు, పేటికా ప్రయాణములు—వీనితోనే మన ప్రాచీనుల ప్రయత్న పరంపర లంతమొందలేదు. మిగిలిన వివిధోపాయములను గూర్చియు, వాని యాచరణమును గూర్చియు నీక్రింద వ్రాయుచున్నాను.

### "పచ్చపురుగులారా, విచ్చిపొండి"

ఇట్టిప్రయత్నములలోకెల్ల ముఖ్యమైనది 'వ్రాత పద్ధతి.' పూర్వకాలమేగాక నేటికిని మనదేశములో నీ పద్ధతి విరివిగ వ్యాపించియున్నది. పంటలనుగాని, తోటలనుగాని, చెట్లనుగాని, మొక్కలనుగాని పురుగులు పాడుచేయుచుండెనేని ఖామందు శ్రీవత్సగోత్రపు బ్రాహ్మణునిదగ్గరకు పరుగెత్తును. ఆబ్రాహ్మణుని కాగితములమీద (పూర్వకాలము తాటియాకుల మీద) "శ్రీవత్సగోత్రమువారి సింహము వచ్చినది; పచ్చపురుగులారా విచ్చిపొండు" అనుమాటలను వ్రాయుమని కోరును. ఆ బ్రాహ్మణు డిట్లనేక కాగితముల వ్రాసి రైతున కిచ్చును. రైతా కాగితములను పదిలముగ తీసికొనిపోయి పొలములోనో, తోటలోనో ఆ కాగితములను కట్టివైచును. పురుగు లెక్కువగ నున్నచోట రెండు కాగితము లెక్కువకట్టును. ఇతరచోట్ల నొక్కొక్క కాగితమునే కట్టును. ఈ కాగితములు కట్టుటవలన పురుగులు విడిచిపోయినవనికూడ కొందరు రైతులు చెప్పుదురు.

పూర్వము గ్రీసుదేశస్థులలోగూడ నిట్టిపద్ధతి యున్నట్లు ప్రాచీనగ్రీకుగ్రంథమగు 'జియోపోనికా' వలన తెలియుచున్నది. ఇది వ్యవసాయమును గురించిన గ్రంథము. ఇందు గ్రీకురైతున కీయబడిన సలహా యేమనగా, ఎలుకలు పంటను పాడుచేయునప్పుడు రైతొక కాగితమును తీసికొనవలెను. దానిమీద "ఎలుకలారా జాగ్రత్త. మీరు నాకు హాని కలిగించరాదు. మఱి యే యెలుకలనుగూడ హాని చేయనీయరాదు; అదిగో ఆ ప్రక్కభూమి మీ కిచ్చివేయుచున్నాను. (ఇక్కడ ఫలానాభూమియని తెలియబరచవలెను)[15] కాని మఱల నిక్కడనే మీరు కనబడితిరా, ఆ దేవమాత సాక్షిగ, మిమ్ముల నేడేసిముక్కలుగ పోసి కుప్పలు పెట్టెదను." అను వాక్యములను కాగితముమీద వ్రాయవలెను. ఈ కాగితమును సూర్యోదయముగులోపల చెక్క నిరాతికి, వ్రాసినవైపు పైకి కనబడునట్లు అంటించవలెను.[16]

భారతదేశమునందు వలెనే బెదరింపుధ్వని దీని యందును గలదు. కాని కొంచెము భేదముమాత్రమున్నది. మనదేశపు పద్ధతిలో ఆజ్ఞాపన గలదు:—"పచ్చపురుగులారా, విచ్చిపొండు" మనదేశపుపద్ధతిలో సంశయ విహీనమగు విశ్వాసము, మనశక్తి యందలినమ్మకము గలవు. గ్రీకుపద్ధతిలోనో, బెదరింపు, మఱల నిదికాక పోయినచో, ఎలుకలు విననిచో, తిరిగివచ్చుచో నేమో చేసెదనను మేకపోతు గాంభీర్యము మిళితములై యున్నవి. గ్రీకులకు తమశక్తియందు తమకే సందేహము.

గ్రీకులు పెట్టిన వరవడి ఐరోపాఖండమునం దంతటను అవలంబింపబడినది. ఫ్రాన్సుదేశపు ముఖ్య పట్టణమగు ప్యారిస్ నగరసమీపమునగూడ కాగితములను వ్రాసి పొలములలో కట్టు గ్రీకుపద్ధతి కనబడిన ట్లొక పరాసు విజ్ఞాన విశారదుడు వ్రాసియున్నాడు.[17]

ఈ వ్రాతపద్ధతి యెంతవిరివిగ వ్యాపించి యున్నదో తెలిసికొనుట కొక చిత్రమైన యంశము పాఠకులకు తెలియజేయుట నావిధి. అమెరికాదేశములో నొకరైతు గలడు. ఆ రైతొకసారి ఎలుకల కొక యుత్తరము వ్రాసెను. "నాకుపంట తక్కువగనైనది. మఱల కోతల వఱకుగూడ నాకు ధాన్యము చాలునట్లు లేదు. నేను మీ కిదివఱకు చాలదయ చూపినాను. కాబట్టి మీ మంచి

15. సాధారణముగ మఱియొక రైతుభూమి మొదటిరైతు ఎలుకలకు దానముచేయును. అత్తసొమ్మును అల్లుడు దానముచేయుట యన్న నిట్టిదే కదా. ఒక్కొక్కప్పుడు మొదటిరైతు భూమిలోనే, దున్నక వదలిపెట్టిన భాగమో ఊరిలో బంజరుగనున్న భాగమో యెలుకలకు దానముచేయుటయు గలదు.

16. చూ. Geoponica XIII. 5.

17. A. de Nore: Coutumes, Mytheset Traditiones de France (1846) p. 383 చూ.

కొఱకే చెప్పుచున్నాను-నన్ను వదలిపెట్టి, నాకంటె నెక్కువ సమృద్ధిగ ధాన్యముగల ఫలాని ఫలాని ఇరుగు పొరుగు వారిదగ్గరకు పోవలసినది" అని యేమేమో వ్రాసి ధాన్యపుకొట్టులో నొకకట్టను పాతి దానికీయుత్తరమును గ్రుచ్చెనట. ఎలుక లాయుత్తరము నామూలాగ్రముగ చదువుకొని, సంగతిసందర్భములను సావధానముగ నాలోచించుకొని ఉత్తరమువ్రాసిన రైతును వదలిపోవునని అమాయకుడగు నారైతుయొక్క విశ్వాసము.[18] మనకు వింతనుగొలుపు నీసమాచారమువలన వ్రాతపద్ధతి శ్వేతజాతులలో నెంతవఱకు వ్యాప్తిగాంచినదో చక్కగ తెలియుచున్నది.

ఉచ్చారణపద్ధతి

ఈ వ్రాతపద్ధతియు, కొన్నిమాటల యుచ్చారణముగూడ ఆర్డెనిస్ అనుచోట జంటగ వెలయుచున్నవి. మొదట ఎలుకలున్నతావునకు పోయి యీ క్రిందిమాటల ననవలెను. "మగఎలుకలారా, ఆడఎలుకలారా, నామాట వినుడు. నేను భగవంతునిపేర మిమ్ములను పొమ్మని చెప్పుచున్నాను. నాయింటిని, నావాకిలిని, నాధాన్యపుకొట్లను, నాపాతరలను వదలిపెట్టి అనుగో ఫలాని చోటికి పొండు. అక్కడనే మీజీవితపరిసమాప్తి గావించుకొనుడు." ఇట్లుచెప్పి, ఈమాటలనే కాగితముల మీద వ్రాసి మడచి ఒక కాగితమును ధాన్యపుకొట్టు గడపకిందను, తక్కినవానిని తక్కినచోట్లను పెట్టవలెను. సూర్యోదయకాల మీ మంత్ర తంత్రముల కత్యుత్తమకాలము.[19]

సెలిబస్ ద్వీపవాసులలో వ్రాతపద్ధతి లేదుగాని ఉచ్చారణముమాత్రము వాడుకలోనున్నది. సయాం, బర్మా, ఇండో-చీనా వగైరా దేశములందువలెనే సెలిబస్‌ద్వీపమునందలి వరిపంటకు ఎలుకలు గర్భశత్రువులు. అచ్చట రైతు తనపొలముచుట్టు నడచుచు ఎలుకలు, పందికొక్కులు వగైరాలనుద్దేశించి "నీపేరు కోతగాడు. నా వరిపైరులో దూరరాదు. గ్రుడ్డి దానిపై పొమ్ము. చెవిటిదాని పై పొమ్ము. ధాన్యములో జొరబడవలెనన్నచో ఇతరుల ధాన్యములో జొరబడుము." అను నామాటల నుచ్చరించు.[20]

సరిగ నిట్టిదే యొకపాట మన తెలుగుదేశములో కానవచ్చుచున్నది.

"కోతగాడు, కోతగాడు నీపేరు,
ముట్టకు అంటకు నాపైరు;
గ్రుడ్డిదాని పైపో, ఎలకమ్మ.
చెవిటిదాని పైపో, ఎలకమ్మ.
దూరకు దూరకు నాయిల్లు
దూరాలంటే ఒక యిల్లు—
ఊరంతా యిళ్లూ పాతళ్లూను."

ఈ పాటయందలి భావములును సెలిబస్ ద్వీపపురైతుల భావములు నొక్కటిగ నుండుట మిక్కిలి యాశ్చర్యకరమైన విషయము. సెలిబస్‌ద్వీపము జావా, సుమత్రా మొదలగు ద్వీపములసమీపమున నున్నది. ఆంధ్రులు జావాసుమత్రా ద్వీపములతో వర్తక వ్యవహారములను జరిపినట్లు చరిత్రమువలన తెలియుచున్నది. బహుశః ఈభావము లానాటివేమో. ఏది యెట్లున్నను ఈ రెండుదేశములందలి భావముల యైక్యత గమనింపదగిన విషయ మనుట నిస్సందేహము.

సెలిబస్ ద్వీపమునందు మఱొక వాక్యజాల ముచ్చారణచేయబడినది. "నీ నిజమైనపేరు కోతగాడు. 'ఎలుక' నీకొసరుపేరు. సాయాహ్నభూమిలో నీవు కూర్చుండు రాయికలదు. జావాద్వీపములో పడమటిభాగమే నీయిల్లు" మఱొక వాక్యజాల మేమనగా: "పొడుగుతోకగాడా, పొడుగుతోకగాడా, నాధాన్యము తినవలదు. అది రాజకుమారుని ధాన్యము. అందరును గౌరవించువాని భూమిలోని ధాన్య మీధాన్యము."

18. American Journal cf Folklore, Vol. XI (1898). p. 161.
19. చూ. A. Meyrac; Traditions Contumes Legends etcontes des Ardennes p. 176
20. చూ G. Maan: Tijdschrift vocr Indische Taal-Land-en volkenkumde (1903) p. 329.

21 ఇట్లు అనుటచేత ఎలుకలు ధాన్యమును విడచి వెడలి పోవునని సెలిబస్ ద్వీపవాసుల నమ్మకము.

## ప్రతిమలు

పంటలను వానిశత్రువులగు జంతుకీటకాదుల బారినుండి తప్పించుటకును, జంతుకీటకాదులను పారద్రోలుటకును మఱొకరకపు ప్రయత్నములు గూడ చేయబడుచుండెను. బోర్నియోద్వీపములో నొకభాగము సారవాక్ అను పేర బరగుచున్నది. సారవాక్‌నందలి రైతులు కీటకములును, పిట్టలును తమపంటను విపరీతముగా పాడుచేయునప్పుడు మొసలివిగ్రహము నొకదానిని బంకమట్టితో తయారుచేయుదురు. నిజమగు మొసలి యెంతపొడుగు, లావు ఉండునో బొమ్మకూడ నంతేపొడుగులావులు గలిగియుండును. ఈ విగ్రహమునకు ఆహారము, తర్వాణి, బట్టలు వగైరాలు సమర్పించి, ఒక కోడిని, ఒక పందిని దానికి బలియిత్తురు. ఇట్లు చేయుటవలన మొసలి సంతసించి పంటలు పాడుచేయు కీటకములను, పిట్టలను లొట్టలువైచికొనుచు మ్రింగివైచును.22

ఫిలిస్టయినుల పంటలకు ఎలుకలవలన గొప్ప నష్టము సంభవించిన సందర్భమున వారు బంగారముతో ఎలుకల విగ్రహములను జేయించి వాని నొక క్రొత్త బండిమీద పెట్టి ఆబండిని రెండావులచేత లాగించుచు ఊరినుండి బయటకు తోలిరట. ఇట్లు చేసినక్షణమే ఊరిలోని ఎలుకలన్నియు వానంతట నవి ఊరునిడచి పోవునని ఫిలిస్టయినులు నమ్ముచుండెడివారు.23

ఇట్లే పూర్వకాలమున నేదో యొకయూరు మిడుతలచే బాధలు పొందుచున్నందున బంగారముతో నొక మిడుతబొమ్మను చేసి ఊరిబయట నుంచిరనియు, ఈ కారణమున మిడుత లాయూరు జొరకుండెననియు నొక అరబ్బీయుడు తెలిపినట్లు 'ఎన్ సైక్లోపీడియా బిబ్లికా' యను గ్రంథమున వ్రాయబడియున్నది.24

ఈ పైవిషయములను బట్టి చూచినచో సాధారణముగ నేజంతువును, ఏకీటకమును వెడలనడుపవలెననియు, ఊరుజొరకుండ చేయవలెననియు తలంతురో ఆజంతువు విగ్రహమో, ఆకీటకముయొక్క విగ్రహమో చేయించి ఊరువెలుపలనో, మఱొక ముఖ్యప్రదేశముననో నెలకొలిపినచో వాని బారినుండి ఊరును, ఊరిపంటలును సురక్షితము లగునని ప్రాచీనుల నమ్మకమైనట్లు స్పష్టమగుచున్నది. ఈ విషయము పాఠకులకు సుబోధకమగుటకుగాను కొన్ని ఉదాహరణముల నిందు వ్రాయుచున్నాను.

పూర్వకాలమున ఆంటియోక్ అనునొక పట్టణము గలదు. ఆ పట్టణమున తేళ్లు విశేషముగ నుండుటచే 'టయానా' వాసుడైన 'అపలోనియస్' అనునతడచ్చటికేగి కంచుతో తేలుబొమ్మను చేయించి ఊరికి మధ్యగ దానిని పాతిపెట్టి దానిపై నొకస్తంభమును ప్రతిష్ఠించెను.25 ఫెజ్ అను నగరమున నొక మసీదులోనికి తేళ్లు రాకుండుటకై యొకతేలుబొమ్మను చేయించి దాని నొకపిట్టబొమ్మ ముక్కుతో పట్టుకొన్నట్లు మసీదుపై నెలకొల్పిరి.26

పాములను పోగొట్టుటకు 'ఇస్రయెల్లు' ఇత్తడితో నొక పాముబొమ్మను చేసి యొక పెద్దగడమీద నుంచిరని క్రైస్తవమతగ్రంథమగు బైబిలునందు చెప్పబడి యున్నది.27 పూర్వము ప్యారిస్ నగరమున

21. Ibid.

22. C. Hose and w. Macdougell Journal of the Aathropological chustetute vol. XXXI p. 198

23. Holy Bible I samuel Vi 4—18 and V. 6.

24. Encyclopaedia Biblica (1900) Col. 4395.

25. చూ Cranographia Edited by L. Lindorf p. 264.

26. చూ E. Doutte Magie at Religion dans Afrique due Nord 1908 p. 144

27. Holy Bible Numbers XXI 6—9.

పాములు ఎలుకలు నుండెడివికావట. కాని కొన్ని సంవత్సరముల క్రిందట నొక మురుగుకాలవను శుభ్ర పరచు చుండగా కంచుతో చేసిన పాము విగ్రహమును, కంచుతోనేచేసిన యొక ఎలుక విగ్రహమును కనుపించినవి.28 అప్పు డవి తొలగించిననాటినుండియు ప్యారిస్ నగరమున పాములును, ఎలుకలును విజృంభించి సాగినవి.

విగ్రహప్రతిష్ఠాపనములవలన అపలోనియస్ కాన్‌స్టాంటినోపుల్ నగరమును ఈగలనుండియు, చిమటలనుండియు తప్పించె ననియు, 29 వర్జిల్ అనునతడు నేపుల్స్ నగరవాసులను కంచుటీగ విగ్రహమువలన ఈగలనుండియు, రాగిప్రతిమమూలమున 'గొల్లభామ' లను పురుగులనుండియు బంగారుజలగబొమ్మమూలమున జలగలనుండియు విముక్తులను జేసెను.30

## మాయమంత్రము

పైన పేర్కొనబడినవి గాక ఇంద్రజాలము, భూతవైద్యము నను రెండిటి సమ్మేళనమువలనను గూడ జంతుకీటకములను పారద్రోలు ప్రయత్నములు జరిగినవి.

ప్రాచ్యాఫ్రికాయందు 'వజగ్గా' తెగవారు నివసించుచున్నారు. వీరిలో నొక భూతవైద్యుని రావించి వానిచే నొకటిరెండు మిడతలును బట్టింతురు. వాడా మిడుతల కాళ్లను కలిపికట్టి ఏవోమాటలు నుచ్చరించును. పిమ్మట "నీవును, నీవారును ఫలానిరాజు రాజ్యములోనికి పోవు" డని నియమించును. (ఇచ్చట శత్రురాజు పేరే చెప్పుదురుగాని స్నేహముగ నున్న రాజు పేరు చెప్పరు.)31 ప్రాచ్యాఫ్రికాయందే 'వగోగో' తెగవారు గలరు. వీరు పిట్టలబాధ పడజాలక భూతవైద్యు నొకని రావించి కొన్ని వస్తువులను మంత్రింపించి, ఒకపిట్ట నందు ముంచి పారలించి పంపివేయుదురు. ఈ పిట్ట తనవారి నందఱను తోడ్కొని అడవిలోని కెగిరిపోవునని వారి యాశ.32

ఇంతవఱకును మనము పరిశీలించిన పద్ధతులలో జంతువులను, కీటకములను చంపకుండ వానినుండి తప్పించుకొను మార్గములు మనకు గోచరించినవి. ఇక జంతుహింసతో కూడుకొనిన మార్గము లేవేవి యవలంబింపబడెనో కనుగొందము.

## మారణము-మర్యాద

బొహిమియా యను దేశములో ఎలుకలబాధ మిక్కిలిగ నుండును. అచ్చటిరైతులు నల్ల యెలుకలను, బూడిదరంగుయెలుకలను చంపుదురు. కాని తెల్ల ఎలుకలను మాత్రము చంపరు. బొహిమియా దేశపు రైతున కొకతెల్లనియెలుక కనబడినచో దానిని జాగ్రత్తగ నింటికి తీసికొనిపోయి కిటికీలోనో, గూటిలోనో దానిని కాపురముపెట్టి చక్కగ కాపాడును. అది చనిపోయినచో దురదృష్టము గలుగు ననియు, బూడిదరంగుగల యెలుకలు బహుళసంఖ్యాకము లగు ననియు నచ్చటివారి నమ్మకము.33 అటులుగాక తెల్ల ఎలుకను తెచ్చి బాగుగ సాకినవా డదృష్టవంతుడయి సుఖపడు నని వారి విశ్వాసము.

ఆఫ్రికాఖండమునందలి 'నిమాసాల్యాండ్' నందొకజాతిచీమలు గలవు. ఈ చీమలు పంటలను, ధాన్యమును ధ్వంసముచేయును. అచ్చటి ప్రజ లీచీమలను బోనులలో తగిలించి చంపివేయుచుందురు. కాని, కోతల సమయమున నీచీమలను "మంచిదేవతలు" అను పేర వ్యవహరించుచుందురు. పంటలరక్షణభారము నీ 'మంచి దేవతలు' వహించెనని వారు కోతలలోమాత్రమే తలంతురు.34 ఇండో చీనాలో ఎలుకలను 'మంచి

28. చూ Gregoire de Tours Ecclesiastical History of France, Vol. I. p. 514 (Fr.)

29. చూ D. Ocurfareth virgil in the Middle Ages, p. 265.

30. Ibid.

31. చూ M. Merker's German Pamphlet on the Wajagga (1902)

32 Rev. H Cole in Journal of the Anthropological Institute 1902 p. 320.

33. చూ. J. V Grohmann: Aberglauten and Gebranche and Bohmen p. 60.

34. చూ. E. Modigliani; un Viaggis a Nias p. 626.

ఎలుక స్తంభము'ను నిర్మించుట పైన తెలిసికొంటిమి కదా. కీడుచేయువానిని 'మంచివి' అనుటవలన లాభము గలుగు ననియు, అవి కీడుగలిగించ వనియు నొకనమ్మకము ప్రపంచమున వ్యాప్తమైయున్నది. మనదేశమునందుగూడ ద్రవిడులు పామును 'నల్లపాంబు' (మంచి పాము) అని యందురు.

కొన్నిచోట్ల జంతువులలో నొక రకమువానిని చంపుటయు, మఱికొన్నిటిని వదలివేయుటయు నాచారమనియు, కొన్నిచోట్ల అన్నిటిని చంపుచు 'మంచివి' అని యనుట వాడుకయనియు కనుగొంటిమి కదా. ఇప్పుడు అన్నిటిని చంపుచు కొన్నిటిని మాత్రము గౌరవించు నాచారమునుగూర్చి తెలిసికొందము.

హిందూ మహాసముద్రమునకు ఈశాన్య భాగమున-అనగా భారతదేశమునకు తూర్పున-నున్న ద్వీపములలో 'బలి' యను పేరుగల ద్వీప మొక్కటి కలదు. ఇచ్చట ధాన్య ధ్వంసకములగు నెలుకలను ద్వీపవాసులు తఱలబెట్టి చంపివేయుదురు. కాని ఈ యెలుకలలో రెంటిని మాత్రము చంపరు. ఈ రెండెలుకలకు కొంత వస్త్ర మిచ్చి బహూకరింతురు. దేవతలకు నమస్కరించి నట్లు యెలుకలకు నమస్కరింతురు. పిమ్మట వానిని వదలివేయుదురు.35 ఆ ప్రాంతములందలి ద్వీపములందే మఱొకదానిలో చంపినన్ని ఎలుకలను చంపుచు నాలుగింటిని మాత్ర మొక శుక్రవారమునాడు పట్టుకొని రెండు జతలకును పెండ్లిండ్లుచేసి, బియ్యము వగైరా తినుబండారములతో నింపిన యొక్కొక్క బొమ్మల యోడలో నొక్కొక్క దంపత్యుగము నుంచి పెద్ద యుత్సవముతో సముద్రమునకు తీసికొని పోవుదురు. అచ్చట సముద్రములో వానిని దిగబెట్టి, తిరిగియిండ్లకు చేరికొందురు.36 ఆ ప్రాంతములందలి 'సారవాక్' నందు పంటలకు శత్రువులగు పిట్టలు, పురుగులు వగైరాలలో చంపినన్నిటిని చంపి తుద కొక్కొక్క రకమున కొక్కొక్కటిచొప్పున పిట్టలను, పురుగులను పట్టుకొని, బొమ్మల పడవనిండ ధాన్యము వగైరా వంటసామానులను పోసి, పై 'ప్రయాణీకుల' నందుంచి సముద్రమున వదలివేయుదురు.37

పైన వర్ణించిన విషయములవలన చాల కీటకాదులను చంపి కొన్నింటిని గౌరవించిపంపుట వాడుకయని తేలినది. ఇక, అన్నిటిని చంపి చచ్చిన కీటకాదులను గౌరవించుటనుగూర్చి తెలిసికొందము.

## ఏడ్పులు - పెడబొబ్బలు

అమెరికా ఖండమున "డెలగోవాఖాతము" తీరమున 'బరోంగా' జాతివారు గలరు. వీరియొక్క జొన్నపంటలను 'నూనూ'అనునొక కీటకము ధ్వంసము చేయుచుండును. అచ్చటివా రీకీటకములను పట్టుకొనుటకు స్త్రీలను పంపుదురు. మొక్కజొన్న మొక్కల మీదనుండియు, చిక్కుడు మొక్కలమీదనుండియు 'నూనూ'లను స్త్రీలు తెచ్చినతరువాత వానిని జలమువలన మరణమును బొందించుటకు స్త్రీలందఱును గడ్డితో దేహమునంతటి నలంకరించుకొని చేత కొమ్మలను పట్టుకొని 'నూనూ వెళ్లిపో, నూనూ వెళ్లిపో' అని యఱచుచు నొక తటాకమును చేరుదురు. పిమ్మట నొకకవల పిల్లచే పురుగులను తటాకములో పారవేయింతురు.38 పిమ్మట మరణసమయగీతముల నాలాపింతురు

ఆల్బేనియాలో మిడుతలు వగైరాకీటకములు పంటలను పాడుచేయునప్పుడు స్త్రీలు తలలు విరబోసికొని కొన్నిటిని పట్టుకొని చంపివేయుదురు. పిమ్మట వానివెనుక నేడ్చుచు 'ఓమిడుతలారా, మీరుచనిపోయి మమ్ము దుఃఖసముద్రములో ముంచినారు, అయ్యో, అయ్యో'యని బొబ్బలు పెట్టుచు మర్యాదగ నంత్యసంస్కారములను గావింతురు.39 సిరియాలో కంబళీపురు

35. చూ. R. Van Eck: Tijdschrift voor Nederlandsch-Indie (1879) p. 125.
36 చూ. J. L. Van Gennep: Ibid (1896) p, 101
37 C. Hove and W. Macdongall: Journal of the Authropelogical Chistitute (1901) p. 198
38 చూ. H. S. Junod: Les Baronga p. 419 42 (1898)
39, చూ. J. G. Von Hahn: Allanesische Studien Beft I p. 157.

గులబాధ నోర్వజాలకున్నప్పుడు కొందఱు కన్యకలు కంబళిపురుగుల నన్నింటిని చంపుదురు. అం దొకకన్యక 'కంబళిపురుగుల తల్లి'గ నియమిత యగును. అంతట 'తల్లి' చుట్టు నందఱును చేరి 'అయ్యో, నీ పిల్లలు చనిపోయినారా, తల్లీ!' యనియేడ్చి యుపశమనవాక్యములను పలుకుదురు. 40 రష్యాలో కొన్నికూరగాయలతో నేడుకట్ల సవారిని ఆడపిల్లలు తయారు చేయుదురు. అందు పంటలను నాశనముచేయు ఈగలను బోలిన పురుగుల నుంచి, ఏడ్చుచు, మొత్తుకొనుచు తీసికొని పోయి వానిని పాతిపెట్టుదురు. 41 దక్షిణాఫ్రికాయందలి కాఫర్ జాతుల ఆడపిల్లలు దొరికినన్ని కంబళి పురుగులను హతమార్చి పొలములవెంట నేడ్చుచు బోవుదురు. 42

పైరెండుపేరాలలో వ్రాసిన విషయములను గూర్చి క్రింద నేను తెలిపినరచయితలును, ఫ్రేజరుగారునుకూడ చాల పొరపడినారు. కీటకములను చంపకయే అవి పోవుటకుగాను పైపద్ధతు లుపయోగించలేదనియు, అవి చచ్చినతరువాత క్రిందతెలుపబోవు మూడు కారణములు మనస్సులం దుంచికొని దుఃఖమును ప్రకటించి రనియు నేను వారికి మనవిచేయుచున్నాను.

(1) ఇందు మొదటికారణము చనిపోయిన జంతుకీటకాదులందు ప్రజల పూర్వీకుల యాత్మలు చొచ్చియున్న వనుభావము. పంటలకు పట్టుకొన్న పురుగులను చంపకతప్పదు. చంపినచో పూర్వీకులకు కష్టముగలుగును. కావున ప్రజలు దుఃఖింతురు. ఈ పురుగులను చంపినచో అందలి యాత్మలు మరణరహితమగు మఱియొక నెలవును వెదకికొనును. కీటకజన్మమున నుండుటకంటె మఱియొక జన్మమెత్తుట పూర్వులకు మంచిది కాదా? అంతమంచి జన్మమే రాబోవుచో నేడ్చుట యెందుకని పాఠకులు ప్రశ్నించవచ్చును. వేదాంతరహస్యము నెఱింగినవారు దుఃఖించరు. తక్కినవారు తలంచున దేమనగా; మనుజులు చనిపోయినచో నేడ్తుముగదా? అట్లేపూర్వుల మరణమునకు నేడువవలెను అని తలంచుట సహజము. ఇంతేగాక పూర్వులను తాము గౌరవించు చున్నామని తెలియబరచుటకు గూడ దుఃఖమును వెలిబుచ్చుటయు, కర్మవంటిదాని నాచరించుటయు జరుపబడు చున్నవి.

(2) రెండవ కారణ మేమనగా: పురుగులు, జంతువులు వగైరాలయందలి పూర్వీకుల యాత్మలు "మన సంతతివారు మన కింతగౌరవము చూపుచున్నారుగదా. కావున మనము వీరి పాడిపంటలను రక్షించవలెను" అని యనుకొను నను భావము.

(3) మూడవది: జంతువులలో కొన్నింటిని చంపగలముగాని, అన్నింటిని రైతులు చంపజాలరుగదా? కావున చచ్చినజంతువులను గౌరవించుచో నవి పోయి "మే మీయాసుఖములను, ఈగౌరవమర్యాదలను అనుభవించితిమి. మీరును పోయి వారిచేతికి చిక్కుడు" అని చావని జంతువుల నవి ప్రబోధించును. ఈకారణము చేతనే కొరియాదేశస్థులు గుంటనక్కలను చంపినప్పుడు వెంటనే చర్మము నొలిచివేయరు. దాని నింటికి తీసికొనిపోయి "అతిథిగారు, కుంపటిదగ్గర చలికాచుకొనుడు" అని యందురు. నక్కనోట రకరకముల తిండిపదార్థములను పెట్టుదురు. పిమ్మట "ఓ నక్కా, నీవు నీవారి యొద్దకు పోయి 'అచ్చట మంచియిల్లున్నది. నా కడుపునిండ భుజించినాను. మీరును పొండు' అని చెప్పుము" అని యందురు. 43 టోగోల్యాండునందు 44 సెలిబిస్‌నందును 45 తేళ్లదవడ ఎముకలను తాటికల్లుతో 'సంతృప్తి'పరచి "మీస్నేహితులను తీసికొని

40. చూ. Lagarde: Reliquise jurisecclesiastici antiquissimal, p. 135.

41. W. R. S. Ralston: Songs of the Russian People, p. 255.

42. Dudley kidd: Sanage Childhood, a Study of kafir childorn, p. 292.

43 W. Bogaras: The Chukchcc, p. 409.

44. చూ. J. Spieth; Die. Eue. Stanme p. 389.

45. చూ. A. C. kruizt: Mededeelingen van wege het Nederlandsche Zandelingenootschap (1897) Hs 4 and 5

రంకు" అని అచ్చటివారు చెప్పుదురు. సిలబస్ సమీపమున నున్న 'టిమర్‌లాట్' ద్వీపమునందలి పల్లెవాండ్రు తాముపట్టుకొన్న కడపటి పెద్దచేప పుఱ్ఱె నోటిలోనికి తాంబూలమును త్రోసి చేపలు పట్టుటకు వెడలుదురు.[46] కాబట్టి మర్యాదచేసినచో మఱికొన్ని జంతువులు పట్టుపడునను నాశయు పైగౌరవములను ప్రేరేపించియుండవచ్చును.

## ముగింపు

ఈ వ్యాసమునందు ప్రాచీనకాలమునుండి నేటివఱకును సస్య సంరక్షణావసరమున ముఖ్యమగు సస్యశత్రువులయెడ నవలంబింపబడిన పద్ధతులను విశదముగ తెలిసికొంటిమి. ప్రాచీనకాలమునుండి నేటివఱకును తమ పంటలను రక్షించుకొనుటకై రైతులు సస్య శత్రువులను శరణుచొచ్చిరి; దేవతల నారాధించిరి; మంచితనము చూపిరి; వ్రాతపద్ధతిని, ఉచ్చారణపద్ధతిని, ప్రతిమల పద్ధతిని, మాయమంత్రములను ఉపయోగించిరి; మర్యాదను చూపిరి; సంహరించిరి; దైన్యము నవలంబించిరి; నటించిరి. ఎన్ని చేసినను నొకొక్కప్పుడు తాత్కాలికోపశమనము గలిగినను సంపూర్ణముగ సస్యశత్రువుల మరలింపనుగాని, నిర్మూలింపనుగాని ఏ పద్ధతికిని సాధ్యపడలేదు. ఆధునిక శాస్త్ర పరిశోధనముల వలన గూడ పూర్తిగ మానవునికి విజయము చేకూరలేదు. ఇట్టిసందర్భములలో ప్రాచీనమానవుని ప్రయత్నములపట్ల మన కెంతయు కౌతూహల ముండకతప్పదు. కావుననే మన విజ్ఞానచక్షువును తెరచి అనాదినుండి నేటివఱకును గల కృషీవలుల ప్రయత్నములను సావధానముతో మనము తెలిసికొంటిమి; విమర్శించితిమి; చర్చించితిమి. ఇకనా ప్రాచీన కృషీవలుని వీడ్కొని మన దైనందినచర్యలకు గడంగుదమా?

---



భజన K. P. S.

46. చూ J. A. Jocobsan: Reisen in die elnselwett Ses Banda Meerss, p. 234.

# ఇటలీ — అబిసీనియా

పులపాక సీతాపతిరావు

యూరపు మరల యుద్ధమునకు సిద్ధముగా నున్నది. ప్రతిదేశము యుద్ధసామగ్రి కొరకై కావలసిన ధనమును వ్యయపరచుచున్నది. అన్నిటికంటెను తొందరగాయున్నది ఇటలీకి. యుద్ధము వచ్చినచో ఇటలీయొక్క అబిసీనియాక్రమణ పద్ధతి యనే నిర్ధారణగ చెప్పవచ్చును. జూలై తే 31 ది గడచినది.



అబిసీనియా చక్రవర్తి రాస్ టఫారీ

జాతిసమితి (League of Nations) మరి వారము రోజులలో సమావేశమగును. దానిలో అబిసీనియా ఇటలీకి గల భేదములు, న్యాయాన్యాయములు విశదముగా చర్చింపబడును. తదుపరి విశేషములు ముమ్ముందు తెలియగలవు. కాని ఇంతవరకు ఇటలీ అబిసీనియాలకు గల విరోధమునకు కారణములు తెలిసికొందము.

అబిసీనియా ఆఫ్రికా అంతటికి ముఖ్యమైనది. అటువంటి ప్రదేశము ఆఫ్రికాలో మరెచ్చటను లేదు. దాని శీతోష్ణస్థితి (Climate) ఎల్లప్పుడు వసంతకాలమే. వర్షములు మెండు. Red sea coast ననుసరించి క్రమక్రమముగా సముద్రమునకంటె ౮౦౦౦ అడుగుల కెత్తుగా నున్న ప్రదేశము. అది మిక్కిలి సారవంతమైన భూమి. సంవత్సరమునకు మూడు పంటలు పండును. దీనియంతటికి కారణము Blue Nile అనే గొప్ప నదియే. దానిలో దొరకు వస్తువులు బొగ్గు, ఇనుము, కర్ర నూనె, ప్రత్తి, పంచదార, కాఫీ, తదితరమైనవి.

అబిసీనియా జనసంఖ్య ౧౦,౦౦౦,౦౦౦. స్వదేశీయులు దానిలో మూడవవంతు. తక్కినవారందరు పైదేశీయులు, తదితర జాతీయులు. అందుచేతనే అబి



ముసోలీని ఇటలీనియంత

సీనియా ప్రభువు ౭౦ భాషలలో ఏచట్టము నైనను ప్రకటించవలెను.

కాని నాగరకతవిషయములో మాత్రము అది పాశ్చాత్యదేశములకెల్ల వెనుకబడియున్నది. చాలకాలము నుండి బానిసవ్యాపారములో వన్నెకెక్కినది. ఇప్పటికి కూడ పూర్తిగా దానిని పోగొట్టుకొనలేదు. ఇక దేశముయొక్క ఆరోగ్యవిశేషమో చాల విచారింపవలసిన యంశమే.—యుద్ధసామగ్రిని చేకూర్చుకొనుటలో నితరదేశములకంటె నేమాత్రము వెనుకబడదు. Field artillary, Machine guns, air craft మొదలుగాగల పనిముట్లన్నియు పాశ్చాత్యదేశములనుండియు, జపాను దేశమునుండియు అతివేగముగ దిగుమతిచేసికొనుచున్నది,

ఇకను అబిసీనియాకు తదితరదేశములకు గల సంబంధబాంధవ్యములు తెలుసుకొందము.

ఇటలీకి వలసరాజ్యములను ఆక్రమించుఉద్దేశ్యము (Colonial enterprise) ౧౮౭౦-వత్సరమున Bay of Assab (బె ఆఫ్ అసాబ్) కొనుటలో ప్రారంభమయినను, పట్టుదలగా దానికొరకు పనిచేయుటకు, ఫ్రాన్సుదేశము 'టునీషియా' (Tunisia)ను ౧౮౮౧ లో వశపరచుకొన్నప్పటినుండి మొదలిడెను. టునీషియా ఇటలీకి దగ్గరగానుండుటచేతను, ౧౮౮౧ వత్సరమునకు ముందే ఇటలీ టునీషియాతో వ్యవహారములు చేయుటచేతను, ఫ్రెంచిదేశీయులకంటె ఇటాలియనులు హెచ్చుగా నుండుటచేతను, టునీషియాను ఇటలీ ఆక్రమించుకొనుటకు మిక్కిలి ఆసక్తితోనుండెను. కాని దైవఘటనవల్ల ఫ్రాన్సుదేశము టునీషియాను ఆక్రమించుకొనుటచే ఇటలీ దానికి బదులుగా ఎబిసీనియాకు ఉత్తరముగానున్న ఎరిత్రియా (Eritrea)కు రేవుపట్టణమైన మసావా (Massawa)ను వశపరచుకొని రానురాను సుదానువైపు తనరాజ్యమును స్థాపించుటకు యత్నించెను. కాని అది తుదకు ఇటలీకి వ్యతిరేకముగా పరిణమించెను.

మసావా నిటలీ ఆక్రమించుటచే ఎబిసీనియాకు సముద్రములోనికి దారి లేకపోయినది. అందుచే చిన్న చిన్న దెబ్బలాటలు ఆరెంటికిని ప్రారంభమాయెను. ౧౮౮౭ లో ఇటలీ, అబిసీనియాను ఓడించుటకు ప్రయత్నముచేసెను కాని అది కొనసాగలేదు. ఆ సంవత్సరముననే అబిసీనియన్ రాజు 'జాన్' అనునతడు చనిపోవుట, మెనిలిక్ (Menelik) అనునతడు రాజపదవి స్థాపించెను. తరువాత ఇటలీ అబిసీనియాలు రాజీనామా చేసికొని దానిని మూడువత్సరములవరకు పాటించిరి. కాని ౧౮౯౩ లో జాన్‌కుమారుని ఇటలీ లేవనెత్తి అతనికి సహాయము చేయుచున్నట్లు మెనిలిక్‌నకు అనుమానము గల్గి తాను ఇటలీతో చేసుకొన్న రాజీనామాను రద్దుపరచెను. వెంటనే యుద్ధము ప్రారంభమాయెను. కాని అబ్బాయిరీమావద్ద నున్న ఎడోవా (Adowa) అనుస్థలమున ఇటలీ ఓడిపోయెను. ౬౫౦౦ మంది చనిపోయిరి. ౪౦౦౦ మంది ఖయిదీలుగా ఎబిసీనియాకు తీసికొనిపోబడిరి. తదుపరి వాటిరెంటికిని జరిగిన సంధిప్రకారము ఇటలీ, అబిసీనియాకు యుద్ధనష్టపరిహారము నిమిత్తము ౪౦౦,౦౦౦ పౌన్లను ఇచ్చెను. అదిగాక ౧౮౯౩ వత్సరమున మెనిలిక్ రద్దుచేసిన సంధికికూడ ఒప్పుకొనెను. ఇటలీ ఎబిసీనియాస్వాతంత్ర్యమునకు అంగీకరించెను. అప్పటినుండి ఇప్పటివఱకు వాటిరెంటికి అసూయ హెచ్చుగుచున్నది.

ఎడోవాయుద్ధమున అబిసీనియా జయముగాంచుటకు ముఖ్యమైనసహకారి ఫ్రాన్సు. అదియే అబిసీనియాకు కావలసిన యుద్ధసామగ్రి నంతను నిచ్చెను. ౧౯౨౩ లో ఎబిసీనియా జాతిసమితిలో సభ్యత్వము గాంచుటకు కూడ ఫ్రాన్సే ముఖ్యాధారము. వీనికి ప్రత్యుత్తరముగా ఫ్రాన్సు ఎబిసీనియా ముఖ్యపట్టణమగు ఏడిస్-అబాబా (Addis Ababa) నుండి ఫ్రెంచ్ సోమాలి ముఖ్యపట్టణమగు జిబూటి (Gibuti) వరకు రయిలుమార్గమును వేయుటకును, దానిమీదుగా అబిసీనియాకుగల పరరాష్ట్రములతో వర్తకవ్యాపారములు జరుపుటకును నిర్ణయించుకొనిరి.

అయితే అబిసీనియాకు ఫ్రాన్సు అనిన భయము లేదా యని సంశయము పుట్టవచ్చును. కాని అట్లు భయపడుటకు అబిసీనియాకు ఏమియు అవకాశములేదు. ఫ్రాన్సుదేశముకూడ అటువంటి దురభిప్రాయము ౧౮౯౮ వత్సరమున ఫెషోడావద్ద ఓడిపోయిన వద్దనుండి వదలుకొనెను. అదిగాక ఫ్రాన్సుయొక్క సోమాలి అబిసీనియన్ సరిహద్దును ౨౫౦ మైళ్లుమాత్రము అంటియున్నది. ఇటలీ సోమాలి ఇంగ్లీషుసుదాను, తక్కిన సరిహద్దులను ఆక్రమించినవి. కాన ఫ్రాన్సును చూచినచో అబిసీనియా కెవ్విధమైన భయమునులేదు.

ఎడోవాయుద్ధమైనప్పటినుండి అబిసీనియా దినదినము వృద్ధిపొందుచుండెను. ఆదేశములో నుండుకొన్న రాజద్రోహులను, తదితర శత్రువులను మెనిలిక్ సంపూర్ణముగా హత మొనర్చెను. కాని ౧౯౧౩-వ వత్సరమున నాతడు కాలముచేసెను. అతని మేనల్లుడు రాస్‌టఫారి (Ras Tafari) అనునతడు రాజాయెను. రాజు మారినను అబిసీనియను రాజకీయపద్ధతులు మారలేదు. ముఖ్యముగా ఇటలీని చూచిన రాస్‌టఫారికి సవతిబిడ్డప్రేమ.

తన దేశమును ఇతర దేశముల బారినుండి కాపాడుటయే ఆతని ముఖ్యోద్దేశ్యము. దానికొరకు తన ప్రాణములను కూడ నర్పించగలడు.

మస్సొలిని ఇటలీ ప్రధానమంత్రిత్వము వహించినప్పుడు ఇటలీని మరల మునుపటి ప్రాముఖ్యమునకు తీసికొనివచ్చెదనని కంకణము గట్టుకొనెను. తదితర దేశములతో వలసరాజ్యములను సంపాదించుటలో సమానత్వమును పొందుట ఆతని ప్రధానోద్దేశము. అదిగాక ఇటలీ పరిశ్రమలకు పనికివచ్చెడు వస్తువు లన్నియు అబిసీనియాలో దొరుకును. ఇంకను ఆతడు 'ఎడోవా' యుద్ధమును మరవక దానికి ప్రత్యుత్తరమును ఈయవలచుచున్నాడు. దీనికితోడు ఇటలీ జనులకు వాసస్థలము చాలదు. వారివృద్ధికొరకు మస్సొలినీ చాలతాపత్రయము పడుచున్నాడు. మరియు, తదితర దేశములకు తన సామర్థ్యము తెలియచ్చుటకు యీయావకాశము అబిసీనియాను స్వాధీనము చేసికొనుటయే. ఫ్రాన్సు దేశము, ఆల్జీరియా, మొరాకో, ట్యూనిస్‌లను ఆక్రమించుటయు, ఇంగ్లాండు ఈజిప్టును ఆక్రమించుటయు మస్సొలినికి కష్టముగా నున్నది. సమయమునకై ఆతడు ఆతురతతో వేచియుండెను.

ఇంతవరకును తనస్వాధీనమున నున్న ట్రిపోలి (Tripoli) ని బాగుగ బలపరచెను. దానికి బాల్బొ ప్రభువును ప్రతినిధిగా జేసెను. భూసముద్రవాయుమార్గముల రాకపోకల నేర్పరిచెను. ఎడారిప్రదేశమును Tripoli ని మోటారుమార్గములతో నింపెను.

అబిసీనియాను వశపరచుకొనినచో ఇటలీకి మంచిలాభములు గలవని వేరే నొక్కిచెప్పనక్కరలేదు. అదిగాక, ట్రిపోలినుండి ఎరిట్రియాకు సుదానుమీదుగా మార్గమును వేసినచో, సూయజుకాలువనుండా పోవుచున్న ప్రయాణీకులు, ఈమార్గమున తక్కువకాలమున పోగలరు. అట్లుపోయినచో ఇటలీ, ఎరిట్రియా, అబిసీనియాలకు మంచి ఆర్థికలాభములు గల్గును.

పైని వక్కాణించినట్లుగా, ఇటలీ చేయవలెనంటే తాను, ఇంగ్లాండుతోను, ఫ్రాన్సుతోను ముందుగా మైత్రిసంపాదించవలెను. దానికి అనుకూలముగానే ఈమధ్య లేవల్-మస్సొలినిటాక్సు (Lavel-Mussolini talks) వల్ల వారిద్వరికి సంధి జరిగెను. దానిని బోధపరుచుటకుగాను ౧౯౧౫ వత్సరమున ఇటలీ, ఇంగ్లండు, ఫ్రాన్సులకు జరిగినసంధిలోయున్న ౧౩-వ ఆర్టికలు, తదుపరి వెర్సైయిల్సుసంధిలో జరిగిన అంశములను గమనించవలెను[1, 2]. ఈదిగువ చెప్పిన ప్రకారము ఇటలీ, ఫ్రాన్సు, ఇంగ్లాండులను అడిగెను. ఇంగ్లాండు దానికి ఒప్పుకొన్నప్పటికి ఫ్రాన్సు దానికి సమ్మతించలేదు. కాని ఇప్పుడు Lavel Mussolini talks ప్రకారము ఇటలీ ౭౩౦౦ మైళ్ల ప్రదేశమును ఆఫ్రికాలో సంపాదించెను. ఇదిగాక ఎరిట్రియాలో 'డోమెట్రా' అను లంకలో ఆధిక్యమును, ఒకరేవుస్థలమునుగూడ (Straits of Babel Mandeb)ను ఫ్రాన్సు ఇటలీకి ఒసంగెను. రైల్వేలోగూడ ౨౦౦౦ షేర్లను సంపాదించెను. దీనివల్ల మస్సొలిని అబిసీనియాకు కావలసిన సామగ్రిలో నూటికి ఎనుబదివంతులు పంపెను జపానుదేశముయొక్క వ్యాపారమును పడగొట్టెను. ఇది గాక అబిసీనియాకు యుద్ధసామగ్రికూడ మునుపటివలె వచ్చుటకు వీలులేక పోవుచున్నది.

ఇంగ్లాండుదేశముతోగూడ మస్సొలిని సఖ్యతగా యున్నట్లు ౧౯౨౫-వ వత్సరమున ఇంగ్లాండురాయబారి (Ambassadar) మస్సొలినికి వ్రాసినవుత్తరమువల్ల తెలియుచున్నది. 'మా కన్నిటికంటెను ముఖ్యమైనది Lake Tsana Dam, అందుకుగాను నీవు మాకు

1. Art. 13 If the colonies of Germany in Africa are occupied by either France or England, both of them agree that Italy should also be given some territories adjoining the territories she already possesses.

2. In pursuance of the treaty of versilies, Italy demanded from France, territories South of Biya so that she may have an opening to Lake Chad; Jibuti in French Somaliland so that she may have free access to the gulf of Aden, and to cede the Addis Ababa Railway to her and from England. She demanded the valley of Juba River and the part of Kismayee.

తగినసహాయముచేసినచో, ఇంగ్లాండు, అబిసీనియావద్ద నుండి ఎరిట్రియాసోమాలివరకు రైలుమార్గము వేసికొను టలో ఇటలీకి సహాయము చేయునని వ్రాసెను. అట్లుజరిగినచో, అబిసీనియా పడమటిభాగముకూడ ఇటలీయొక్క ఆర్థికలాభముకొరకు వదలివేయుటకు కూడ ఇంగ్లాండు సమ్మతించెను. దీనికి డిసంబరు ౨౦-వ తేదిని ముస్సోలిని సమ్మతించెను.

ఇంగ్లాండు, ఫ్రాన్సు దేశములు ఇటలీతో సఖ్యతగా ఉన్నప్పటికి, ఇటలీకి అబిసీనియాను లొంగదీయుట సులభమైన పనికాదు. అబిసీనియన్ రాజు వారి ఇంగ్లాండు ఇటలీలకు జరిగిన రాయబారములు వినగానే జాతిసమితికి జూన్ ౯-వ తేది, ౧౯౨౬ వత్సరమున అపీలు దాఖలుచేసుకొనుటచే అప్పటినుట్టుకు ముస్సోలిని మారు మాట్లాడలేకుండెను.

ఈచిక్కులన్నిటిని తప్పించుకొని ముస్సోలిని అబిసీనియాను లోబరచుకొనుటకు మిక్కిలి ఆసక్తితో గతించిన ౬,౭ నెలలనుండి తీవ్రముగా ప్రయత్నము చేయుచున్నాడు. ౧౯౩౪ నవంబరు 3-వ తేదిని Victor Emanuel (ఇటలీరాజు) సోమాలికి కాలక్షేపము చేయుటకు విచ్చేసెను. డిశంబరు మొదటివారమున నేపుల్సులో యుద్ధవీరులందరు సమావేశమయిరి. యుద్ధమునకు అతితీవ్రముగా కావలసిన సామగ్రిని ఇటలీ ఆఫ్రికాకు పంపెను. అచ్చటచ్చట అబిసీనియనులలో చిన్నచిన్న దెబ్బలాటలు జరుగుచున్నప్పటికి ముస్సోలిని గతమాసమువరకు యుద్ధముచేయుటకు ఆతని కిష్టము లేనట్లు చెప్పుచుండుట పత్రికలలో చూచుచున్నాము. గత నవంబరు ౧౬-వ తేదిని గింషన్‌ను కాపాడుచున్న సిపాయిలను అబిసీనియనులు ఎదుర్కొనిరి. దానికి అబిసీనియన్ ప్రభువు పశ్చాత్తాపము పడుటచే ముస్సోలిని వారిని క్షమించెను.

కాని అంతకంటె తీవ్రముగా జరిగినది Wal Wal లో యుద్ధము. ఇప్పుడు మరి అబిసీనియా వెనుకతీయలేదు. Wal Wal ఇటలీ Somaliland లోనని ఇటలీవాదము. కాని అబిసీనియాలోని దని అబిసీనియనురాజు వాదము. కాని ౧౯౨౫ నుండి ఇటలీ స్వాధీనములోనే యున్నది Wal Wal. ఏడిస్ ఏబాబాలో ౧౯౦౮, మే ౧౬ వ తేదీలో జరిగిన ఒడంబడిక ప్రకారము అబిసీనియాకు ఇటలీకి సరిహద్దులు ఏర్పరుచుటకు ఒక Commission ను ఏర్పరిచిరి. దానికి సరిహద్దులు వేయుటలో ఈదిగువ అంశములను * గమనించవలెనని యున్నది. ౧౯౧౦ వరకు ఆ కమిషను ఏమియు చేయలేకపోయినది. కాని ౧౯౩౪ డిశంబరు ౧౬ వ తేదిని Stampa of Turin అనుపత్రికలో Wal Wal అబిసీనియాలో వున్నట్టు ఒక పటము ముద్రించబడెను. అటులనే ౧౯౨౮ వ వత్సరమునయున్న పటములో కూడ నున్నది. కాని, ఇది మరల డిశంబరు ౨౫ వ తేదీని ముద్రించిన పటములో ఇటలీకి చేరునట్లు ముద్రించబడినది. దీనినిబట్టి చూడగా Wal Wal అబిసీనియాలో చేరినదని నిర్ధారణముగా చెప్పవచ్చును.

౧౯౩౪ డిశంబరు ౧౫-వ తేదిని Wal Wal లో యుద్ధము జరిగినట్లు జాతిసమితికి తెలిసినది. కాని జాతిసమితి ఒడంబడికలో నున్న ౧౫-వ ఆర్టికలు ప్రకారము విచారణచేయుటకు అబిసీనియా అప్పటికి సిద్ధపడలేదు. ఏలనన ముస్సోలినీ ఏమిచేయునో చూతమని అబిసీనియా వేచియుండెను. వారిద్దరకు ౧౯౨౮ ఆగస్టులో జరిగిన ఒడంబడిక ప్రకారము వారిద్దరిలో ఏమిభేదములు వచ్చినను యుద్ధమునకు పోకుండా, మామూలుగా వారిద్దరును న్యాయాన్యాయములు విచారించుటకును, అట్లు పరిష్కారము కానిచో, మరి ఎవరికైనను వారి వారి అంశములు చెప్పి వారి యిష్టమువచ్చినట్లు నడుచుకొనుటకును నిశ్చయించుకొనిరి. కాని ముస్సోలిని ఆ ఒడంబడిక ప్రకారము న్యాయమును విచారింపకపోవు

---

* It has to start at Dolo on the Juba River and proceed eastward and northeastward in such a way as to place the territories of certian specified tribes on the Italian side & those of others on the Abyssinia and it proceeds that from the Webi Shebeli. The boundary shall be drawn north-eastward in such a manner that all the territory belonging to the tribes towards the East will remain in Italy & all the territory of Ogaden to Abyssinia."

టచే అబిసీనియా తుదకు జాతిసమితిమీద భారమంతయు నైచెను.

ఈలోపుగా Anglo Abyssinian Boundary Commission కూడ Wal Wal అబిసీనియాలో చేరినదనియు, వాల్ వాల్ యుద్ధమునకు ఇటలీదే ముఖ్యముగా నేర మనియు కూడ చెప్పినది.

మున్ముందు కర్తవ్యమంతయు జాతిసమితిమీదనే యున్నది. జపాను మంచూరియాను అక్రమముగా ఆక్రమించినప్పుడు చైనా జాతిసమితికి అపీలు చేయగా జాతిసమితి ఏమి చేయగల్గినది? అటులనే ఇప్పుడు కూడ నిరాశచేసుకొనుటయేనా? లేక జాతిసమితి ఏమైనను మేలు చేయగలదా? ఏమయినను ఇటలీకి వ్యతిరేకముగా చెప్పినచో మస్సొలినీ జపాను వలె జాతిసమితి సభ్యత్వమును వదలెదనని చెప్పుచున్నాడు. ఏది ఎట్లుండునో జాతిసమితి మరి వారముగోజుల లోపుగా సమావేశమగునప్పుడు తెలియగలదు.

ఈలోపుగా ఇటలీ యుద్ధమునకు సిద్ధపడుచున్నది. అబిసీనియాకూడ ఏమియు వెనుదీయలేదు. వీరిద్దరకు జరిగిన Pact ప్రకారము జూలై ౨౫ వ తేదీ గడచినది. వా రిర్వురు Arbitration Commission విషయమై రాజీనామాకు రాలేదు. ఇకను ఆగస్టు ౨౫-వ తేదివరకు జాతిసమితికి గడువున్నది. తదుపరి యుద్ధముతప్పదు.

ప్రస్తుతము స్థితి యిట్లున్నది. న్యాయము అబిసీనియామైపు ఉన్నది. దౌర్బల్యము ఇటలీది. వీరిద్దరినడుమ ఇంగ్లాండు, ఫ్రాన్సు నలుగుచున్నవి. ఇంగ్లాండు రాయబారి ఏడెన్ (Eden) మస్సోలినికి అబిసీనియాబదులుగా బెర్బెరా (Berbera) వద్ద యున్న రేవుపట్టణము ఇచ్చెదనని చెప్పెను. కాని మస్సోలిని దానిని పెడచెవిని పెట్టెను. ఎట్లయినను యుద్ధమురాక తప్పదని తోచుచున్నది.

---




## తెలంగానా శాసనములు భా. ౧

ప్రకాశకులు: లక్ష్మణరాయ పరిశోధకమండలి, హైదరాబాదు-దక్కన్.

క్రౌను ౨౧౫ పుటలు వెల రు ౨-౮-౦.

---

## ఆంధ్రకారకోపనిషత్తు

గ్రంథకర్త: పంతుల లక్ష్మీనారాయణ శాస్త్రి గారు, గజపతినగరంపోస్టు-విశాఖపట్టణంజిల్లా. డెమ్మీ ౫౨ పుటలు. వెల ౧౦ అణాలు.

---

## విరికన్నె

గ్రంథకర్త: విద్వాన్ శ్రీ విశ్వరూప శాస్త్రి గారు, సాధనముద్రాలయము-అనంతపురం. క్రౌను ౪౮ పుటలు. వెల ౬ అణాలు.

---

## కాకతీయ సంచిక

సంపాదకుడు: మారేమండ రామారావుగారు, రాజమహేంద్రవరము. క్రౌను ౩౩౦ పుటలు (అసలు గ్రంథం.) కాకతీయ సంచికానుబంధము-౯౮ పుటలు. వెల రు ౪-౦-౦.

---

## ఆంధ్రదేశము- మొదటిభాగము

గ్రంథకర్త: కర్లపాలెం కృష్ణరావుగారు, చీరాల క్రౌను ౧౨౪ పుటలు. వెల రు ౧.

---

## వీరసింహుఁడు

గ్రంథకర్త: వఝ్ఝల చినసీతారామస్వామిశాస్త్రి గారు, విశాఖపట్టణము. క్రౌను ౧౦౧ పుటలు. వెల తెలియదు.

---

## కుబేరపతనము

గ్రంథకర్త: హోసూరు నంజుండరావు గారు, ౧౨ ఈస్టురోడ్, బసవనగుడిపోస్టు, బెంగుళూరు.

క్రౌను ౧౦౩ పుటలు. వెల రు ౦-౮-౦.

---

## క్రొత్త తెలుగు మాస పత్రికలు

### ౧. కళ

సంపాదకులు: డాక్టరు వి. శ్రీనివాసమూర్తి, రాజమహేంద్రవరము. సాలుచందా రు ౧-౮-౦. విడి సంచిక రు ౦-౨-౬.

### ౨. దేవాలయ ప్రతిభ

మేనేజింగు సంపాదకుడు: డాక్టరు వి. యస్. ఆచార్య, బెజవాడ. సాలుచందా రు. ౨.

---



# సాభిప్రాయ విశేషములు



ఆత్మజ్ఞానానుభవము, బాహ్యాభ్యంతర విషయములందు సకలజనులకును పురుషార్థమునకు ప్రమాణము. అనంతమైన ప్రవృత్తియందు సకలజనులకును స్వానుభూతియే పురుషార్థమునకు పరమ ప్రమాణము. మానవు లత్యంత పరిమితమైన స్వానుభవస్వార్థప్రమాణమునను నపరిమితమైన ధర్మప్రమాణమును నారాధించుట వర్తమాన సమయమునందు ప్రపంచము నావరించిన దురదృష్టము. స్వాభిమాన స్వార్థస్వోత్కర్ష ప్రియులైన నాయకులు, పండితులు, శాస్త్రజ్ఞులు, తత్త్వవేత్తలు, కవులు, వీరులు, ధీరులు, రయితులు, భూస్వాములు, రాజులు, కార్మికులు, కుబేరులు, మతాధిపతులు, రాజ్యాధికారులు మొదలగు మహాజనులు స్వానుభవ సిద్ధాంత ప్రమాణమునను ప్రజాహృదయమునందు గలుగజేయుచున్న సంక్షోభమున కాద్యంతములు గనుపడవు. సకలధర్మపరిణామమునకును మాటలందు ధర్మసూత్రములును, వ్యవహారములందు ప్రజ్ఞావాదములును, మారణ యంత్ర ప్రహారములును పరమార్థములుగను పరిణమించినవి. ప్రపంచ మంతయును సంగ్రామ ధ్వనులతో ప్రతిధ్వనిల్లు చున్నది. నిర్మాణ సాధనమైన శాస్త్రకళా విజ్ఞాన మంతయును సంహార సాధనముగను పరిణమించినది. మానవవిజ్ఞాన సంపదలు సంహారసాధనములుగను పరిణమించుచున్న విధమున కాయుధ ధారణమునందు సకల రాజ్యములును జూపుచున్న యహమహమికోత్సాహము మహావ్యాఖ్యానము.

సకలరాజ్యములును, ప్రజలు నిరుద్యోగులై, అన్నాతురులై బాధపడుచున్నను, దేశాదాయమునందలి విశేష భాగమును సంగ్రామ సన్నాహములకై వినియోగించుచున్నవి. ఆయుధవిసర్జన నియమము లంతరించుటయె కాకను ఆయుధధారణము విజృంభించుచున్నది. జపాను, జర్మనీ, రుష్యా, ఫ్రాన్సు, గ్రేటుబ్రిటను, అమెరికా, ఇటలీ, ఆస్ట్రియా, తుర్కీ, అబిసీనియా మొదలగు పెద్ద, చిన్న దేశము లన్నియును పూర్ణముగ నాయుధధారణము నవలంబించినవి. బ్రిటీషురాజ్యాధికారు లాయుధ విసర్జనమును బోధించుచు జర్మను, ఇటలీ, ఫ్రాన్సు రాజ్యములతో జేసిన రహస్యసంధు లాయుధ ధారణమున కవకాశములను విస్తరింప జేసినవి. ఈడెన్ గారి చాణక్యనీతి సఫలమగుచున్నది. అన్ని రాజ్యములును కల్పతరు వనములను నిర్మించి పరాక్రమణ సాధనమునను సుఖము ననుభవింప గోరుచున్నవి. ప్రపం

చమునందలి నందనోద్యానములే కాకను ఊసరక్షేత్రములును పాశ్చాత్య పరాక్రమణమునకు పాలై, సుక్షేత్రము లూసర క్షేత్రములై, క్షేత్రము లన్నియును స్వదేశీయుల దౌర్భాగ్యమునకును, పరదేశీయుల సౌభాగ్యమునకును వినియోగపడుచున్నవి. ప్రపంచవ్యాప్తమైన యంత్రపరిశ్రమ వ్యాపారము, మద్యవ్యాపారము, మారణాయుధ వ్యాపారము, ధనధాన్యవ్యాపారము, మానవ ధర్మ వికాసమును స్తంభింపజేసిన విధమును ప్రపంచవ్యవహారము లనంత ముఖములను బోధించుచున్నవి.

ప్రపంచము నావరించిన ప్రళయతాండవము భయ సంభ్రమములను గలుగజేయుచున్నను దురాశాపిశాచమున కానందతాండవముగ నున్నది. వ్యక్తులు, సంఘములు, జాతులు, రాజ్యాధికారులు దంభాహంకార పరాయణులై చేయుచున్న ప్రగల్భములు మహాప్రళయచిహ్నములుగను గనుపడుచున్నవి. వ్యక్తులు, కుటుంబములు, గోత్రములు, కులములు, సంఘములు, జాతులు, మహాజాతులు పరాక్రమణపరాయణత్వమును పూని నిస్సహాయుల నాశనమునకే కాకను పరస్పరనాశనమునకును విశ్వప్రయత్నములను జేయుచున్నవి. పాశ్చాత్యసంస్కార సంజాతములైన ప్రళయ సస్యములు సర్వత్ర ఫలవంతము లగుచున్నవి. ప్రపంచమునం దంతటను శాంతి ధ్వనులు మారుమ్రోగుచున్నను ప్రళయ తాండవము మాత్రము గోచరం బగుచున్నది.

* * * *

శాంతి—సంగ్రామములు

శాంతిస్థాపనమున కేర్పడిన నానాజాతి సమితి మొదటను శ్వేతజాతిసమితి, మహారాజ్యములసమితి, యూరపురాజ్యములసమితి, చివరను శాంతిధర్మసమితి. ఆ సమితియందు పెద్దరాజ్యములకును చిన్న రాజ్యములకును, తెల్లజాతులకును నల్లజాతులకును, ప్రబల రాజ్యములకును బలహీన రాజ్యములకును పరపతిగౌరవములు, ధర్మనిర్ణయములు భిన్నములు. జర్మను, జపాను రాజ్యముల ప్రతిఘటన నిర్గమనములును, నితరవ్యవహారములును నానాజాతిసమితి నావరించిన దురవస్థను వెల్లడిచేయుచున్నవి. నానాజాతి సమితి నిర్ణయములు దుర్బలములై వ్యవహారములందు నిరర్థకములుగ నున్నవి. జపాను చీనా రాజ్యమును ముక్కలనుజేసి మ్రింగివేయుచున్నను నానాజాతిసమితికి వేలెత్తుటకైనను శక్తిలేకున్నది. యుద్ధపర్వానంతరమే శాంతిపర్వము సాధ్యమని మహాభారతేతిహాసములు దివ్యముగను బోధించుచున్నవి. ప్రపంచవ్యవహారములందు తాత్కాలికముగను శాంతి సాధ్యమైనను సంగ్రామ మనివార్యమని ప్రపంచ వ్యవహారములు బోధించుచున్నవి. సంగ్రామభూకంప మేమూలనుండి బయట పడునో దైవాధీనమునం దున్నది. బ్రిటీషు రాజ్యాధికారులవలెను నితరదేశ రాజ్యాధి

కారులును సంగ్రామసన్నాహములకు చేయుచున్న యపారవ్యయము ప్రజాజీవనమును సకల దేశములందును దుర్భరము చేయుచున్నది.

సామ్రాజ్య రక్షణాభిమానము పరదేశప్రజలకే కాకను స్వదేశప్రజలకును దుఃఖభాజనముగ నున్నది. పారతంత్ర్య పాశబంధనముల ననుభవించెడివారువలెను నిర్మించెడివారును దుఃఖము ననుభవించుచున్నారు. విదేశీయాధికారుల దురభిమాన దుర్ణయములు పాలకపాలితుల కాత్మ నాశనమును గలుగజేయుటకు వినియోగ పడుచున్నవి. "రాజ్యాంతే నరకం ధ్రువం" అనెడి ఆర్యోక్తి సఫలమగుచున్నది. పాలితుల పారతంత్ర్య దైన్యము, పాలకుల పరాక్రమణాభిమానము మానవ ధర్మ నిర్వహణమును దుర్లభము చేయుచున్నవి. బ్రిటీషుసామ్రాజ్యాభిమానుల పటాటోపములవలెను హిట్లరు ముస్సోలినీ గారల ప్రగల్భములును ధర్మ నాశనమునకు నిదర్శనములు. బ్రిటీషుప్రజలు ప్రపంచమునకు, ముఖ్యముగను భారతీయులకు ధర్మకర్తలు. ఇటలీదేశస్థులు ఎతియోపియనులకు మతగురువులు. జర్మనులు దేవాంశ సంభూతులు ప్రపంచాధికారులు. శ్వేతజాతులు ప్రపంచాక్రమణముచేసి మానవ స్వాతంత్ర్య ధర్మమును మాయమాటలం దంతర్ధానము చేయుచు ధర్మారాధనమును నిరర్థకము చేయుచున్నారు.

సుప్రసిద్ధ మానవ స్వాతంత్ర్య ధర్మాభిమానులు బర్నార్డుషాగారు వాయువార్తా ముఖమునను పంపిన స్వాతంత్ర్యసందేశమునందు మానవత్త్వమును, స్వాతంత్ర్యమును, ధర్మమును శూన్యములు. బర్నార్డుషాగారి లక్ష్యము కడుపునిండాతిని కూర్చున్నవారికి విశ్రాంతి విషయమునను లగ్నమైనటు లన్నాతురులై దైన్యము ననుభవించుచున్న ప్రాచ్యదేశీయులమీదను ప్రసరింపకున్నది. ముస్సోలినిగారి నాగరకత్వ మతాభిమానము యూరపు రాజ్యములందు పరిహాసపాత్రమైన క్రైస్తవ మతోద్ధరణమునకుగాకను నిరాయుధులైన అబిసీనియనుల మీదను ప్రసరించుట దురభిమాననిదర్శనము. హిట్లరు గారు స్వీయక్రోధాభిమానములను యూరపురాజ్య వాసులను మానవులను జేసిన క్రైస్తమతముమీదను, ఏసుక్రీస్తు మీదను, యూధులమీదను ప్రసరింపజేయుట నిరర్థకదుర్జనత్వము. ఆత్మసంస్కారము లేని శ్వేతప్రజలు శ్వేతేతరప్రజల నుద్ధరింపజూచుట స్వప్నప్రయత్నము ప్రత్యభిజ్ఞానముగల శ్వేతేతరులను పాశ్చాత్యులును నిర్బంధింపజాలరని జపాను అబిసీనియాల చరిత్రములు వెల్లడి చేయుచున్నవి.

* * * *

ఇటలీ అబిసీనియాతగవులు

ముస్సోలినిగారి నాయకత్వము క్రిందను సంభవమగుచున్న ఇటలీ విజృంభణమునకు సంగ్రామము సహజఫలము. ఆఫ్రికాఖండ

మంతయును పాశ్చాత్యరాజ్యముల వశమై ప్రజలు దైన్యము ననుభవించుచున్నారు. ఇటలీకి కావలసినది రాజ్యవ్యాపనము. యూరపీయను రాజ్యాధికారులకును ముసోలిని గారికిని వారిఘోషపట్టును. కాని లయమును పొందుచున్న ఆఫ్రికా ప్రజలగతి స్మరణకైన రాదు. అదృష్టవశమునను అబిసీనియా ప్రజలు క్రైస్తవ మతస్థులు. అబిసీనియా బ్రిటీషు, ఫ్రెంచి, ఇటలీ, ఈజిప్టుదేశములకు నడుమను సారవంతమైన దేశముగ నున్నది. అందర కును అబిసీనియా ఆక్రమణ మసాధ్యమైనది. ఇటలీ ఒకసారి ప్రయత్నించి ఆడీసు అబాబాయుద్ధమునందు పరాభవమును పొందినది. తిరిగి వెనుకటియాట నుపక్రమించుచున్నది. అబిసీనియా రాజ్యాధికారులు ప్రశాంతముగను స్వాతంత్ర్యరక్షణ భేరిని ప్రమోగించిరి.

ముసోలినిగారొక మెట్టుదిగినను సభిమానము మాత్రము తగ్గలేదు. అబిసీనియా వర్తమాన వ్యవహారములను నానాజాతిసమితి ద్వారా పరిష్కరించుకొనుట కంగీకరించుచు వెనుకటి సంధివిమర్శనమును నిరాకరించుచున్నది. నానాజాతిసమితి మధ్యవర్తిత్వము కొంతవిరామమును గలుగజేసినను సంగ్రామ సన్నాహములు మాత్రము సాగుచునే యున్నవి. అబిసీనియాచూపిన ధైర్యస్థైర్యములు స్వాతంత్ర్యసంపాదనమునకు వినియోగపడుట సహజము. ఆసియా ప్రబోధమువలెను ఆఫ్రికా ప్రబోధమును మానవ స్వాతంత్ర్య ధర్మసంస్థాపనమునకు పరమావసరములు. కోట్లప్రజలు ఆసియా ఆఫ్రికాఖండములందు పారతంత్ర్య దారిద్ర్యదైన్యముల ననుభవించుచున్నపుడు పండితుల స్వాతంత్ర్య సందేశములు నిరర్థకములు. భారతస్వాతంత్ర్య సమరోదంతమును నీపరమార్థమునె విశదము చేయుచున్నది. ఇండియా శాసనోదంతమును నీవిషయమును పరిస్ఫుటము చేయుచున్నది.

* * * *

కాంగ్రెసు-ఇండియాబిల్లు

ఇండియాబిల్లు పార్లమెంటునందామోదింపబడి రాజసమ్మతిని బడసినది. చిరకాలమునుండియును ఖండనమండనములకు గురియైన ఇండియాబిల్లుప్రయోజనముల విషయమై ప్రస్తుతము చర్చించుట గతజలసేతుబంధనము. చర్చిలు హోరుగారల ప్రసంగములే ఇండియాబిల్లు దేశోపయోగములకు నిరర్థకమని వెల్లడిచేయుచున్నవి. ఇండియాబిల్లు నేషనలుపక్షమువారో వ్యవహరించుట స్వభావసిద్ధము. కాలచక్రమువలెను వ్యవహారములును నడుచుచుండును. వ్యవహారములు మానవధర్మప్రయోజనముల కెంతవరకు వినియోగపడగలవను విషయమే విచారణీయాంశము. ఇండియాబిల్లు పురోభివృద్ధికి నిరుపయోగమేకాకను ప్రతికూలమని భిన్నపక్షములవారు ప్రకటించినను వ్యవహారక్రమము మాత్రము యథాప్రకారము సాగుచున్నది. అన్నిపక్షములవారు నూతన రాజ్యాంగము

లందు పాల్గొనుటకు సన్నాహములను జేయు చున్నారు.

చెన్నరాష్ట్రమునందు జస్టిసు పక్షము రాజ్యాంగనిర్వహణమునకు పన్నుచున్న తంత్రములన్నియును రాజ్యాంగముల దౌర్బల్యమునకు ప్రమాణములు. రాష్ట్రము నందలి రెండు సభలును సామాన్య ప్రజా శక్తిని స్తంభింపజేయుటకు వినియోగపడ గలవు. ప్రజాశక్తిని నిర్మూలనము చేయుటకు శాసనము ప్రసాదించిన భేదోపాయమునకు, ప్రదేశనిర్దేశోపసంఘము చేసిన నిర్ణయములు బలరక్షణములను గలుగజేయు చున్నవి. రాజులు, జమీందారులు, భూస్వాములు, శ్రీమంతులు, కులాభిమానులు, తంత్రజ్ఞులు పన్నుచున్న తంత్రములు భావిరాజ్యాంగ పరిణామమునకు దుశ్శకునములు. అధికారము లేని మంత్రిపదవులు, ధనములేని కోశములు, సంయోగములేని పక్షములు, అనుచరులు లేని నాయకులు రాష్ట్రీయ శాసనసభలను కలహరంగములను జేయుట సహజము.

సుశిక్షితపక్షమైన కాంగ్రెసుపక్షము స్థానికసంస్థలను రాష్ట్రీయసభలను నాక్రమించుట వలన నీయుపద్రవము కొంత తొలగ వచ్చును. కాంగ్రెసు నిర్ణయించినవిధమునను ప్రజలును అభ్యర్థులును రాష్ట్రీయసభలందు జేరుటయును ధర్మనిర్వహణమును జేయుటయును విధ్యుక్తముగ నున్నది. జాతి, కుల, సాంఘికాదిభేదముల కతీతమైన కాంగ్రెసు సంస్థ యొక్కటియే దేశబలగౌరవములను స్వాతంత్ర్యమును సంరక్షించుటకు తగియున్నది. కాంగ్రెసు పక్షము సత్యాగ్రహమును విరమించి పార్లమెంటువిధానమును ప్రస్తుత మవలంబించు చున్నది. రాష్ట్రీయశాసన సభల యందును నీ మార్గావలంబనము శరణ్యముగనున్నది. మంత్రిపదవుల స్వీకార నిరాకరణములు కాలమువచ్చినపుడు నిర్ణయము కాగలవు. కాంగ్రెసు నాయకానుచరులు నిరర్థకములైన వాదప్రతివాదములతోను కాలయాపనము చేయుటకన్నను కాలమును ప్రజోపయోగకరములైన నిర్మాణకార్యక్రమమునకు వినియోగించుట ధర్మము. గాంధి మహాత్ముని నాయకత్వము కాంగ్రెసునాయకానుచరుల కీపరమార్థమును మనోగతము చేసినను ప్రజానాయకుల నావరించిన హృదయదౌర్బల్యసంస్కారము బలీయమై ప్రజానాయకులకు కర్మయోగమును దుర్లభము చేయుచున్నది. కాంగ్రెసువిజయ మనివార్యమైన ధర్మవిజయము. కాంగ్రెసు ప్రజానాయకులు దేశస్వాతంత్ర్యసమరమునందు నిర్బంధముల ననుభవించుటయందు జూపిన త్యాగనిగ్రహములను శాసనసభలయందును జూపుట కనుకూలమైన కార్యక్రమమును కాంగ్రెసు సంఘము లారాధించి కాంగ్రెసు ప్రతిష్ఠను సుస్థిరముచేయుట పరమార్థము.

* * * *

కాంగ్రెసు—స్వర్ణోత్సవము

౧౮౮౫ సంవత్సరమునం దారంభమైన భారతజాతీయ మహాసభకు ౧౯౩౫ డిసెం

బరు ౨౭ వ తేదికి ౫౦ ఏండ్లు నిండి స్వర్ణో త్సవమును జేయుట కవకాశములు గలుగుట యదృష్టము. కాంగ్రెసు చరిత్రయందు గతించిన యేబదేండ్లయందును దేశస్వాతంత్ర్యమునకై ప్రజానాయకులు చేసిన సేవాత్యాగములు స్వాతంత్ర్య సమరేతి హాసములందు సువర్ణాక్షరములతో విరాజిల్లగలవు. ఫిరోజిషా, దాదాభాయి, గోకలే, తిలకు, బెజంటు, లాజపతిరాయి, తిలకు, దాసు, నెహ్రూ, గాంధి మొదలగు మహానుభావుల పవిత్రనామములు మానవస్వాతంత్ర్య సంరంభమునందు దివ్యకాంతులతో తేజరిల్లగలవు. సత్యాగ్రహ సాధనమునను శాంతి సమరము నుపక్రమించిన గాంధిమహాత్ముని పవిత్ర నామము మానవస్వాతంత్ర్యధర్మపరిణామము నందు ధ్రువనక్షత్రముగను వెలయగలదు. వార్ధాయందు గతమాసాంతమునందు గూడిన కాంగ్రెసువర్కింగుకమిటీ డిశంబరు ౨౭ వ తేదిని నిరాడంబరముగను కాంగ్రెసు స్వర్ణోత్సవమును జరుపుటకు నిర్ణయించినది. శ్రీ యుత పట్టాభిసీతారామయ్య గారు వ్రాసిన కాంగ్రెసు చరిత్రను ప్రకటించుట యును కాంగ్రెసు ధర్మమును గ్రహించుటకు ప్రయోజనకరము. శ్రీ జార్జిసార్వభౌముని రజతోత్సవము జరిగిన యేటనే కాంగ్రెసు స్వర్ణోత్సవము సంప్రాప్త మగుట యును సౌభాగ్యము. సకల సందర్భములందును కాంగ్రెసు గౌరవప్రతిష్ఠలను కాపాడుట యును, వృద్ధిచేయుటయును దేశదాస్య విమోచనమునకును, స్వాతంత్ర్య స్థాపనమునకును యథార్థసాధనము. ఆంధ్రులును నీ సందిగ్ధసమయమునందు స్వధర్మనిర్వహణము నకు దీక్షనుబూనవలసిన యవసరమును దేశ వ్యవహారములు బహుభంగులను బోధించుచున్నవి. ఆంధ్రులీప్రబోధార్థమును గ్రహించి కార్యశూరులగుట యవసరము.

* * * *

## ఆంధ్రాభ్యుదయము

ప్రపంచవ్యవహారములందు వ్యక్తులకు, కులములకు, సంఘములకు, జాతులకు, స్వయంపోషణ వికాసములకు సంరంభము సహజసిద్ధము. స్వాత్మానుభవప్రయోజనమే పరవ్యవహారములందును కార్యసిద్ధికి పరమ ప్రమాణముగను పరిణమించుచున్నది. స్వీయ భుక్తములకు ప్రతిఘటనము గలుగునపుడన్యాయాక్రమ ఘోషలు పరాక్రమణమునకు వెలువడుచుండును. చెన్నపురియందు శ్రీయుతులు సత్యమూర్తి, వరదాచారి, లక్ష్మణస్వామిగారులు మొదలగు తమిళ నాయకు లుపక్రమించిన తమిళాధిక్యాందోళ నము సకల విధములను నిరసనయోగ్యముగ నున్నది. గతించిన ౧౪ ఏండ్ల నుండియును మద్రాసు నగరమునందు కాంగ్రెసు భారమును యథోచితముగను వహించుచున్న మద్రాసుజిల్లా ఆంధ్ర కాంగ్రెసు కమిటీని రద్దుచేసి మద్రాసునగరమును తమిళజిల్లా కాంగ్రెసువశము చేయగోరుట కేవల మనా

లోచితకార్యము. మద్రాసున కుత్తర పశ్చిమ ప్రాంతములనుండి తిరునల్వేలివరకును తెంపు లేకుండా తెలుగుతల్లి భాషగను మాటలాడెడి ప్రజ లన్ని మండలములందును గలరు. కాలక్రమమునను తమిళప్రజలు తెలుగు ప్రాంతముల నావరించిన విధమును జనాభా లెక్కలు వెల్లడిచేయుచున్నవి. బ్రిటీషు ప్రభుత్వాదరణము తెలుగుప్రాంతములందు తమిళవ్యాపనమున కుపకరించినది. తెలుగు రాజులదైన చెన్నపట్నము బ్రిటీషుప్రభుత్వాధికార వ్యాపనమునందు తమిళవ్యాపనమునకు వినియోగపడినది. తమిళవ్యాపనము మద్రాసు ప్రాంతములను తమిళవాసస్థలమును చేయుటయందు విచిత్రము లేదు. బ్రిటీషు ప్రభుత్వ వ్యాపనమునందు మద్రాసునందు తమిళవ్యాపనము గలిగినను చెన్నరాష్ట్రమునకు రాజధాని నగరమైన మద్రాసు తెలుగు దేశమునకు, తెలుగుప్రజలకు స్వీయ స్వత్వ రక్షణమున కాధారభూతముగ నున్నది. గతించిన ౧౯ ఏండ్లయందును ఆంధ్ర మద్రాసుమండల కాంగ్రెసు వ్యవహారమునను నిర్వహించుచున్నది. తెలుగు, తమిళ కాంగ్రెసు సంఘములకు కొన్ని సందర్భములందు భేదాభిప్రాయములుకలిగినను రెండుకాంగ్రెసు సంఘముల సంయోగబలము కాంగ్రెసు గౌరవబల ప్రతిష్ఠలను గాపాడిన విధమును గతించిన సత్యాగ్రహప్రస్థానములు, కాంగ్రెసు అభ్యర్థుల విజయములు, కాంగ్రెసు వ్యవహార ప్రాబల్యము రుజువుచేయుచున్నవి. వార్ధాయందు వర్కింగుకమిటి నిర్ణయించినటులు రెండుసంఘములును పరస్పరభేదములను విడిచి కలిసి పని జేయుట కేర్పాటుచేయుట ప్రజల బలగౌరవ విశ్వాసములకు పరమసాధనము. ఆంధ్రాభ్యుదయమునకు వివిధ ప్రాంతములవారును; వివిధ పక్షములవారును కలిసిపనిజేయవలసిన యవసరమును మద్రాసు ఆంధ్ర-తమిళ తగాదాలును, కర్ణాటకోత్కళ ప్రాంతముల తగాదాలును విశదము చేయుచున్నవి. నూతన రాజ్యాంగ సంస్కరణములు ప్రజానాయకులందుగలుగజేయనున్న విభేదములు దురూహ్యములు. తెలుగు జమీందారు లధికార స్వీకారరక్షణములకు చేయుచున్న ప్రయత్నములు బ్రిటీషు రాజ్యనీతిరక్షణమున కనురూపములై ప్రజాశక్తిని స్తంభింపజేయుట సంభవము. ప్రధానమంత్రి శ్రీబొబ్బిలిరాజాగారు రయితుల పురోభివృద్ధికిని, ఆర్థికాభివృద్ధికిని జేసెడిప్రయత్నములు స్వీయాధికార సంరక్షణమునకును స్వాతంత్ర్యనిరోధమునకుగాకను ప్రజాధికారసౌభాగ్య వ్యాపనమునకు వినియోగపడుట ప్రయోజనకరము, వివేకము, ధర్మము.

ఆంధ్రావని విశాలమై, రమణీయమై, సస్యపరిశోభితమై, సుజలపూరితమై, ౨౮౦ కోట్ల ప్రజలను గలిగియున్నను ప్రజానాయకులం దవసరమైన సంయోగ సాహచర్యములులేకను దైన్యదశ ననుభవించుచున్నది. ఆంధ్రకాంగ్రెసు నాయకానుచరులు ప్ర

యందు గలుగజేసిన ప్రబోధ ప్రత్యభిజ్ఞానములను రక్షించుటయును, వృద్ధిచేయుటయును అధికారాభిమానావలంబనులకును కాలక్రమమునను శరణ్యము గాగలదు. ఆంధ్రాభ్యుదయప్రియులైన అధికారప్రియులు, సారస్వతోపాసకులు, శాస్త్రకళాకోవిదులు, భూస్వాములు, రయితులు, సంపన్నులు, సామాన్యులు, రాజకీయ ప్రచారకులు, సంఘసంస్కర్తలు, మతాభిమానులు, పండితులు, సామాన్యులు, పురుషులు, యువకులు ఆత్మోద్ధరణమునకై దీక్షాపరాయణులై పాటుపడవలసిన పరమావసరమును, విదేశస్వదేశపరిస్థితులు వివిధసందర్భములందును వెల్లడిచేయుచున్నవి. ఆంధ్రలోక మీపరమార్థమును గ్రహించి ఆత్మానుభవసాధ్యమైన శక్తిసామర్థ్యముల బడయుటకు విజయునివలెను కృతనిశ్చయులై విజయమును బడయుటకు శ్రీ కృష్ణపరమాత్ము డనుగ్రహించుగాత!

శ్లో. నష్టో మోహః స్మృతి ర్లబ్ధా త్వత్ప్రసాదా న్మయాఽర్జున;
స్థితోఽస్మిగత సందేహః కరిష్యే వచనం తవ.

---

Printed and Published by K Nageswara Rao, at the Andhra Patrika Press, No.7, ThambuChetty St., Madras.
Editor: G. Subbaramayya.

